# డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ



# సంస్మృతి

# డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ సంస్మృతి



*సంపాదకమండలి:*

**డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం**

**డాక్టర్ వెలగా వెంకటప్పయ్య**

**కోకా విమలకుమారి**

**ఊటుకూరి సుహాసిని**

స్మారక సమితి ప్రచురణ

ప్రచురణ :
డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
స్మారక సమితి
త్యాగరాయనగరం, బాపట్ల

ఆవిష్కరణ
20 నవంబరు 1997

వెల రు. 60-00

Printed at : Don Bosco Press, Ring Road, Guntur - 7. Ph : 350832

లేజర్ టైప్ సెట్టింగ్ :
ఓంకార్ గ్రాఫిక్స్, బోస్‌రోడ్, తెనాలి.

శ్రీ కొణిజేటి రోశయ్య
మాజీ అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ
మకాం : హైదరాబాదు.

# ముందు మాట

పవిత్రమైన ఆర్ష సంస్కృతి పరిమళించిన ఈ భారత దేశంలో లోకొద్ధారకులైన కారణజన్ములు ఎందరో!! ఎందరో!! దేశ విదేశాలలో తమ మాతృ ఖ్యాతిని ఇనుమడింప చేసి ఆ తల్లికి ముద్దుబిడ్డలై విలసిల్లిన వారే కదా! అటువంటి కారణజన్ములలో ఒకరై తన రాష్ట్రానికి, తన దేశానికి ఖ్యాతి నార్జించిన డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ చిరస్మరణీయురాలు. సహస్రమాసాలు జీవించి భగవత్సన్నిధానానికి వెళ్లిన సంగతి సర్వులకు విదితమే.

చిన్ననాడే సంగీత సాహిత్యాది లలితకళా రంగాలలో కాలూని విశేష ఖ్యాతిని ఆర్జించారు. స్వాతంత్రోద్యమంలో గణనీయమైన పాత్ర నిర్వహించారు. విద్యా వ్యాసంగ సమయంలో అనేక బంగారు పతకాలను పొందిన యువతీమణి ఆమె. కవికుల గురువు కాళిదాసు చెప్పినట్లుగా తల్లిదండ్రులకు, గురువులకు కూడా ఖ్యాతి నార్జించి పెట్టిన విదుషీమణి ఆమె. పండితురాలిగా, సారస్వత వేత్తగా, సంగీత సరస్వతిగా, ఉపన్యాస భారతిగా అచిర కాలంలోనే ప్రాదుర్భావాన్ని, ప్రాభవాన్ని సంతరించుకొని విశిష్ట వనితగా విరాజిల్లారు లక్ష్మీకాన్తమ్మగారు.

అనర్గళమైన ఆమె వాగ్ధాటిని ఎరుగని శ్రోతలు ఆంధ్ర దేశంలో లేరంటే ఆతిశయోక్తి లేదు. అతిక్లిష్ట విషయాలను కూడా మధురాతి మధురమైన ద్రాక్షారసం వలె మలచి శ్రోతల హృదయాలచే ఆస్వాదింప చేసిన ఆమె వైదుష్యం ఎన్నదగినది. సరస గంభీరమైన ఆమె వాణి శ్రోతలకు మైమరపు కల్గించి వింత వింత అనుభూతులను కల్గింప చేసిన విషయం సర్వవిదితం.

ఆంధ్ర కవయిత్రులు, అఖిల భారతకవయిత్రులు, వాగ్గేయకారుల చరిత్ర మొదలగు పరిశోధక గ్రంథాలు, సరస్వతీ సామ్రాజ్య వైభవం, నా తెలుగు మాంచాల. కన్యకా సుప్రభాతం, దేవీస్తవ తారావళి, జాతిపిత మొదలకు ప్రక్రియా వైవిధ్యం గల అనేక కావ్యాలు ఆమె అమృత లేఖిని నుండి వెల్వడినవే.

మహిళా సంక్షేమం ఆమె ప్రధాన జీవితాశయం. మహిళోద్యమ నాయకురాలామె. అహోరహం మహిళా శ్రేయస్సు కోసం పాటుపడిన విశిష్ట వ్యక్తి. సంఘ సేవకు ఆమె జీవితం అంకితం.

## డాక్టర్ లక్ష్మీ కాన్తమ్మ సంస్మృతి

ఆమె సాహిత్య సేవలకు గుర్తింపుగా కళాప్రపూర్ణ, సాహితీ రుద్రమ, అపర వాగ్దేవి, తెలుగు మొలక, ప్రతిష్ఠాత్మకమైన గుప్తా అవార్డు, ఇంకా ఎన్నో అవార్డులు, హైందవ ధర్మ పరిరక్షణకై పాటుపడినందుకు ధర్మప్రచార భారతి మొదలగు బిరుదులు ఎన్నో ఆమెను వరించాయి. ఈ శతాబ్దికే అలంకారప్రాయమైన కనకాభిషేక సత్కారం ఆమె జీవితానికే ఒక అమూల్యాభరణం. 1954 లోనే గృహలక్ష్మి స్వర్ణ కంకణ స్వీకరణం కూడా ఆమె ప్రతిభకు ఒక నిదర్శనమే.

ఏకేశ్వరోపాసనలో తరించడమే కాదు వైదికమైన భక్త్యారాధనలోనూ దైవ సాక్షాత్కారాన్ని పొంది, పొంగి, పరవశించిన పరమ భక్తురాలామె. పుణ్యమూర్తి. ఆ జీవిత పర్యంతం తవ కర్తవ్యపాలన కొరకు తపించిన మనీషి. హుందాగా జీవించి రాజసంగా జీవితాన్ని చాలించారు.

డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారి సేవలను, కృషి విశేషాలను ముందుతరాల వారికి అందించే నిమిత్తం 'డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ సంస్మృతి' అనే స్మారక సంపుటి ప్రచురణ తలపెట్టాము. ఈ సంపుటికి తమ అమూల్యమైన వ్యాసాలను, కవితలను అందించిన రసజ్ఞులైన కవి, పండితులకు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. ఈ సంపుటి సంపాదకత్వ బాధ్యత చేపట్టి దీనిని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది, శాశ్వత జ్ఞాపికగా రూపొందించిన సంపాదక మండలి సభ్యులు ప్రొఫెసర్ బొడ్డుపల్లి పురుషోత్తం, డాక్టర్ వెలగా వెంకటప్పయ్య, శ్రీమతి కోకా విమల కుమారి, లక్ష్మీకాన్తమ్మగారి పెద్ద కుమార్తె, సాహిత్యవారసురాలు శ్రీమతి పోలేపల్లి సుహాసిని గార్లకు నా అభివందనాలు తెలియ చేస్తున్నాను. ఈ సంచిక ప్రచురణలో సహకరించిన వదాన్యులు బొమ్మిడాల బ్రదర్స్, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ, తదితర సంస్థలకు, వదాన్యులకు నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. ఈ సంపుటి, డా॥ లక్ష్మీకాన్తమ్మగారి రచనలు, వారు స్థాపించిన నిర్వహించిన సంస్థలు తెలుగు జాతికి చిరకాలం సేవలందించగలవనీ, వారి సంస్కృతి సంపదకు ముందు తరాల వారికీ అందిస్తూ, డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ గారిని చిరస్మరణీయు రాలిగా చేయగలవనీ ఆశిస్తున్నాను.

కొణిజేటి రోశయ్య,

అధ్యక్షులు,

డా॥ లక్ష్మీకాన్తమ్మ స్మారక సమితి

# విషయ సూచిక

## భాగం - 1: కుటుంబ విషయాలు



## భాగం - 2 : సాహిత్య సౌరభాలు :

## భాగం - 3: స్నేహ సౌభాగ్యాలు

## భాగం - 4 అశ్రుతర్పణం



## భాగం - 5: డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారి కొన్ని ముద్రితా ముద్రిత రచనలు

# డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ స్మారక సమితి

అధ్యక్షులు : శ్రీ కొణిజేటి రోశయ్య, మాజీ అధ్యక్షులు - ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి

ఉపాధ్యక్షులు : శ్రీ జయం సుబ్రహ్మణ్యం శెట్టి, అధ్యక్షులు-ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ

శ్రీ కాసంసెట్టి రాధాకృష్ణయ్య, ప్రముఖ పారిశ్రామిక వేత్త, కల్లూరు

శ్రీ ముత్తా గోపాలకృష్ణ, ఎం.ఎల్.ఎ., కాకినాడ

శ్రీ కబళవాయి రాధాకృష్ణరావు, ఉపాధ్యక్షులు, ఆర్యవైశ్య మహాసభ

శ్రీమతి మద్ది రామకుమారి, ఉపాధ్యక్షురాలు - ఆం.ప్ర. మహిళా కాంగ్రెస్ విభాగం

ప్రధాన కార్యదర్శి: శ్రీమతి కోకా విమలకుమారి, సెక్రటరీ, సంస్కృతీ సమాఖ్య, విజయవాడ

కార్యదర్శులు : శ్రీ కె.వి.డి. మల్లిఖార్జునరావు, వేటపాలెం

శ్రీ పోలేపల్లి హరనాథ్, ఏలూరు

శ్రీ మద్దా సత్యనారాయణ, బాపట్ల

శ్రీ సంకా వెంకట రామకుమార్, బాపట్ల

కోశాధికారి : శ్రీ బి. సురేష్‌బాబు, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, కొత్తపేట, తెనాలి

సభ్యులు : శ్రీ పెనుమత్స శ్రీరామరాజు, బుద్ధాం

డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి, తెనాలి

శ్రీ బందా వెంకయ్య, ఏలూరు

శ్రీ కోకా నాగేంద్రరావు, విజయవాడ

డా॥ ఎస్.వి. చలపతిరావు, బాపట్ల

శ్రీ చీదెళ్ల సత్యనారాయణ, బాపట్ల

శ్రీ మోదడుగు కృష్ణగుప్త, బాపట్ల.

శ్రీ దేవకి వెంకట సుబ్బయ్య, బాపట్ల

శ్రీ నాళం శ్రీనివాస మూర్తి, బాపట్ల

శ్రీ డాక్టర్ కె.వి. సత్యనారాయణాచార్యులు, బాపట్ల

# డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ సంస్మృతి

## దాతల పేర్లు

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ | - | హైదరాబాదు |
| శ్రీ ఇరదల పాండురంగారావు | - | ఏలూరు |
| శ్రీ ఊటుకూరి హృషీకేశగుప్త | - | చీరాల |
| శ్రీ ఊటుకూరి ప్రభాకర గుప్త | - | చీరాల |
| శ్రీమతి కంచర్ల సుకుమారి | - | విశాఖపట్నం |
| శ్రీ కాకరపర్తి మల్లికార్జునరావు | - | వేటపాలెం |
| శ్రీ కాకరపర్తి సాంబశివరావు | - | వేటపాలెం |
| శ్రీ కొంకిమళ్ళ లక్ష్మీప్రసాదు | - | విజయవాడ |
| శ్రీ కొంకిమళ్ల దుర్గా శ్యామసుందర్ | - | విజయవాడ |
| శ్రీమతి కోకా విమలకుమారి | - | విజయవాడ |
| శ్రీమతి గుడిపాటి సావిత్రి | - | ఏలూరు |
| శ్రీ గ్రంధి సుబ్రహ్మణ్యం | - | రాజమండ్రి |
| డా॥ చిన్నం సీతారామమ్మ | - | ఏలూరు |
| శ్రీ చిన్ని శంకరయ్య | - | వేటపాలెం |
| శ్రీ చుండూరి శివప్రసాదు | - | వేటపాలెం |
| శ్రీ సి.హెచ్. మార్కండేయగుప్త | - | రాజమండ్రి |
| శ్రీ చీమకుర్తి మల్లికార్జునరావు అండ్‌సన్స్ | - | ఏలూరు |
| శ్రీ చేపూరి గురువర్ధనమ్మ | - | వేటపాలెం |
| శ్రీ జి. చెన్నకేశవులు | - | హైదరాబాదు |
| శ్రీమతి తూనుగుంట్ల సుశీలా తిలక్ | - | హైదరాబాదు |
| శ్రీ నాళం కామేశ్వరరావు | - | రాజమండ్రి |
| శ్రీమతి నాళం కమలమ్మ | - | మచిలీపట్నం |

## డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ సంస్మృతి

| | | |
|---|---|---|
| శ్రీ నాళం నాగేశ్వరరావు | - | సికింద్రాబాదు |
| శ్రీమతి నాళం లక్ష్మీకాన్తం | - | మద్రాసు |
| శ్రీ నాళం శ్రీనివాసమూర్తి | - | బాపట్ల |
| శ్రీ నూనె కైలాసపతి | - | చీరాల |
| శ్రీమతి నూనె త్రిపుర సుందరి | - | ఏలూరు |
| డా॥ నూలి వరహాలు | - | విశాఖపట్నం |
| శ్రీ నూలి వెంకట లక్ష్మీరంగారావ్ | - | భీమవరం |
| శ్రీమతి నాగసూరి సులోచన | - | బాపట్ల |
| శ్రీ పొట్టి బ్రహ్మానందం | - | గుంటూరు |
| శ్రీ పోలిసెట్టి ఏకనాథగుప్త | - | గుంటూరు |
| శ్రీ పోలిసెట్టి హరిప్రసాదరావు | - | గుంటూరు |
| శ్రీ పి.వి.వి. ప్రసాదు | - | గుంటూరు |
| డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం | - | గుంటూరు |
| బొమ్మిడాల ట్రేడింగ్ కంపెనీ | - | గుంటూరు |
| శ్రీ మద్దా సత్యనారాయణ | - | బాపట్ల |
| శ్రీమతి మద్ది రామకుమారి | - | గుంటూరు |
| శ్రీ మద్ది రామకృష్ణ | - | గుంటూరు |
| శ్రీ మన్యం రాజా కనకయ్య జమీందారు | - | రాజమండ్రి |
| శ్రీమతి మోతే సత్యవతి | - | ఏలూరు |
| శ్రీమతి లింగమల్లు సావిత్రి | - | రాజమండ్రి |
| డా॥ విన్నకోట వీరరాఘవమ్మ | - | ఏలూరు |
| వైశ్యసేవా సదనం | - | రాజమండ్రి |
| శ్రీమతి శిఖాకొల్లు లక్ష్మీమోహన్ | - | హైదరాబాదు |
| శ్రీమతి సీరం సుశీలాబాయి | - | మచిలీపట్టణం |

# భాగం - 1



డా॥ లక్ష్మీకాన్తమ్మగారి

- బాల్య విశేషాలు
- కుటుంబ జీవనం
- మమతానురాగాలు
- కుటుంబ బాధ్యతలు
- వ్యక్తిత్వం, దాతృత్వం
- సాహస ప్రవృత్తి
- ఉద్యమస్ఫూర్తి

# నా సోదరి డాక్టర్ లక్ష్మీ కాన్తమ్మ

- నాళం నాగేశ్వరరావు
సికిందరాబాదు

1996 డిశంబరు 1వతేదీ ఉదయం 8గంటలు. . . . . . . ఒక జీవన జ్యోతి ఆరిపోయింది. ఒక విదుషీమణి కనుమరుగైనది. ఆమే శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ - ఆమె నాచెల్లెలు కావడం మరపురాని, మహత్తరమైన మధుర స్మృతి, ఆమెను గూర్చి చెప్పాలంటే హద్దులే ఉండవు - వాక్యాలే చాలవు. ఆమె బహుముఖ ప్రజ్ఞాశాలిని. ఆమె 21 డిశంబరు 1917న నాళం కృష్ణారావు కుమార్తెగా జన్మించింది. నాకంటే 2 సంవత్సరాలు చిన్నది. ఏలూరు వాసులు, మాతామహులు అయిన మోతేవారి యింటనే ఆమె, నేను, నాతమ్ముడు అందరం జన్మించాం, ఈ రెండు వంశాలు జమీందారులైనప్పటికీ వర్తక వ్యాపారాలందే కాక సంగీత, సాహిత్యాది లలితకళలలో నిష్ణాతులు. చిన్నప్పటినుండి నాచెల్లెలు నాతోనే కాక నా స్నేహితులతో కూడా కలసి మెలసి ఆటలాడేది. పాటలు పాడేది. కళాశాలలో చదువు. ఇంట్లో ప్రైవేటు మాస్టారి వద్ద చదువు. ఆమె 5వ ఏట, నా ఏడవ ఏట మా సంగీతాభ్యాసం - హార్మోనియం గాత్రం . . . ప్రారంభమయ్యాయి. రెండేండ్ల తర్వాత మా వీణాభ్యాసం మొదలైంది. మా తాతగారు నాళం కామరాజుగారు. గొప్ప వ్యాపారులేకాక గొప్ప దాతలు కూడా. వారు కలకత్తా, కటకం, బరంపురం, విజయనగరం, రాజమహేంద్రవరం, మదరాసు నగరాలలో ధర్మసత్రాలు కట్టించారు. కాకినాడలో దేవాలయం కట్టించారు. ఇతర స్థలాలలో చలివేంద్రాలు ఏర్పాటు చేశారు. కవి పండితులను, కళాకారులను ప్రోత్సాహ పరచి, సత్కరించి వారికి ధన సహాయాలు చేసేవారు. వారి ఆఖరి కుమారుడు, మానాన్నగారు నాళం కృష్ణారావుగారు. మానాన్నగారికి పుట్టిన వారంతా బ్రతుకలేదు. నేను, నాచెల్లెలు, నా తమ్ముడు మాత్రమే మిగిలాం.

మానాన్నగారికి వ్యాపారంలో బొత్తిగా ప్రవేశం లేదు. మెట్రిక్యులేషన్‌తో చదువు ఆపేశారు. స్నేహితులు ఎక్కువ. వారితో కలిసి తిరుగుతూ భగవత్ప్రేరణతో కవిత్వం చెప్పడం ప్రారంభించారు. బ్రహ్మసమాజంలో చేరి, సంఘ సంస్కారాన్ని చేపట్టారు. కందుకూరి వీరేశలింగం గారితో కలసి స్త్రీవితంతు వివాహాలు, బాల్యవివాహాలను నిషేధించి రజస్వలానంతర వివాహాలు చేయించడం, అస్పృశ్యతా నివారణ, గోసంరక్షణ, గ్రంథాలయోద్యమం. మొదలైన వాటిని ఆయన అకుంఠిత దీక్షతో కొనసాగించారు. మా అమ్మగారు వెంకటసుబ్బమ్మ నామధేయులు. వివాహానంతరం సుశీలమ్మగా మారినారు. ఆమెకు చదువు తక్కువే అయినా మా నాన్నగారి ప్రోద్బలంతో చదువు కొనసాగించి తాను కూడా పద్యాలు రాయడం ప్రారంభించారు. ఆమె సనాతనాచార

పరురాలు. నాన్నగారు బ్రహ్మసమాజవాది. అయినా వీరిరువురకు వాద భేదాలుండేవి కావు. ఎవరి విధులను వారు సక్రమంగా నెరవేర్చుతూ గృహవాతావరణాన్ని ఆనందంగా సుఖప్రదంగా చేసేవారు. ఇది వారి జన్మ సంస్కారం, క్రమక్రమంగా అమ్మగారు కూడా నాన్నగారు చేసే సంఘసేవలో పాలు పంచుకునేవారు. వారిదైన ఈ విశిష్ట సేవాభావం, భిన్నత్వంలో ఏకత్వం అనే సంస్కృతి సంపదలు బిడ్డలమైన మాకు కూడా బాల్యంలోనే అలవడినాయి.

మానాన్నగారు సంగీత సాహిత్యాది లలిత కళలన్నిటా ప్రోత్సాహం చూపేవారు. మా యింటికి కళాకారులే ఎక్కువగా వస్తుండేవారు. వీలైనప్పుడల్లా మానాన్నగారు స్నేహితులతో కలసి చదరంగం ఆడేవారు. ఆయనకాచదరంగం ఆరోప్రాణమే. మానాన్నగారి పినతండ్రి కుమారులు, కాకినాడ వాస్తవ్యులూ అయిన నాళం రామలింగయ్యగారు మానాన్నగారి ప్రోత్సాహంతో రాజమండ్రిలో 1920వ సంవత్సరంలో 'వైశ్య సేవాసదనం' అనే సంస్థను ప్రారంభించారు. అదే క్రమంగా 'జాతీయ బాలికా పాఠశాల' గా రూపుదిద్దుకొని గొప్ప పేరు పొందింది. అక్కడ సంస్కృతం, ఆంధ్రం, సంగీతం, కుట్టుపనులు, దేశ చరిత్ర మొదలైన అంశాలలో శిక్షణ నిస్తుండేవారు. లక్ష్మీ కాన్తమ్మ ఆ సేవాసదనంలోనే విద్యాభ్యాసం మొదలు పెట్టింది. ఆ సంస్థలోని సత్కార్యాచరణం, నియమ నిష్ఠలు, దీక్ష, స్త్రీ జనాభ్యుదయం పట్ల ఆదరణ, ఆదర్శాలు, సంగీత సాహిత్యాభ్యాసం . . . , క్రమశిక్షణ .. . .ఇవన్నీ ఆమెను ఒక విశిష్టవ్యక్తిగా తీర్చిదిద్దాయి. అలా బాల్యం నుండే ఒక ఆదర్శవాదిగా సంఘసంస్కారిగా, స్థిరభావాలు గల పరిపూర్ణ యువతిగా ఆమె ఆ సంస్థనుండి బయటకు వచ్చింది. 1930లో 'వైశ్య సేవా సదనం' 'ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల'గా రూపాంతరం చెందింది. లక్ష్మీకాన్తమ్మ అక్కడే "ఉభయ భాషా ప్రవీణ' కోర్సు చదవడం ప్రారంభించింది. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. ఆ కాలంలోనే ఆమె ఇంటర్ కాలేజియేట్ వక్తృత్వ పోటీలలో పాల్గొని అన్నిటా ప్రథమురాలిగా గెలుపొందుతుండేది. తరగతిలో ఉపాధ్యాయినులు ప్రశ్నలు వేస్తే అన్నిటికీ ఆమే మున్ముందుగా సమాధానాలు చెప్పేది. స్వభావం దూకుడుగా ఉండేది. ఎక్కువ అల్లరి కూడా చేసేది. క్లాసులు చూడడానికి ఎవరైనా వస్తే వారిమీద ఆశువుగా తేటగీతికలలో కవిత్వం చెప్తుండేది. మానాన్నగారితో కలసి నేను, నాచెల్లెలు గౌతమీ గ్రంథాలయానికో, బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరానికో, సంస్కృతిక సమావేశాలకో వెళ్తుండేవాళ్లం. 'మధురకవి' అనే బిరుదును మానాన్నగారికి హైదరాబాదులోని వైశ్య సంఘంవారు ప్రదానం చేశారు. వారిపట్ల ఆ బిరుదు సార్థకమైనదే.

క్రమక్రమంగా లక్ష్మీకాన్తమ్మ ప్రసంగాలు ఎక్కువైనాయి. సత్యాగ్రహోద్యమ సభలలోను,

ఇతర సాహిత్య సభలలోను, 12 ఏండ్ల వయసు నుండే ఆమెకు ఉపన్యాసాలివ్వడం అలవాటైపోయింది. తన ప్రోత్సాహం తోనే హిందీ పాఠ్య ప్రణాళికలో మార్పు వచ్చి ప్రాథమిక నుండి అన్ని తరగతులలోను ఒక తెలుగు పుస్తకాన్ని ప్రవేశ పెట్టారు. ఆమె హిందీ ప్రాథమిక, మాధ్యమలలో ఉత్తీర్ణురాలైంది. ఆమెకు 13 సంవత్సరాల వయస్సులో చీరాల వాస్తవ్యులైన ఊటుకూరి హయగ్రీవ గుప్త గారితో వివాహమైంది. ఊటుకూరి వారు పరమ నిష్ఠాపరులు, సనాతనాచారవాదులు, ఐనప్పటికి బ్రహ్మసమాజ సభ్యులైన మాతో వియ్యమందడానికి నాచెల్లెలి ప్రతిభా పాటవాలే కారణం. మానాన్న గారితో కలిసి కాంగ్రెస్ ఉద్యమాలలో జాతీయ గీతాలు పాడుతూ, ఉపన్యాసాలు చెప్తూ ముమ్మరంగా పాల్గొనేది. విదేశ వస్త్రబహిష్కరణలో, దహన కార్యక్రమాలలో మా అమ్మ ఎక్కువ ఉత్సాహం చూపేది. గాంధీగారు మెయిన్‌రోడ్డులో ఉన్న మాయింటి దగ్గరకు వచ్చేటప్పటికి, వారి బండిని అక్కడ ఆపించి, మా అమ్మగారు, చెల్లెలు విదేశీ వస్త్రాలను మార్గమధ్యంలో కుప్పలు పోసి కాల్చేవారు. గాంధీ గారి ఆదేశాన్ననుసరించి స్త్రీలనుండి బంగారు ఆభరణాలను తీసుకుని వారికి సమర్పించారు. అది చూచి ఆనంద పరవశులై గాంధీగారు నా చెల్లెలి భుజం తట్టి ఆశీర్వదించారు. మానాన్నగారు ఆమెకు ఇంగ్లీషు నేర్పించాలని పట్టుపట్టి ఒక స్నేహితుని ఆంగ్లోపాధ్యాయునిగా నియమించారు. అలా ఆమె ఆంగ్ల విద్య కూడా అభ్యసించింది. వీణ సాధన కూడా జరుగుతుండేది. గొప్ప వీణా విద్వాంసులైన ఈమని అచ్యుతరామశాస్త్రిగారు, పొడుగు రామమూర్తిగారు, బెహతా రాజారావుగారు మాకు వీణా గురువులు. మాతల్లి దండ్రుల ప్రోత్సాహం వల్లనే మాకీ విద్యలు ప్రాప్తించాయి. ప్రొద్దునే వీణ సాధన, గోదావరిలో ఈత, చదువు, వేళప్రకారం పాఠశాలలో విద్యా భ్యాసం, సాయంత్రం ఆటలు. మా దినచర్య ఇలాగ సాగేది. అన్నా చెల్లెళ్లిద్దరమూ, కలిసి పాటకచేరీలు చేసేవాళ్లం, వీణలు వాయించేవాళ్లం. సాహిత్య సమావేశాల్లో పాల్గొనే వాళ్లం. వ్యాయామశాలలకు వెళ్లి వ్యాయామం కూడా నేర్చుకున్నాం. మా మేనమామల ఇంటికి వెళ్లి గుర్రపు స్వారీ కూడా నేర్చుకొన్నది మాచెల్లెలు. ఇంతెందుకు ఆమె మగపిల్లవాడిలాగా పెరిగింది. భర్త ఆమెవిద్యా వ్యాసంగాన్ని ప్రోత్సహించారు. ఆమె 'కృష్ణకుమారి' అనే కలం పేరుతో సాహిత్యవ్యాసాలు, పద్యాలు రాసి 'భారతి' మాసపత్రికకు పంపుతూండేది. మహానందిలో జరిగిన ఒక వైశ్య మహాసభలో నాచెల్లెలు 'వ్యాసుని కూర్పు, తిక్కన తీర్పు' - అనే మకుటంతో ద్రౌపదీ పాత్ర చిత్రణను గూర్చి ప్రసంగించింది. అదివిని మద్రాసులోని సాహిత్య సంఘాల వారు కూడా ఆమెను ఆహ్వానించి ఆమెచేత ప్రసంగింప చేశారు. తరువాత భర్త ప్రోత్సాహంతో కలం పేరును వదిలివేసి "ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ'గా తన సాహిత్య వ్యాసంగాన్ని ప్రారంభించింది.

రాజమండ్రిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళా సభలలో ఈమె కీలక పాత్ర ంచిది. మా అమ్మగారు స్థాపించిన ఆంధ్రమహిళా గాన సభకు నాచెల్లెలు, మా బంధువు దేవతా లీలావతి కార్యదర్శినులుగా పని చేశారు. గానసభవారు నిర్వహించిన ప్రతి కార్యక్రమాలలోను, పోటీలలోనూ పాల్గొనేది.

సద్యఃస్ఫూర్తిని, ప్రతిభా పాటవాలను ప్రదర్శించి ఎన్నో బహుమతులను పొందేది. 1935 అక్టోబరు మాసంలో రాజమండ్రిలోని "ఆంధ్రవాఙ్మయ సంఘం"వారు 'కవి సార్వభౌమ' శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి సన్మానం చేస్తూ ఈమెకు కూడా విద్వత్కవయిత్రి అనే బిరుదునిచ్చి ఘనంగా సన్మానించారు. మానాన్నగారు అనేక కళారంగాలలో ప్రతిభకల అనేక కళాకారులకు, సన్మానాలు చేయడమే కాక ఆ నిరుపేద కళాకారులకు ఆర్థిక సహాయం కూడా చేస్తుండేవారు. ఆయన నిర్వహించిన కవి పండిత గోష్ఠులలో నాచెల్లెలు కూడా పాల్గొని ప్రతిభను ప్రదర్శించేది. ఇటువంటి గృహ వాతావరణంలో పెరిగిన ఈమె ఇట్టి పరిణతిని సాధించి ఒక ఉత్తమ కళాకారిణిగా రూపుచెందిందంటే అతిశయోక్తి ఉండదు కదా!

భర్త హయగ్రీవగుప్త బాపట్లలో న్యాయవాదిగా పనిచేస్తున్నందువల్ల ఈమె బాపట్ల నివాసి అయింది. బాపట్లలో కూడా ఆమె తన ఔత్సాహిక వ్యాసంగాన్ని కొనసాగించింది. అనేక సంస్థలకు అధ్యక్షురాలిగా కార్యనిర్వాహకురాలిగా పని చేసి ఘన విజయాలు సాధించింది. 1940-41 సంవత్సరాలలో నేను బొంబాయికి వెళ్ళి అక్కడే ప్రకాశ్ పిక్చర్స్ అనే ఫిలిం సంస్థలో వీణా వాయిద్య కారునిగా స్థిరపడ్డాను. బొంబాయి ఫిలిమ్ రంగంలో దక్షిణాది వాయిద్యమైన వీణను ప్రవేశ పెట్టిన వాడిని నేనేనన్న ఖ్యాతి నాకు కలిగింది. బ్రహ్మసమాజ వాదులమైన మేము ఆ సంప్రదాయాన్ని ఆదరించి ఆ సిద్ధాంతాలననుసరించి నేను వర్ణాంతర వివాహం చేసుకున్నాను. ఇది నాబావగారికి నచ్చలేదు. నా చెల్లెలికి మాకూ గల బాంధవ్యాలను త్రెంచివేసి ఆమెకు చాలా కఠినమైన ఆంక్షలు విధించారు. ఈ సంఘటన మా కుటుంబ వ్యక్తులపై చెరగని ముద్ర వేసింది. దారుణమైన పరిణామాలు చోటుచేసుకున్నాయి. మానసికంగా అన్నా చెల్లెళ్ళిద్దరం క్రుంగిపోయాం. రాకపోకలే కాదు మా మధ్యకొన్ని సంవత్సరాలు మాటలు, చూపులు కూడా లేవు. క్రమంగా నా చెల్లిని గూర్చిన విశేషాలు నాకు అంతగా తెలియలేదు. నా మేనకోడళ్ల, మేనల్లుళ్ళ చొరవవల్ల, ప్రయత్నం వలన అన్నా చెల్లెళ్ళిద్దరమూ తిరిగి 1985లో కలుసుకున్నాం. ఇన్నేళ్ల మనోవేదననుండి కోలుకున్నాం. మా బాల్యాన్ని నెమరు వేసుకున్నాం. ఇద్దరమూ పెద్దవాళ్లమయ్యాం. కష్టాలను, సుఖాలను అనుభవించాం. తిరిగి ఆనందాన్ని పంచుకున్నాం.

నాచెల్లెలు స్వీయచరిత్ర "సాహితీరుద్రమ" వలన నేను చాలా విషయాలు తెలుసుకున్నాను. నిండు గర్భిణిగా ఉండికూడా 'అమరావతి' లో జరిగిన జంతుబలిని ఆపడానికి ఆమె వెళ్లిందట. ఆమె మాటలను వాళ్లు చెవిని వేసుకోక పోతే ఆమె ఆ

బలిపశువు స్థానంలో నిలబడిందట. అప్పుడొక పెద్దమనిషి కల్పించుకుని ఆ జంతుబలిని ఆపుచేయించాడట. ఇలాగే ఆమె అనేక ఉద్యమాలలో పాల్గొని అందరిలోను చైతన్యాన్ని కలిగించేది. ఈమె ఎక్కడకు వెళ్లినా జనంలో స్ఫూర్తిని, ఆర్తిని కలిగించేది అనేక మంది మహిళలకు, యువత సమాజానికి మార్గదర్శిని అయింది.

మానాన్నగారు సంకలనం చేసిన శ్రీకృష్ణరాయ విజ్ఞాన సర్వసము 'అనే అమూల్యమైన గ్రంథాన్ని ఈమె పరిష్కరించి చాలా శ్రమలకోర్చి ప్రచురించి తండ్రి ఋణాన్ని తీర్చుకొన్నది. ఈ శతాబ్దంలోనే మహిళ లెవ్వరికీ దక్కని కనకాభిషేక సత్కారాన్ని కూడా ఈమె పొందింది. గజారోహణ సన్మానాన్ని కూడా ఈమె అనుభవించింది. ఇలా చెప్పుకుంటూ పోతే నా చెల్లెలికి లభించని అవార్డులు లేవు. ఆమె పొందని సత్కారాలు లేవు. ఆమెకు దక్కని బిరుదులు లేవు. ఇలా చెప్తూపోతే అంతు ఉండదు.

ఆమె సంతానం కూడా ఆమెకు తగిన బిడ్డలుగా రూపొందారు. తల్లితండ్రులనకు కీర్తి ప్రతిష్ఠలను గడిస్తూ వారి వారి జీవితాలను చక్కదిద్దుకుంటున్నారు.

ఆమె ఒక పరిపూర్ణ వికాసం కలిగిన విశిష్ట వ్యక్తి. ఆమె వ్యక్తే కాదు. సమష్టి సంస్కారవంతురాలు. బహుగ్రంథ రచయిత్రి. మహిళోద్యమకర్త. సాహస వనిత. దీన జనులకు చేయూతనిచ్చి వారిని ఆదుకున్న ధీర వనిత. స్వాతంత్ర్యోద్యమ కారిణి. ఉన్నతాదర్శమూర్తి. అపజయమెరుగని, అలుపు సొలుపులు లేని మహోన్నత మహిళ. గాంభీర్యమూ, వర్చస్సూ, తేజస్సూ కలబోసిన వ్యక్తి.

సుమారు 60-65 సంవత్సరాలు సాహిత్య సేవచేసి, ఆంధ్ర ప్రజల హృదయాలలో తనకంటూ ఒక పదిలమైన స్థానాన్ని కల్పించుకుని, ఆంధ్రరాష్ట్రంలోనే తనదైన ఒక చెరగని ముద్రను వేసింది. దైవ సాక్షాత్కారం పొంది, తద్వారా లభించిన ఆనంద పారవశ్యాన్ని అనుభవించింది. తుదకు 79 సంవత్సరాలు నిండుతాయి అనుకుంటుండగా వ్యాధిగ్రస్తురాలై తాను నమ్మిన ఆదైవ సన్నిధికే వెళ్లిపోయింది. అవును ఒక ధృవతార రాలిపోయింది. అమరజీవి అయింది. మా అందరి హృదయాలలోను తరగని దుఃఖాన్ని మిగిలించి వెళ్లిపోయింది. నా చెల్లెలు ధన్యురాలు. కారణజన్మురాలు -

నాచెల్లెలు వంటి మహోన్నత వ్యక్తి "నభూతో నభవిష్యతి" ఆమె నాకే కాదు చెల్లెలు. ఆంధ్రులందరికీ అక్కయ్యే, చెల్లెలే . . . .

నా చెల్లెలు లేని లోటు నాకీవయస్సులో తీరేదికాదు. కాని విధి బలీయం. అందరమూ ఆ సర్వేశ్వరుని ఆజ్ఞాబద్ధులమే. కలుసుకొన్న కొద్ది కాలానికే ఆమె అన్నను విడిచి వెళ్లిపోయింది.

ఆమె ఆత్మకు శాతి చేకూరుగాక!
ఆమె నాకొక మధురస్మృతి.!

# నా అక్కయ్య డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ

- నాళం లక్ష్మీకాన్తమ్
మద్రాసు

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారితో పరిచయమేంటండీ పరాయి వారైతే అలాంటివన్నీ. స్వంత అక్కయ్య. మేమిద్దరం అన్నదమ్ముల పిల్లలం. మా ఇద్దరికి పది సంవత్సరాలు వ్యత్యాసం అందువల్ల నాకు ఊహ తెలిసినప్పటి నుండి ఆమె మా అందరికీ అక్కయ్య.

మానాన్నగారు స్వర్గీయ నాళం వెంకటరత్నం గారు. లక్ష్మీ కాన్తమ్మగారి నాన్నగారు, మా చిన్నాన్నగారు స్వర్గీయ నాళం కృష్ణారావుగారు. మా అక్కయ్యకూ, నాకూ మా నాయనమ్మగారి పేరు లక్ష్మీకాన్తమ్మ అనే పెట్టారు. మానాన్నగారు వ్యాపారంలో మంచి పేరు ప్రతిష్ఠలు పొందగా,మా చిన్నాన్నగారు లలిత కళా రంగాన్నే వారి ప్రవృత్తిగా ఎంచుకుని ప్రశక్తి కెక్కిన విషయం సర్వులకు విదితం. "మీగడ తరకలు", "గోరుముద్దలు", "తేనె చినుకులు", మొదలగు ఖండకావ్యాలనెన్నింటినో రాసి బాలసాహిత్యంలో తొట్టతొలి కవిగా ఉదయించారు. స్వర్గీయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, ఇంకా అనేకమంది కవి పండితులు, సంగీత కళాకారులు . . . చిత్ర లేఖకులు . . . ఎంతో మంది ప్రతినిత్యం వారి యింటికి వచ్చి పోతూండేవారు. నేను చాలా చిన్నదాన్ని. అందరినీ అలా చూస్తూ ఉండేదాన్ని. వారింటినిండా పుస్తకాలే. అవే వారి గృహాలంకారాలు. ఇక మా పినతల్లి నాళం సుశీలమ్మ సరేసరి - ఆరోజుల్లోనే ఆమె గొప్ప సంఘసేవా పరాయణురాలు. స్వాతంత్ర్య సమరంలో ఆమెకూడా తనకు తగిన సేవ చేసింది. ఆమె చేతికి రాట్నం ఒక అలంకారం. వీణ ఇంకో అలంకారం. డిశంబరు నెలవస్తే వారింట్లో ఒక పెద్ద పండుగే. నాకు తెలిసినంతవరకు ఆంధ్ర దేశంలో మొట్టమొదట మహిళా గాన సభను స్థాపించింది. ఆమే. ప్రతి డిశంబరు నెలలోనూ ఆమె ఆంధ్రమహిళా గాన సభలను మా నాళం వారి సత్రంలో అతివైభవంగా జరుపుతుండేవారు. బయటి ఊళ్లనుండి అనేక మంది గాయనీ మణులు, నర్తకీమణులు వచ్చి వారి వారి విద్యలను ప్రదర్శిస్తూండేవారు. నేను కూడా ఆసభలకు వెళ్తూండే దానిని. అలాంటి కుటుంబ వాతావరణంలో జన్మించిన మా అక్కయ్య కవయిత్రిగా, గాయకురాలిగా ఎదగడం సహజం. ఆమె ఒక బాలమేధావి.

"అక్కయ్య 10 సంవత్సరాల వయస్సు నుండీ వేదిక నెక్కి ఉపన్యాసాలిచ్చేది" అని మా అమ్మగారు ఎప్పుడూ మాతో చెప్తుండేవారు. నాకు ఊహతెలిసినప్పటినుండి ఆమె నాకు ఉపన్యాసకురాలిగా బాగా తెలుసు. ఒకరోజు రాజమండ్రిలో ఉంటే ఆ

సాయంత్రం బెజవాడలో ఆమర్నాడు హైదరాబాదులో ఇంకోరోజు మద్రాసు. ఇలా ఆమె ఉపన్యాసాలు జరిగేవి. ఆమె ఎప్పుడు వస్తుందో ఎప్పుడు వెళ్తుందో ఎవ్వరికీ తెలిసేది కాదు.

ఆమె వచ్చిందంటే చాలు చిన్న, పెద్దా అందరినీ మంచి చెడ్డలు, కష్టసుఖాలు విచారిస్తూ అందరినీ అతి ప్రేమతో మాట్లాడిస్తూండేది. ఆమె మాయింటికే కాదు రాజమండ్రిలో అందరికీ ఆడపడుచు. అందరూ ఆమెనలాగే గౌరవించేవారు.

ముఖ్యంగా వైశ్యసేవా సదనానికి పెద్దాడపడచు. ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలకు అనుబంధంగా ఉన్న వసతి గృహమది. ఆ కళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి అక్కయ్యంటే తరగని ప్రేమ. అక్కయ్య ఆమెకు కుడిచెయ్యి. ఆకళాశాల నుండి అక్కయ్య ఉభయభాషా ప్రవీణపట్టా పుచ్చుకుని ప్రప్రథమంగా స్వర్ణ పతకాన్ని సాధించింది. ఆమె జీవించినన్నాళ్లు ఆ సేవాసదనానికి ఎంతో సేవ చేశారు.

అప్పటి ఉమ్మడి ఆంధ్ర, మద్రాసు రాష్ట్రం, కర్నాటక రాష్ట్రాలలో ఎక్కడ ఆర్యవైశ్య మహాసభలు జరిగినా అక్కయ్య వెళ్లేది. నేనుకూడా ఆమెవెంట వెళ్తూండేదాన్ని. ఆయా ఊళ్లలో ప్రముఖవైశ్యుల ఇండ్లకు వెళ్తుండేది. ఆమెతో బాటు నేనూను. అది ఏమి పూర్వజన్మ ఫలమో నాకు తెలియదు. ఆమెను వారు ఆదరించే తీరు - ఆమె వారందరితో మెలిగే తీరు నాకు ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించేవి. నాకు చాలా సంతోషంగా ఉండేది. అది ఆమె చేసుకున్న అదృష్టమేనని నా అభిప్రాయం. అందరికీ అలా జరుగదు -

ఇంకో విషయం - మా కుటుంబంలో ఆమె అంటే ఒక విధమైన ఆరాధనా భావం. ఆమె ఏంచేసినా మాకు శుభం జరుగుతుందని ఒక ప్రగాఢ విశ్వాసం. నా అన్నయ్యలిద్దరికీ సంతానం నిలిచేది కాదు. ఆ భార్యా భర్తలెంతగానో విచారిస్తూండే వారు. తమ పిల్లలకు పేర్లుకూడా పెట్టేవారు కాదు. ఈ అక్కయ్య ఎప్పుడు వచ్చినా మా అన్న వదినలు వాళ్ల పిల్లల్ని ఆమెకు చూపించి "అమ్మాయీ వీడికి పేరు నీవే పెట్టాలి' అని ప్రాధేయ పడేవారు. అక్కయ్యకు మా యింట్లో ఇప్పటికీ ఎప్పటికీ "అమ్మాయీ!" అదే పేరు. (మాయింట పుట్టిన ఇద్దరాడ పిల్లలమూ పెద్దమ్మాయి, చిన్నమ్మాయిగా పిలువబడ్తున్నాం నేటికీ). వెంటనే ఆమె ఏదో ఒక పేరుతో ఆ పసివాడిని పిలిచేది. ఇంక అదే పేరు వాడుకలోకి వచ్చేది. ఆమె పేర్లు పెట్టడం ప్రారంభమైనప్పటినుండి ఆ పిల్లలు చిరంజీవులే. ఈనాడు వాళ్లంతా పెరిగి పెద్దవారై తమ అత్తయ్యను తలచుకుంటూంటారు. ఆ పిల్లలు కూడా అక్కయ్యనే అత్తయ్య అంటారు. మా యిద్దరినీ పెద్దమ్మాయి, చిన్నమ్మాయి అనే ఈనాటికీ వ్యవహరిస్తారు. ఆమె అందరికీ మంచినే కోరేది. చేసేది కూడా !

మా నాళం వారి వంశం అంటే ఆమెకెంతో అభిమానం. మాకుటుంబ పెద్దలగురించి ఎంతో గొప్పగా చెప్తుండేది. "ఆరోజుల్లో మన తాతలు రవ్వలు, మణులు మూటలు కట్టుకుని, అమ్ముతుండేవారట. . ." అని ఇలా ఎన్నో విశేషాలు మాతో చెప్తుండేది. మారెండు కుటుంబాలు ముందు కలిసి ఉన్న తర్వాత ఎవరికి వారు విడిపోయారు. అయినా మా మధ్య విడదీయలేని ఆప్యాయతానురాగాలు ఉండేవి. బాంధవ్యాన్ని మించింది మా రెండిళ్ల అనుబంధం. మా పెద్దన్నయ్య స్వర్గీయ నాళం రాజారావుగారు అక్కయ్యను కలుపుకుని నాకు ముగ్గురు చెల్లెళ్లు అని చెప్పుకుంటుండేవారు. అలాగే మా లక్ష్మీకాన్తం అక్కయ్య అన్నదమ్ములైన నాళం నాగేశ్వరరావుగారు, నాళం కామేశ్వరరావుగారు కూడా మా యిద్దరిని వారి స్వంత చెల్లెళ్ళుగానే చూచేవారు. అన్నదమ్ముల పిల్లలాగా కాకుండా ఒకయింటి పిల్లల్లాగానే ఈనాటికీ మేము మసులుకుంటున్నాం. అంత గొప్ప అనుబంధం మాది".

ఆమెకు తనకులమంటే చాలా అభిమానం. వారిలోని నిజాయితీని, రుజు ప్రవర్తనను, నియమ నిష్ఠలను ఎప్పుడూ ప్రశంసిస్తుండేది. మా ఆర్యవైశ్య ప్రముఖులందరికీ ఆమె పేరు సాధారణమై పోయింది. మాకులదేవత శ్రీ కన్యకాపరమేశ్వరీ సుప్రభాతాన్ని సంస్కృతంలో రాశారు - చాలా చక్కని రచన అది. సదరన్ వైశ్య అసోసియేషన్ మద్రాసు వారు ఆ సుప్రభాతాన్ని సావనీరులో పలుమార్లు ప్రథమ పుటలో ప్రచురించేవాళ్లు. ఆమెకు ఆశువుగా వచ్చిన భావమది.

ఇంక ఆమె కవిత్వం అంటారా ! నేను కవిని కాను కనుక నాకంతగా తెలియక పోయినా ఆమె ఉపన్యాసాలు వింటుంటే ఏదో తెలియని ఆనంద పారవశ్యం కలిగేది నాలో. "మా అక్కయ్య ఎంత గొప్పది అని" నాలోనేనే గర్వించేదాన్ని చిన్నప్పటినుండి నా చదువంతా ఆంగ్ల మాధ్యమంతోనే జరిగినందువల్ల తెలుగు భాషా, సాహిత్యాలపై నాకంత పాండిత్యం లేదు. కాని అక్కయ్య ఉపన్యాసం నన్ను ఎంత గానో ప్రభావితురాలను చేసేది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో నాకు బి.ఏ. సంగీతంలో స్వర్ణపతకం లభించినప్పుడు ఆమె ఎంత సంతోషించిందో ఎందుకంటే ఆమె సాహిత్యంలో యూనివర్సిటీ ఫస్ట్ - గోల్డ్ మెడలిస్ట్, నేను సంగీతంలో యూనివర్సిటీ ఫస్ట్ గోల్డ్ మెడలిస్ట్. అందుకు ఆమె కంత సంతోషం. అక్క చెల్లెళ్లిద్దరికి University First, Gold Medals వస్తే ఎవరు సంతోషించరు ?

ఒక నిండైన జరీ అంచు పట్టుచీర కట్టుకుని, గృహలక్ష్మివారు తనకిచ్చిన స్వర్ణకంకణం చేతికి తొడిగి, మంచి శాలువా కప్పుకుని, పెద్దకుంకుమ బొట్టును పెట్టుకొని గంభీరమైన ఉపన్యాసమిస్తూంటే సాక్షాత్తు సరస్వతీదేవి ప్రత్యక్షమైనట్లే ఉండేది. అలా ఆమెను చూచినప్పుడు ఆమె అంటే ఎంతగౌరవం పెరిగిపోయేదో నాలో ! ఆమెకు చెల్లెలుగా

పుట్టడం నాపూర్వజన్మసుకృతమే అనుకుంటుంటాను. ఆ ఉపన్యాసం !! ఏమి గాంభీర్యమండీ ! మొదటినుండి చివరివరకు ఒక అనర్గళ వాక్ప్రవాహమే పునరుక్తి ఉండదు. ఎక్కడెక్కడో పురాణాల్లోంచి, కావ్యాల్లోనుండి ప్రమాణాలు చెప్పి, తనముందు కూర్చుని ఉన్న ప్రముఖ కవి పండితులతో ఏమండీ శాస్త్రిగారూ! కవిగారూ! నేను చెప్పేది సరియైనదేనా ? అనేవారు. ఎంత ఆత్మవిశ్వాసం! ఎంతటి శక్తిసామర్ధ్యాలు ! ఆమె స్వరం సింహగర్జనే సుమండీ ! ఒకసారి అక్కయ్య మద్రాసులో ఉపన్యాసం ఇస్తూంటే ప్రముఖకవి; గాయకుడు పి.బి. శ్రీనివాస్‌గారు అక్కయ్యమీద అక్కడికక్కడే ఒక పద్యం రాసి సభలో చదివారు. అదెలా ఉన్నదంటే - ఒక్కొక్క వరుసలో ఆఖరి అక్షరం తీసి అన్నిటినీ చేర్చి చదివితే ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ అని వస్తుంది. ఆమె ఉపన్యాసం శ్రోతలమీద అంతటి ప్రభావం చూపించేది.

ఇది సరే ! ఇక సాహసమంటారా ! ఆరోజుల్లోనే ఆమె ఒంటరిగా ధైర్యంగా ఎంతెంత దూరమో ప్రయాణాలు చేసేది. ముఖ్యంగా ఆంధ్ర కవయిత్రులు, అఖిల భారత కవయిత్రులు - గ్రంథాలు రాసినప్పుడు. పల్లెటూర్లు మొదలు పట్నాల వరకు వెళ్లి ఎక్కడెక్కడ కవయిత్రులు, రచయిత్రులు ఉన్నారు - అని విచారించి వారిని గురించి సవివరంగా తెలుసుకొని ఇంటికి వచ్చి రచన చేసేది. ఇది సాధారణ విషయం కాదు. ఆమె కొక్కతెకే చెల్లింది. ఆమెకు మొదట్లో ఆంగ్లభాష అంతగా రాకపోయినా తరువాత తరువాత ఆభాషలో కూడా పాండిత్యం సంపాదించి సుమారుగా మాట్లాడడం కూడా నేర్చుకున్నారు. హిందీ భాషలో కూడా ఆమెకు మంచి పరిజ్ఞానం ఉన్నది. హిందీలో కూడా మాట్లాడే వారు. కేంద్ర సాహిత్య ఎకాడమీ వారి పిలుపుపై రష్యా, జర్మనీ, చెకోస్లావేకియా మొ॥ దూరదేశాలకు భారతదేశ ప్రతినిధిగా ఆమె వెళ్లడం. అక్కడ ఉపన్యాసాలు ఇవ్వడం, అందరినీ మెప్పించడం గర్వించ దగిన విషయం.

సాహిత్యంతో బాటు సంగీతం కూడా ఆమెకు ఉగ్గుపాలతో అబ్బిన విద్య. మానాళం వారి కుటుంబమే సంగీత సాహిత్యాలను పోషించిందంటే అతిశయోక్తికాదు. ఇంట పుట్టిన అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు అందరూ కూడా సంగీత విద్వాంసులే. మా అందరికీ వీణ నేర్పించడం కోసం విజయనగర సంప్రదాయానికి చెందిన పొడుగు రామమూర్తిగారి ప్రథమ శిష్యులైన బెహతా రాజారావు గారిని మా చిన్నాన్నగారు రాజమండ్రికి పిలిపించారు. మా అందరికీ వారే గురువులు.

పెండ్లి పేరంటాలలోను, సభలలోను . . . ఏ సందర్భానికి తగిన పాటలను ఆయా సందర్భాలలో అక్కయ్య పాడుతూ మాకందరికీ స్ఫూర్తిని కలిగిస్తూండేది. వివాహాలలో వియ్యపురాళ్ల హాస్యపుపాటలను ఆమె పాడిన తీరును ఈనాటికీ మరచిపోతేం. ఉపన్యాసాలలో కూడా పద్యాలను రాగభావయుక్తంగా పాడి అందరి చేత ఓహో !

అనిపించేది ! సంగీత సాహిత్యాలతోనే ఆమె పుట్టిందా అనిపించేది. మనిషిరూపం గంభీరమే, ఆమె స్వరమూ గంభీరమే, ఎప్పుడూ ధైర్య సాహసాలతో కూడిన సంభాషణలే. ఆమె విచారం వెలిబుచ్చడం ఎప్పుడూ ఎరగను. అలాంటి నిండైన వ్యక్తి మా అక్కయ్య ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

ఒక యింట్లో పుట్టిపెరిగిన మా అక్కయ్య గురించి ఎంతని చెప్పగలను ? రాయదలచుకుంటే పెద్ద గ్రంథాలే రాయవచ్చును.

ఒక ముఖ్యవిషయం.. ఈమధ్య ఆమెకు సుస్తీ చేసిందని తెలిసింది. ఆమె కుమారుడు చి॥విజ్ఞానేశ్వర్ అమెరికా నుండి వచ్చి మద్రాసు ఎయిర్ పోర్ట్ నుండి 'పిన్నీ అమ్మకు చాలా సుస్తీగా ఉన్నది. నేను బాపట్ల వెళ్తున్నాను - నీవు నాతోవస్తే నిన్ను తీసుకు వెళ్తాను. అమ్మను చూద్దువుగాని' అని ఫోను చేశాడు. వెంటనే నేను బయలుదేరి అతని సహాయంతో బాపట్లకు వెళ్లాను. ఆ రాత్రి నేను ఇల్లుచేరేసరికి అర్ధరాత్రి 11గం॥లు దాటింది. ఆమెకు నిద్రాభంగం చేయడం ఇష్టం లేక వేరొక గదిలోకి వెళ్లి నేను నిద్రపోయాను. తెల్లవారి లేచేసరికి అక్కయ్య బాగా వదులైపోయిన కండ్ల జోడుపెట్టుకుని వార్తా పత్రిక చదువుతూ కనిపించింది. ఆమె వ్యాధితో ఎంతగా చిక్కిపోయిందో అని నేను బాధపడుతుంటే, తానే నన్ను "ఏంటే చిన్నమ్మాయీ ! అంత చిక్కిపోయావూ !" అంటూ దీర్ఘాలు తీస్తూ తన సహజధోరణిలో పలకరించింది. అప్పటికే ఆమె బాగా క్షీణించింది. ఓపిక బాగా తగ్గింది. స్వరం బాగా చిన్నదైపోయింది. ఆ గాంభీర్యమంతా ఎక్కడికి పోయిందో అనిపించింది. "అక్కయ్యా! ఇలాగై పోయావేమిటీ! అని దగ్గరకూర్చున్నాను - భగవంతుని మాయ ఎంత గంభీరులైనా వ్యాధికి చిక్కితే ఇలా క్షీణించిపోతారు గదా అని నాలోనేను అనుకున్నాను. ఆమెతో 1 1/2 రోజులు గడిపాను. ఆత్మతృప్తినాకు కలిగింది. ఉన్నంతసేపు ఆమెకు వచ్చిన అవార్డులు, బిరుదులు సన్మాన పత్రాలు అన్నీ చాలా వరకూ చూడగలిగాను. బీరువాల నిండా పుస్తకాలే, గోడలనిండా సన్మానస పత్రాలు, ఫోటోలే ! ఇంటినిండా అవార్డులే ! ఎన్నని చూడగలను ? ఆమె రాసిన గ్రంథాలే కాక తాను సేకరించిన, కొన్న గ్రంథాలతోనే ఇల్లంతా నిండి పోయింది. ఇటీవలే దూరదర్శన్ వారు "తెలుగు వెలుగులు" శీర్షికతో "ఆంధ్ర దేశంలోని సాహితీ వేత్తలను, కళాకారులను గురించి తెలియచేస్తూ తీసిన చిత్రమాలికలో తనను గూర్చి తీసిన ఎపిసోడును నాకు చూపించింది. అది చూస్తూంటే నాకు చెప్పలేని ఆనందం కలిగింది. నాకు ఆమెపై గల గౌరవం మరింత పెరిగింది. ఇంక ఎన్నాళ్లుంటాను? అని నా గమ్యానికి నేను బయలు దేరాను. అంత బాధలో కూడా కుంకుమ పెట్టించి, రవికల గుడ్డ ఇచ్చి ఆమె రచించిన 'నా తెలుగు మాంచాల' గ్రంథాన్ని నాకు ఇచ్చింది. రాయడానికి చెయ్యి సహకరించక పోయినా గ్రంథంలోపలి పుట మీద 'ప్రియసోదరి చి॥సౌ॥ చిన్నమ్మాయికి అక్కయ్య ఆదరంతో ఊ॥ లక్ష్మీకాన్తమ్మ 10-10-1996 అని సంతకం చేసి నా తలపైన చెయ్యి ఉంచి ఆశీర్వదించి నన్ను పంపించింది మా అక్కయ్య.



డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ తండ్రి నాళం కృష్ణరావు, తల్లి. సుశీలమ్మ



1953లో డా॥ కె.ఎన్. కేసరి నుంచి గృహలక్ష్మి
స్వర్ణ కంకణం అందుకుంటున్న డా॥ లక్ష్మీకాన్తమ్మ

ఆఖరిదశలో కూడా పేరు, తేదీ, సంవత్సరంతో సహా వ్రాసి ఇస్తుంటే చాలా ఆనందమూ, బాధా రెండూ కలిగాయి. ఆమెను విడిచి మద్రాసు చేరుకున్నాను. పదిరోజులు గడిచిందో లేదో ! ఆమె ఈ ప్రపంచాన్ని విడిచి పైలోకాలకు వెళ్లిపోయారు అని టెలిఫోను వార్త వచ్చిందట. ఆ సమయంలో నేను రామేశ్వరంలో ఉన్నాను - ఈ ఇబ్బందులతో నేను బాపట్ల వెళ్లి మా పిల్లల్ని పలుకరించలేక పోయాను. ఆమెను నిర్జీవంగా చూడలేననే ఉద్దేశంతోనే భగవంతుడు ఈ ఆటంకాలు కల్పించి ఉంటాడనుకుంటాను. ఆమె నా శ్రేయోభిలాషిణి. ఆమె ఆశీస్సులు ఎప్పుడూ నాకు లభించేవి. ఇకపైన కూడా ఆమె ఆశీస్సులు మా అందరికీ ఉంటాయి

ఆమె ఎప్పుడూ తన జీవితంలోని మహత్తరమైన విశేషాలను అందరితో చెప్తుండే వారు. తన మూడవ కుమారుడు తన గర్భంలో ఉండగా తనకు స్వర్ణకమలం కన్పించిందని, సరస్వతీదేవికన్పించిందనీ అందువల్ల అతనికి "విజ్ఞానేశ్వర్' అని నామకరణం చేశానని చెప్పింది.

ఆమెకు వ్యాధి ముదిరి హైదరాబాదులోని ఆస్పత్రిలో చేర్చగా ఆమెకు Endosocpy చెయ్యాలని చెప్పినారట. అది విజయవంతం కాకపోతే మాత్రం Bi-Pass Surgeory చెయ్యాలి అని డాక్టరుగారు చెప్పారట. ఆరోజు రాత్రి ఆమె ఆరాధ్య దైవం శ్రీరామ చంద్రమూర్తి కలలో సాక్షాత్కరించి తిరుగులేని తన రామ బాణాన్ని ఆమెమీదకు సాచి ఎక్కుపెట్టి బాణం వదిలారట. ఆ దృశ్యం ఆమెకు చక్కగా కన్పించిందట. అది శుభసూచకం. నాకు ఆపరేషన్ జరుగదు. నేను కులాసాగా ఇల్లు చేరుకుంటాను' ' అని అనుకున్నారట. అలాగే ఆపరేషన్ జరుగకుండానే ఇల్లు చేరిందట. ఈ అనుభవాన్ని ఆమెను స్వయంగా ఎంతో ఆనందంతో చెప్పారు. కాని శ్రీరాముడు ఆ బాణంతోనే ఆమెకు తన వద్దకు రప్పించుకుంటున్నాడని ఆమె అనుకోలేదేమో ! ఇలాంటి దైవికమైన అనుభూతులు ఆమెకు ఎన్నో ! ఆమె పుట్టినింట్లో మాపిన్నిగారు ప్రకృతి వైద్యమే చేసేవారు. అలానే ఆమె పుట్టినప్పటి నుండి కూడా ప్రకృతి వైద్యంలోనే పెరిగారు. పిల్లలందరం కూడా తెల్లవారుఝామునే లేచి గోదావరికి వెళ్లి ఈతకొట్టి, స్నానం చేసి ఇంటికి వచ్చి కొబ్బరి బొండం నీళ్లు త్రాగేవాళ్ళం. అలాంటి ఆనందమైన క్షణాలు మళ్లా వస్తాయా ? తలచుకుంటే పుట్టెడు దుఃఖం ముంచుకు వస్తుంది.

మా అక్కయ్య మా వంశానికే ఒక విలువైన రవ్వ. మరి మా ఆర్యవైశ్యకులానికే ఒక మణిదీపం. ఆమె రచనలతో ఆమెకు ఇహలోకంలో సంతృప్తి కలిగి ఉండవచ్చును. ఆమె ఆత్మకు పరిపూర్ణ శాంతి చేకూరాలని మనసారా కోరుకుంటూ ఆమెపాదాలకు నమస్కారం చేస్తూ ! ఆమె ఆశీస్సులకోసం వేచి యుంటూ ! ఇంక చాలిస్తున్నా. రాయడమే చేతకాని నాచేత ఇంత రాయించిందంటే ఆమె ఆశీస్సులే కదా !

# వదిన డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారు

- ఊటుకూరి హృషీకేశగుప్త
చీరాల

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు నాకు వదినగారు (నా అన్నగారు శ్రీ హయగ్రీవగుప్తగారి ధర్మపత్ని కావడం నాకే కాక మా ఊటుకూరి వంశీయులందరికీ గర్వకారణం. ఆమె మా కుటుంబానికే కాక మా కులానికే కాక యావదాంధ్రదేశానికే అలంకారం వంటిది. నారీ లోకానికే మణికిరీటం మా వదిన గారు. ఆమె మమ్మల్ని ఎప్పుడూ ఆత్మీయులు గానే చూచుకున్నారు. ఆమె చరిత్ర సర్వులకు ఆదర్శప్రాయం. ఆమె పాండిత్యప్రకర్ష అపురూపం. అత్యద్భుతం, అమోఘం. ముఖ్యంగా ఆమె ఉపన్యాసం వైభవం, వచో విలాసం అనితర సాధ్యమైనవి.

ఆమెలా ఉపన్యాసాలివ్వగలిగినవారు ఇంకొకరు లేరంటే అతిశయోక్తికాదు. వేదిక నెక్కి గళం విప్పితే ఆమె నోట్లోంచి వచ్చేవి మాటలు, వాక్యాలు కావు. అమృత ధారలే. ఏ విషయాన్ని గూర్చి అయినా ఎంతటి క్లిష్ట విషయాన్నైనా ఆమెకు ముందుగా తెలియచెయ్యకపోయినా సరే ఆమె తడబడేది కాదు. సంకోచించేది కాదు. ఆలోచించి చెప్తాననేది కాదు. విషయం చెప్పడం - ఆమె అనర్గళంగా ఉపన్యసించడం జరిగేది. చీరాలలో సంస్కృతి సమితి తరపున నేను, చీరాల రామారావుగారు కలిసి సభలు చేసేవాళ్లం. మావదిన గారిని వక్తగా ఆహ్వానించేవాళ్లం. మిగిలిన వక్తలందరికీ విషయాన్ని ముందుగా తెలియచేసేవాళ్లం. ఈమెకు మాత్రం వేదిక నెక్కేముందే విషయం తెలియచేసేవాళ్లం. అది మాకలవాటైపోయింది. ఆమె వెంటనే గలగలా ఉపన్యసించేది. అందర్నీ ఆనందపరచేది. ఈ విశిష్ట గుణం ఆమెకే చెల్లింది. అది నా అనుభవం.

వరంగల్లులో సంస్కృతి సమితి సభలు జరిగాయి. అప్పటికప్పుడామె ప్రసంగించిన తీరు అత్యద్భుతం ఏనాడో ఆమె పలికిన పలుకులు ఈనాటికీ నాచెవుల్లో మార్మోగుతుంటాయి. అంతటి ప్రతిభాశాలిని మావదినగారు. విశిష్ట వ్యక్తిత్వంగల మహిళామణి. గృహిణిగా, సంఘసేవపరాయణురాలిగా, సాహిత్యవేత్తగా, ఆమె చిరస్మరణీయురాలు. ఆమెనాకు తల్లికంటె ఎక్కువ. ఈమాటను నేను సగర్వంగా చెప్పుకుంటుంటాను. మా కుటుంబ సభ్యులందరితోను ఆమె అరమరికలు లేకుండా ప్రేమగా పలుకరించేవారు. ఆదరించేవారు. ఆమెలేని లోటును ఎవ్వరూ తీర్చలేరు. ఆమె ఆత్మకు శాంతి కలగాలని మనసారా ప్రార్థిస్తున్నాం. ఆ దంపతుల బిడ్డలుగా జన్మించిన చిరంజీవులు ధన్యులు. . .

# మా వదినగారు

-మోతే రమేష్ ప్రసాద్
రిటైర్డ్ రైల్వే ఇంజనీర్, ఏలూరు

మా వదిన. మా మేనత్త నాళం సుశీలమ్మగారి పుత్రిక లక్ష్మీకాన్తమ్మగారు. ఆప్యాయతకు, కార్యశీలతకు మారుపేరు. సంఘ సంస్కరణానికి తనవంతుగా జీవితాన్ని అంకితం చేసిన ధన్యజీవి.

సరస్వతీ కటాక్షాన్ని అనుభవించి, ముఖ్యంగా స్త్రీ అభ్యుదయం కోసం ప్రతి అణువు నిష్కామ కర్మలో వెచ్చించిన కార్యపిపాసి.

ఆమెను చూస్తుంటేనే ఒకవిధమైన ఆనందం, ఆమెను వింటుంటే ఒకవిధమైన ఉద్వేగం జనింపచేయగలిగే వ్యక్తి. ఆమె ప్రసంగంలో శ్రోతలను కార్యసిద్ధికై ఉర్రూతలూపగలిగే శైలి గోచరం అవుతుంది.

పరిపూర్ణమైన జీవితాన్ని గడిపి, అందరి మన్ననలు పొందిన బహుముఖ ప్రజ్ఞాశాలిని.



# సంగీత సాహిత్య సరస్వతి మా అమ్మగారు

-ఊటుకూరి రాజరాజనరేంద్ర
ఇంజనీర్, అమెరికా

ఆపదామపహర్తారం, దాతారం సర్వసంపదం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం!!

శుక్లాంబరధరంవిష్ణుం, శశివర్ణం చతుర్భుజం!
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే!!

జననీ, జన్మప్రదాయినీ, జ్ఞానదాయినీ, మాతృదేవీ,
యా లక్ష్మీకాన్తా నమస్తస్యై, నమస్తస్యై, నమోనమః !

మాతల్లిగారిని గురించిన నా జ్ఞాపకాలు కనీసం అర్థశత సంవత్సరాల పర్యంతం ఉంటాయి. నాకు 7 సంవత్సరాల ప్రాయంలోనే ప్రతి ఉదయం ఆమె వీణా వాయిద్యం చేస్తూంటే ఆమె ఒడిలో పడుకుని వింటూండడంతో, కర్ణాటక సంగీతంతో పరిచయం కలగడమయింది. నాకు రాగతాళజ్ఞానం లేకపోయినా శాస్త్రీయ సంగీతమంటే వల్లమాలిన అభిమానం ఇంతవరకూ తగ్గలేదు. సంగీత, సాహిత్య, లలిత కళలంటే ఆమెకు ఎనలేని అభిమానమని అందరికి తెలిసిన విషయమే ఆవిధంగా చూస్తే ఆమె ఒక "అపరసరస్వతి" గానే అనిపిస్తుంది. మాకు చిరు ప్రాయంలోనే సంస్కృతం నేర్పింది. ప్రతిదినం ఉషోదయం కాకుండానే నన్ను, అక్కయ్యనూ, అన్నయ్యనూ నిద్రలేపి సంస్కృతం నేర్పించింది.

బాల్యంలోనే బాలరామాయణం, రఘువంశం, అమరకోశం, భగవద్గీతలు నేర్పించింది. కాశీ కృష్ణాచార్యులుగారి బాలబోధిని ద్వారా సంస్కృతం నేర్పింది. ఆ సంస్కృతజ్ఞానం ఇప్పటివరకూ నాకు కొద్దో గొప్పో ఇంకా ఉండడం నాకే ఆశ్చర్యంగా ఉంటుంది. బాపట్లలో సంగీత, సాహిత్య, నృత్య విద్యాభ్యాసాలకు నాంది కలిగించింది అమ్మ మాత్రమే. నాకింకా బాగాగుర్తు, విజయనగరం నుండీ అయ్యగారి సోమేశ్వరరావుగారిని బాపట్లకు తరలించి తీసుకువచ్చి బాపట్లలో వీణా వాయిద్యాభ్యాసావకాశం కల్పించింది. తరువాత గ్వాలియర్ ఆస్థాన నృత్యాభ్యాసకులైన దువ్వూరి జగన్నాధశర్మగారిని కూడా బాపట్లకు తరలించి బాపట్లలోని - 40 మంది కన్నెపిల్లలకు నృత్యాభ్యాసం కల్పించింది. మా అక్కయ్యకు నోరి నాగభూషణం గారు గాత్రం నేర్పేవారు. సోమేశ్వరరావుగారు వీణా వాయిద్యం నేర్పేవారు. అదేసమయంలో నన్నుకూడా సంగీతం, నృత్యం నేర్చుకోవమని ఎంతో ప్రోత్సహించేది. కానీ ఆడపిల్లలతో కలిసి సంగీతం, నత్యం నేర్చుకోవలెనంటే నాకు సిగ్గు కలిగి నేర్చుకోలేకపోయాను. అవన్నీ తలచుకుంటే

నాకు ఇప్పుడు చాలా బాధగా ఉంటుంది. కనీసం సంగీతం అయినా నేర్చుకునుంటే బాగుండేదనిపిస్తుంది. నాకు తీరని కోరికలు, నా కుమారుడు, చి॥ అవనీంద్రుని సంగీతాభ్యాసం ద్వారాను, నాకుమార్తె చి॥ సుస్మిత నృత్యాభ్యాసంద్వారాను కొంతగా తీరినట్లే. అంతేగాక నాభార్య మాలతికి కూడా వీణావాయిద్యాభ్యాసం ఉన్నది, సంగీత, సాహిత్య, లలిత కళలలో ఎంతో అభిరుచి ఉంది. అది నాకు ఎంతో ఆనందం కలిగిస్తుంది. చి॥ అవనీంద్రకుచిత్రకళలో కూడ మంచి కుశలత ఉన్నదని చెప్పుకోవడానికి నేనెంతో గర్విస్తున్నాను. మరచిపోయాను ఆచిరుత ప్రాయంలోనే భాపట్ల వాస్తవ్యులైన స్వర్గీయ తూములూరి శివరామయ్యగారి చేత హిందీ నేర్పించింది. మాతోబాటుగా తాను కూడా హిందీ పరీక్షలు రాసింది. అంటే నాకు 7 నుండి 12 సం॥ల ప్రాయంలోనే సంగీత, సాహిత్య, బహువిధ భాషాజ్ఞానానికి నాంది కల్పించింది. ఎస్.ఎస్.ఎల్.సి. వరకూ స్పెషల్ తెలుగు ప్రత్యేక పాఠ్యవిషయంగానేర్చుకోవడం కూడా జరిగింది. ఇదంతా ఆమె ప్రోత్సాహం వలననే వీటన్నింటికి స్వర్గీయులైన మానాన్నగారి ప్రోత్సాహం కూడా ఎంతో ఎక్కువగా ఉండేది. మరి మా మాతామహులైన నాళం కృష్ణారావుగారు జగమెరిగిన కవి. మా పితామహులైన వెంకటేశ్వర్లుగారు ఆరోజుల్లో గుంటూరుజిల్లాలో ప్రసిద్ధికెక్కిన ఒక మహాదానశీలి, చీరాలలో వారింట్లో జరిగే శుభక్రతువులకు మంత్రాలు చదవడానికి ఎవ్వరూ సాహసించేవారుకాదట. ఆయనకున్న మంత్రజ్ఞానం, సంస్కృతజ్ఞానంవల్ల కలిగిన భయమే అందుకు కారణం. అదే అభిమానం, గౌరవం, శ్రద్ధ మానాన్నగారికి కూడ ఉండేది. ఆ కారణంవలననే ఆయన అమ్మనుఎంతగానో ప్రోత్సహించేవారు. అమ్మ 1953లో ఆంధ్రకవయిత్రులచరిత్ర రాసి తెలుగు భాసాసమితి వారి బహుమతి, పొందడం ఆయన ప్రోత్సాహమే ఆయన మా విద్యాభ్యాస విషయాలలో కూడ అమితశ్రద్ధ కనపరచేవారు.

ఇంకొక సంగతిగుర్తుకు వస్తున్నది. మా మాతామహులు మనసావాచా, కర్మణా, బ్రహ్మసమాజం పాటించేవారు. మా నాన్నగారు నిష్ఠురమైన శ్రీ వైష్ణవ సంప్రదాయంలో పుట్టి పెరిగినవారు. ఐనా కూడ అమ్మతన బాల్యావస్థలో అభ్యాసంవలన వివాహానంతరంకూడా తెల్లవారుఝామున ఉషోదయాత్పూర్వం బ్రహ్మసమాజపు కీర్తనలు పాడుకుంటుండేది. నేను ఆమెఒడిలో పడుకుని ఆపాటలను వినడం నాకు ఇప్పటికీ బాగా గుర్తున్నది. "నాలోని విభవంబునీవై, నీలోని ప్రణవమ్మునేనై నిఖిలమౌ భువనాలు నిండి వెలిగెదమోయి" అని ఎంతో ఆర్తితో, ఆవేదనతో, తన్మయత్వంతో ఎలుగెత్తిపాడటంనాకు ఇంకా నా శ్రవణాలలో గింగురుమని మ్రోగుతూ వినిపిస్తుంది. ఆ పాటలు వినడానికి, కలసిపాడటానికిమా ఇరుగు పొరుగువారు కూడ వస్తూండేవారు

ఇంకో సంగతి గుర్తుకువస్తున్నది. నాకుపైన అక్కయ్య ఉన్నాకూడా అమ్మ నాకు

చిన్న వయస్సులో ఆడపిల్లల బట్టలు వేసి, జడలు వేసి, నగలుపెట్టి ఫోటోలు తీయించుకుని మురిసిపోయేది. దానికి కారణం మాత్రం నాకింతవరకూ తెలియదు. మరి నాకన్నా ఒక సంవత్సరం పెద్దఅయిన అన్నయ్య ప్రతాపునకు అలాగ చేసినట్లు గుర్తులేదు.

ఇంకొక ముఖ్యవిషయం నాపేరు "రాజరాజనరేంద్రుడు". రాజరాజ నరేంద్రచోళుడు. రాజమహేంద్రవరం రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తున్నప్పుడు ఆయనకుండే సాహిత్యాభిమానం వల్ల నన్నయ మహాకవిని సంస్కృతలిఖితమైన వ్యాసమహాభారతాన్ని తెలుగు భాషలోకి అనువదించమని కోరటం జరిగిందిగదా. ఆ విధమైన రాజప్రోత్సాహంతో మహాకవి భారతంలోని మొదటి రెండున్నర పర్వాలు తెలుగులోకి అనువదించి ప్రప్రథమంగా ఆంధ్ర భాషా చరిత్రలో ఒక కావ్య సృష్టికి నాంది కలిగించారు. అమ్మకు అప్పటికీ తెలుగు సాహిత్యం మీదున్న అభిమానంతో రాజరాజనరేంద్రుడని పేరు పెట్టుకుంది. మరి నాన్నగారికి వివేకానందమీదుండే అభిమానంతో నరేంద్ర అనిపేరుపెట్టాలనుకున్నారు. ఆ మహాకవి నన్నయ్య పేరుపెట్టితేనేను తెలుగుసాహిత్యానికి తీరని అవమానం కలుగచేస్తానని అనుకున్నారో, భయపడ్డారో తెలియదుగానీ, రాజరాజనరేంద్రుడైతే ఇద్దరి ఉద్దేశ్యాలకూ సమన్వయమౌతుందని అలాగ పేరు పెట్టారు. ఏమోమరి, ఇప్పటికీ వివేకానందుని జీవితచరిత్ర చదువుతుంటే నాకు వళ్లంతా గగుర్పాటు కలుగుతుంది. నాకింకా బాగా గుర్తున్న ఇంకొక విషయం. అమ్మ తరచు సాహిత్యోపన్యాసాలకారణంగా ఆంధ్రావనిలో పర్యటిస్తూండేది. ఆమె అటు ప్రయాణం కాగానే నాకు బెంగతో జ్వరం వచ్చేది. అమ్మని అంతగా వదిలిఉండలేకపోయేవాడిని. అందువలన ఎన్నో మాట్లునాన్నగారు తంతిద్వారా అమ్మను వెంటనే తిరిగి బాపట్లకు రమ్మని కోరడం జరిగేది.

ఇంట్లో తరచుగా సంగీత సమావేశాలు, సాహిత్యచర్చలు జరుగుతుండేవి. సుప్రసిద్ధగాయకులు, కవులు అమ్మతో మాట్లాడటానికి రావడం జరుగుతుండేది. అమ్మకన్నా వయస్సులో చిన్నవారు "అక్కయ్యా" అని పెద్దలు "చెల్లెమ్మా" అని సంబోధించేవారు. నాన్న గారిస్నేహితులుకూడ అమ్మను చెల్లెలు లాగనే సంబోధించేవారు. ఆవిధంగా స్వంత మేనమామలు మాకు ఇద్దరే అయినా, మామయ్యలు చాలామంది ఉన్నారు. ఆ సంబంధం ఎంత బలీయమైనదంటే మేమింకా ఆ పెద్దలందరనూ ఇంకా అలాగనే పిలుస్తూంటాము. వారిలో ముఖ్యులు, మానాన్నగారి ముఖ్యస్నేహితులు స్వర్గీయ పిల్లుట్ల హనుమంతరావుగారు, బొడ్డుపల్లి పురుషోత్తంగారు, కాల్వ వరదరాజులుగారు, స్థానం పార్థసారథిగారు, నాళం రామచంద్రరావుగారలు.

1953లో ప్రప్రథమంగా అమ్మ "ఆంధ్ర కవయిత్రులు" గురించి గ్రంథరచన చేపట్టింది. అంతకుముందుగా, "భారతి",మరి ఇతర సాహిత్య పత్రికలలో వ్యాసాలు ప్రచురించడం జరుగుతుండేది. ఆంధ్ర కవయిత్రులు రాస్తున్నప్పుడు మేమంతా తన రాతప్రతికి కాపీలు చేయడం జరిగింది. మేము ముగ్గురమే కాక చీరాలలోని మా జ్ఞాత సోదరి శ్రీమతి సుశీల, (పెద్దఅక్క) సోదరుడు ప్రభాకర్ (పెద్దన్నయ్య) కూడ చాలా సహాయం చేయడం నాకింకా గుర్తున్నది.

తరువాత ఆమె ఎన్నెన్నో రచనలు చేసింది. అప్పుడప్పుడు నాముందు చదివి నా అభిప్రాయం కూడ అడుగుతుండేది. 1956 సంవత్సరంలో నేను ప్రథమంగా బాపట్ల వదలి రాంచీకి ఇంజనీరింగు విద్యాభ్యాసం కొరకై ఆంధ్రావని వదలి, ముఖ్యంగా అమ్మనువదలి 1000కి.మీ వెళ్లడం చాలా దుఃఖం కలిగించింది. అప్పుడు అమ్మనాకు ఎంతో ప్రోత్సాహం కలిగించింది, ఎంతోధైర్యం చెప్పింది. అది మొదలు నేను దేశ దేశాలు తిరగడం, బాపట్లకు సెలవులకు వెళ్ళడం మాత్రం జరుగుతుండేది. అలాగవెళ్ళినప్పుడల్లా ప్రతిదినంఏదో విషయం గురించి అంటే సాహిత్యమో, మతసంబంధమో, పురాణ, ఇతిహాసాల సంబంధంగానో చర్చలు జరుపుకోవడం ఇంకా బాగా గుర్తున్నది. ఆవిధంగానైనా అమ్మ సాహిత్యవ్యాసంగాలతో సంబంధం కలుగుతుండేది. 1963లో నేను పి.హెచ్.డి. కెనడాలో రావడంతో నేను అమ్మకు చాలా దూరమైపోవడం జరిగింది. అది నాకు ఎంతో అసంతృప్తి కరంగా ఉండేది. ఆరోజున మద్రాసులో (1963 ఆగష్టు) నేను ప్రథమంగా విమానం ఎక్కేముందుగా అమ్మనాకు గబగబా "ఆపదామపహర్తారం . . ." అనే శ్లోకం రాసి "నరేంద్రా, ఇది ఎప్పుడు నీదగ్గఉంచుకోమని ఇవ్వడం జరిగింది. ఆమెకు శ్రీరామచంద్రుడంటే ఎంతో భక్తి, ఎంతోగురి. అందువలననే కాబోలు నేను కెనడాలో రెండుపర్యాయాలు (1964, 1969 సం॥లో) తీవ్రమైన కారు ప్రమాదాలకు గురైనాకూడా ఆశ్లోకం నాపర్సులోనే ఉండటం వలననే అనుకోవాలి, నాకు శ్రీరామరక్షఅయి ప్రాణగండం తప్పిందని అనిపిస్తుంది. ఇంతేకాదు, ఆమెకు భగవద్గీతలోని భక్తియోగం అంటే ఎనలేని గురి,అభిమానం. నాకు చిరుత ప్రాయంలోనే భక్తియోగం నేర్పించింది. నేనింకా ప్రతిదినం ఉదయం ఒక్కపర్యాయమైనా భక్తియోగమననం చేసుకుంటూ అమ్మను తలుచుకుంటుంటాను. 1972లో అమ్మ కేంద్రసాహిత్య అకాడమి తరఫున రష్యా, జర్మనీ, చెకోస్లోవేకియాలకు సాహిత్య సంఘసభ్యురాలిగా వెళ్ళడం జరిగింది. అప్పుడు అమ్మను యూరపు నుంచి కెనడాకు రమ్మని కోరాను. తాను అప్పుడు వచ్చి మా ఇరువురితో 3వారాలు గడిపింది. అప్పుడు కూడా ప్రతిదినం ఏవో ఒక విషయంపై నేను చర్చించేవాడిని. ఆమెకు సాంప్రదాయక సాహిత్యమన్నా, హిందూమతపరమైన చర్చలన్నా చాలా ఇష్టం. ఎంతో ఆవేశంతో, ఉత్సాహంతో

పాల్గొనేది. "ఏ దేశమేగినా, ఎందుకాలిడినా పొగడరా నీతల్లి భూమిభారతిని" అనేటటువంటి ఉద్దేశ్యాన్ని నిండుమనస్సుతో అత్యంత అభిమానంతో, సగర్వంగా ఎలుగెత్తి చాటడానికి ఆమె ఎప్పుడూ, ఎక్కడా వెనుకంజ వేయలేదు. రాయప్రోలు సుబ్బారావుగారు ఎంతో ఆదరంతో చెల్లెమ్మా అనే సంబోధించేవారు. అలాగే బొడ్డు బాపిరాజుగారూ, విశ్వనాధ సత్యనారాయణగారూ కూడా సంబోధించేవారు. అక్షరాలా "నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము" అని అంత్యఘడియలవరకూ కూడ ఒక తల్గొగ్గని సైనికునిలాగ జాతి గర్వంతో, తనకు ఆజన్మత: కలిగినటువంటి హిందూమతం మీద మన ప్రాచీన సాసంస్కృతిక, సాహిత్య, సంప్రదాయాలమీద చెక్కుచెదరని నమ్మకంతో, అఖండవిశ్వాసంతో అంతిమశ్వాస వరకూ నిలబడింది. ఇదెందుకు రాస్తున్నానంటే 1996 సెప్టెంబరు మాసంలో తన ఆరోగ్య పరిస్థితి విషమించి, ఆపరేషన్ చేయవలసి వస్తుందేమో, చేసినా, బలహీనత వల్ల సజీవురాలిగా ఆస్పత్రి నుండి తిరిగి రాకపోవచ్చునని అక్కయ్య, అన్నయ్య, చెల్లి అత్యంత సందిగ్ధపడుతున్న సమయంలో నేను కూడ హైదరాబాదుకు వెళ్లడం జరిగింది. నేను వెళ్ళటానికి నా భార్య మాలతి చాల ప్రోత్సాహం చేసింది. నేనువచ్చి తనకు ఆపరేషన్ చేయించుతానని తాను సజీవిగా తన స్వగృహం (బాపట్లకు) చేరలేనేమోనని ఎంతో బెంగతో వెక్కివెక్కి ఏడ్చేసింది. అట్టి పరిస్థితిలో నేనే రకమైన నిర్ణయంతీసుకో లేకపోయాను. సమయానికి మామిత్రులొకరు నాగేశ్వరరావు పంతులుగారు వచ్చి అమ్మ ప్రక్కనే కూర్చుని, మరణ, భీతి తగ్గించవలెననే ఉద్దేశ్యంతో భగవద్గీత, భారత, భాగవతాలు చర్చించసాగారు. దాంతో ఆమెకు ఎక్కడలేని ఉద్రేకం వచ్చి ఉపన్యాస ధోరణిలో తానుకూడా చర్చించసాగింది. దాంతో ఆమరణ భీతి అంతా పోయి అవసరమయితే ఆపరేషన్ చేయించు నరేంద్రా అని ఒప్పుకున్నది. అప్పుడు నాకు ఎక్కడ లేని భీతి, నిరుత్సాహం కలిగాయి. నేనేమైనా తప్పు నిర్ణయం తీసుకుంటున్నానా అని ఎంతో భయపడ్డాను. అప్పుడు అక్కయ్య, సోదరుడు రామానందులు ధైర్యం చెప్పారు. ఎలాగైతేనేం ప్రపంచ విఖ్యాతిచెందిన నాగేశ్వరరెడ్డిగారి హస్త వాసివలన అమ్మ అప్పుడు సజీవిగా బాపట్లకు తిరిగి వెళ్లగలిగింది. బాపట్లలోనే అంతిమ శ్వాస తీసుకుందామని ఆమె ఆశయం కోరిక. 12సం॥ల చిరుత ప్రాయంలో 1917లో నాన్నగారితో వివాహం జరిగిన తర్వాత ఆమెకు బాపట్ల ఒక్కటే స్వస్థలం అనేటటువంటి సంప్రదాయంలో పెరిగింది, విశ్వసించింది, మనసావాచా ఆచరించింది కూడ. అలాగే అంతిమ శ్వాసకూడ స్వగృహంలోనే జరిగింది, భగవత్కృపవలననే అనుకోవాలి.

అమ్మకు అత్యంత క్లిష్ట పరిస్థితులలో దివ్య స్వప్నాలు వచ్చేవి. నాకు 12 సంవత్సరాల ప్రాయంలో (1952లో) ఇంట్లో అందరు పిల్లలకూ, నాన్నగారికీ, మశూచి వ్యాధి తీవ్రంగా వచ్చి ప్రాణసంకటపరిస్థితులేర్పడ్డాయి. అప్పుడు అమ్మ చాలా ఆర్తితో శక్తి దేవిని

మనసారా ప్రార్ధించింది. ఆ రాత్రి ఆమెకు స్వప్నంలో శక్తి దర్శనమై అభయం ఇచ్చింది. ఒక చిన్న పాప మాత్రం తట్టుకోలేకపోయింది. (అప్పటికి మేము 5గురం సంతానం). అలాంటి స్వప్నాలు ఆమెకు ఎన్నో వచ్చాయి. బెజవాడ గోపాలరెడ్డిగారు ఉత్తరప్రదేశ్‌కు గవర్నర్‌గా ఉన్నప్పుడు వారి సహకారంతో అయోధ్య వెళ్ళటం జరిగింది. అక్కడి రామాలయంలో కన్నులు మూసుకుని రామ ధ్యానం చేసుకుంటుంటే శ్రీరామచంద్రుని దర్శనభాగ్యం కలిగిందనికూడ నాకు చెప్పింది. గోపాలరెడ్డిగారికి అమ్మ యందుండే ఆదరం, వాత్సల్యం నేను, అమ్మ వేరే సందర్భంలో లక్నో వెళ్ళినప్పుడు స్వయంగా చూచి ఆశ్చర్యపోయాను. వారిద్దరి అన్నాచెల్లెళ్ళ అనుబంధం, పరస్పర సాంస్కృతిక, సాహిత్యోపాసన పరసంబంధం. దేశాధ్యక్షులుగా సర్వేపల్లి రాధాకృష్ణగారు అమ్మకు ఇంటర్వ్యూ ఇచ్చినప్పుడు, తాను సంస్కృతంలో రాసిన శ్రీ కన్యకమ్మ నివాళి చదువుతుంటే కన్నులు మూసుకుని విని వారు దివ్యానుభూతిని పొందారట. అంతటి మహాపండితుల ఆదరం, మన్నన సామాన్యులకు లభించగలవా ? మరి ఆమె రాసిన రచనలలాంటివి, భాష అలాంటిది, శుద్ధగ్రాంధికంలో తప్ప మరేమి రాసేదికాదు. అందువలన సామాన్య జనాదరణ లభించి యుండకపోవచ్చునుగాని, తెలుగు సాహితీ చరిత్రలో ఒక గౌరవం, సంప్రదాయం, శైలి ఒక వినూత్న రచనాలంకారం తీసుకు వచ్చింది. అది అంతా ఆమెకున్న స్వదేశ, స్వభాషాభిమానాలే కారణం.

అలాగే దేశంలో ఎందరెందరో కథనం చేస్తారు, రచనలు చేస్తారు. కాని వెయ్యిమంది కాదు, లక్షమందిలో ఏ ఒక్కరికోగాని ఆ దివ్య రచనాశక్తి కలుగదు. అదే అలాంటి వ్యక్తులకు పరమావధి, పరమ ధ్యేయం, ఆజన్మాంత లక్ష్యంకూడాను. ఆమె అలాగే జీవించింది చివరివరకూ కూడాను. అమ్మకు చాలా ఇష్టమైన ఈశావనిషత్తులోని శ్లోకంతో ఈవ్యాసం ఇంక ముగిస్తాను. ఒక "ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్, పూర్ణముదుచ్యతే. పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేదాన శిష్యతే' . ఆమె జీవితం ఇలాగే చివరకు ఆపూర్ణంతో ఏకమైపోయింది. అదే నాకు సంతృప్తి అదే నాకు శోకవిమోచని.

"తెలుగన్నను తేనెయనిన<br>
తియ్యదనము, తియ్యదనము<br>
తెలుగన్నను, తెలియనిన<br>
తిన్నదనము, మిన్నదనము<br>
తెలుగన్నను తేటదనము<br>
క్రొత్త దనము, మెత్తదనము"

- లక్ష్మీ కాన్తమ్మ - మన సాహితి - మధు భారతీనుండి

# డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
## వ్యక్తిత్వం, కుటుంబ విశేషాలు

- పోలేపల్లి సుహాసిని
ఆంధ్రశాఖాధ్యక్షురాలు (రిటైర్డ్)
సెయింట్ తెరిసాస్ అటానమస్ కళాశాల, ఏలూరు.

అవనిపై కారణ జన్ములు కొందరే ఉద్భవిస్తారు. భరతమాత బిడ్డలైన గౌతమ బుద్ధుడు, శంకరాచార్యులు, మహాత్మాగాంధీ మొదలగు మహానుభావులు ఇట్టివారేగదా! భగవంతుడు తమకు నిర్దేశించిన మహాత్కార్యాలను కష్టనష్టాలకోర్చి, శ్రమించి, సాధించి ప్రజల నుద్ధరించి వారిని తరింపచేశారు. తామూ తరించారు. భూమిపై అవతరించిన అవతార మూర్తులుగా యశస్సును ఆర్జించారు. దేశవ్యాప్తంగా ఇలాంటి వారెందరో ఉన్నా చరిత్ర పుటలకు ఎక్కేవారు కొందరే. అటువంటి కారణ జన్ములలో నా తల్లి డా॥ లక్ష్మీకాన్తమ్మగారొకరు

ఆమె ఒక విచిత్ర వ్యక్తి, సృష్టిలో ఆమె వంటి వ్యక్తులు అరుదుగా కన్పిస్తారు. ఒక వ్యక్తిలో కొన్ని గుణాలు మాత్రమే కానవస్తాయి. అవి సుగుణాలు కావచ్చును. దుర్గుణాలు కావచ్చును. రెండూ కలిసి ఉండవచ్చును. అనుకూల స్వభావాలు, వ్యతిరేక స్వభావాలు కావచ్చును. లక్ష్మీకాన్తమ్మ కూడా అనుకూల ప్రతికూల భావాల సమ్మేళనం. ఆమెకూ కొన్ని బలహీనతలున్నాయి. కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి.

ముందుగా ఆమెలోని అనుకూల భావాలు: ప్రేమైకశీలత, కర్తవ్యపాలన, సేవా తత్పరత, సమయపాలన, దాతృత్వం, నిరంతర పఠనం, జ్ఞానామృత బోధ, అనితర సాధ్యమైన కార్యదీక్షా దక్షతలు నీతి నిజాయితీలు కార్యసాధనలో కానవచ్చు పట్టుదల, సహన శీలత, భావావేశం, క్రమశిక్షణ, యుక్తాయుక్త విచక్షణ శక్తి, ఉత్తమ గృహిణి, శ్రమ శీలత, మంచి, చెడులను విశ్లేషించి చెప్పడంలో నిర్మొహమాటం, వెనుక మాట్లాడడం ఆమె జీవితంలో లేదు, ఉత్తమ కళాకారిణి. అప్రతిహతమైన అనర్గళమైన వాగ్ధాటి, ప్రతిభా వ్యుత్పత్తులతో కూడిన అపార ప్రజ్ఞా పాటవాలు, స్వతంత్ర భావోపేతమైన విశిష్ట వ్యక్తిత్వం, నిష్కళంకమైన నిష్కామభక్తి.

ప్రతికూల లేక వ్యతిరేక భావాలు: ఆవేశం ఉద్రేకం, ఉద్విగ్నత, అసహనం, కోపం, కాఠిన్యం మొదలైనవి. కాని ఇవి ఆమెలో కానవచ్చే కొన్ని ప్రతికూల గుణాలు కావచ్చు. ఆమె నిర్దిష్ట లక్ష్యసాధన కొరకే ఈ భావాలు ఆమెలోకానవస్తాయి అని మాత్రం తెలుసుకోవాలి. పరస్పర విరుద్ధ భావసంపుటి లక్ష్మీకాన్తమ్మ. ఆమె ఒక వ్యక్తికాదు సమష్టి.

మాతామహులైన మోతేవారు, పితామహులైన నాళంవారు ఇద్దరూ జమీన్ దారులే. ఆమె బాల్యమంతా ఆటపాటలతో, సంగీత, సాహిత్యాది లలిత కళాభ్యాసంతో, గడచిపోయింది. బాధ్యతలు లేని ఆనందమయ జీవితం. వివాహమంటేనే ఆసక్తిలేని 13 ఏళ్ళ చిన్నారికి వ్యక్తురాలు కాకముందే తండ్రి శ్రీకృష్ణారావుగారు చీరాలకు చెందిన ఊటుకూరి రంగనాయకమ్మ, వెంకటేశ్వర్లు గార్ల ద్వితీయ పుత్రుడు, తనకంటే 9 సంవత్సరాలు పెద్దవాడు, న్యాయశాస్త్ర పట్టభద్రుడైన హయగ్రీవ గుప్తగారితో పెండ్లి జరిపించారు. గుప్తగారు విద్యావంతుడు, సుగుణ సంపన్నుడు, సౌశీల్యవంతుడు, తానాచరించే బ్రహ్మసమాజ ధర్మానికీ, ఏకేశ్వరోపానకు, ఈ సనాతనాచారపర్వానికి లంకె కుదరదని తెలిసినా, ఇంతకంటే మంచి సంబంధాన్ని తాను వెతకలేననే తలంపుతో కృష్ణారావుగారు తన ఏకైక కుమార్తెను వివాహం చేసేశారట. ఆనాడు ఆమెఈ వివాహం చేసుకోకపోతే మరింక జన్మలో వివాహం చేసుకొనేది కాదట. ఒకరికి లొంగని స్వతంత్ర జీవితాన్నే ఆమె చిన్నప్పటినుండీ కోరుకునేదట. ఈ విషయాన్ని ఆమె ఎప్పుడూ మాతో చెప్తుండేవారు.

**దాంపత్యం :** లక్ష్మీకాన్తమ్మ, హయగ్రీవగుప్తగార్లది ఆదర్శ దాంపత్యం. అపార్థాలు, అపోహలులేని, పవిత్ర బంధం వారిది. తల్లిగారి వైదికాచారనిష్ఠ, తండ్రిగారి ఏకేశ్వరోపాసన - ఈ రెండు విభిన్న ధర్మాల సమ్మేళనమే లక్ష్మీకాన్తమ్మ. ఎందుకో లక్ష్మీకాన్తమ్మకు తల్లిగారి వైదికాచారం వంటపట్టలేదు. తండ్రిగారి ఏకేశ్వరోపాసననే ఆమె ఆచరించారు. అడుగుపెట్టింది పరమమైన వైదికాచార పరత్వం రాశి పోసినట్లున్న కుటుంబం. తల్లిగారిది, అత్త గారిది ఒకటే ధర్మం . . .

అన్నగారితోను, ఇతర మగపిల్లలతోను కలిసి గోళీలాడుతూ ! గోటింబిళ్లాడుతూ, చెట్లెక్కుతూ మగపిల్లవాని వలె బాధ్యతలు లేకుండా పుట్టినింట పెరిగిన గారాల లక్ష్మీకాన్తం ఒడిలో పసిబిడ్డతో అత్తవారింట అడుగుపెట్టింది. న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించిన గుప్తగారు బాపట్లలో క్రొత్త కాపురం ప్రారంభించారు. ఒంటరి సంసారం. పనిపాటలు ఏమీ చేతకాని భార్యకు ఓర్పుతో, నేర్పుతో వంటా, వార్పూ నేర్పించారు గుప్తగారు. ఆమె ఏకేశ్వరోపాసనకు ఆయన భంగం కల్గించలేదు. ఎవరి పూజవారిదే ఎవరి ప్రార్థన వారిదే. తమ పొరుగునే నివసిస్తున్న సామ్రాజ్యం (కాల్వ వరదరాజులు గారి మాతృమూర్తి) గారి సహకారంతో పని పాటలను నేర్చుకున్నారట అమ్మ. అచిర కాలంలోనే సంసార నిర్వహణలో సిద్ధ హస్తురాలిగా రూపొందిందట లక్ష్మీకాన్తమ్మ. అలాగే నాన్నగారి ఆచార పరత్వానికీ, నియమ నిష్ఠలకూ ఆమె అలవాటు పడిపోయిందట. ఒకరినొకరు అర్థం చేసుకుంటూ పొరపొచ్చాలు లేకుండా స్త్రీపురుషులు ఒకచోట మనుగడ సాగించడమే కదా ఆదర్శ

దాంపత్యమంటే, ఈ సృష్టిలోనే ఏజంటా అనుభవించనట్టి అన్యోన్యానురాగ పూర్వకమైన ఆదర్శదాంపత్యమట అమ్మ నాన్నగార్లది. వీరిని చూచి ఇతరులు ఈర్ష్య పడేటట్లుగా మెలిగేవారట. ఇంటి యజమాని నాళం బాలకృష్ణయ్యగారు అమ్మను తన కుమార్తెవలెనే చూచుకుండేవారట. తమయింటి పేరుకూడా నాళంవారే కావడంతో ఈ ఐక్యతా భావం ఇక్కడ చోటు చేసుకున్నది.

**సంతానం :** అమ్మనాన్నగార్లకు జన్మించినవారిలో జీవించింది ఐదుగురు మాత్రమే. వరుస చెప్పాలంటే ద్వితీయ సంతానాన్ని, జీవించి ఉన్నవారిలో ప్రధమురాలిని నేను సుహాసినిని నా తర్వాత వరుసగా ఇద్దరు మగపిల్లలు ప్రతాపు, నరేంద్రలు . . . సప్తమ సంతానం విజ్ఞానేశ్వర్ కుమార్ . చిట్టచివరి సంతానం ఆడపిల్ల మైథిలీ బాలాజీ . .

పిల్లలకు పేర్లు పెట్టడం దగ్గరనుండి లక్ష్మీకాన్తమ్మ ప్రత్యేకత, భావస్ఫోరకత, విశిష్ట వ్యక్తిత్వాలు ప్రత్యక్షమౌతాయి. ఆమె స్వాతంత్ర్యోద్యమ కారిణి, దేశ భక్తురాలు. అందరి నోటా వందేమాతరం గీతం ఆలపించబడుతున్న రోజులవి. ఆపాటకు గుర్తుగా నాపేరు గీతం ఆలపించబడుతున్న రోజులవి. ఆపాటకు గుర్తుగా నాపేరు సుహాసిని. తెలుగుసీమ నేలిన సుప్రసిద్ధ కాకతీయులలో ప్రముఖుడు అయిన ప్రతాపరుద్రుని పేరును తృతీయుడు, నా తర్వాతి వాడు అయిన పిల్లవానికి (అతడే పెరిగి పెద్దవాడై తన పేరును ప్రతాపచన్ద్రగా మార్చుకున్నాడు) పెట్టింది. నాల్గవ సంతానాన్ని ప్రసవించే ముందే అమ్మ వివేకానందుని జీవిత చరిత్రను చదవడం పూర్తి చేశారట ! రాజమహేంద్ర వరం రాజదానిగా తూర్పు చాళుక్య రాజ్యాన్ని ఏలిన ఆఖరిరాజు, ఆంధ్ర మహాభారత రచనకు కారకుడు అయిన రాజరాజ నరేంద్రుని పేరును, వివేకానందుని పూర్వాశ్రమ నామం నరేంద్రుడనే పేరును రెండింటినీ జోడించి 'రాజరాజ నరేంద్ర' అని ఆ పిల్లవానికి, 5వ సంతానానికి "సర్వేశ్వర్" అని, 6వ సంతానమైన మగపిల్లవానికి తన తండ్రిగారి పేరు, ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయల పేరూ కలిసి వచ్చేటట్లుగా శ్రీ కృష్ణదేవరాయలు అని పేర్లు పెట్టారు. 7వ సంతానం మగపిల్లవాడు . . . అతడు గర్భంలో ఉండగా తెల్లని కమలం ఆమె గర్భంలో ప్రవేశించగా ఏదో దివ్య తేజస్సు ఆమె శరీరంలో ప్రవహించినట్లు గొప్ప స్వప్నంవచ్చి మెలకువ వచ్చిన తర్వాత ఆ తీయని అనుభూతితో ఆమె పులకించి పోయిందట. కమలం విజ్ఞాన చిహ్నం. విజ్ఞానేశ్వరుడు భారత దేశంలో ప్రసిద్ధుడైన తత్త్వశాస్త్రవేత్త. ఈరెండింటినీ జోడించి అతనికి "విజ్ఞానేశ్వర కుమార్" అని, 8వ సంతానం ఆడపిల్ల - ఆమె ఎప్పుడు సత్యవాక్కునే తన ఆభరణంగా ధరించాలనే తలంపుతో ఆమెకు "సూనృలత" అని, 9వ సంతానం, మగపిల్లవాడు - తొలి శాతవాహన రాజు, తొట్టతొలి

'తెలుగు రాజు అయిన శ్రీముఖుని పేరు కలసి వచ్చేటట్లుగా అతనికి "శ్రీముఖ నిరంజన్ కుమార్" అని, 10 సంతానం ఆడపిల్లకు, లక్ష్మీఅష్టోత్తర శతంలో ఒకటైన చంపకమాలిని పేరును, 11వ సంతానము - ఆఖరిది. ఆడపిల్ల అమ్మ శ్రీరామ భక్తురాలు. శ్రీరామపత్ని మిథిలానగర రాజపుత్రి మైథిలి. ఆమెను గర్భంతో ఉండగా తిరుమలకు వెళ్లినప్పుడు శ్రీ వెంకటేశ్వరుని సన్నిధిలో అమ్మకు పిండ చలనం కలిగిందట. అందుకు ప్రతిగా ఆడపిల్ల జన్మిస్తే 'బాల' అని, మగపిల్లవాడైతే 'బాలాజీ' అని పేరు పెట్టుకుంటాననీ స్వామికి మ్రొక్కుకున్నారట. ఆడపిల్ల జన్మించినందువల్ల పై రెండు పేర్లనూ జోడించి "మైథిలీ బాలాజీ' అని అర్థవంతంగా పేర్లు పెట్టారు. భార్య విజ్ఞాని, విద్యావతి ఐనందువల్ల నాన్నగారు ఆమెకు పూర్తి స్వేచ్ఛనిచ్చారట పీటల మీద కూర్చుని ఆమె ఏ పేరుతో పిలిస్తే అదే పేరును నాన్నగారు బియ్యంలో రాసేవారట. తన పిల్లలకే కాదు, ఇతరుల పిల్లలకు, బంధువుల పిల్లలకు కూడా పేర్లను ఎంపిక చేయడం, ఆమె వంతే. తాను జీవించినన్నాళ్లూ ఎవరు కావాలన్నా తడుముకోకుండా అందమైన పేర్లను ఎన్నింటినో రాసి ఇచ్చేది. బంధువర్గంలోని పిల్లలను ఆసమయానికి ఏపేరు తన నోటికి వస్తే ఆపేర్లతో పిలిచేది. వారంతా అంగీకరించేవారు. చాలా మందికిక సంతానం బ్రతుకకపోతే అమ్మదగ్గరకు వచ్చి ఆమెచేత పేర్లు పెట్టించుకునేవారు. అమ్మ హస్తవాసి మంచిదని ఆమె దగ్గరనుండి, నూనె, ఆముదం, పాతబట్టలు, క్రొత్త బట్టలు, వగైరాలను తీసుకుని వెళ్లేవారు. బహిష్టు నొప్పితో బాధపడ్తూ సంతానం కలుగని స్త్రీలకు మందు తయారు చేసి ఇచ్చేది. వారికి గర్భం నిలచి పండ్లంటి పిల్లలు పుట్టారు. అలా పుట్టిన వాళ్లలో ఒకతె మా ఆప్తులు, బంధువులు, ప్రియమిత్రులు అయిన శ్రీ నల్లమల్లి గోపాలకృష్ణ గుప్తగారి కుమార్తె ఆండాళ్లు. ఆమె మా ఐదుగురితో బాటు ఆరవదానిగా మాయింట్లోనే పెరిగింది. కొన్నాళ్ల వరకూ. ఇప్పటికీ మాయింటి ఆడపడుచుగానే మెలుగుతుందామె. అలా ఎందరో ఈనాటికీ లక్ష్మీకాన్తమ్మగారి పేరును చెప్పుకుంటూ సుఖంగా జీవిస్తున్నారు.

**ఆమె చక్కని గృహిణి :** ఇంటికి వచ్చిన నాన్నగారి స్నేహితులకు, తన మిత్రవర్గానికి, పెద్దలకు, నాన్నగారి క్లైంట్లకు, పిల్లల స్నేహితులకు అందరికీ ఆమె చక్కని ఆతిథ్యం ఇచ్చేది. ఏవేళ వచ్చినా కడుపులనిండా తింటేగాని బయటకు వెళ్లేవారు కాదెవ్వరూ. నాన్నగారితోటి ప్లీడర్లు, పిల్లుట్ల హనుమంతరావు, కర్లపూడి వెంకటేశ్వర్లు, బెండపూడి నారాయణ రావు, మంతెన సుబ్బరాజు మొ॥ వారంతా మా ఇంటికి వచ్చి అడిగి మరీ అమ్మచేత వంటలు చేయించుకుని తిని సంతృప్తిగా వెళ్లేవారు. పుట్టినింట్లో వంట యింటి ఛాయలకు కూడా వెళ్లని లక్ష్మీకాన్తం, గడుగ్గాయి లక్ష్మీకాన్తం కాపురానికి



డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ, శ్రీ హయగ్రీవగుప్త దంపతులు



పెద్ద కుమార్తె సుహాసిని, అల్లుడు హరనాథ్ వారి కుమారులు రాజీవ్ కుమార్, పంకజ్ కుమార్.

వచ్చిన కొన్నాళ్లకే వంటపనిలో, గృహకార్య నిర్వహణలో అనంతమైన నైపుణ్యాన్ని సాధించిందంటే అతి సూక్ష్మమైన ఆమె గ్రహణశక్తినీ, కార్యదక్షతనూ, పట్టుదలను నైపుణ్యాన్ని తెలుసుకోవచ్చును. ఒక్క వంటపనినే కాదు. ఆమె చెయ్యాలనుకున్న ఏపని నైనా సరే తత్సాధనలో ఎన్ని అవాంతరాలు ఎదురైనా సరే పట్టుదలతో, పూర్తి చెయ్యవలసిందే. జంకనేది ఆమె జీవితంలో ఎరుగనే ఎరుగదు. దేనినీ లెక్కచేసేది కాదు. ఆమెది ఆరంభ శూరత్వం కాదు.

**సంతానం - బాధ్యతలు :** పుట్టిన పిల్లలు పదకొండు మందిలో ఆరుగురు వివిధ వ్యాధులతో చనిపోయారు. ఆరోజుల్లో లివరు, మలేరియా, స్ఫోటకం, టైఫాయిడ్, విరేచనాలు కలరా వ్యాధులెక్కువగా ఉండేవి. అప్పట్లో ఇప్పుడున్న ఆధునిక వైద్య సౌకర్యాలు కూడా లేవేమో మరణ సంఖ్య ఎక్కువగానే ఉండేది. శిశుమరణాల సంఖ్య చాల ఎక్కువగా ఉండేది. మాయింట్లో పుట్టిచనిపోయిన ఆరుగురూ కూడా వ్యాధి గ్రస్తులైన వారే. గృహనిర్వహణ, సభలు, సమావేశాలు మొ॥ కార్యక్రమాలతో క్షణం కూడా తీరిక లేకుండా ఉన్నా పిల్లలకు సుస్తీలు చేస్తే వారి సంరక్షణ భారమంతా అమ్మదే. వైద్యులను తీసుకురావడం, మందులు కొని తేవడం, వేయడం అహోరాత్రులు వారి దగ్గరే ఉండి సంరక్షించుకోవడం అంతా అమ్మ బాధ్యతే. నాకు ఊహ తెలిసినప్పటినుండీ నేనే అన్నిటా అమ్మకు సహాయకారిగా ఉండేదాన్ని. సమయానికి తగిన వైద్యాన్ని, సపర్యలను చేస్తూ ధైర్యంతో పిల్లల సంరక్షణను చేసేది.

**సంతానం - విద్య - ఆటపాటలు - ఆమె బాధ్యతా నిర్వహణం కర్తవ్య పాలనం - శ్రద్ధాసక్తులు**

తమ సంతానం వృద్ధిలోకి రావాలని, తమపిల్లల ద్వారా తమకు పేరు ప్రతిష్ఠలు రావాలని ప్రతి తల్లిదండ్రికి కోరిక ఉంటుంది కదా! అది సహజమైనదే కదా ! అలాగే మా తల్లిదండ్రులకు కూడా మాపట్ల బలీయమైన కోరికలుండేవి. నేను, ప్రతాపు, నరేంద్రలు ఒక వరుసలో పుట్టినందువల్ల, మా వయస్సులలో కూడా ఎక్కువ వ్యత్యాసాలు లేనందువల్ల మేం ముగ్గురం కలిసి మెలసి పెరిగాం. ఆరోజుల్లో ఇప్పటిలా ట్యూషన్లు ఉండేవి కావు. విద్యావంతులైన తల్లిదండ్రులైతే వారే తమ బిడ్డలకు పాఠాలు చెప్పుకుండేవారు. అప్పట్లో అమ్మ అంత ఎక్కువగా ఊరువిడచి ఉపన్యాసాలకు వెళ్లేది కాదు. అందువల్ల మా ముగ్గురి చదువు, సంధ్యలు, ఆట పాటలూ అన్నీ అమ్మే చూచుకొనేది. నాన్నగారు లెక్కలు, ఇంగ్లీషు చెప్పేవారు. ఆయన దగ్గర చదువుకోవడమన్నా, ఆయన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడమన్నా మాకు తగని భయం. నోట్లో నుండి మాటే బయటకు వచ్చేది కాదు.

**నా సంగీతసాధన :** బాపట్ల వాసులైన నోరినాగభూషణంగారి చేత గాత్రం చెప్పించారు. తర్వాత అయ్యగారి సోమేశ్వర రావుగారు బాపట్లలో స్థిరపడడంతో నా సంగీతాభ్యాసంనోరి వారినుండి అయ్యగారి దగ్గరకు మారింది. గాత్రం నుండి వీణకు మారింది. వీగురువులైనా మాయింటికి వస్తే మాకు పాఠం చెప్పడం కంటె అమ్మ, నాన్నగార్లతో శాస్త్రచర్చలు, చేయడానికే ప్రాధాన్యమిచ్చేవారు - చూస్తూ కూర్చోవడం మా వంతు అంత లోతైన విషయాలు మాకర్థం కావు గదా! విజయనగర సంస్థాన ఆస్థాన విద్వాంసులు, ప్రసిద్ధ నృత్యాచార్యులూ దువ్వూరి జగన్నాథ వర్మగారి చేత నాకు భరత నాట్యం నేర్పించింది. విజయనగరం నుండి గురువుగారిని తీసుకుని వచ్చి వారికి వసతి సౌకర్యాలన్నీ కల్పించి, జీవన భృతిని కల్పించి విద్యార్థినులను చేర్చి వారిచేత నృత్య విద్య నేర్పించింది.

నా తమ్ముళ్లు రాజ రాజ నరేంద్రుడు, ప్రతాపులు కూడా మేం స్థాపించుకున్న బాలల సంఘంలోనూ, స్కూల్లోను నాటకాలు, విచిత్రవేషధారణలు చేసేవారు. నరేంద్రుని చేత అష్టావధానం కూడా చేయించింది. ఆకార్యక్రమం ఆరోజుల్లో విశేష ప్రశంసల నందుకుంది. మైథిలికి వీణ అమ్మే నేర్పించింది. ఆమె కూడా హిందీ విశారద పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. పిల్లలందరూ విశారద ప్యాసయ్యారు.

**ఎడతెరిపి లేని ఆమె విద్యా బోధన, స్వవిద్యాభివృద్ధి వగైరాలు**

అమ్మ యౌవన దశలో ప్రారంభమైన ఎడతెరిపిలేని విద్యాబోధన, ఇంచుమించు తన చివరి శ్వాస వరకూకొనసాగిందంటే అతిశయోక్తి, అసత్యమూ లేదు. విద్యాబోధనలో ఆమెకు గల ఆసక్తి, విద్యాదానం చేయడంలో ఆమెకు కలిగిన ఆనందాను భూతులూ, మాటలలో చెప్తే అర్థమయ్యేవికావు. అనుభవజ్ఞులు, రసజ్ఞులు మాత్రమే ఆమె అభిరుచిని అర్థం చేసుకోగలరు. నాకు ఊహ తెలిసినప్పటి నుండి ఆమెదగ్గర ఎంతోమంది బాల బాలికలు, యువతీ యువకులు - చదువుకోవడానికి, సంగీతాభ్యాసానికి,కుట్లు అల్లికలు నేర్చుకోవడానికి, వేదాన్త విషయ చర్చలకు వచ్చేవారు. తనకు తీరిక లేకపోయినా, ఆరోగ్యం బాగోకపోయినా, మానసికంగా బాధపడ్తున్నా - పాఠాలు చెప్పడం మానేది కాదు . అందరిపేర్లూ నాకిప్పుడు గుర్తులేవు.

ఆమె తొలి శిష్యుడు, ప్రధాన శిష్యుడు డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం గారిని గూర్చి నేను చెప్పక పోతే క్షమించరాని నేరమే అవుతుంది. ఆయనకు 12వ యేట వారి నాన్నగారు తన కుమారుని తీసుకుని వచ్చి అమ్మకు అప్పగించారట. అంతే ఇంక ఆబాలుడు మాయింట మాతోబాటు అమ్మకు సోదరుడిగా మెలిగారు. అప్పటినుండి నేటి దాకా ఆయన మాకు మామయ్య యే. ఆయన ఎంతమంది పెద్దవారితో ఉన్నా

మా పిలుపు మామయ్యా అనే. అలా పిలుస్తేనే ఆయనకూ తృప్తి. నాతల్లి అన్న, తమ్ములతో కూడా మేమంతా సన్నిహితంగా మెలగలేదు. అమ్మ ఆయనకు ఎం.ఎ. వరకూ తెలుగు చెప్పింది. మామయ్య యూనివర్సిటీ విద్యకు ధన, పుస్తక సహాయం చేసింది. అనేక సంస్థలనుండి స్కాలర్ షిప్పులను ఇప్పించింది. ఆ తమ్ముని అభివృద్ధి కోసం అమ్మ ఎంతగా పాటు పడిందో మామయ్యకు తెలుసు, మాకు తెలుసు. మామయ్య వేదిక నెక్కి ఒక్కపలుకు పలికినా, ఒక అక్షరం రాసినా అంతా లక్ష్మీకాన్తమ్మ ముద్రయే వినిపిస్తుంది, కనిపిస్తుంది. నేటి ప్రముఖ మహిళ మల్లాది సుబ్బమ్మగారు కూడా అమ్మదగ్గర తెలుగు చదువుకున్న వారే. ఎంతమంది శిష్యులున్నారో, అనుయాయులున్నారో లెక్కతేలరు.

**దైవభక్తి - భగవత్సాక్షాత్కారం - ఇత్యాదులు :** ఆమె పరమ భక్తురాలు. తండ్రి కృష్ణారావుగారి ప్రభావం వలన లక్ష్మీకాన్తమ్మ ఏకేశ్వరోపాసనా తత్పరురాలై అందులో తాదాత్మ్యాన్ని, దివ్యానుభూతులను పొందారు. పారవశ్యాన్ని అనుభవించారు. బాల్యమంతా ఏకేశ్వరోపాసనతోనే గడిచింది. తల్లిగారి సనాతనాచారం, విగ్రహారాధనలు ఆమెను ఆకట్టుకోలేదు. మెట్టింది పరమ వైదిక సంప్రదాయ నిష్ఠ గల వారిల్లు. ఊటుకూరి వారు సనాతనులే అయినా పరమ ఛాందసులు మాత్రం కాదు. ఆరోజులలో కొన్ని విషయాల్లో వారూ అభ్యుదయ పథంతో నడచిన వారే. మేనరికవివాహ నిషేధం, వరకట్న నిషేధం మొ॥ విషయాలలో మా తాతగారు చాల ముందడుగు వేశారట. అయినా నియమ నిష్ఠలు, ఆచారవ్యవహారాలు కఠినమైనవే. వారింట్లో త్రేతాగ్నులు ప్రజ్వరిల్లుతుండేవట. అందరూ పరమ వైష్ణవులే. అత్తింట అడుగిడిన కొత్తలో వారి పద్ధతులు, నియమ నిష్ఠలను పాటించడం కొంచెం కష్టంగానే ఉన్నా, సూక్ష్మ గ్రాహి, మేధావి, తెలివితేటలుగల లక్ష్మీకాన్తమ్మ అచిర కాలంలోనే వారి పద్ధతులకు అలవాటు పడిందట. నాన్నగారికి కావలసిన పూజాదికాలను ఏర్పాటు చేస్తూనే తన ఏకేశ్వరోపాసనను నిరాటంకంగా కొనసాగించుకున్నారు. అందులోనూ ఆమెకు పరిపూర్ణ స్వేచ్ఛయే. రోజూ రాత్రులు పడుకోబోయే ముందు పిల్లల్ని తనచుట్టూ కూర్చోపెట్టుకుని బ్రహ్మసమాజ ప్రార్థనలు చేసేది. పాటలు పాడేది. తాను రాసిన పాటలు కూడా పాడుతుండేది. మేం కూడా ఆమెతోబాటు ప్రార్థన చేసేవాళ్లం. ఈమధ్యలోనే నేనా ప్రార్థనలను మరచిపోవడం జరిగింది. తాను వ్రాసిన పాటలకు తానే స్వరం కూర్చిఎక్కడకు వెళ్లినా పాడి విన్పించేది. తనకు తానే అమితానందాన్ని అనుభూతిని పొందేది. ఆ ప్రభావం తనమీద ఉన్నా సరే ప్రతి పండుగకూ, మాచేత పూజలు చేయించేవారు. మన్త్రాలు తానే చదివేవారు. మడికట్టుకుని వంటలు చేసేవారు. సంప్రదాయ బద్ధంగానే చేయించేవారు.



పెద్ద కుమారుడు ప్రతాపచంద్ర, కోడలు శ్రీమతి ఆదిలక్ష్మి
వారి కుమారుడు రంజన్ కుమార్, కుమార్తె వీణామయి



రెండవ కుమారుడు - రాజ రాజ నరేంద్ర, కోడలు - మాలతి
వారి కుమారుడు అవనీంద్ర, కుమార్తె - సుస్మిత

ఇలా జరుగుతుండగా మాయింట అడుగిడిన పరమ వైష్ణువుడు, శ్రీమాన్ ఆదివరాహాచార్యులుగారి ప్రభావం వలన ఆమె వైదిక ధర్మాన్ని అనుసరించడం ప్రారంభించారు. అదికూడా అమ్మ జీవితంలో ఒక విచిత్ర సంఘటన. మఱపురాని ఘట్టం. క్రమక్రమంగా వైదిక ధర్మబద్ధురాలు కావడమే కాదు. అందులోను అలౌకికమైన పారవశ్యాన్ని, ఆనందానుభూతులను పొందింది. అనేకమారులు అనేక విధాలుగా భగవత్సాక్షాత్కారాన్ని పొందింది. కన్యకా సుప్రభాత రచనా ప్రారంభ సందర్భంలో ఆమెకు ఆ తల్లి స్వర్ణవిగ్రహ మూర్తి రూపంలో కాలిగజ్జెల సవ్వడితో నట్టింట్లోకి వచ్చి కూర్చుని దివ్యతేజస్సుతో, అపూర్వమైన కాంతిలో ఆమెకు ప్రత్యక్షమైందట. ఆమెను దీవించిందట. వెన్వెంటనే కన్యకా సుప్రభాతమ్ ఆశువుగా అమ్మ నోటినుండి వెల్వడిందట. అయోధ్యలో సరయూ నదిలో స్నానం చేస్తుంటే శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించాడట. శ్రీరాముడు ఆమె ఆరాధ్యదైవం ఇలా ఎన్ని మార్లు ఆమెకు దైవసాక్షాత్కారం కల్గిందో చెప్పనలవి కాదు. రామనామాన్ని ఎన్నికోట్లు రాసిందో ! కోటి, కోటి, పూర్తికాగానే జపహోమాదులు చేసి అన్నదానం చేసేది.

## ఒక మహిళగా ఆమె అభిరుచులు - వగైరాలు

తమ యింటికి వచ్చిన వారినందరినీ ఆప్త మిత్రులవలె ఆదరించడం ఊటుకూరి వారి యింటి విశిష్ట లక్షణం. బంధువుల నందరినీ, తన అత్తవారి కుటుంబ సభ్యులందరినీ అత్యంతానురాగంతో గౌరవించేది అమ్మ. తన చిన్న మరది, మా బాబాయి హృషీకేశ గుప్త గారంటే ఆమెకు ఎనలేని ప్రేమాభిమానాలున్నాయి. ఆయన ఆమెకు మిత్రునికంటె ఎక్కువ. తను బిడ్డల స్నేహవర్గాన్నికుడా ఆదంపతులు తమ బిడ్డల వలెనే చూచుకునే వారు. వారంతా మా యింట్లో అరమరికలు లేక మెలిగేవారు. బాపట్ల స్థానికులైన - స్థానం, ధారా, బొడ్డుపల్లి, పిల్లుట్ల, కాల్వ, నాళం, గెల్లి, పారేపల్లి, బుర్లె మోదడుగు, సెనగపల్లి మొదలగు కుటుంబాలతోను, వృత్తి, ఉద్యోగాల రీత్యా వచ్చి స్థిరపడిన డాక్టరు సంకా చలపతిరావు, వీణావిద్వాన్ అయ్యగారి సోమేశ్వరరావు, బొలిసెట్టి వరదరాజులు, నాగసూరి రాజేశ్వరరావు, మద్దా సత్యనారాయణ మొదలగు అనేక కుటుంబాలతో మాకు ఘనిష్ఠమైనసంబంధ బంధవ్యాలున్నాయి. ప్రతి వారికి వారిద్దరూ అక్కాబావలే. ఇల్లాలిని చూచి ఇంటిని చూడమన్న సామెత ఆమె పట్ల ప్రత్యక్షర సత్యం. ఉద్యోగరీత్యా వచ్చి వెళ్ళిపోయినా వెణుతురుమిల్లి శ్యామసుందర్ (నా తమ్ముడు విజ్ఞానేశ్వరు స్నేహితుడు) ఆమెకు శిష్యుడు (వీణావాదనంలో), అత్యంత ఆప్తపుత్రుడు. ఆమెకు ఆప్తులు కాని వారెవరు - చిన్నవారి దగ్గరనుండి పెద్దవారి వరకు అందరు ఆత్మీయులే అందరూ సన్నిహితులే.

ఎంతగొప్ప వారైనా ఎవరి అభిరుచులు వారికి, ఎవరి కోరికలు వారికీ ఉంటాయి కదా! అందులో తప్పులేదు కదా! అలాగే లక్ష్మీకాన్తమ్మకీ మహిళగా అనేక కోరికలున్నాయి. వాటిని సాధించి అనుభవించాలనే పట్టుదలా ఉండేది. కొన్ని తీరాయి. మరికొన్ని తీరలేదు. నిరంతర కార్యమగ్నురాలైనా ఆమె చేయని పూజలేదు. వ్రతంలేదు. నోచని నోములేదు. చిట్టి బొట్టు నుండి మూగనోము, గ్రామపసుపు కుంకం, పదహారు ఫలాల నోము వరకు నోచింది, నిష్ఠగా, సశాస్త్రీయంగా వాటిని ఆచరించింది. నాగుల చవితి, కార్తీక పూర్ణిమ మొ॥ శుభదినాల్లో ఉపవాస దీక్షలు చేసింది.

ఆమెకు స్వర్ణాభరణాలు ఎక్కువలేవు. కాని ఉన్నంతలో ఆమె తనకిచ్చ వచ్చిన రీతిలో బంగారాన్ని మలిపించి ఆభరణాలు చేయించేది. సభలు, సమావేశాలకు వెళ్లినా, పండుగలకు, పబ్బాలకు, పెండ్లి పేరంటాలకు వెళ్లినా వాటిని తాను ధరించేది. మాచేత ధరింపచేసేది. మేం ఒక్కసారి ఎందుకమ్మా అంటే మమ్మల్ని మందలించేది. ఆభరణాలు ధరించినా ఆమెలో నిరాడంబరత కొట్టవచ్చినట్లు కన్పించేది. చీరకట్టులో కూడా అదొక హుందాతనం. ఏచీర కట్టినా, ఏ నగ పెట్టినా ఆమెకు స్వభావ సిద్ధంగాసహజంగా నప్పేది. అది ఆమెలోని గొప్పతనం ఆమె కట్టడం వల్ల ఆ చీరకు అందం వచ్చేది.

పెండ్లి పేరంటాలకు తప్పనిసరిగా వెళ్లేది. నన్ను తనతో తీసుకుని వేళ్లేది. వాళ్లు అడుగకపోయినా సందర్భానుసారమైన పాటలను తాను పాడేది, నాచేత పాడించేది. మాయింట్లో కూడా రకరకాల పేరంటాలు చేసింది. శ్రావణ వరలక్ష్మీ వ్రతం పేరంటం, గొబ్బి పేరంటం, బొమ్మల కొలువులు, పుట్టిన రోజు పండుగ పేరంటాలూ, అడుగులకు అరిసెలు మొ॥ వాటినన్నిటినీ సరదాగా, హుందాగా చేసేది. ఎక్కడికి వెళ్లినా బహుమతులను తీసుకొని వెళ్లేది. ఆమెకు ఫోటోగ్రఫీలో మంచి ప్రావీణ్యాం ఉండేది.

**మాయిల్లు ఒక లలిత కళా నిలయం :** నేనీ మాట అన్నానంటే అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. అవాస్తవమూ లేదు. నేను రాస్తున్న విషయాలన్నీ సత్యావాక్కులే. ఇంట్లో ప్రతినిత్యం సాహిత్య చర్చలు, గోష్ఠులు జరుగుతుండేవి. సంగీత సాహిత్య సరస్వతి తనకు మధుర గాత్రంతో ఇంటినీ పరిసరాలనూ ప్రతిధ్వనింప చేసేది. ఆమె కాలికి కట్టిన చిరుగజ్జెల సవ్వడితో, మాయింట నర్తించేది. రస ప్రవాహం ఆపరిసరాలన్నిటా పొంగి పొర్లుతూ శ్రోతలను ఆనంద తరంగితులను చేసేది. ఆరోజులలో బాపట్ల రసవత్తర సన్ని వేశాల కూడలి. ఆవూర్లో నాటకం జరుగని రోజు లేదు. సంగీత నృత్య కచేరీలు, యక్షగాన ప్రదర్శనలు, వీధి నాటకాలు, తోలు బొమ్మలాటలూ, సాహిత్య సమావేశాలూ జరుగని ఘడియలేదు. గొప్ప రసికులు

బాపట్ల పౌరులు. అమ్మ, నాన్న గార్లిద్దరూ ప్రతి కార్యక్రమానికి వెళ్తుండేవారు. వారి వైశిష్ట్యాన్ని ప్రశంసించేవారు. వారితోబాటు నేను కూడా ప్రతి కార్యక్రమానికీ వెళ్తుండే దానిని తమ్ముళ్లు కూడా వచ్చేవారేమో నాకు గుర్తు లేదు. నా చిన్ననాడు జరిగిన ఈ ఘటనలన్నీ ఈనాటికీ నాపై అమిత ప్రభావం చూపుతున్నాయి.

బాపట్ల కేతెంచిన ప్రతి కళాకారుడూ, ప్రతి పండితుడూ ఊటుకూరి వారింటికి రావలసిందే. ఆ పుణ్య దంపతులను సందర్శించి వారిచ్చిన తృణమో, ఫణమో పరిగ్రహించి వారిచ్చిన ఆతిథ్యం స్వీకరించి ఆనందంతో వెళ్లవలసిందే. ఇది నిత్యకృత్యం. అంతేకాదు - నాన్న గారి స్నేహితులు, కోర్టుకు వచ్చిన క్లైంట్లు, నాన్నగారి బంధుగణం. ఇంకా ఇతర సందర్శకులతో, విందులు వినోదాలతో నిత్య కల్యాణం పచ్చతోరణంలా ఉండేది.

సర్వశ్రీ రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, జమ్మలమడక మాధవరాయశర్మ, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, బి.వి. నరసింహారావు, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, బొడ్డు బాపిరాజు, మొ॥ కవి పండితులు, వేదాన్తం లక్ష్మీనారాయణ శాస్త్రి, వేదాన్తం ప్రహ్లాద శర్మ, సత్యనారాయణ మొ॥ నృత్య కళాకారులు, బెహతా రాజారావు, మంగిపూడి రామలింగ శాస్త్రి, నోరి నాగభూషణం గారు ఇంకా ఎందరో కళాకారులు, సంఘసేవకులు, కార్యకర్తలు మాయింటికి వస్తుండేవారు. నాన్నగారు కూడా అమ్మతో కలిసి వారికి ఆతిథ్యాన్నిచ్చి వారితో గోష్ఠీ కార్యక్రమాలలో పాల్గొనే వారు. నేను కూడా వారిప్రక్కనే కూర్చుని వింటుండేదాన్ని కాని అవగాహన శక్తి ఉండేది కాదు. చిన్నదానను కదా మరి !

**కళానిలయం ఊటుకూరి వారి ఇల్లు :** పుస్తక భాండాగారం . . బొమ్మల, అవార్డుల నిలయం మేము చాలా ఇండ్లు మారాం. 1959లో స్వంత ఇంట్లోకి వెళ్లాం. అద్దె ఇంట్లో ఉన్నా, స్వంత ఇంట్లో ఉన్నా మాయిల్లు ఒక పుస్తక భాండాగారమే. ఆ యింటికదే అమూల్యాభరణం. అపురూపాలంకారం. అరుదైన, అపురూపమైన, సంస్కృతం, తెలుగు, హిందీ, ఆంగ్ల భాషా సాహిత్య గ్రంథాలు అనేకం మాయింట్లో ఉన్నాయి - ప్రాచీన గ్రంథాలనుండి అత్యంతాధునిక కావ్యాలు వరకు ఉన్నాయి. అమ్మరచనలు, కృష్ణారావు తాతగారి పుస్తకాలు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణలు, విభిన్న భాషల నిఘంటువులు, పరిశోధక గ్రంథాలు . . ఒకరకం కాదు వైవిధ్యం గల గ్రంథాలకు నిలయం మా యిల్లు. ఒకవైపు నాన్నగారి లా పుస్తకాలు, ఆయన రికార్డులు . . . వీటన్నింటికీ వేరువేరు బీరువాలు. అమ్మకు వచ్చిన సన్మాన పత్రాలు, ఆమె సాహితీ పురస్కారాలకు సంబంధించిన ఫోటోలు, అమ్మ కుట్టిన కళాఖండాలు, నన్నయ తిక్కన మొ॥ మహాకవుల రేఖా చిత్రాలు,



మూడవ కుమారుడు విజ్ఞానేశ్వర్ కుమార్, కోడలు అరుణజ్యోతి
వారి కుమార్తెలు శాయిపల్లవి, జాహ్నవి.



రెండవ కుమార్తె బాలాజీ మైథిలీ, అల్లుడు సురేష్ బాబు వారి కుమార్తె,
వాసవి మనోజ్ఞ, కుమారుడు ప్రశాంత్ పవన్ కుమార్

వివేకానంద, రాధాకృష్ణపండితుడు, నెహ్రూ, గాంధీ గార్ల ఫోటోలు, వివిధ పత్రికలలో ప్రచురించబడిన పౌరాణిక, చారిత్రక, పటాలు, హిందీ సాహిత్యానికి సంబంధించిన సూరదాస్, మీరా మొ॥ మహా కవుల పటాలు ... అమ్మకు వచ్చిన అనేక అవార్డులు, మా కుటుంబానికి సంబంధించిన ఫోటోలతో గోడలన్నీ నిండి ఉన్నాయి. అమ్మనాన్నగార్ల డిగ్రీ ఫోటో నిలువెత్తుసైజుది ఈనాటికీ ఉన్నది. "భార్య, భర్తలిద్దరూ కలసి డిగ్రీ గౌన్లతో తీయించుకున్న ఫోటో నాకు తెలిసినంతవరకూ ఇదొక్కటే. ఇంకెక్కడా నేను చూడలేదు, . . జాగ్రత్త చెయ్యండి" అని అమ్మ చనిపోయిన తర్వాత మా యింటికి వచ్చినప్పుడు పురుషోత్తం మామయ్య అన్నాడు. ఇంటికి వచ్చిన వారందరి చూపులు ముందుగా వీటిపైనే ఎన్ని పుస్తకాలు, ఫోటోలు, అవార్డులండీ మీ యింట్లో' ' అని ప్రతివారు ఆశ్చర్యం ప్రకటిస్తారు.

దసరాకు కొలువు తీర్చడం, పేరంటం చెయ్యడం . . . ఓహ్ అదొక సరదా! అదొక విశేషమైన ప్రత్యేకమైన కళాఖండమే. లక్ష్మీకాన్తమ్మగారి కళాతృష్ణకది దర్పణం. ఆమె భావుకతకది ప్రతిబింబం. నిజంగా ఆకొలువును ప్రతివారూ చూచి తీరవలసిందే. పిల్లలలో సృజనాత్మక శక్తిని నిర్మాణాత్మక శక్తిని పెంచే మెకానో, మొడేకానోలతో తమ్ముళ్లు అనేక రకాల వంతెనలు, ఇండ్లు, క్రేన్లు మొ॥ తయారుచేసి కొలువులో పెట్టేవారు. ఒక ఆదర్శనగరం ఏర్పడేది. ఆకొలువు అందచందాలను వెదజల్లుతూ అత్యంత వైభవంగా అలరారు తుండేది. బాపట్ల వారేకాక పై ఊళ్లనుండీ కూడా వచ్చి చూచి ఆనందించి వెళ్లేవారు. పండుగ పదిరోజులైతే మాకొలువు నెలరోజులుండేది.

గ్రామఫోను ఉండేది. తాన్‌సేను, పాటలు, మీరా భజనలు, ద్వారం వారి వయొలిన్ - రికార్డులు - చక్కటి భావుకతకల సినిమా పాటల రికార్డులు తెచ్చేది. ఇంత ఎందుకు అమ్మ ఊరినుండి వచ్చిందీ అంటే . . . బట్టలు, గాజులు, రిబ్బన్లు, బొమ్మలు, గ్రామఫోను రికార్డులు, రకరకాలైన గృహోపకరణాలు ఇంకా విశేషమైన వస్తువులు పుస్తకాలు ఎన్నో ఇంటికి వచ్చేవి. అంత గొప్ప అభిరుచిగల వ్యక్తిని ఇంకొకరిని మనం చూడమేమో !

ఒక రంగంలో కాదు అన్ని రంగాలలోను ఆమె అభిరుచి, ఎంపిక ప్రత్యేకమైనదే. విశిష్టమైనదే. ఆమె అన్ని సుగుణాలనూ, అన్నిరకాల అభిరుచులను తనలో పొదుపుకొన్న కలగూర గంప . . . అందులో దేని అర దానిదే. అదే ఆమెలో విశేషం.

**ఆమె సాహిత్య సేవ - ఇంట్లో నాపాత్ర :** నాకు ఊహ తెలిసినప్పటి నుండి - 6 ఏళ్ల ప్రాయం నుండి - ఆయింట్లో బాధ్యత గల ఒక వ్యక్తిగా నా పాత్ర ప్రారంభమైంది.

ఆమె మా సంరక్షణను, బాధ్యతను నాన్నగారికి, పనివాళ్లకు అప్పగించి ఉపన్యాసాలివ్వడానికి, సమావేశాలకు ఊరు విడచివెళ్లి పోతుండేది. అమ్మ ఇంట్లో లేనప్పుడు నాన్నగారే మా సంరక్షణను తన భుజాలపై వేసుకుంటే వారు - వంటమనిషి లేకపోతే ఆయనే వండి పెట్టేవారు. ఇరుగు పొరుగుస్త్రీలు నాకు జడలు, బొట్టు వగైరాలు చేసేవారు. మొదట్లో అంత ఎక్కువగా బయటకు - వెళ్లకపోయినా క్రమక్రమంగా ఆమె పేరు ప్రతిష్ఠలు పెరిగిపోయాయి. కార్లు తీసుకుని వచ్చి ఆమె రానంటున్నా సరే - ఒప్పించి తీసుకుని వెళ్లేవారు. ఇంక ఇంటి పెద్దను నేనేగదా . . . నాతరువాతి పిల్లల బాధ్యత, ఇంటి పనుల బాధ్యత అంతా నాదే. నాతోబాటు ప్రతాపు కూడా కొంతపని పంచుకునేవాడు. అలా ప్రారంభమైన ఆమె ప్రయాణాలు - ఒక్కొక్కసారి వారంరోజులు, పదిరోజులు, పదిహేనురోజులు, నెలరోజులు కూడా సాగుతుండేవి. ఒకొక్కసారి ఊరిమీదుగా వెళ్తు-ఊళ్లో దిగి ఇంటికి వచ్చి హడావుడిగా భోజనం చేసి, బట్టలు సర్దుకుని వచ్చిన రిక్షాలోనే మళ్లీ మళ్లీ పోతుండేది. ఒక్కొసారి ఊరిమీదుగా ప్రయాణించినా ఊళ్లో దిగేది కాదు. నేను ఫలాని ఊరికి వెళ్తున్నాను' అని నాన్నగారికి ఒక కార్డు రాసి వెళ్లిపోతుండేది. ఆవిధంగా రానురాను ఆమె ఊళ్లో ఉండడం గగన కుసుమమై పోయింది. ఇంట్లో ఉన్నా ఊళ్లో వాళ్లు తీసుకుని వెళ్లేవారు.

నాకు తెలిసి తన కళాశాల ప్రిన్సిపాలు, అమ్మ బంధువూ అయిన శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి షష్ట్యబ్ది పూర్తి ఉత్సాహాలకు - విరాళాలకు, సభ ఏర్పాట్లకు - 6 మాసాలు, ఇల్లు వదలి దేశం తిరిగింది. అప్పుడు నావయసు 8సం॥లుంటాయేమో ! తర్వాత ఆంధ్ర కవయిత్రుల గ్రంథరచనా సందర్భంలోను, అఖిలభారత కవయిత్రుల గ్రంథ విషయసేకరణ సందర్భంలో భారత దేశమంతటా సంచారం . . . అయ్యగారి సోమేశ్వరరావుగారికి ఆలిండియా రేడియోవారు గ్రేడు తగ్గించగా వారిని పూర్వపు గ్రేడుకు తీసుకుని రావడానికి వారి వీణావాయిద్య వైభవాన్ని, పాండిత్యాన్ని ప్రజలకు, రేడియోవారికి తెలియచెయ్యడానికి, అఖిలభారత కవయిత్రుల మహాసభ నిర్వహణకు, ఇలా ఎన్నో పార్లు నెలలు నెలలు, ఇల్లు విడచి రాష్ట్ర దేశ పర్యటనలు చేశారు. కేంద్ర సాహిత్య అకాడమీ వారి తరుపున పశ్చిమ కమ్యూనిస్టు దేశాలకు భారతదేశ ప్రతినిధిగా ఆమె వెడలి తన దేశ ఖ్యాతిని తన రాష్ట్ర భాషల వైభవ ప్రాభవాలను ఖండాంతరాలలో చాటి విజయగర్వంతో తిరిగి వచ్చింది. మలేషియాలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు కూడా రాష్ట్ర ప్రతినిధిగా వెళ్ళి ఆ దేశంలో ఉపన్యాసాలిచ్చింది.

నేను డాక్టర్ని కావాలని ఎంత ప్రయత్నించినా, ఎంతగా కోరుకున్నా నా కోరిక నెరవేరలేదు సరికదా . . . రిటైరయ్యే వరకూ ఉపాధ్యాయ వృత్తినే నిర్వహించ వలసి వచ్చింది. విధి బలీయం కదా! చిన్ననాటి అభ్యాసాలు పెద్దైన తర్వాత వ్యక్తులమీద

తమ ప్రభావాన్ని చూపిస్తాయి అనడానికి నా జీవితమే ఒక నిదర్శనమేమో !

అమ్మ కాలూనిన సాహిత్య రంగమే నాకూ అభిమాన రంగమైంది. నాన్నగారు ఇకనమిక్స్ లేదా ఇంగ్లీషు చదువంటే నేను ధైర్యం చేసి ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా తెలుగు బి.ఎ., ఎం.ఎ.,లు చేశాను. డాక్టర్ని కాకుండా సంగీత సాహిత్యవేత్తనై, అమ్మ వారసురాలిగా ఎదిగినందుకు నేను ఎంతో సంతృప్తిని పొందుతున్నాను - గర్వపడుతున్నాను కూడా.

ఆమె పెద్దకుమార్తెగా నాస్థానం ఆయింట్లో చాలా ప్రధానమైనదే. పెద్దకుమారునిగా ప్రతాపు కూడా తన బాధ్యతలను చాల శ్రద్ధాసక్తులతో నిర్వహించాడు. అంతేకాదు తమ్ముళ్లిద్దరూ విదేశాలకువెళ్లినా, ఆడపిల్లలు అత్తవారింట ఉన్నా పెద్దవాడైన ప్రతాపు అతనికుటుంబం మాత్రం అమ్మ, నాన్నగార్ల చివరిదశవరకూ తోడు నీడగా ఉంటూ సర్వసపర్యలను అమితప్రేమ భావంతో అంకిత భావంతో నిర్వహించాడు. భార్యా భర్తలిద్దర్నీ తన చేతుల మీదుగానే సాగనంపాడు.

**మహిళా జనసేవ :** ఆమెకు సంఘంలో మహిళల సెకండరీ స్థానం బాధాకరంగా ఉండేది. సమయం వచ్చినప్పుడల్లా మహిళల హక్కుల కోసం పోరాడింది. స్త్రీల హక్కులకు భంగం వాటిల్లితే ఆమె సహించేదికాదు. వెంటనేగళం విప్పి ఎదుటివారితో వాదించేది. నా ఉన్నత విద్యాభ్యాసంకోసం ఆమె నాన్నగారితో ఎన్నోసార్లు వాదించింది. స్త్రీలకు భాషాప్రవీణ ఎంట్రన్స్ కోర్సును స్థాపించి 2 సం॥లు కళాశాలను నిర్వహించింది. మల్లాది సుబ్బమ్మగారు ఆమెకు సహాయంగా ఉండేవారు. కాని తర్వాత తమ తమ కార్యవ్యగ్రతల వల్ల ఆకళాశాలను మూసివేయవలసి వచ్చింది. స్త్రీలకు కో ఆపరేటివ్ సొసైటీని స్థాపించింది. భీమరాజు వరలక్ష్మమ్మగారు మొ॥ వారితోడ్పాటుతో ఆసంస్థను చాలా సంవత్సరాలు పోషించారు. అనేకమంది దీనులైన, పేదలైన మహిళలకు జీవనోపాధిని కల్పించి సంతృప్తి చెందారు.

**సమాజ సేవ :** గిల్ట్ ఆవ్ సర్వీసు సంస్థద్వారా అమ్మ, భీమరాజు వరలక్ష్మమ్మ మొ॥వారు దీనార్తులైన, దుఃఖితపీడిత యువతీ యువకులకు, స్త్రీ పురుషులకు అనేక సేవలు చేశారు. అదేకాకుండా వ్యక్తిగతంగా కూడా ఆమె కోరిన వారికి కావలసిన అగణిత సేవలు చేశారు. తనదగ్గరకు వచ్చిన వారికి (స్త్రీ పురుషులకు) చదువుకు ధనసహాయం చేసింది. విద్యాలయాల్లో సీట్లు ఇప్పించింది. నోటిమాటతో ఉద్యోగాలిప్పించింది. వృత్తివిద్యలను నేర్పించింది. కులమత భేదం లేకుండా ప్రతిఒక్కరికీ నిండైన హృదయంతో స్పందించి సహాయం చేసింది. వాళ్ళు జీవితంలో స్థిరపడితే ఎంతో ఆనందించేది. భగవంతుడు తనకు శక్తి నిచ్చినందుకు ప్రతిగా

కృతజ్ఞతగా ఎన్నో సహాయాలూ, చేసింది. ఒక్కకార్డు వ్రాసినా, ఫోనులో మాట్లాడినా అధికారులు, పెద్దలు ఆమె కోరికను మన్నించేవారు. ప్రతి చిన్న విషయానికీ ఆమె స్పందించేది.

**కుటుంబం - సంతానం - విద్యా వివాహాదులు - ఆమె బాధ్యతలు స్పందన - కష్టసుఖాల భాగస్వామ్యం తల్లిగా కర్తవ్య పరాయణత**

సంతానం విషయంలో కూడా ఆమె అలాగే స్పందించేది. మాకు టైఫాయిడ్, మలేరియా, స్ఫోటకం మొ॥ వ్యాధులు సంక్రమించినప్పుడామె చేసిన సేవలను ఎన్నటికీ మరచిపోలేము. నాన్నగారు తనకు ఏసహాయమూ చేసేవారు కాదు. అన్నీ తానేఅయి, అన్నిటా తానే అయి మాకు సేవలు చేసింది. ఒకేసారి 5గురు పిల్లలకు స్ఫోటకం వచ్చింది. మాయింట్లో అప్పుడు సూనృత అనే పాప ఆ జబ్బుతో చనిపోతే వ్యాధి తీవ్రతతో ఉన్న మాకు ఆవిషయాన్ని కొంచెం కూడా తెలియనివ్వకుండా దుఃఖాన్నంతటినీ కడుపులోనే దిగమ్రింగిన మనస్థైర్యం గల మహిళ అమ్మ. అలాగే మా వివాహాల సందర్భంలో కూడా అన్ని బాధ్యతలూ చాకిరీలూ అమ్మవే. నాన్నగారు ఎప్పటిలా కోర్టు, క్లైంట్లు, ఇల్లూను.

**బిడ్డలపై తల్లిదండ్రుల ప్రభావం :** వారిరక్తాన్ని పంచుకుని జన్మించి నందుకు మాపై వారి ప్రభావాలు అధికంగానేకానవస్తాయి. సత్యావాగ్భాషణం, నీతి నిజాయితీలు, నియమ బద్ధమైన జీవన విధానం, ఋజుప్రవర్తన, హేతుబద్ధమైన కార్యాచరణ ప్రణాళిక, యుక్తాయుక్త వివేచన, ధర్మనిరతి, న్యాయపాలన, కార్యాచరణలో దీక్షా దక్షతలు, సేవానిరతి . . . విజ్ఞాన వారసత్వం . . . మొదలైన విశేషాలు ఆ తల్లి దండ్రుల బిడ్డలుగా మాకు వారసత్వంగా సంక్రమించాయి. వాళ్ళ గర్భాన జన్మించిన "పంచరత్నాలు"గా మమ్మల్ని ప్రశంసించేవారు. మేం కూడా వారిబిడ్డలుగా జన్మించినందుకు అది మా పూర్వజన్మ సుకృతంగా భావించి గర్విస్తుంటాము.

**మా పోలికలు :** నేను, నరేంద్ర - నాన్నగారి పోలికలు. ప్రతాపు, విజ్ఞాను, మైధిలి లు . . . నాళంవారి పోలికలు. ప్రతాపు అమ్మతమ్ముడు కృష్ణుని పోలికలు, విజ్ఞాను అచ్చంగా నాళం కృష్ణారావుగారే. (పోలికలు, రంగు, విజ్ఞానం, కదలికలు వగైరాలు) మైధిలి . . . ముమ్మూర్తులా తల్లి పోలికలే. ఆమె మా యింట్లో చి.ల.కాం. . . చిన్న లక్ష్మీకాన్తం . . . (మాట, బాణి,యాజమాన్యం . . . అన్నీ అమ్మే) . . .

**ఉపన్యాస వైశిష్ట్యం, పాఠ్య బోధనా విధానం :** (ప్రభావయుతమైన, సరసమధుర గంభీరమైన, ఉదాత్తానుదాత్త స్వరిత స్వరయుతమైన, శ్రోతలను మైమరపింపచేయునట్టి

సమ్మోహనాస్త్రతుల్యమైన, వినువారిచే ఆనంద నాట్యాలుచేయించునట్టి, విజ్ఞానోపేతమై సులభగ్రాహ్యమౌశైలి యుతమైన;చక్కని, చిక్కని లలిత లలితమౌ తెలుగు పదాలతో వినువారి గుండెలకు చక్కలిగింతలు పెట్టే ఉపన్యాం ఆమెకు ఉగ్గుపాలతో వచ్చిన విద్య. అప్రతిహతము, అనర్గళము అయిన ఆమె వాగ్ధాటిని గూర్చి నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఆంధ్ర పౌరులందరికీ ఆమె ఉపన్యాసం సుపరిచితం. ఆమెకు ఆమెయేసాటి. ఆమెతో పోటీపడే ఉపన్యాసకులు ఎవ్వరూ లేరంటే అతిశయోక్తి కాదేమో !

**వైద్యం:** అమ్మకు వైద్యరంగంలో కూడా ప్రవేశమున్నది. బహిష్టునొప్పి వచ్చి సంతానం కలుగని స్త్రీలకు మంచిగంధంతో మందు తయారు చేసి ఇచ్చేది. మూడు నెలలు మందు వేసుకునే సరికి ఆ స్త్రీలకు గర్భం నిలచి నవమాసాలైన తర్వాత పండ్లంటి పిల్లలు పుట్టేవారు. అదే కాకుండా ఇంకా కొన్ని చిట్కా వైద్యాలు చేసేది. అవి అన్నీ సత్ఫలితాలనే ఇచ్చేవి, తాను ప్రకృతి వైద్యాన్ని అనుసరించేది. బాపట్లలో శ్రీ స్థానం పార్థసారధిగారి సహాయంతో ఆమె తన వైద్యాన్ని కొనసాగించింది. మా అందరికీ తీవ్రమైన, భయంకరమైన స్ఫోటకం వచ్చినప్పుడు ఆమె ఏమాత్రం క్రుంగిపోలేదు. తనకు బాగా అనుభవం ఉన్న ప్రకృతి వైద్యంతోనే మమ్మల్ని బ్రతికించుకున్నది. ఒక పాప సూనృత (9 నెలలు) ఆ జబ్బుతోనే మరణించింది. తనను ఆశ్రయించిన ఇతరులకు ఇరుగు పొరుగులకు కూడా ప్రకృతి వైద్యంతో సేవలు చేసేది.

నాన్నగారి మరణం : నాన్నగారి మరణం ఆమె జీవితంలో అగాధాన్నే సృష్టించింది. సుమారు 60 సంవత్సరాల వారి దాంపత్య వృక్షం నేలకూలింది. ఎన్నో అనుభవాలు, అనుభూతులు, కల్లోలాలు, కలతలు, అనురాగవిరాగాలు, ఇలా అసంఖ్యాకమైన భావ సంచయంతో కూడిన నౌకకు లంగరు వీడింది. లక్ష్మీకాన్తమ్మ ఒంటరిదైంది. విలవిలలాడి పోయింది. అందరికీ ధైర్యం చెప్పే లక్ష్మీకాన్తమ్మేనా ఇంత శోకిస్తుంది అని ఆశ్చర్యపోవడం నావంతైంది. ఎప్పుడూ నాన్నగారు తనతో చెప్పే జోస్యం నిజమని నమ్మింది. తాను పుణ్యవతిగా వెళ్లిపోతానని అనుకున్నది. కాని జోస్యం తారుమారైంది. విధి మనచేతుల్లో లేదనే విషయం మరోమారు స్పష్టమైంది. పైకి ఎంత నిగ్రహంగా ఉన్నా అంతరంగంలో ఆమె చాలా వియోగాన్ని అనుభవించింది. యజమాని మరణంతో ఇల్లు బోసి పోయినట్లే అమ్మ మనస్సు, తేజోవంతమైన ఆమె ముఖమూ బోసిపోయాయి. వైధవ్య క్రతువును నెరవేర్చలేదని మాదగ్గరి బంధువులు, అమ్మను మమ్ము విమర్శించారు. కాని మేము వారిని లెక్కచెయ్యలేదు. తాళిని మాత్రం తీసివేసింది. బొట్టు, గాజులను ఆమె తియ్యలేదు. ఎవరైనా ఇంటికి వచ్చినవాళ్లుగాని ఆమె ఎక్కడికైనా వెళ్లినప్పుడుగాని, ఆమెకు బొట్టుపెట్టకపోతే వారిని అడిగి మరీ బొట్టు పెట్టించుకునేది. ఆ విశిష్టత ఆమెకే దక్కింది.

ఒంటరితనాన్ని భరించలేక, చాలా బాధపడింది. మా యిండ్లకు రమ్మంటే స్వాభిమానం అడ్డువచ్చింది. "ఏమైనా సరే నేను ఎవ్వరి యిండ్లకూరాను. నాయింట్లో నేనుంటాను. అక్కడే నాతనువు చాలిస్తాను'' అని దృఢంగా పల్కేది. అలాగే తనమాటే చెల్లించుకున్నది. 1996 సం॥ డిశంబరు నెల తనకు గండసమయం అని జ్యోతిష్యుడు చెప్పిన మాటలను ప్రగాఢంగా విశ్వసించింది. ఆమెకు తెలియకుండానే లోలోపల వ్యాధి ప్రవేశించి, ప్రకోపించింది. సుదీర్ఘకాలం బాధపడకుండా 4 నెలలు మాత్రం వ్యాధి ప్రతాపానికి గురైంది. డిశంబరు నెల ప్రవేశించిన కొద్ది గంటలకే ఆమె తనువు చాలించింది. ఆమె తాను కోరుకున్నట్లుగా తన కుటుంబ సభ్యుల సమక్షంలో తన సహజ గాంభీర్యం, వాక్పటిమలను కోల్పోకుండానే, విస్పష్టమైన స్వరంతో మాట్లాడుతూనే ప్రాణాలు వదలింది.

రాజసింహంలా జీవించి, రాజసింహం లాగానే గంభీరంగానే ఆమె భువినుండి దివికి తరలి వెళ్లిపోయింది.

"జాతస్య మరణం ధృవం" అని తెలిసినా విశిష్టురాలైన అమ్మ మాకింక లేదే అని మా మనస్సులు మౌనంగా రోదించాయి.

ఆమె మరణంతో ఒక శకం ముగిసింది. "సాహితీ రుద్రమ'' అనే నక్షత్రం సాహిత్యాకాశం నుండి నేలరాలింది. ఒక "తెలుగు మొలక'' చిగురించి, పుష్పించి, ఫలించి, పండిపోయి నేలవాలింది. ఒక "ధర్మ ప్రచార భారతి'' దివ్య రథాన్ని అధిరోహించి ఆకాశహర్మ్యంలో భగవత్సన్నిధానంలో స్థానం సంపాదించింది. ఒక "అపర వాగ్దేవి" తిరిగి ఆ వాగ్దేవి కిరీటానికే అలంకారంగా భాసిస్తూ ఆమె సన్నిధికి చేరుకున్నది. ఒక 'సంగీతసాహిత్య సామ్రాజ్ఞి' తన సింహాసనాన్ని తన అనుయాయులకు అప్పగించి ఇంతకంటె పదిలమైన, పటిష్ఠమైన సింహాసనాన్ని ఆక్రమించింది. "ఆంధ్రసరస్వతి' 'గా అలరారింది. ఆంధ్రులందరికీ తన "కాంతి శిఖరాలను'' పంచిపెట్టింది.

పూజ్యులైన మా తల్లిదండ్రుల బిడ్డలుగా మేము జన్మించినందుకు కృతజ్ఞతా సూచకంగా నేనురిటైరు కాగానే దేశంలో ఉన్న ముగ్గురమూ అమ్మ నాన్నగార్ల పాదపూజ (నాన్నగారి పటాన్ని పెట్టి) చేసుకున్నాం. పితౄణం, మాతౄణం రెండూ తీరనివే. అయినా అదొక తృప్తి, నా"నృత్యహేల" కావ్యాన్ని వారిద్దరికీ అంకితం చేశాను. ఆమె నాకు "కవయిత్రీలలామ'' అని బిరుదునిచ్చి, తన చేతిని ఉన్న 'గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని' నాచేతికి తొడిగి, తన సాహిత్య వారసురాలిగా నన్ను అందరెదుట ప్రకటించి తన గొప్పతనాన్ని, అవ్యాజమైన ప్రేమానురాగాల్ని ప్రకటించుకున్నది. ఆమెతో కలసి ఆనందాన్ని పంచుకున్న శుభ సమయం, ఆఖరి పండుగ అదే. మాకు దక్కిన చివరి అదృష్టమూ అదే.

# సర్వశ్రీ ఊటుకూరివారు

- ఊటుకూరి ప్రతాప చంద్ర

ఊటుకూరివారి గురించి వ్రాయాలంటే వారెవరో వారి గురించి ఎందుకు రాయాలో ముందు తెలియాలి. చీరాలలోని ఊటుకూరి వెంకటేశ్వర్లుగారిల్లే శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి మెట్టినిల్లు. రాజమహేంద్రవరం వాస్తవ్యులు రెండవ కృష్ణదేవరాయులుగా ప్రసిద్ధిపొందిన నాళం కృష్ణారావుగారి పుత్రిక చిరంజీవి లక్ష్మీకాన్తమ్మ. అపర సరస్వతీదేవి సుశీలగారు వీరి తల్లిగారు.

పాఠశాల రోజుల నుండి కళాశాల రోజుల వరకు ఒక ప్రత్యేకతను సంతరించుకొని, తనదైన బాణిలో సాహితీ సమరం నుండి స్వతంత్ర సమరం వరకు ఒక ప్రత్యేక పంథాలో చిరుత ప్రాయంలోనే పేరు సంపాదించుకున్న చిరంజీవిని నాళం లక్ష్మీకాన్తమ్మ. తన చిరుత ప్రాయంలోనే (తన 13 సం॥లో) శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగా మారారు. సంఘసంస్కర్త, సాహితీవేత్త, బహుముఖ ప్రజ్ఞాశాలియైన నాళం కృష్ణారావుగారికి సమఉజ్జీ ఊటుకూరి వెంకటేశ్వర్లుగారు. వీరుకూడ విద్యాప్రియులు, సంఘసంస్కర్తలు.

చీరాలలో ఊటుకూరి వెంకటేశ్వర్లుగారిని తెలియని వారుండరు. ఆయన ధర్మమూర్తి. ఆయన చేసిన ధర్మకార్యముల వలన సంస్కరణల వలన ఊటుకూరి వారి కుటుంబం ఉన్నత శిఖరాలు అందుకుందంటే అతిశయోక్తి కాదు. ఆయన గ్రామపెద్ద. ఆయన ఇల్లే ఒక న్యాయశాల.

ఊటుకూరి వెంకటేశ్వర్లుగారి ధర్మకార్యాలకు ఒక పరిమితి లేదు. ఆంగ్ల విద్యా బోధన లేని రోజుల్లో, చీరాలలో ఆంగ్ల విద్యాబోధన కొరకు స్వంత ఖర్చులతో, స్వంత భవనాలలో ఒక ఇంగ్లీసు మీడియం మిడిల్ స్కూలు ప్రారంభించి నడిపారు ఆ స్కూలు ప్రభుత్వపరమైన తరువాత ఒక సంస్కృత పాఠశాల స్థాపించారు. మంచి సంస్కృత పండితులచే బోధన చేయించారు. విజ్ఞాన నిధిని ఏర్పాటుచేసి, విద్యార్హత ఉండి స్తోమత లేని అర్హులకు ఉపనయన వివాహాది శుభకార్యాల వరకు వెంకటేశ్వర్లుగారిదే నిర్వహణ. ఈ కుటుంబంలో కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం నిషిద్ధం, మేనరికాలు నిషిద్ధం. స్త్రీలకు విద్య ఎందుకు, వంటింట్లో పనేకదా అన్న మూఢాచారాన్ని త్రోసిరాజని, తన కుమార్తెలకు చదువు చెప్పించుటయేకాక, కోడళ్ళనుకూడా చదువుకున్న వారినే ఎంచుకున్నారు స్త్రీ విద్యకు ఎంతో ప్రాముఖ్యతనిచ్చి వారి ఉన్నతికి ఎంతో కృషి చేశారు.

అటువంటి కుటుంబంలో మెట్టిన లక్ష్మీకాన్తమ్మగారుకూడా చిరుత ప్రాయం నుండి



ఆం. ప్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి నుంచి సన్మానం అందుకుంటున్న డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ



ప్రపంచ తెలుగు మహాసభల సందర్భముగా విద్యామంత్రి మండలి
శ్రీ వెంకట కృష్ణారావు నుండి సన్మానం అందుకుంటున్న డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ

అలవాటైన తన బాణిలో స్త్రీ విద్య, స్త్రీ పురోభివృద్ధి వగైరాలకు ప్రాధాన్యతనిచ్చి తన జీవితమంతా ధారపోసారు. ఆమె విజయాల వెనుక అత్తవారింటి పూర్తి సహాయ సహకారాలు లభించాయి. ఆమె వలన ఊటుకూరి వారి వంశం ఇంకా ఉన్నత శిఖరాలనందుకొన్నది.

చీరాలలోని బేర్ హాస్పిటల్ స్థలంలో కొంత స్థలం (7 ఎకరాలు, సం॥ 1840) ఎన్.ఆర్.ఎన్.పి. హైస్కూలు స్థలంలో కొంత స్థలం, యార్లగడ్డ అన్నపూర్ణాంబ జూనియర్ కళాశాల స్థలంలో కొంత స్థలం వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.ఎన్. కళాశాల స్థాపన, లగాయతు స్వర్ణదారిలో నాగ ప్రతిష్ఠ, కొట్ల బజారులో రామ మందిరం వగైరాలన్నీ ఊటుకూరి వారి దాన గుణానికి కొన్ని ప్రతీకలు.

ఇక వెంకటేశ్వర్లుగారి సంతానం -- ఆడపిల్లలు ఆరుగురు, మగపిల్లలు నలుగురు. అందరూ విద్యావంతులే.

**ప్రథమ పుత్రిక:** శ్రీమతి రామాంబ. -- తూనుగుంట్లవారి కోడలు. ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

పుత్రుడు - చంద్రమౌళి - వంతెనల నిర్మాణ నిపుణుడు. ఆలమూరు వంతెన ఈయన ధీశక్తికి మచ్చుతునక.

**ద్వితీయ పుత్రిక:** శ్రీమతి పుణ్యావతి. -- పల్లపోతువారి కోడలు.

**ప్రథమ పుత్రుడు:** శ్రీ ఉపేంద్ర గుప్త. -- వంకాయలవారి అల్లుడు. ధైర్యానికి, శౌర్యానికి మారుపేరు. నలుగురు కుమార్తెలు, నలుగురు కుమారులు. స్వాతంత్ర్య సమర వీరులు. 1942లో ఆంధ్రరాష్ట్రంకోసం అల్లర్లు జరిగినపుడు, చీకటి మాటున, దోపిడీ ముఠాలు పేరాల దోచుకొని తగులబెట్టి, చీరాలను ధ్వంసం చేయుటకు వచ్చినపుడు, తెల్లగాంధీ బొమ్మ దగ్గర (చేల మీద నౌకరు సాయంతో) వారిని అడ్డగించి, చీరాల నాశనం కాకుండా కాపాడారు. గ్రామ కాపలా కమిటీని ఏర్పాటు చేసి పోలీసువారి సహాయంతోపాటు గ్రామ రక్షణ నిర్వహించారు.

**ద్వితీయ పుత్రుడు:** శ్రీ హయగ్రీవ గుప్త. నాళంవారి అల్లుడు. లక్ష్మీకాన్తమ్మగారి భర్త. న్యాయవాది. స్వాతంత్ర్య సమర వీరులు. బాపట్లలో న్యాయవాద వృత్తి చేపట్టింది మొదలు, వృత్తి విరమణ చేసే వరకు ఎంతో మంది యువ న్యాయవాదులకు శిక్షణ ఈయడమే కాకుండా, న్యాయవాదులకు మార్గదర్శకులైనారు. వృత్తిలో మణిదీపమనియే చెప్పవచ్చు. విద్యార్థినీ, విద్యార్థి దశలోనే వీరి వివాహం అయినా "వివాహే విద్యానాశాయ" అన్న నానుడిని తోసిరాజని, ఇద్దరూ ఉన్నత విద్యలు పూర్తి

చేశారు.

తండ్రిగారైన వెంకటేశ్వర్లుగారి సంస్కృత భాషాభిమానం పునాదిగా, తెలుగు సంస్కృతంలో ఉభయ భాషా ప్రవీణ పట్టా పొందిన భార్య లక్ష్మీకాన్తమ్మ తోడ్పాటుతో మాకు (పిల్లలకు) 10వ తరగతి వరకు ఇంటి వద్దనే సంస్కృత విద్యాబోధన జరిగింది. సర్వ మానవ సమానత్వం, మానవతావాదం, సహపంక్తి భోజనం ఈ ఇంటిలో సర్వ సాధారణం. సంగీత కచేరీలు, కవి పండిత గోష్ఠులు నిత్యకృత్యాలు.

**తృతీయ పుత్రుడు :** శ్రీ హరిప్రసాద్. చిన్నంవారి అల్లుడు. హోమియో డాక్టరు. 5గురు కుమార్తెలు, ఒక కుమారుడు.

**తృతీయ పుత్రిక :** శ్రీమతి సావిత్రి. నూకలవారి కోడలు. ఒక కుమార్తె.

**చతుర్థ పుత్రిక:** శ్రీమతి సత్యవతి. కొంకిమళ్ళవారి కోడలు. నలుగురు కుమార్తెలు, నలుగురు కుమారులు.

**పంచమ పుత్రిక :** శ్రీమతి శారదాంబ. పొట్టివారి కోడలు. ఇద్దరు కుమారులు.

**చతుర్థ పుత్రుడు :** శ్రీహృషీకేశ గుప్త. మోటమర్తివారి అల్లుడు. ఇద్దరు కుమార్తెలు, ఆరుగురు కుమారులు. కొంతకాలం ప్రభుత్వ ఉద్యోగం చేసి, తరువాత వ్యాపారం, వ్యవసాయం చేశారు. వీరి గృహం ఇప్పటికీ చిన్న న్యాయశాలయే.

**షష్ఠమ పుత్రిక :** శ్రీమతి కళ్యాణి. దొరడ్లవారి కోడలు. ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

తరువాత తండ్రిగారి సంస్కరణలు పూర్తిస్థాయిలో అమలు పరచ లేకపోయినా, కాలానుగుణంగా వారిని అనుసరిస్తూనే ఉన్నారు శ్రీవెంకటేశ్వర్లుగారి సంతానం.

కయ్యానికైనా, వెయ్యానికైనా సమఉజ్జీ ఉండాలన్న నానుడికి ఊటుకూరి నాళం వార్ల కలయిక ఒక ఉదాహరణ. పూవుకి తావి అబ్బినట్లు ఈ సంబంధం అటు 7 తరాలు, ఇటు 7 తరాలు మరువలేనిది. లక్ష్మీ సరస్వతులకు నిలయమైన ఈ హయగ్రీవ లక్ష్మీకాన్తమ్మల కలయికను గుప్తుల స్వర్ణయుగంతో పోల్చవచ్చు.

రంగాజమ్మ, తరువాత కనకాభిషేకం చేయించుకున్న కవయిత్రిగా, అల్లసాని పెద్దన తరువాత గజారోహణ చేసి ఊరేగిన కవయిత్రిగా, సకల కళాకోవిదురాలు, విఖ్యాతురాలైన మా అమ్మగారు, మనందరికీ మార్గదర్శకురాలేనని భావిస్తాను.

# నాళం, ఊటుకూరి వంశాలు
# వారసత్వ ప్రతిభా విశేషాలు

ఊటుకూరి రంజన్ కుమార్
ఊటుకూరి వీణామయి

తాతముత్తాతల, తల్లిదండ్రుల గుణగణాలు, రూపలావణ్యాలు, వారి బిడ్డలకు, మనుమలకు, మునిమనుమలకు సంక్రమిస్తాయనేది ప్రత్యక్షర సత్యం. శాస్త్రీయంగా కూడా నిరూపించబడిన అంశమిది. మంచి, చెడులు రెండూ కూడా తరాతరాల సంతానానికి సంక్రమిస్తాయి. మాయింట్లో మాత్రం పెద్దవాళ్ళ మంచి గుణాలే మాలో కన్పిస్తాయి.

**ప్రప్రథమంగా మా నాయనమ్మ లక్ష్మీకాన్తమ్మ :**

నాయనమ్మ రంగు, రూపమూ అన్నీ మా ముత్తాత నాళం కృష్ణారావుగారి పోలికలే. వారిని మేం చూడలేదుగాని వారి ఫోటోలున్నాయి కదండీ అందుకనీ తెలిసింది. ముత్తవ్వ శ్రీమతి సుశీలమ్మ, ముత్తాత కృష్ణారావు దంపతులిద్దరి గుణగణాలు కలబోసి నట్లుంటాయట నాయనమ్మలో. ముత్తవ్వగారి సంగీత జ్ఞానం, పాకరచనా ప్రావీణ్యం, మేధాశక్తి, హస్తకళా నైపుణ్యం, కార్యదీక్ష, కార్యసాధనా నైపుణ్యం, మొక్కవోని ధైర్యం, దేనినైనా సాధించాలనే పట్టుదల, ఆధ్యాత్మిక చింతన మొదలైన గుణాలన్నీ నాయనమ్మకు అలవడ్డాయి. ముత్తాతగారి కవిత్వ హృదయం, ధీకుశలత, సంఘసంస్కారాదులు ముత్తాగారినుండి సంక్రమించాయి.

మా తాతగారు హయగ్రీవ గుప్తగారి వారసత్వ లక్షణాలు, రూపం అన్నీ మా ముత్తాతగారు వేంకటేశ్వర్లుగారివే. ఆయన నిగూఢమైన కవి కూడా. భార్యనుగూర్చి, మామగారిని గూర్చి ఎన్నో అందమైన పద్యాలు రాశారట. ఆయన చక్కని బోధనా సామార్థ్యంగల ఉపాధ్యాయుడు కూడా. గొప్ప గణితశాస్త్రవేత్త, న్యాయశాస్త్రవేత్త. తన సంతానానికి తానే గురువై పిల్లలను చక్కగా తీర్చిదిద్దుకున్నారు. ఆరోజుల్లో ఆపరగణాలలో ఆయన గొప్ప మేధావి. గొప్ప న్యాయవాది. కోర్టుకి సంబంధించిన విషయరచనలో ఆయనది అందెవేసిన చెయ్యి. బాపట్లలో అందరూ ఆయనను ధర్మరాజు అని పిలిచేవారట. ఆయన చేసిన రహస్య ధన సహాయంవల్ల ఎంతో మంది నిరుపేదలు లాభ పడ్డారట. తమ ఇండ్లలో దీపాలు పెట్టుకున్నారట. ఇక వారి సంతానం తమ తల్లిదండ్రుల గుణగుణాలను, లక్షణాలను ఎలా పుణికి పుచ్చుకున్నారో చూద్దాం :-

## మా పెద్దత్త శ్రీమతి పోలేపల్లి సుహాసిని

ఆమె మా యింట్లో ప్రథమ సంతానం. జన్మదినం 3-10-1937. వయస్సు 60 సంవత్సరాలు. ఎం.ఏ. తెలుగు భాషా సాహిత్యాలు, ప్రథమశ్రేణి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖపట్టణం. సంగీతంలో డిప్లొమా, హిందీ 'విశారద'. భర్త పోలేపల్లి హరనాధ్, బి.యస్సీ.,బిఎడ్. ఆయన ఆంధ్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖలో అసిస్టేంటు డైరక్టరుగా పని చేసి 1992 సం॥లో పదవీ విరమణ చేశారు.

గుణ గణాలు : తాతయ్య నాయనమ్మల వారసత్వ లక్షణాలు ఆమెలో బాగా కాన వచ్చినా నాయనమ్మ లక్షణాలే ఆమెలో ఎక్కువగా కానవస్తాయి.

సాహిత్య వ్యాసంగం : నాయనమ్మలాగానే పెద్దత్తకూడా క్షణాలలో ఆశువుగా పద్యాలు రాస్తుంది. రచన చేస్తుంది. సాహిత్యంలో గల ప్రక్రియలన్నిటినీ ఆమె హస్తగతం చేసుకున్నది. పెద్దత్త ఎందుకో కథలు, నవలల జోలికి వెళ్ళినట్లు కన్పించదు. ఆకాశవాణిలో ఆమె ప్రసంగాలు, కవితలు, పాటలు మొదలైనవి ఎన్నో ప్రసారమయ్యాయి.

**ఇక ఆమె సంతానం :** పెద్దకుమారుడు పోలేపల్లి రాజీవ్ కుమార్. వయస్సు 23 సంవత్సరాలు. ఎలక్ట్రానిక్స్ బాపట్ల ఇంజనీరింగ్ కళాశాలలో చదివాడు. చిన్నప్పుడు చక్కని కవిత్వం చెప్పేవాడు. మా ముత్తాతగారి శత జయంతి సభలోను, నాయనమ్మ కనకాభిషేక సభలోను కవితలు రాసి చదివి శ్రోతలను, ప్రేక్షకులను ఆనందాశ్చర్యాలలో ముంచి వేశాడు. మా నాయనమ్మ అతనికి "బాలకవి" అనే బిరుదునిచ్చి అతనినెంతో మన్నించింది. ప్రోత్సహించింది.

రెండవ కుమారుడు పోలేపల్లి పంకజ్ కుమార్ : వయస్సు 21 సంవత్సరాలు. ప్రస్తుతం బి.కామ్. మూడవ సంవత్సరం చదువుతున్నాడు. అతడు కొన్నాళ్ళు తబలా, మృదంగాలు వాయించడం నేర్చుకుని, మధ్యలో వదలి వేశాడు. నేర్చుకున్నన్నాళ్ళూ చక్కగా వాయించేవాడు. ప్రవృత్తి - గృహాలంకరణ, ఫోటోగ్రఫీ. వ్యవహార దక్షతగల యువకుడు.

**మా నాన్నగారు ఊటుకూరి ప్రతాప చంద్ర**

ద్వితీయ సంతానం. వయస్సు 58 సంవత్సరాలు. జననం 16-1-1939. విద్యార్హతలు: ఎ.యమ్.ఐ.ఇ. ద్వితీయ భాగం చదువుతూ వదలివేశారు. హిందీ విశారద., వృత్తి ఎలక్ట్రికల్ రిపేరింగ్. ప్రవృత్తి సాహిత్య వ్యాసంగం.

**సంతానం :** ఊటుకూరి రంజన్ కుమార్ : నేనేనండీ ఆ రంజన్ కుమార్‌ని. వయస్సు 23 సంవత్సరాలు. జన్మదినం 17-9-1974. విద్యార్హత బి.యస్‌సి.

ఎలక్ట్రానిక్స్. నాయనమ్మ తమ్ముడు కృష్ణ తాతయ్యగారి పోలికలే. అంటే నాళంవారి పోలికలే.

మా పెద్దల చేతి పనితనం అంతా నాకు అబ్బిందని మా వాళ్ళు అంటుంటారు. మా కామేశ్వరరావు తాతయ్య చాలా గొప్ప పేరుగల ఫోటోగ్రాఫర్. బ్రిటీష్ రాయల్ సొసైటీ ఫెలోషిప్ గ్రహీత ఆయనకు బోలెడు అవార్డులు, పేరు ప్రతిష్ఠలు లభించాయి. నేనుకూడా ఆయనలా పేరు తెచ్చుకోవాలని నా కోరికండీ ! కుమార్తె వీణామయిని నేనేనండోయ్: వయస్సు 20 సం. విద్యార్హత ద్వితీయ సంవత్సరం బి.ఏ. ప్రస్తుతం సంగీతం నేర్చుకుంటున్నాను. బాగా చదువుకొని పైకిరావాలని, పెద్దవాళ్ళకు పేరు తేవాలని నాకోరికండీ ! వారి ఆశీస్సులునాకుంటాయి కదండీ !!

మా పెద్ద బాబాయ్ **ఊటుకూరి రాజ రాజ నరేంద్ర**.

వయస్సు 57 సంవత్సరాలు. జన్మదినం **28-1-1940**. విద్యార్హతలు బి.టెక్. ఎలక్ట్రికల్ కమ్యూనికేషన్స్, ప్రధమ శ్రేణి, యమ్.టెక్., పి.హెచ్.డి., యూనివర్సిటీ ఆఫ్ వాటర్లూ, కెనడా. మైక్రోవేవ్స్, హిందీ - విశారద., వృత్తి - ఎలక్ట్రికల్ ఇంజనీర్., ప్రవృత్తి - సంగీత శ్రవణం, పుస్తక పఠనం. భార్య మాలతీ. బి.ఎ., గృహిణి.

ఎమ్.టెక్. పూర్తి కాగానే ఆయన కెనడాలో పి.హెచ్.డి. పూర్తి చేశారు. అక్కడే ఇంజనీర్‌గా ఉద్యోగంలో చేరారు. మధ్యలో కొన్ని సంవత్సరాలు మళ్ళీ మనదేశంలో ఇంజనీర్‌గా ఉద్యోగం చేశారు. కానీ మళ్ళీ కెనడాకే వెళ్ళి అక్కడే స్థిరపడ్డారు. ప్రస్తుతం అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రంలోని డల్లాస్‌లో ఉద్యోగం చేస్తున్నారు.

సంతానం : కుమారుడు - అవనీంద్ర కుమార్ . . . బి.టెక్(కెనడా), వయస్సు -23 సం॥. స్ఫురద్రూపి. రంగు, రూపం . . . ఊటుకూరి వారి పోలికలే. మా బాబాయి నరేంద్రగారి పోలికలే.

అవనీంద్ర కెనడాలోనే ఇంజనీరింగ్ డిగ్రీ పుచ్చుకున్నాడు. గొప్ప మేథావి. తనకుగల సంగీతాభిరుచిని మాబాబాయి తన కుమారునిలో తీర్చుకొని సంతృప్తి చెందాడు. అవనీంద్ర కెనడాలోనే కర్ణాటక శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించాడు. అంతేకాదు. అతను తన శ్రావ్యమైన కంఠంతో సంప్రదాయ బద్ధంగా, స్పష్టంగా, అర్థవంతంగా పాడడం అతని ప్రత్యేకత. గొప్ప చిత్రకళాకారుడుకూడా:

కుమార్తె - సుస్మిత - 19 సం॥లు. బి.యస్సి - ద్వితీయ సంవత్సరం. ప్రవృత్తి - నృత్యం, ఫోటోగ్రఫీ - ఆమెచదువుకుంటూనే భరత నాట్యాభ్యాసం చేస్తున్నది. అరంగేట్రం కూడా ఇచ్చింది. ముందుముందు గొప్ప నాట్యకళాకారిణి కావాలని ఆశిద్దాం.

మా రెండవ బాబాయి, **ఊటుకూరి విజ్ఞానేశ్వర కుమార్** - వయస్సు - 49 సం॥లు. 2-2-1948 జన్మదినం. విద్యార్హత - ఎమ్.ఎస్‌సి - ఫిజిక్స్ - ఆంధ్ర విశ్వవిద్యాలయం. విశాఖ ప్రథమ శ్రేణి - రెండవరాంకు. పి.హెచ్.డి. ఐ.ఐ.టి - కాన్పూరు. లేజర్ బీమ్స్‌లో పి.హెచ్.డి పట్టా పొందిన తొలి వ్యక్తి.

భార్య . . . శ్రీమతి అరుణజ్యోతి. ఎమ్.ఎస్.సి. (జెనెటిక్స్, కెమిస్ట్రీ). . .

సంతానం : సాయిపల్లవి - 18సం॥ 1-1-1979 జన్మదినం. అమెరికాలో బయో మెడికల్ ఇంజనీరింగ్ చదువుతున్నది. అమెరికన్ విద్యార్థులకంటె ఆమె ప్రథమ శ్రేణిలో ఉంటూ తన తల్లిదండ్రులకు తాత ముత్తాతలకు కీర్తి తెచ్చిపెడ్తూ అభివృద్ధి పథంలో సాగుతున్నది. రెండవ సంతానం - జాహ్నవి - 14 సంవత్సరాలు - అమెరికాలోనే తొమ్మిదవ తరగతి చదువుతున్నది.

ఆఖరి సంతానం : **శ్రీమతి మైథిలీ బాలాజీ** 14-10-1957 - జన్మదినం. విద్యార్హత. . . ఎమ్.కామ్. ద్వితీయ శ్రేణి - నాగార్జున విశ్వవిద్యాలయం . . . హిందీ - వి. శారద. వృత్తి . . బ్యాంకు ఉద్యోగం. . . భర్త - శ్రీ బొడ్డు సురేష్‌బాబు ఎమ్.కామ్.

మాచిన్నత్త మైథిలీ బాలాజీ - చాలా చురుకైనది. రంగు, రూపం పోలికలు అన్నీ మా నాయనమ్మవే. మాట, చేత, గాంభీర్యం అన్నీ తల్లి పోలికలే. అందుకే మా బాబాయిలిద్దరూ ఆమెను చి.ల.కాం. (చిన్న లక్ష్మీకాన్తం) అంటుంటారు. అయితే నాయనమ్మంత పొడగరికాదు. భారీ శరీరమూ కాదు. ఆమె చక్కని కార్యకుశలురాలు. ప్రణాళికా బద్ధమైన ఆలోచనా పరురాలు.

సంతానం : వాసవీ మనోజ్ఞ - వయస్సు - పది సంవత్సరాలు. పేరుకుతగ్గ రూపం . 6వ తరగతి.

ఆమె నృత్యం నేర్చుకుంటున్నది. చిత్రకళలో ఆసక్తి గల బాలిక. ఆ కళను అభ్యాసం చేస్తూన్నది. అమ్మమ్మ పేరు నిలపాలని ఆశిద్దాం. కుమారుడు : ప్రశాంత పవన్ కుమార్ - 7 సం॥లు, 4వ తరగతి.

గుప్త దంపతుల సంతానం అందరూ హిందీ పండితులే. సంస్కృత భాషా జ్ఞానం కలవారే. అందరకీ చదరంగం మొదలైన ఆటలలో ప్రవేశమున్నది. అందరికీ తొలిగురువులు మా తాతయ్య నాయనమ్మ గార్లే. అందరూ సంస్కారవంతులే - ఉత్తమాదర్శాలు గలవారే. తమ సంతానాన్ని ఉత్తములుగా తీర్చిదిద్దిన ఘనత ఆ తల్లి దండ్రులదే. తమ సంతానాన్ని పంచరత్నాలుగా చెప్పుకుండే వారట ఆదంపతులు. ఇంకేం కావాలండీ కన్నవారి సంతోషానికి. మేం కూడా వారిపేర్లను నిలిపి వారి కీర్తికి కారకులం కావాలని ఆశిస్తూ! వారి ఆశీర్వచనాలను కోరుకుంటూ ముగిస్తున్నాం.

# "మధురకవి" నాళం కృష్ణారావు

- డా॥ చిట్టిప్రోలు సుబ్బారావు
లెక్చరర్, శ్రీ సుబ్బరాయ అండ్
నారాయణ కళాశాల, నరసరావుపేట.

నాళం వారి స్వస్థలం చారిత్రిక ప్రాశస్త్యాన్ని సంతరించుకున్న రాజమహేంద్రవరం. ఆదికవి నన్నయ్య, ఆధునిక యుగకర్త కందుకూరి, మధురకవి నాళం వారలాయమ్మ నలరించే ముద్దు బిడ్డలు, వారి వాసిని, రాశినీ తొలగిస్తే ఆ పట్టణాన్ని ఊహించలేము. అందువల్ల నా దృష్టిలో వీరు "వరకవిత్రయం".

తరతరాలనుండి శ్లాఘా పాత్రమైన ఆ కుటుంబం చేసిన దానధర్మాలు కోకొల్లలు. కలకత్తా నుండి చెన్న పట్నం వరకున్న ప్రధానక్షేత్రాల్లోను ధార్మికంగా వారు కట్టించిన కట్టడాలున్నాయి. రాజమహేంద్రవరంలోని మాట చెప్పేపనిలేదు. ఇప్పటికీ పదిమంది ఉన్న ఇంటికి నాళంవారి సత్రమనే వాడుక ఉంది.

అటువంటి కుటుంబంలో లక్ష్మీకామరాజుల ముద్దుబిడ్డగా కృష్ణారావు (వెంకట కృష్ణయ్య) జన్మించాడు. గుఱ్ఱపు సార్టు, గూడు బండి ఇత్యాది జమీందారి హూదాలతో ఆ యిల్లు కళకళలాడుతుండెడిది. అటువంటి కుటుంబంలో పుట్టినా నాళం వారికి జమీందారీ వాసనలు పట్టుబడ లేదంటే అతిశయోక్తికాదు. ఏలూరు జమీందారులైన మోతే రామకృష్ణయ్య, రామమ్మగార్ల కుమార్తె వెంకట సుబ్బమ్మను వివాహం చేసికొన్నాడు. వయస్సులో సంవత్సరాలు చిన్నదైన ఆమెకు ధార్మిక చింతన ఎక్కువ. సనాతనాచార నిష్ఠాగరిష్ఠురాలు. అటువంటి ఆమెకు కృష్ణారావుగారు తమ కవితా హృదయంతో పరిచయం కలిగించారు. అంతకుమించి సంస్కారవాదిగా మలిచారు. అందువల్లనే గాంధీ ఉద్యమ ప్రచారంలో విదేశీ వస్త్ర బహిష్కరణమే కాకుండా, విదేశీ వస్త్ర దహనం కూడా ఆమె కావించింది. భర్తకండగా నిలబడకలిగింది. నిరాడంబరంగా ఉండే ఆమె ప్రతిరోజూ రాట్న పరిశ్రమను గావించడమే కాకుండా, అనుదిన వీణా వాదనం కావిస్తుండేది. ఆంధ్రమహిళా గాన సభ మొదలైన కార్యక్రమాలు కావిస్తుండేది. ఆమెలోని సుగుణకోటిని చూచి అతడామెకిడిన సార్థక నామధేయమే సుశీల ! ఆమె చేతుల్లో, కట్టుబాట్లతో పెరిగిన సంతానం అభివృద్ధి పథంలో వామనమూర్తుల్లా తేజరిల్లారు.

**బాల్యదశ :**

ఆవిధంగా ఇంటినీ, ఇల్లాలినీ తనకనుగుణంగా మార్చుకొన్న కృష్ణరాయుని చిన్ననాటి



ఆంధ్రా యూనివర్సిటీలో గవర్నర్ కుముద్‌బెన్ జోషి గారి
నుంచి కళాప్రపూర్ణ గౌరవం అందుకుంటున్న సందర్భంలో

జీవితం సాఫీగా సాగిపోలేదనే చెప్పాలి. కృష్ణారావు దుందుడుకుగా ప్రవర్తించేవాడు. దానికి తోడు బడిమానివేసేవాడు. అయితే ఈ కాలపు ఆకతాయి వాళ్ళల్లా ప్రవర్తించేవాడుకాదు. గోదావరిలో శవాలు తీయటం, అస్పత్రిలో రోగులకు సేవ చేయటం వంటి కార్యక్రమాల్లో నిమగ్నమయ్యేవాడు. అతనికి తోడు ఇరవై, ముప్పై మంది మిత్రులుండేవాళ్ళు. గోదావరి తీరంలోనో, మరో ప్రాంతంలోనో ఆడుకునే అతగాడిని పట్టుకోవాలంటే "టైం" మార్చి "టైం" తో పోయేవాడు. తనకోసం పంతుళ్ళ నుండి తప్పించుకోవటానికి మిత్రులనే అంచెలంచెలుగా వుంచేవాడు. యుద్ధరంగంలో ప్రధానాధికారి తెలుసుకొన్నట్లుగా వార్తలు నిముషంలోనే తెలుసుకొనేవాడు.

ఈవిధంగా తొలినాళ్ళనుండే సేవాభావంతో ప్రవర్తించే వెంకట కృష్ణయ్య నొకసారి వాళ్ళ పెద్దలు రమ్మన్నారు. చెట్టెక్కి కూర్చున్న కృష్ణారావెంతకూ దిగిరాలేదు. పది, యిరవై, ముప్పై అలారెండు వందల రూపాయలిస్తామన్నారు. అప్పుడు దిగివచ్చాడు. ఆ డబ్బులు ఆపదలో వున్నఒక స్నేహితుడికిచ్చి, అతని ఇల్లు నిలబెట్టాడు. తన దగ్గర లేకుంటే పెద్దల నడిగి అప్పుచేసి మరీ దానధర్మాలు చేసేవాడు. ఇటువంటి వాళ్ళాంధ్రదేశంలో వ్రేళ్ళ మీద లెక్క పెట్టదగినంత మంది కూడా లేరేమో ! మామిడి దేవేంద్రుడనే వ్యక్తి పై చదువులకు ఇంగ్లాండు వెళ్ళాలి. 150 రూపాయలు కావాలి. ఆస్తిపాస్తులున్నప్పటికి అతనికి డబ్బులివ్వడానికి చిక్కులేర్పడ్డాయి. అప్పుడు గురువుగారైన వీరేశలింగం పంతులుగారి వద్ద ప్రోనోటు రాసి అతణ్ణి ఇంగ్లండుకు పంపించాడు. (పంతులుగారి స్వీయ చరిత్రం పుట 324) దానధర్మాలు గోప్యంగా ఉంచే కృష్ణరాయుడు కావించిన ఇలాంటి దానధర్మాలెన్ని ఉంటాయో!

మూడవ అన్నయ్య పద్మనాభం (గోదావరి జిల్లాలో మొట్టమొదటి బి.ఏ. గ్రాడ్యుయేటు) ప్రభృతుల వల్ల బడికిపోయిన అతగాడికి ప్రతిపరీక్షలో ఫస్టు మార్కులు తెచ్చుకోటం అదంరికీ ఆశ్చర్యం కలిగించింది. అంతేకాకుండా తొమ్మిదవ తరగతిలో ప్రశ్నా పత్రానికి జవాబులన్ని పద్యాల్లోనే రాసి తన ప్రతిభను నిరూపించుకొన్నాడు.

ఎప్పుడూ మితిమించిన దాన ధర్మాలు చేసే కృష్ణారావు వైఖరి కుటుంబంలో వాళ్ళకు నచ్చలేదు. అతడు చేసే కార్యక్రమాల వల్ల రోజు రోజుకూ డబ్బు హరించుకుపోతూంది. చెన్న పట్నంలో ఉండే వకీలును సంప్రదించారు. కృష్ణారావుకు వాటాయివ్వకుండా ఉండే మార్గం ఏదైనా ఉందా ? అని ఎన్ని తప్పులు చేసినా, చివరకు కులం నుండి వెలివేయబడ్డా ఆస్తి హక్కు మాత్రముంటుందని లాయరు చెప్పాడు. చేసేదేమీ లేక తిరిగివచ్చారు. ఆవిధంగా ఆ రోజులోనే తనకు వచ్చిన లక్షలాది ఆస్తిని సమాజ సంస్కరణకు, సాహిత్య పోషణకు, గ్రంథాలయ నిర్వహణకు వెచ్చించాడు.

ఆంధ్రదేశంలో తొలినాళ్ళకు చెందిన బ్రహ్మ మతావలంబకుల్లో నాళం వారొకరు.

"అపర విద్యాసాగరులైన శ్రీ వీరేశలింగం గారికి గుండెకాయ" అని, "బ్రహ్మ సమాజంలో స్వానుష్ఠాన సంపన్నులు లేనికాలాన వీరేశలింగం, బాపయ్య గార్ల కన్న ముందుగా యజ్ఞోపవీతాన్ని విసర్జించి బహిష్కారాన్నందిన నెఱజోదు" అని ఆంధ్రప్రవక్త ఉపన్యాసకేసరి బాల దారి వీరనారాయణదేవు గారు వీరిని అభివర్ణించారు. 1904 ప్రాంతంలో ప్రార్థనా సమాజంలో ఉన్నతాసనాన్నధిష్ఠించి, వారు కావించిన తొలి పూజ హృదయ తంత్రులను మీటినట్లు తను పేర్కొన్నాడు. సంగీత ప్రియులైన నాళం వారి సమాజ ప్రార్థనలకీ విధంగా తలలూపిన వారెందరో ఉన్నారు. ప్రార్థనా మందిర స్థాపన.

1906వ సంవత్సరంలో ఏలూరులో కావించిన ప్రార్థనా మందిర స్థాపన వీరి కృషిలో ప్రత్యేకంగా చెప్పుకోదగిన విషయం. అందువల్ల బ్రహ్మధర్మాలకు, సంఘ సంస్కరణ భావాల కెందరో అంకితం కాగలిగారు. అటువంటి వారిలో మాజేటి సుబ్బయ్య, వెల్లంకి కృష్ణమూర్తి, చుండూరి శ్రీరాములు, దుగ్గిరాల శివరామమూర్తి, దుగ్గిరాల దేవలరాజు, డాక్టరు గోవిందరాజులు, శంకర వెంకట్రామయ్య, మాజేటి సుబ్బారావు ప్రభృతులు ప్రత్యేకించి చెప్పుకోదగ్గవారు. అతడు కావించిన సేవా కార్యక్రమాల వల్ల కులం నుండి వెలివేయబడ్డాడు. అత్తమామలు కూడా తమ యింట అన్నం పెట్టటానికి నిరాకరించారు. సిద్ధాంతాలకు లొంగని కృష్ణరాయుడు తనను అర్థం చేసుకోగలిగి, ఆదరంతో పిలిచిన మాజేటి సుబ్బారావు గారింట మాత్రమే పరమానందంగా భుజించాడు.

తమ సమాజ కార్యక్రమాల్లో పంచములు పాల్గొనకూడదని వేరే సమావేశం పెట్టుకోవాలని పేర్కొన్న బ్రహ్మ సమాజం వారిని తీవ్రంగా దుయ్యబట్టాడు. అలా పెట్టటం సమాజసూత్రాలకు విరుద్ధమని బల్ల గుద్ది చెప్పాడు, నెగ్గుకువచ్చాడు. కాకినాడ ఆంధ్రరాష్ట్ర ఆస్తిక మహాసభల్లో భోజనాల సమయంలో పంచములు తమ ప్రక్కన కూర్చుండటం ఒక వర్గానికి అభ్యంతరంగా కనిపించింది. వెల్లంకి కృష్ణమూర్తి వంటి మిత్రులతో కలిసి వాళ్ళతో పోరాడి విజయం సాధించాడు. పంచముల్లో ఒకరైన చింతాశేషయ్య గారిని స్వయంగా రాజమండ్రికి తీసుకువెళ్ళి మూడు సంవత్సరాలు ఆయన్ని తన సోదరుడిగా ఆదరించాడు. బ్రహ్మ చర్య ప్రచారకుడిగా తీర్చిదిద్దాడు.

రాజమండ్రి, ఏలూరు, మండపేట, కాకినాడ వంటి ప్రాంతాల్లో తమ సేవా కార్యక్రమాల వల్ల, రచనా వ్యాసంగం వల్ల కొద్ది కాలంలోపేరు ప్రతిష్ఠలు తెచ్చుకోగలిగాడు. విద్య, వినయం, సంపదవంటి అన్ని హంగులూ ఉండి, అవకాశాలున్నప్పటికి పదవులతో కూడిన రాజకీయాలకు దూరంగా ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో తన శక్తికొద్దీ పాల్గొన్నారు. బిపిన్ చంద్రపాల్ రాజమండ్రికి వచ్చిన సంవత్సరంలో నాళం

వారుత్తేజితులయ్యారు. అంతేగాక పురమందిరంలో వీరేశలింగం గారి పేరుతో ఉన్న పఠన మందిరంలో ఖుదీరాంబోసు చిత్ర పటాన్ని ఉంచి తమ దేశభక్తిని ప్రజల్లో రేకెత్తించారు. గురువైన వీరేశలింగంగారు కేవలం సమాజ సంస్కరణల్లో మాత్రమే పాల్గొన్న ఆ సమయంలోనే నాళం వారు స్వాతంత్ర్యోద్యమ రంగంలోనూ ప్రవేశించారు. అటు తరువాత వచ్చిన గాంధేయ ఉద్యమాల్లో తానూ, తన ధర్మపత్ని యిద్దరు పాల్గొన్నారు. వంగదేశ మందు గల సుప్రసిద్ధ బ్రహ్మ సామాజికులతో పరిచయం గల కృష్ణరాయుని ప్రోత్సాహం టంగుటూరి ప్రకాశం పంతులు గారు కూడా పొందారని కళాప్రపూర్ణ లక్ష్మీకాన్తమ్మగారి కథనం.

ప్రప్రథమ గ్రంథాలయోద్యమ కార్యకర్తల్లో కృష్ణారావు గారొకరు. అయ్యంకి వెంకట రమణయ్య, వంటి ప్రముఖుల ప్రవేశానికి ముందే నాళంవారీ రంగంలోకి ప్రవేశించి కృషిచేశారు. వారు స్థాపించిన రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం ఆంధ్రదేశంలో అత్యంత ప్రాముఖ్యాన్ని సంతరించుకోగలిగింది. గో సంరక్షణ సంఘాధినేతగా, హితకారిణీ సమాజ ఉపాధ్యక్షుడుగా, అన్నదాన సమాజాధ్యక్షుడుగా, నాట్యగాన కళా సమితుల్లో ప్రధాన పోషకులుగా నాళంవారు కావించిన సేవలు ప్రశంసాపాత్రం. అంతకంటె ఎక్కువగా తన సేవలు గ్రంథాలయానికి ఆజన్మాంతం కావించారు. **1940** నాటికే నలభైవేల అచ్చు పుస్తకాలు. ప్రాచీన రాత ప్రతులు, తాళపత్ర సంపుటాలు, తామ్రశాసనాలతో నిండియున్న ఆ గ్రంథాలయం ప్రాధాన్యం కృష్ణారావుగారి కళ్లల్లో స్పష్టంగా గోచరించింది. మనస్సులో చక్కగా మెదిలింది. గ్రంథాలయోద్యమాని కనుగుణంగా "మానవసేవ" అనే తొలి సచిత్ర మాసపత్రికను తన సంపాదకత్వంలో ప్రవేశపెట్టారు. సత్యజీవనానురక్తి, ఏకేశ్వరోపాసనాసక్తి గల నాళం వారితో పాటు సుప్రసిద్ధ వాఙ్మయ పరిశోధకులు నిడదవోలు వెంకటరావుగారా పత్రికకు **1911** సం॥ ప్రాంతంలో కార్యనిర్వాహకుడిగా పనిచేశారు.

కళలకు, కవిత్వానికి, పరిశ్రమలకు, సంఘ సంస్కరణానికి, ఏకేశ్వరోపాసనకు ఆ పత్రికలో ప్రధాన స్థానముండేది.

"ధర్మగ్లాని" ఏర్పడిందంటే గురువుతో నైనా గ్రుద్దులాటకు జంకడు, గొంకడు, పైపెచ్చు రచ్చకీడ్చించి పగసాధించే ఉగ్రమూర్తి. ప్రజాస్వామ్య గౌరవాలకు కుహనా ప్రతిష్ఠలకు ప్రాకులాట మాని, తనదే తప్పని రూఢి పడితే వెనుకాముందూ చూడకుండా అనుతాపాన్ని ప్రకటించే "ఋజువర్తను" డిగా బాలదారి వీరనారాయణదేవుగారు కృష్ణారావు గారిని వర్ణించారు. అక్షరాలా అంతే జరిగింది. గురుశిష్యులిద్దరు స్త్రీ సంబంధమైన అపవాదానికి గురికాబడ్డారు. నిష్కళంక చరిత్ర అంటూ బయట పడగలిగారు. అయితే, తత్ఫలితంగా వీరేశలింగంగారి స్వీయ చరిత్రలో గాని, తదితర రచనల్లో గాని, చిలకమర్తి వంటి తదనుయాయుల రచనల్లో కాని నాళం వారు తమ

స్థానాన్ని సముచితంగా కాదు, ఘోరంగా కోల్పోయారు. సత్యానికి, సాహిత్యానికి పట్టిన దుర్వ్యవస్థల్లో యిది యొకటి. ఖుదీరాంబోస్, మామిడి మహేంద్రుడు వంటి వారి సంఘటనలున్నాయి కదా అని ప్రశ్నిస్తే అవి నాళం వారిని దెబ్బతీసే సంఘటనలుగా మాత్రమే కందుకూరి వారు అభివర్ణించారు.

**మధుర కవితలు :**

గోరుముద్దలు, మిాగడ తరకలు, వెన్నబుడగలు, పాలతరగలు, తేనె చినుకులు, విరిదండ, వెన్నెల వెలుగులు, పాపాయి, ముద్దు, గ్రంథాలయ సూక్తులు వంటి మధురకవితల ద్వారా బాల సాహిత్య ప్రవక్తగా, బాలుర కవిగా రూపొందారు. పురాణాల్లో గరళ కంఠుడిలా, ఈ ప్రయత్నంలో తన పాండిత్యాన్ని కంఠం దాటి రానివ్వలేదు.

అందువల్లనే -

"అందములు చిందు తీరు తీయములు గల్గి
ముద్దు గులికెడు నుడికారములను గల్గి
లలిత జాతీయములు గల్గి యలరుచుండు
తేట తేనియ మూట మా తెనుగుమాట"

అని తను పలికాడు. ఆ విధంగానే వ్రాసి గెలిచాడు.

శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, మున్నంగి శర్మ, కొమరువోలు వెంకటసుబ్బారావు, బాలాదారి వీర నారాయణదేవు, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు ప్రభృతులు కృష్ణరాయాభ్యుదయ సంచికలో నాళం వారి కవిత్వాన్ని లెస్సగా వివిధ కోణాల నుండి తిలకించారు. మెత్తదనం, సౌకుమార్యం స్వభావోక్తి తమ రచనల్లో కన్పిస్తుంది. నాగార్జున విశ్వవిద్యాలయ ఆంధ్ర భాషోపన్యాసకులు డా॥ ఆకురాతి పున్నారావు గారు "కృష్ణారావు గారు మధురకవి మాత్రమే కాక, మహాకవి కూడా" అని వీరిని కీర్తించారు. కాళిదాసు వలె ఆర్ద్ర హృదయుడైన నాళం వారు కాళిదాసు కంటె తక్కువ శృంగారాన్ని ఎక్కువ లాలిత్యాన్ని తమ రచనల్లో ప్రతి ఫలింపజేశారు. ఇరువురు కవులూ రాసిన ఇందుమతీ వృత్తాంతాన్నే ఈ సందర్భంలో పేర్కొన్నారు. తిరుపతి కవుల తరువాత సారధ్యాన్ని తెలుగుదేశంలో అటు దువ్వూరివారు, ఇటు నాళం వారు మాత్రమే కొని తెచ్చారని ప్రముఖ రచయిత చిటిప్రోలు కృష్ణమూర్తి గారీ సందర్భంలో పేర్కొన్నారు. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాసం దాని కుపబలకంగా పేర్కొనవచ్చు.

"మంచి గంధము, వెన్నెల, మంచుకంటె
శీతలకరంబు నందనా శ్లేష సుఖము,
ఉడుకు నూనియు, కార్చిచ్చు, పిడుగుకంటె

ఉగ్రతాపంబు పుత్ర వియోగభరము'' అనే

క్తులు ఎన్నో ఆశలు పెట్టుకొన్న పుత్రుడు మరణించినప్పుడు కృష్ణారావు గారు ౦న రాతలు. పుత్ర వియోగభారాన్ని భావాన్నియింత హృద్యంగా ఎందరు రాస్తారో ుమానాస్పదమే !

"శ్రుతుల సమ్మేళనము చేసి సొంపు మీఱ
రాగమాల పింపగ వీణ బ్రద్దలయ్యె'' నని

ెందరు మరణాన్ని పోల్చగలరు. ఈతీరైన వర్ణన నాళం వారికి మాత్రమే ల్లెతుంది.

ధుర కవితలతో పాటు శ్రీ కృష్ణ రాయాంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వము, తీయములు, లోకోక్తులు, సంస్కృత న్యాయాలను గూర్చి రాసిన పరిశోధనా ంథాలు, గాంధీ మహాత్ముని దశావతార లీలలు, వితంతు వివాహ చరిత్ర, స్త్రీలయెడ ుషులు కావించు పంచ మహాపాతకములు వంటి సాంఘికోద్ధరణ సంబంధమైన ంథాలు వీరి లేఖిని నుండి వెలువడ్డాయి. భాషా విషయకంగా భావ విషయకంగా ుయిరు తెగల గ్రంథాలు పరిశీలించవలసి యుంటుంది. వీరి మధురకవితలు ఠశాలల్లో పఠనీయ గ్రంథాలుగా పెడితే ప్రభుత్వం తప్పక సత్ఫలితాలు సాధిస్తుంది.

ః అభినవ కృష్ణరాయని కొలువులో - కళా ఖండాలు తీంద్రించే తొలిజాము వేళ, ంకర రంగయసూరి, సూరాబత్తుల సూర్యనారాయణ సుధి, అత్తిలి సూర్యనారాయణ న్నిషి, సత్యవోలు అప్పారాయ పండితుడు, చాగంటి వీరభద్రకవి, చెళ్ళపిళ్ళ పిన ంకటశాస్త్రి, నిడుకుర్తి భీమరాజు, టేకుమళ్ళ రమణ రాట్కవు లష్టదిగ్గజాలుగా ఠరిల్లారు. వీరు మాత్రమే కాక వడ్డాది సుబ్బరాయకవి, రాయప్రోలు సుబ్బారావు ంటి పలువురు కవులాయింట చర్చలు జరిపేవారు. పై కవులతో పాటు జాషువా, ుల, బొడ్డు బాపిరాజు వంటి ఉత్తమ కవులచే ప్రస్తుతింప బడ్డ మధురకవి నిజంగా వ్యజీవి. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు తమ భారతిలో కృష్ణారావు గారి చనలకు ప్రథమస్థానం కల్పించేవారు.

యప్రోలు వారి సమక్షంలో మధురకవి బిరుదాన్ని పొందిన వీరి కవితా స్రవంతిని వేణీ సంగమంలోని సరస్వతీ వాహినితో ఉపమిస్తాను. భావకవిత్వం, అభ్యుదయ ుత్వ వాహినులనదగిన గంగా యమునల సారాన్ని గ్రోలినట్లే, అంతగా విశేష ాచుర్యాన్ని పొందకపోయినా, విశిష్ట స్థానాన్ని కలిగియుండే సరస్వతీ పయస్సుల ిలిన అమృత మూర్తుల అంశలు సాహిత్య ప్రపంచంలో రేఖా మాత్రంగా చరిస్తాయి. నాళం వారి జీవిత కథనం వల్ల మరికొన్ని సాంఘిక సత్యాలు, సాహిత్య ధనం వల్ల మరికొన్ని నవీన నవనీత మార్గాలు ద్యోతక మౌతాయి.



కేంద్రమంత్రి శ్రీ అర్జున్ సింగ్ నుంచి సత్కారాన్ని అందుకుంటున్న
డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ ప్రక్కనే ఉంది ఆం.ప్ర. ముఖ్యమంత్రి శ్రీ. టి. అంజయ్య



ఆం. ప్ర. సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వం ఆం .ప్ర. ముఖ్యమంత్రి
శ్రీ జె. వెంగళరావుగారి నుంచి అందుకుంటున్న డా॥ లక్ష్మీకాన్తమ్మ

# భాగం - 2



డా॥ లక్ష్మీకాన్తమ్మగారి

- ప్రతిభా, వ్యుత్పత్తులు
- పాండితీ ప్రకర్షలు
- కవితా సౌరభాలు
- స్త్రీత్వ సౌందర్యాల తీరూ
- కృష్ణరాయ విజ్ఞాన పీఠం

# కైమోడ్పు

- ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

తెలుగు పల్కుల తల్లి తలమానికమ్ము
శ్రీ ఊటుకూరి లక్ష్మీకాన్తమ కిదె
సమకూర్తు మందార సంస్కృతి సరము
భక్తి వాసనలు గుబాళింప దిశలు ॥

నన్ను సోదరుకన్న మిన్న మన్నించి
తెలుగు సాహితి తీరుతెన్నులు చూపి
ఆంధ్రభాషా రహస్యాలు బోధించి
ప్రథిత సాహిత్య సంపద సమకూర్చు
పథము చూపిన సరస్వతికి జోహారు ॥

సాధ్వి సుశీల - కృష్ణారావు దుహిత
మధుర కవికి మనోరథమైన పుత్రి;
శ్రీపాద కృష్ణమూర్తికి ముద్దుబిడ్డ
చెళపిళ్ల గురుని యాశీర్వాద పాత్ర
అభినవ నన్నయ్యకభిమాన తనయ
బాపిరాజు కవి సంభావించు కుశల
మాధవ రామశర్మకు తగ్గ చెల్లి
గోపాలరెడ్డి దృగ్గోచ రాదర్శ
పావనుండీ హయగ్రీవు నర్ధాంగి
సత్పుత్ర పుత్రికా సంతాన భాగ్య.
సంతతోన్నత లక్ష్య సాధన శీల
బంధు మిత్రులయందు బద్ధానురాగ ॥

ఉభయ భాషా ప్రవీణోన్నత విద్య
ప్రప్రథమ సుస్నాత, బంగారు పతక;
ఆత తాధీతి బోధాచరణ చణ
ప్రతిభా సముజ్జ్వల పాండితీ మూర్తి
శివ సత్యసుందర నవనవోన్మేష ॥

సకలాంధ్ర స్త్రీజన సముచితారాధ్య
వివిధ విప్లవభావ విజ్ఞాన వీణ
సంగీత సాహిత్య సరసాంతరంగ
వాగ్గేయ కారాగ్ర వరమనో ధర్మ
బహుకావ్య సవిమర్శ ప్రజ్ఞా ధురీణ
భరతాంధ్ర కవయిత్రి చరిత సర్వజ్ఞ ॥

స్త్రీ జనోద్ధరణైక దీక్షాతిదక్ష
గృహలక్ష్మి కంకణాంకిత దివ్య హస్త
జలధి గంభీర నిస్వన మహావాగ్మి
పదవులు వరియింప పాలించు జాణ
సాధు రుక్మిణి, ప్రౌఢ, సత్యభామీమె ॥

'ఆంధ్ర ఝాన్సీలక్ష్మి' యననొప్పు ధైర్య
నా తెన్గు మాంచాల నవ్యేతిహాస
వినుతికెక్కనుదాత్త 'విదుషీమణి' యని
'ఆంధ్ర సరస్వతి' సార్థక బిరుద
గౌరవ డాక్టరేట్ గైకొన్న ధిషణ
ఖండ ఖండాంతర గమన మరాళ
దేశ భక్త్యావేశ దేదీప్యమాన
'సాహితీ రుద్రమ్మ' సారాత్మ చరిత
మహిళా జగత్తుకే మకుటాయమాన
బహుముఖ సత్కార ప్రాభవోపేత

కనకాభిషేక సత్కారైక మహిళ
పురుషులతో స్పర్థ పూను మనీషి
స్త్రీవాద సాహితీ సృష్టి శ్రీకార
ఉపనిషత్కాల సముజ్జ్వల గార్గి
సరస సారస్వత సామ్రాజ్య లక్ష్మి
మొల్ల పాత్రాభినయోల్లాస హృదయ
శత్రులపైని ద్వేషములేని సాధ్వి.
నిత్య చైతన్యాత్మ; నిర్నిద్రకాంతి
వ్యక్తియే కాక యుద్యమమన్న సబబు.

నిరత మంత్రధ్యాన పరమాత్మ చిత్త
ఆర్ష విజ్ఞాన ప్రహర్షైక బుద్ధి
గీతోపనిషదర్థ చేతోవికాస
గుప్తాత్మ నిత్య సంతృప్త జీవాత్మ;
మహిళామ తల్లుల మహిత మార్గమ్ము,
గోరంత యుపకృతి కొండంత నెఱపు
కొండంత యుపకృతి గోరంత తలచు
పురుషోత్తముని మీద పూర్ణ విశ్వాస
సంప్రదాయముపై యచంచల నిష్ఠ
గోదావరీ కృష్ణకున్ కూడ లీమె.

ఆఱు కోట్లాంధ్రుల కగ్రజారాధ్య
లక్ష్మీకాన్తమ్మ కుల్లాస జీవనకు
ఈ సంస్మృతి సంచిక హృదయంగమమ్ము
శీతాంశువున కొక్క శీకరార్పణము.

- అభినవ నన్నయ, ఆచార్య రాయప్రోలు సుబ్బారావు

# సాహిత్య దృక్పథాల్లో మార్పులు సహజం

## డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ గారితో ఇంటర్వ్యూ - మల్లాది పద్మావతి

**ప్ర.** జమ్మలమడక మాధవ రాయశర్మగారూ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి తర్వాత ఉపన్యాసా లివ్వడంలో మీరే దిట్ట అని అంటారు. కాని రచనలు అందించడంలో కొంత కాలం పట్టినట్లున్నది దానికి కారణమేమిటంటారు ?

**జ.** అప్పట్లో ఉపన్యాసాలమీదే ఉత్సాహం ఉండేది. రచనలంటే నాకు సహజమైన బద్ధకం, చాలా రోజుల వరకు కలం పట్టలేదు. మదరాసు ప్రభుత్వ పక్షాన తెలుగు భాషా సమితి వారు 'ఆంధ్ర కవయిత్రులు' పోటీ 1951 - 52లో పెట్టారు. అది తెలుసుకొని మావారు హయగ్రీవగుప్తగారు నన్ను రాయమని ప్రోత్సహించారు. ప్రొఫెసరు బొడ్డుపల్లి పురుషోత్తంతో కూడా చెప్పించారు. నేను చివరికెలాగో ఒప్పుకొని రాయడానికి పూనుకున్నాను. రాష్ట్రమంతటా తిరిగేను. కవయిత్రులెక్కడెక్కడ ఉన్నారో తెలుసుకొనే ఏర్పాట్లు చేసేను. రాజమండ్రిలో గల గౌతమి గ్రంథాలయం, ఓరియంటల్ గ్రంథాలయాలు, వేటపాలెంలోని సారస్వత నికేతనం, తంజావూరులోని సరస్వతీ గ్రంథాలయం మొదలగు గ్రంథాలయాలన్నీ తిరిగి, ఆరు నెలలు అధిక శ్రమకోర్చి నోట్సులను తయారు చేశాను. బొడ్డుపల్లి పురుషోత్తం సహాయంతో వొక పుస్తక రూపానికి తెచ్చేను. దానికి బహుమతి రావడంతో నాకు ఉత్సాహం పెరిగింది. నా కలం వేగం పుంజుకుంది. ఆల్ ఇండియా రేడియోలో నేనిచ్చిన ప్రసంగాలు భక్తి గీతాలు, భారతదేశ చరిత్ర, కొన్ని గుణపాఠాలు అను హుమయూన్ కబీర్ ఆంగ్ల గ్రంథానికి తెలుగు అనువాదం రాశాను. గేయ కావ్యాలు నా తెలుగు మాంచాల మొదలగునవి రాశాను. విజ్ఞాన సర్వస్వం అనే శీర్షికతో వ్యాస సంపుటిని రాశాను. తెలుగు భాషా సమితి దీన్ని ముద్రించారు. ఇలా చెప్పుకుపోతే చాలా వున్నాయి. సరస్వతీ సామ్రాజ్య వైభవం ఆల్ ఇండియా రేడియోలో ప్రసారమయింది.

ఈ స్ఫూర్తితో అఖిల భారత కవయిత్రుల చరిత్రను, వ్రాసేను. విషయ సేకరణ కోసం కర్నాటక, మదరాసు, ఒరిస్సా మొదలగు రాష్ట్రాలకు వెళ్ళి నోట్సులను తయారు చేసుకోగలిగాను. ఎంతగానో కృషి చేసి అఖిలభారత రచయిత్రుల సమావేశాలను ఏర్పాటు చేయగలిగేను. ఆ సభను విజయలక్ష్మీ పండిట్ ప్రారంభించారు. లీలావతి మున్షీ అధ్యక్షత వహించారు.

**ప్ర.** మీరు సంస్కృతంలో కూడా రచనలు చేశారా ?

**జ.** అవును, కన్యకాపరమేశ్వరి సుప్రభాతాన్ని రచించడమే గాక, మా అమ్మాయి సుహాసిని నేను పాడి గ్రామ ఫోను రికార్డు కూడా చేసాము. అదిగాక దేవి సతితారావళి, జాపిత రాసాను.

**ప్ర.** మీరు అనేకసార్లు విదేశాలకు కూడా వెళ్లారు గదా, అక్కడ మీరు సాహిత్య పరంగా చేసిన కార్యక్రమాలను వివరించండి.

జ. చాలాసార్లని అనలేను గాని, మూడుసార్లు వెళ్ళాను. ప్రభుత్వం సాంస్కృతిక వినిమయ పర్యటన శాఖ వారి నుండి భారత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా విదేశ పర్యటనకు ఎంపిక చేసిన వారిలో నా పేరుండడము నాకాశ్చర్యమేసింది. ఇంగ్లీషు భాషా పరిచయం అంతగా లేని నన్ను ఎంపిక చేసినందుకు ఆశ్చర్యపోయాను. రష్యా, జర్మనీ, జకోస్లవేకియా, కెనడా, అమెరికా, స్పెయిన్, మలేషియా మొదలగు చాల యూనివర్సిటీలకు వెళ్లాను. ఉపన్యాసాలిచ్చాను. బెర్లిన్ యూనివర్సిటీ నుండి రిటైరయిన, ఓరియంటల్ డిపార్టుమెంటు ప్రొఫెసర్ రూబెన్ మహాశయుణ్ణి కలిశాను. ఆయన మహా పండితుడు కాళిదాసు రచనలకు వ్యాఖ్యానాలు రాసారు. శకుంతల పాత్రను గురించి చక్కగా వివరించాడు. తరువాత హోబర్ పండితుణ్ణి కలిశాను. ఆయన వేద నాగరికత చరిత్రమీద పరిశోధనలు చేశారు. 15వేల సంవత్సరాల పూర్వపు నాటికి భారతదేశంలో వేద నాగరికత వెలసి యున్నట్లు ఆధారాలున్నాయని తెలిపాను.

రష్యా వెళ్ళినప్పుడు విల్నూస్‌లోని ఓరియంటల్ డిపార్టుమెంటులో డైరెక్టరైన ఎడ్వర్ దాస్ అనే పండితుడు, నేను సంస్కృత కవయిత్రినని తెలుసుకొని బెల్ట్ ఆఫ్ పోయెట్స్‌ను నాకు బహూకరించాడు. జకోస్లవేకియాలో మాకాతిథ్యమిచ్చిన మిస్ మరియమ్ నల్లావికా అనే రష్యన్ రచయితల సంఘాధిపతికి నేను ఇంగ్లీషులో వ్యాఖ్యానాలున్న భగవద్గీతను నేను ఆమెకిస్తుంటే ఆమె తన కాలి చెప్పులను విప్పి అతి వినయంగా ఆ పుస్తకం మీద తనకున్న భక్తి ప్రపత్తులను చాటుతూ తీసుకున్నది. అది చూసి నేను ఆశ్చర్యపోయాను. "మీ కమ్యూనిస్టు దేశాలలో భగవద్గీతపై ఇంతటి గౌరవం చూపుతారా" అని అడిగాను. అందుకామె కర్మపరమైన సందేశాన్ని ప్రపంచమంతటికి ఆదర్శ పూర్వంగా చాటిచెప్పిన ఒకే ఒక మహాగ్రంథం భగవద్గీత, దానికి మా రష్యాలో స్థానం లేదంటారా ? అని ఎదురు ప్రశ్న వేసింది.

అమెరికాలో స్టాట్యూ ఆఫ్ లిబర్టీ దగ్గర, ఆగ్రా రాధాస్వామి అనుయాయులైన రెండు వేలమంది స్పెయిన్ దేశీయులను చూశాను. విధులేనియాలో ఇటలీ చర్చి, ప్రాన్సు చర్చిలుండడం చూసి మీకు ఇన్ని రకాలైన చర్చ్‌లున్నాయా అని ఇంటర్‌ప్రిటర్ విక్టర్‌ని అడిగేను. ఒక్కొక్క దేశానికొక్కొక్క రకంగా వుంటాయన్నాడు. మొత్తం 242 భేదాల ధర్మసూత్రాలున్నాయన్నాడు. అయితే మా భారతదేశంలో 20, 25 మత భేదాల కంటే లేవు. అయినా మేమంతా 'ఏకంసద్విప్రాబహుధావాదులు' అనే పరమేశ్వర తత్త్వం మీద విశ్వాసంతో వున్నాము. అయితే మీరు ఆరాధించే భగవంతుని పేరేమిటి? అని అడిగాము. వెంటనే ఆయన క్రీస్తు అని అనకుండా 'హహహహ' అని అన్నాడు. నేను బాబు 'హహహహ' గంధర్వ రాజు శబ్దము అన్నాను. అందుకతను ప్రపంచంలో మహాత్ముడొక్కడే మనం భిన్న భిన్న భేదాలతో సతమతమవుతున్నామన్నాడు.

విండ్సర్‌లో మున్నప్పుడు వారి కోరికపై నేను భగవద్గీతలోని విశిష్ట కర్మ భక్తి అని ప్రబోధించిన భక్తియోగాన్ని గూర్చి ప్రవచించాను. అక్కడికి వచ్చిన యూనివర్సిటీ లైబ్రరీ అసిస్టెంటు ఫెడ్రిక్‌తో నేను 'ఏమండీ మీ క్రైస్తవ మతంలో 242 భేదాలున్నాయా అని అడిగితే చాలా వున్నాయి 460 దాకా వున్నాయన్నాడు. మలేషియా కూడా వెళ్లాను. అక్కడి నా అనుభవాలు కోకొల్లలు.

ప్ర. బాగుందండి, ఈనాటి వచన కవిత మీద సాహిత్యం మీద మీ అభిప్రాయం కొంచెం చెప్పగలరా ?

జ. జ్ఞానం వొక్కటే తగ్గిపోని సాధనం, అలా విజ్ఞానానికి విస్తృతమైన పఠనం ఎంతో అవసరం. తీసిన కొద్దీ చెలమలో నీరూరుతుంది. చదివిన కొద్దీ మనిషిలో విజ్ఞానం పెరిగేటట్లు మొదట భాషా సంచారాన్ని మనసులో దృఢంగా ఏర్పరచుకుంటే, చిన్న ప్రేరణకు సయితం ఆనందాన్ని, అద్భుతాన్ని అనుసంధానం చేసే కళే కవిత్వమన్నట్లు ఆ కవిత్వంగాని, రచనలుగాని ఆవిర్భవిస్తాయి. రచయితలకెప్పుడు బలీయమైన రెండు శక్తులుంటాయి. అవి ఏమంటే కొత్త విషయాలను తెలిసేటట్లు చెప్పడం, తెలిసిన విషయాలను కొత్తగా చెప్పడం, అది లోపించకుండా వుంటే చాలు.

కాలక్రమేపి సాహిత్య దృక్పథంలో మార్పులు రావడం సహజమే. ఎన్నో రకాల మార్పులను నా జీవితంలో చూశాను. మరింకెన్ని చూస్తానో. ఒకటి మాత్రం గుర్తుంచుకోవాలి. హృదయం స్పందించి భావగర్భితమైన పద జాలంతోనున్న రచనలు, కవితలు మన ముందుకొస్తాయే అవే శాశ్వతంగా మనముందుంటాయని మాత్రం మరచి పోరాదు.

ప్ర. స్త్రీవాద, దళితవాద ఉద్యమాలపై మీ అభిప్రాయమేమిటి ?

జ. నాకు పెద్ద ఆ ఉద్యమాలమీద సదభిప్రాయం లేదు. పురుషుడు లేని స్త్రీ, స్త్రీ లేని పురుషుడు ఎక్కడుంటారు. సిగపట్లు పట్టుకొని దెబ్బలాడుకొంటూ వుండడమేనా? లోపాలుంటాయి వాటిని తమ కవితల్లో రచనల్లో . .

ప్ర. దళితవాదం

జ. దళిత సాహిత్యమంటారా? ఇది కేవలం రాజకీయం. కేవలం కుల ప్రాతిపదికమీద వస్తున్న సాహిత్య మనవచ్చు. ఇలాంటి సాహిత్యాలను మనం చదివి 'అయ్యో' అనుకోకపోతే ఆ రకమైన కవితలు రచనలు వచ్చి కూడా లాభం కనిపించదు. అందరు చదివి సెబాస్ అని తలవూపే సాహిత్యమే కలకాలం వుంటుంది.

ప్ర. చివరగా అడుగుతున్నాను మీకు సాహిత్యంలో అపార అనుభవం వున్నది కదా మీరు వారికిచ్చే సందేశమేమిటి ?

జ. దీర్ఘకాలిక రచనలు చేసిన నేను వాళ్ళకిచ్చే సందేశమేముంటుంది. స్పీడ్ హెచ్చింది. అన్ని పన్నునిమిషాలమీద పూర్తవాలని వాంఛిస్తున్నారు. మరి ఇది యాంత్రిక యుగం కదా! దానికి తగినట్లే రచనలు చేస్తున్నారు. అందరికి ఆమోదయోగ్యమైనవే చాలా మార్పులు వస్తున్నాయనడంలో సందేహం లేదు. మన సాహిత్యంలో పుష్టి వుంటే వాటంతటవే రాణిస్తాయి. విశ్వ సందేశమీయగల సామర్థ్యం సంపాదించు కోగలుగుతారు. అందరు ఆ స్థాయినందుకోవాలని నా అభిప్రాయం.

# కవి 'మాంచాల' ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ!

"పూల మాలిక లల్లినందుకు కరకు కత్తులె కాన్కలాయెను తేనె సుధలను చల్లినందుకు తేటికాటుల పోటులాయెను". ఓహో ఎంత సుందరమైన భావకవిత్వం ఇది! 20వ శతాబ్దం తొలి సంధ్యలో నవ్యాంధ్ర సాహితీ క్షేత్రాన్ని ఏలిన భావకవితా యుగంలో ఈ మధుర కవిత అల్లిన విదుషీమణి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ. కవితామ తల్లిని క్షీణయుగ బంధనాలనుంచి తెగతెంపులు చేయించి అభ్యుదయ కవితా ప్రస్థానానికి కటిబద్ధుల్ని చేయడానికి మధ్య - ఒక సంధియుగం నడిచింది. దానిపేరే భావకవితా ప్రవంతి. ఆ సమయంలో అర్థంలేని భావాలను రాయప్రోలు ఈ సడించాడు, దేవుల పల్లీ వంతపాడాడు! ఆంధ్ర సరస్వతిని రమ్యాక్షరక్షోణికి తిప్ప మన్నారు. భారత స్వాతంత్ర్య సమర భేరీలు కూడా అప్పుడప్పుడే మోగుతున్న సమయం; జాతీయోద్యమం ఊపునందుకుంటున్న ఘడియలు; దేశభక్తి గీతాలకు సమయం ఆసన్నమవుతున్న ముహూర్తాలు. భావకవిత, అహంభావకవిత గిరజాలూ, సరదాలూ కట్టిపెట్టి జాతీయ భావాలతో ప్రేరేపితమవుతున్న రోజులు, ఆ పరిణామక్రమంలో ఒక విశ్వసుందరమ్మే కాదు, మరొక చావలి బంగారమ్మే కాదు - "ఆంధ్ర సరస్వతి' 'గా, సాహితీ రుద్రమగా, సాహితీ వేదికను, సంగీత హృదయ సంవాదినిగా, సానతీరిన జాతిరత్నంగా భావకవిత్వం పట్టును విదించుకుని జాతీయభావాలతో కవనరంగాన్ని కదనరంగంగా నడిపించిన అగ్రశ్రేణి ఆంధ్ర కవయిత్రులలో ఇటీవల కన్నుమూసిన ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ఒకరు. ప్రాచీనతకూ, నవీనతకూ వారధి లక్ష్మీకాన్తమ్మ. దేశభక్తితోపాటు, వీరరసప్రధాన ఘట్టాలకు చెవికోసుకోవడమే కాదు, స్వయాన ఉద్యమ స్ఫూర్తితో కలంపట్టిన వ్యక్తి. పాతకొత్తల మేలుకలయికగా-భారతీయుల ఆర్షవాఙ్మయం గురించి ఎంత అధికారంతో చెప్పగలదో, ఆధునిక యుగ సత్యాలను కూడా అంత సాధికారికంగానూ వెల్లడించగలిగిన విదుషీమణి కాన్తమ్మ. విశ్వసాహిత్య ఉద్యానవనంలో భారతీయ కవయిత్రులు తీసిన పంటలను అరవైలనాటికే "ఆంధ్రకవయిత్రులు" సహా ప్రాచీన మధ్యయుగాల వాఙ్మయాలను సమీక్షిస్తూ "అఖిలభారత కవయిత్రులు" సంకలనాన్ని మన ఆడపడుచులకు అందించిన 'కళా ప్రపూర్ణ' కాన్తమ్మ! పుట్టినింటికి, మెట్టినింటికి ఉభయ వంశదీపికగానే గాక, సారస్వతేయులందరికీ ఉభయ భాషా రూపికగా కూడా వర్ధిల్లిన కవి. స్త్రీ విద్యకోసం, ఆర్థిక సమానత్వం కోసం ఆవేదన చెందిన కాన్తమ్మ మహిళాలోకానికి స్ఫూర్తినిచ్చేందుకు, నిరాశా నిస్పృహలనుంచి వారిని విముక్తి చేసేందుకు చేసిన పని-

పనిగట్టుకొని ఋగ్వేద పరిశీలనకు దిగడం, తద్వారా అందులో పేర్కొన్న 2,000 మంది "మంత్రద్రష్టలైన మహాపురుషుల్లో" కనీసం 24 మంది విదుషీమణులైన మహిళా మంత్రదర్శినులను పట్టి వెలికి తీయడమూ! సంస్కృతాంధ్ర, ఆంగ్లసాహిత్యాలను పుక్కిట పట్టిన ఈమె సంస్కృత, ప్రాకృత వాఙ్మయంలో మహిళల పరిశ్రమ గురించి 'కవయిత్రుల' చరిత్రలో వివరించింది. గార్గి, మైత్రేయి, విశ్వవాథ, అపాల, విజ్జిక, అవంతుల గురించే కాదు, మధ్యయుగాన వాఙ్మయంలో గంగాదేవి, తిరుమలాంబ, మధురవాణి, త్రివేణి, మొల్ల, రంగాజి, ముద్దుపళని, తిమ్మక్కల గురించీ, తొలి తెలుగు కవయిత్రులయిన చానమ్మ, పోలమ్మ, కనపర్తి వరలక్ష్మమ్మల గురించీ అపురూపమైన సమాచారాన్ని కాన్తమ్మ సేకరించింది. 544 వ్యావహారిక భాషలూ, 174 ప్రాంతీయ భాషా సాహిత్యాలలో (ఉర్దూ సహా) భారతీయాత్మను పట్టి, పిండి పంచిన ఉత్తమ సంకలనం కాన్తమ్మ "కవయిత్రులు"! సాహిత్యంలో సౌందర్య ప్రభావీచికలు ప్రసరించడమే కాదు, కీర్తన వాఙ్మయకళాసేవలో కూడా కీర్తి పతాకాలు అందుకున్న కవి అని చెప్పడానికి "విమల గాంధర్వ మీ రీతి విశ్రుతిగన/బాలమురళి నీ వొకడవె చాలు చాలు . . ." అన్న కవితా శకలం చాలు ! అంతేగాదు, "నా తెలుగు మాంచాల", గేయ కావ్యంద్వారా తానే కవి 'మాంచాల'గా స్థిరపడి చచ్చుబడిపోయిన తెలుగు మహిళకు విచ్చుకత్తిని చేతికిచ్చిన చాన లక్ష్మీ కాన్తమ్మ! దేశ భక్తినీ, వీరనారీమణుల స్వజాతి అభిమానాన్నీ తెలుగు మహిళకు ఎక్కించడానికి కృషిచేసిన కవి. కదనరంగంలో ఆమె కలం ప్రబోధించేది వీరధర్మమేగాని, శత్రువుకు వెన్ను చూపే 'ప్రేమ ధర్మం'కాదు! అత్త అయితాంబ, భర్త బాలచంద్రుడూ, మగువ మాంచాల ప్రధాన పాత్రలుగా ప్రతిపద రమ్యంగా కాన్తమ్మ రచించిన ఈ కావ్యాన్ని తలమానిక మని చెప్పుకోవచ్చు. వీరవనితగా మాంచాలను దిద్దిన కాన్తమ్మ ఆ తన్మయత్వంలో మాంచాల వ్యక్తిత్వాన్నే కాదు, తన కవితా వ్యక్తిత్వాన్ని కూడా నిలుపుకొంటూ అంటోంది: "నా తెలుగు మాంచాల/నాణెంపు పతిశీల/నవరాగ మణిమాల/స్తవనీయ గుణలీల' ' అని! అర్థసౌందర్యానికీ, శబ్దమాధుర్యానికీ, అంత్య ప్రాసల ప్రయోగ వైచిత్రికీ కాన్తమ్మ కొత్త సొబగులు తొడిగింది! ఆమె సాహిత్య జీవితాన్ని ప్రభావితం చేసిన దేశీయ విదుషీమణులు ఒకరుకారు: చానమ, ప్రోలమల శౌర్య సాహసాలంటే చెవికోసుకుంది; 35 ఛందస్సులతో కావ్యం అల్లిన నిశ్శంక రాయరాణి అంటే ఉప్పొంగిపోతుంది; కన్నడ సాహిత్య ప్రక్రియ "సాంగత్య ఛందస్సు" అన్నా, మలయాళంవారి 'అట్టక్కథ' అన్నా ఆమె మనస్సు చవులూరుతుంది; కాశ్మీర సాహిత్యంలో జాతిమత భేదాలు లేని అవ్వలల్ల, లాల్‌దీదీ కవయిత్రులంటే ఆమెకు ఎక్కడలేని ప్రేమ; రసపుత్రాంగన గుజరాతీ మీరా మధురభక్తి, తమిళుల "అవ్వై" సూక్తులు, ఆండాళ్ దివ్యకీర్తనలూ;

మరాఠీలో ముక్తాబాయి, జనాబాయి, వంగభాషలో చంద్రావతి, కామినీరాయి కవన ప్రలోభాలకు లొంగి పోతుంది! తోరూదత్తుకు తండ్రి గోవిందదత్తు శిక్షణలాగా తండ్రి మధురకవి నాళం కృష్ణారావు కల్పించిన ఉత్సాహ ప్రోత్సాహాలు కాన్తమ్మ కవితాశిఖరారోహణకు ఆశీర్వాదాలయ్యాయి !

అంతేగాదు, లక్ష్మీకాన్తమ్మ రాసిన విలక్షణ రచన "సరస్వతీ సామ్రాజ్య వైభవం" మధురమైన సంవాద చాతుర్యంతో నడిచిన రూపకం, ఆంధ్ర కవయిత్రుల ప్రజ్ఞాపాటవాలను లోకానికి తెలియజెబుతూ రాసిన ఈ రూపకం సరికొత్త బాణీలో సాగింది. ఒక విధంగా ఈరూపకం 'స్త్రీ వాద' సాహిత్యానికి తొలి పూజగా భావించుకోవచ్చు ! ప్రాకృత కవయిత్రులలో "రోహా", రాళ్ళపల్లి వారి గాథాసప్తశతిలోని "వోహా" నిజానికి ఆనాటి ఫెమినిస్టులే నేమో ! ఈ రూపకంలో - తన విద్వత్ ప్రభాపుంజాలతో మంచుకొండలను కూడా కరిగించిన మొల్ల కనిపిస్తుంది; గంగాదేవి తెలుగు నుడికారాలతో కలకండలు కుమ్మరిస్తుంది, కవితా జాజుల కమ్మని పరిమళాలను దిశదిశలా ప్రసరింపజేస్తుంది; మధురవాణి అందంగా రసనిష్యందంగా విజ్ఞాన కళాప్రపంచానికి చక్కని శిల్పంతో కైమోడ్పులర్పిస్తుంది; తిమ్మక్క జాను తెనుగులో శారదాస్తుతి చేసి ప్రేక్షకులను చతుర కవిత్వంతో రసరమ్య సాగరంలో ముంచెత్తుతుంది; ముద్దుపళని ముద్దు పల్కులతో మనోరంజకమైన శబ్ద సాగరంలో ఓలలాడిస్తుంది; రంగాజి రంగుల హరివిల్లులా కవితామృతాన్ని చిలికించి, కరుణను గంగలా పొంగిస్తుంది; వేంగమాంబ మహిళలకు ఉన్నతిని కూర్చు మహాత్ముడెవరో చెప్పమని నిలదీస్తుంది; శాంతిని, అహింసను, ప్రేమను, సత్యనిష్ఠను కలలో కాదు ఇలలో ప్రతిష్ఠాపించే మొనగాళ్ళెవరో చెప్పమని సవాలు చేస్తుంది. క్షీణయుగ లక్షణంగా అతివేగంగా శృంగార వర్ణనలు చేసిన ముద్దుపళని కూడా కాన్తమ్మ చేతిలో దొరికొస్తుంది. నేడు మహిళలపై జరుగుతున్న అత్యాచారాలను వర్తింపజేస్తూ కాన్తమ్మ అన్యాపదేశంగా (తానే సరస్వతిగా మారి) ఇలా హెచ్చరిస్తుంది; "కొందరు పురుషులు అసభ్య శృంగారాన్ని కావ్యాలకెక్కించి ఊరేగించారు, సిగ్గు సింగారంగా ఉండదగిన స్త్రీలు కూడా అలాంటి రచనలనే చేస్తే ఇంక కావ్యాలు విశ్వశ్రేయస్సును కోరే రచనలు ఎలా అవుతాయి ? ఈ లోకంలో ఇప్పటి జనాల విపరీత ప్రవర్తనకూ, స్త్రీలపై జరుపుతున్న అత్యాచారాలకూ ఇలాంటి (శృంగార) రచనలు కారణం కాదా?" ఈ ప్రశ్నకు 'చానమ్మ' ఇచ్చిన సమాధానం కూడా గమనించదగ్గది : "రచనని కూడా ధనార్జనకి ఉపయోగించడం వల్ల నేటి సంఘంలో ఇట్టి ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయి"!! హిందీ కవయిత్రుల గురించి ప్రస్తావిస్తూ లక్ష్మీకాన్తమ్మ కవయిత్రి కమలారూప్ కరణ్ మాటల్ని

స్త్రీవాదంగా మనకు వినిపించింది; "సంఘంలో పురుష సంతానేచ్ఛ అధికమయింది. మగశిశువు జన్మకోసం మంత్రతంత్రాలు, ప్రార్థనలు ప్రారంభమైనాయి. ఇంటిని ఉద్ధరించేవాడు మగవాడన్న భావన అభివృద్ధి పొందినకొద్దీ ఆడబిడ్డ విలువ తగ్గిపోసాగింది. కేవలం కొడుకులను కన్న తల్లికి తప్ప స్త్రీ జీవితం వ్యర్థంగా చూడబడింది . . . స్త్రీని చిన్నతనంలో తండ్రి, యౌవనంలో భర్త, ముసలి తనంలో కొడుకూ పోషించాలన్న నియమం ఏర్పడింది. ఈ నియమం వల్ల స్త్రీ స్వాతంత్ర్యం పూర్తిగా బంధింపబడింది . . . హైందవ సమాజం సనాతన ధర్మాచారాలనే పేరుతో మూఢవిశ్వాసాలకూ, గుడ్డినమ్మకాలకూ ఆటపట్టయింది. ఇందువల్ల అనేక దురాచారాలు సంఘంలో వేళ్ళూనుకుని స్త్రీలపై తమ ప్రభావాలను కనపరుస్తున్నాయి . . . ఇలా కేవలం మత విషయాలేకాదు, సాంఘిక రాజకీయాది పరిస్థితులు కూడా స్త్రీ పతనానికి భాగం పంచుకున్నాయి." కాన్తమ్మ 'మహిళా విక్రమ సూక్తాలు' బోధించడమే కాదు, ప్రయోజనకరమైన ఉత్తమ కథాసంకలనం "కథా మందారం" కూడా మనకు అందించింది. ఇందులో బాపిరాజు "మధుర బిందువుల" నుంచి భానుమతి "జీవితంలోని అగాథాల" వరకూ, రంగనాయకమ్మ "ఆడది" నుంచి రామలక్ష్మి "ఇదిగోమాట" వరకూ, నాయని కృష్ణకుమారి "ప్రకాశరావు కథ" నుంచి రచయిత్రి సుకాంచన "కోరల మధ్యన కోటి స్వర్గాలు" దాకా మెదడుకు మేత పెడతాయి ! కాన్తమ్మ జీవించి ఉన్నన్నాళ్ళూ ఒక మణిదీపమై వెలిగింది. తనకాలపు రచయితలకు తలలో నాల్కలా మెలిగింది; తెలుగు భాషామ తల్లికి గారంగా, ముదిగారంగా, వెలలేని తులలేని కీర్తికి చెక్కుచెదరని పాదుగా మిగిలింది ! ఒక సందర్భంగా కాన్తమ్మే చెప్పుకున్నట్టుగా -

"మందార మాలతో అందాలు కూర్చనీ
ఆంధ్రి కందాలు కూర్చనీ
విందైన నీ మనసు ఆనంద మొందనీ"

అంటూ తన ఆనందలోకాలను మనకి పంచుతూ మనకు అందని లోకాలకు ఆమె చేరుకుంది !!

- వార్త దిన పత్రిక సంపాదకీయం
29 డిశంబరు 1996

# కళాప్రపూర్ణ లక్ష్మీకాన్తమ్మ

- డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

లక్ష్మీకాన్తమ్మ ఉభయ భాషా ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణ ఎం.ఏ. చదువలేదు. పి.హెచ్‌డి. చేయలేదు, అధ్యాపక వృత్తిని చేపట్టలేదు. అయినా తనదగుస్థానాన్ని సాహిత్యరంగంలో, ముఖ్యంగా ఉపన్యాస ప్రక్రియలో సంపాదించుకొన్నారు. కొండంత ఆత్మ విశ్వాసం, గోదావరంత వాక్చాతుర్యం ఆమెకు ఆ స్థానాన్ని సంపాదించి పెట్టాయి. విద్యార్థిలోకంలో, కాలేజీలలో, యూనివర్సిటీలలో ఎన్నెన్ని ఆహ్వానాలు ! ఎన్ని స్వాగతాలు ! నాకు తెల్సినంతవరకు ఆమెది అద్వితీయమైన స్థానం. ఎవరు అధిగమించలేదు, అనుసరించలేదు. అట్టి సుస్థిర స్థానాన్ని ఆమె సంపాదించుకొన్నది. నిలబెట్టుకొనగల్గినది.

మోతేవారు మాతామహులు, నాళంవారు పితామహులు. ఊటుకూరి వారు భర్త వంశంవారు. ఈ వంశాల ప్రభావం ఆమె పెట్టుబడి. అదే ఆమెకు అండ. ఉపన్యాసాలలో ప్రచండయై, రుద్రయై, సాహితీ రుద్రమగా ప్రస్ఫుటించినది. గోదావరి పాండిత్యం, కృష్ణా నిర్మలత్వం, ఆమెకు అబ్బినవి. గుంటూరు పట్టుదల, ఆవేశం, ఆమెకు ఉత్సాహాన్నిచ్చాయి. ఎన్నో పవనాలు ఆమె జీవనవనంలో వీచాయి. ఆ పవనాలలో పూచిన పుండరీకమే లక్ష్మీ కాన్తమ్మ. ప్రభావాల సమ్మేళనమే ఈ సాహితీ త్రివేణి లక్ష్మీకాన్తమ్మ. నాళం కృష్ణారావు రాజమండ్రిలో గొప్పవ్యక్తి. గౌతమీ గ్రంథాలయ స్థాపకులు, వీరేశలింగం అనుచరుడైన బ్రహ్మమతావలంబి, ఆధునికతా నవీనతా సమీరాలలో తేలినవాడు. చిన్నతనాల పెళ్ళిళ్ళ ఫలితం కాబోలు తండ్రి ఆధునికత ఈమెకు అబ్బలేదు. సనాతనం మీద మోజు. ఆంధ్రమాతాభిమానమే మెండు. విశ్వధర్మముకన్న విశ్వహిందూ పరిషత్తు ఆమెను వశంచేసి కొన్నది. సనాతన వ్యసనాలే కప్పివేసాయి. ఆధునికతా ప్రమాణాలలోనూ విదేశ విహారాలలోనూ, మహిళా భ్యుదయమే ఆమె అభిమానరంగం. విజ్ఞానం కన్న సాహిత్య సంగీతాలే ఆమె అభిమాన వేదికలు. కలియుగంకన్న కృత, త్రేతా, ద్వాపర యుగాలే అభిమాన యుగాలు. సమకాలీన ఉద్దేశ్యాల దర్పణం. నేడులకన్న నిన్నలే ఆమె కన్న కలలు.

నేను చెప్పినది కొంత అప్రస్తుతమైనా ఆమె స్థానాన్ని కదల్పలేదు. మరుగున పడిన ఆంధ్ర కవయిత్రులను వెలుగులోనికి తెచ్చింది. అక్షర నీరాజనాలర్పించింది. చెరుకువాడ వేంకట నరసింహం, కల్లూరి సుబ్బారావు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, జమ్మలమడక మాధవరాయశర్మ ఆంధ్ర భాషలో మంచి వక్తలని నా తలంపు. మహిళలలో అగ్రస్థానం ఊటుకూరి వారిదేనని నా భావన.

# ఆంధ్రసాహిత్యంలో అపర రుద్రమాంబ

- డా॥ సి. నారాయణరెడ్డి
జ్ఞానపీఠ పురస్కార గ్రహీత,
అధ్యక్షులు: ఆంధ్ర సారస్వత పరిషత్
రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక భాషావ్యవహారాల సలహాదారు
హైదరాబాద్

రణ పౌరుషానికీ-రాజ్యపాలన పాటవానికీ కాకతీయ రుద్రమాంబ గణుతి కెక్కింది. పాండిత్య వీరానికీ -ప్రచండ వక్తృత్వ ప్రావీణ్యానికీ డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ కోటికెక్కింది ఆంధ్రవాఙ్మయరంగంలో చిరకాలంగా ఓజో మూర్తిగా వెలుగొందుతున్న రచయిత్రి ఆమె.

మధురకవి నాళం కృష్ణారావుగారి పుత్రికగా సంక్రమించుకున్న కవిత్వ వారసత్వంతో- సమకాలీన ప్రముఖ కవి పండితుల సాహచర్యంతో పండిచుకున్న వ్యుత్పత్తి సంభారంతో లక్ష్మీకాన్తమ్మగారు తెలుగుభారతికి తులలేని ఆభరణాలు సమకూర్చారు. ఆమె వ్యక్తిత్వ సాహిత్యాలకు పట్టిక నిలువెత్తు అద్దం ఆమె ఆత్మ చరిత్ర. సారస్వత రంగంలోనేగాక సంస్కరణాత్మక సాంఘిక రంగాల్లో ఆమె వహించిన విశిష్ట భూమిక ఎంతో ఉజ్జ్వలంగా అగుపిస్తుంది.

తెలుగుజాతి ఉషస్సు కవయిత్రుల కోసం ఎదురు తెన్నులు చూస్తున్న రోజుల్లో, మూడు దశాబ్దాల రుద్ర మాంబ'లా నాళంవారు మనకు అందించారు. తల్లికి తన బిడ్డపై మోజుఉన్నట్లే ప్రతికవికి తన కవితలపై మోజు ఉంటుందని, కవి తన రచనల ద్వారా సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని ఎది రించాలి.

కాలనాడిని బట్టి వేమనలా కవితలు రాయాలి. ఆంధ్రసాహిత్యంలో అపర రుద్రమాంబగా వెలుగొందుతూన్న డా॥ లక్ష్మీకాన్తమ్మకు నా అభివందనాలు.

# మధురకవి : మధుర కవయిత్రి

- డా॥ దాశరథి

నా చిన్నతనంలో మధురకవి నాళం కృష్ణారావు గారి "మీగడ తరగలు", "వెన్నముద్దలు" మొదలైన కావ్యాలు చదివి, వారి సరళ సరస శైలికి ముగ్ధుడనై పోతుండేవాడిని. నాళం కృష్ణారావుగారు, బహుముఖ ప్రజ్ఞాశాలిని, విదుషీమణి అయిన సోదరి, ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి పితృపాదులు. తమ తండ్రిగారి తేటగీతిని గురించి లక్ష్మీ కాన్తమ్మగారు ఎంతో మనోహరంగా చెప్పారు :

"భరతజాతి భవ్యరీతి
మెలగ, వసుధ మిన్నయైన
తీరులన్ని, తేనె చినుకు
లద్ది యద్ది గోరుముద్ద
లమృతమట్టు లాహరింప
జేయ మధుర గీతలాడి
పసివారల భవితవ్యము
భద్రపరచె మధురకవి
కృష్ణరాయ తేటగీతి"

మధురకవి నాళం కృష్ణారావుగారి తేటగీతులు పసిపాపల భవితవ్యమును భద్రపరచడానికి ఉద్దేశించినవైనా, పెద్దలను సైతం, అలరించినవి. అట్లే సోదరి లక్ష్మీకాన్తమ్మగారు ఎంత గొప్ప విదుషీమణి అయినా ఉభయ భాషాజలంధులను ఆపోశనం పట్టినా, ప్రజలకు సన్నిహితంగా ఉండే సులభశైలిలో మాత్రాఛ్ఛందస్సులో, అభ్యుదయ భావాలతో "మనసాహితి - మధురభారతి" రచించారు. తండ్రిగారి ప్రభావం తమపై ఉన్నదని నిరూపించారు. మన తెలుగు భాష బహుముఖమైన సౌందర్యాన్ని ఆవిష్కరించారు కవయిత్రి కవితలో వెయ్యేండ్ల ఆంధ్ర కవితా సరస్వతి ఉన్నది.

మనసాహితి మధు ,భారతి
శివరంజని, జ్ఞానాంజని

"స్వస్థాన వేషభాషల
ప్రస్తవమును సేసి, తెలుగు
ప్రజకు, తెలుగుపైన మోజు
కల్గించిన ఘన యశుండు॥ -నన్నయ్యనూ,
"దేశమన్న మట్టికాదు
దేశమన్న మనుషు" లనెడు
నగ్నసత్య మెఱిగించిన - గురజాడ వారినీ
ఆ తరువాత ఇంకా ఆధునికులనూ
సంస్మరించారు కవయిత్రి.

# సరస్వతీ సామ్రాజ్యం: ఒక విచిత్ర సృష్టి

- ఆచార్య తూమాటి దోణప్ప
మాజీ వైస్ ఛాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం

సహస్రాబ్దులుగా సాగుతూవచ్చిన ఆంధ్రసాహిత్యక్షేత్రంలో రూపక రచనాకృషి చాల అర్వాచీనం. అందులోనూ అనూక్షితాలే అత్యధికం. యక్షగానాది దేశీయరూపకాలు మాత్రం పై సూత్రానికి అపవాదం. సముత్థాన సాలులూ, ప్రజ్ఞాశీలురూ ఐన కొందరు ఆధునికులు చేపట్టిన రచనోద్యమంలో అనిదంపూర్వమూ, ఐదంయుగీనమూ అయిన ఒకానొక దృశ్యకావ్యభేదం అవతరించింది. ఉపరూపకాలలో ఈ నూతన సాహితీమూర్తి ఏరీతికి చెందుతుందో సాహిత్యశాస్త్రకారులు నిర్ధారించవలసి ఉంది. ఇందిరామందిరం, ఇంద్రసభ, కవనవిజయం, కురుపాండవదాయ విభాగం, భువనవిజయం వంటివి ఈ కుదురునకు చెందినవి; అభిజ్ఞశేఖరుల ఆమోదాన్నీ, రంగస్థలాభిమానుల ఆదరాన్నీ పొందినవి. ఈ కోవకే చెందిన ప్రకృతికృతి సరస్వతీ సామ్రాజ్యము' కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి విశిష్టసృష్టి.

ఉభయవంశదీపికగా, ఉభయభాషారూపికగా తెలుగునాట ఈమెకి పెద్దపేరు. విద్యావినయ వితరణాలలో తండ్రికి తగ్గని తనయ; వ్యవహార ప్రౌఢతలో హయగ్రీవగుప్తగారికి తగిన గృహిణి. 'పత్యేవజాయా' అన్న వేదమంత్రార్థానికి ఈమె సమర్థత అక్షరక్షరం అన్వర్థం. ఇదే ఈమె సాహిత్య సత్యవ్రతదీక్షకు రక్షాకవచం. సరస్వతీస్తనద్వయ ఉపమాద్రవ్యాలుగా ఉపశ్లోకితాలవుతున్న సంగీతసాహిత్యాలలో ఈమె సహజ బోద్ధ. విద్వత్సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నాగతి ప్రసిద్ధ. పరమ వివేక సౌరభ విభాసిత సంసత్సంపూజిత; ఆంధ్ర విశ్వకళాపరిషద్దత్త; 'కళాప్రపూర్ణ' బిరుద విరాజిత.

అలనాటి ఆంధ్రకవయిత్రులేకాక, ఆయా కావ్య ప్రబంధ భావాంబరవీధీ విశ్రుతవిహారిణులైన కలభాషిణి - 'కలహభాషిణి' అని ఈ కృతిలో ఒక పాత్రయైన కలహాశనుని ఉక్తిచమత్కృతి - వంటి పాత్రలు సైతం ప్రధాన పాత్రవహించడం ఈ కావ్య రచనానిర్మితిలోని ప్రత్యేకత. ఇందలి చమత్కార సహితమైన సన్నివేశకల్పనము, చారుతా మహితమైన సంవాదచాతుర్యమూ, సమయోచిత వాకోవాక్యవిన్యాసమూ, పాఠకులనూ, పారిషదులనూ సపిగా, సమంగా అలరింపజేస్తాయి. పఠనభావుకతా, ప్రయోగయోగ్యతా అమరిన ఈ లఘుకృతి శ్రవ్యకావ్యంగానేకాక దృశ్యకావ్యంగా సైతం సామాజిక ప్రవరులను రంజింపజేయగలదు. ప్రయోగకుశలులైన కుశీలవుల అభినయ కౌశలానికిది నికషోపలమనడం అత్యుక్తికాదు. ఈ శాఖలో మరిన్ని రచనలు సృష్టించి తెలుగు సాహితికి పరిపుష్టినీ, రసపిపాసువులకు సంతుష్టినీ శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు కల్పించగలరని ఆశిస్తున్నాను.

"... ఆయుషే వర్చసే బలాయ దీర్ఘాయుత్వాయ శతశారదాయ"

# సంగీత విద్రుమ - సాహితీ రుద్రమ

-డాక్టర్ ఆరుద్ర

వైదుష్యంలోనూ, వ్యక్తిత్వంలోను - వైశిష్ట్యం విలక్షణత్వంకల సోదరి లక్ష్మీకాన్తమ్మగారు తొమ్మిది మండువా లోగిలిగల నాళంవారి ఆడబడుచు. ఏలూరులోని జమీందార్లు మోతేవారి దౌహిత్రి, చీరాలలో పేరు ప్రతిష్ఠలున్న ఊటుకూరి వారి కోడలు. ఒక తరం ఆంధ్ర రచయిత్రులందరికీ ఇష్టమైన 'అత్తగారు'. సంస్కృతాంధ్ర భాషలలోనేకాని, సంగీత సాహిత్యాలలో ప్రవీణురాలు ఈమెకు తెలియని, ఈమెను తెలియని ఆంధ్ర రచయిత్రి ఎవరైనా ఉంటే - ఆమె దేశానికి తెలియని రచయిత్రి అని చెప్తే తప్పులేదు. ఇటువంటి విదుషీమణి తన స్వీయ చరిత్రను రచించడం సంతోషించతగ్గ విషయం.

ఏడేళ్ళ వయస్సులో ఎవరూ నేర్పకుండానే ఏడు రోజుల వినికిడివల్ల పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి సుప్రసిద్ధమేకాక కష్టతరమైన భైరవి. ఆట తాళవర్ణం, విరిబోణి, సుస్వరంగా కాలపై కాలాలలో సునాయాసంగా గానం చేయకల్గిన ఈ సంగీత విద్రుమ, ఉత్తరోత్తంగా సాహితీ రుద్రమగా బిరుదు పొందడంలో ఆశ్చర్యంలేదు. ఈమె మధురకవి నాళం కృష్ణారావుగారి కుమార్తె. పెరిగినది సాహిత్య వాతావరణంలో, చదివింది ఉభయ భాషా ప్రవీణ విద్య-అందులో సర్వప్రథమురాలిగా నెగ్గడం, దేశ సేవ సంఘసేవలతో పాటు కర్రసాము, కత్తిసాము ఎంబ్రాయిడరీ కుట్టుపని, గోదావరిలో ఈత, ఆడపిల్లల జడ పట్టుకులాగే కుర్రవాళ్ళను చెప్పుతీసి తన్నబోవడం ఏలూరులో గుర్రపు స్వారి, మగపిల్లలతో సమంగా కోతి కొమ్మచ్చులాడడం. చలికాలంలో సహితం తెల్లవారుజామున వీణపై గంటసేపు పై స్థాయిలో సాధన, సత్యాగ్రహోద్యమంలో పోలీసులను పాటలతో ఏడిపించడం. గాంధీజీ సమక్షంలో ఆయన హరిజన నిధికి బంగారు నగలు కుప్పలు పోగుచేయడం అందుకు బాపూజీ భుజం తట్టగాఆయన చేతివ్రేళ్ళ స్పర్శను యిప్పటికీ మరువలేకపోవడం ... ఒకటేమిటి ! ఎన్నెన్నో విషయాలు ఈ స్వీయ చరిత్రలో వున్నాయి.

పెళ్ళి కాగానే చదువుమానిపించమని తోడపుట్టిన పడుచులు ఎంత పోరినా భార్య విద్యకు అంతరాయం కల్గించక, పరీక్షల సమయానికి ఆమె మూడు నెలల గర్భవతిగా వున్నా, ధైర్యంగా రాయమని ప్రోత్సహించి పంపిన హయగ్రీవ గుప్తగారు భర్తగా లభించడం లక్ష్మీకాన్తమ్మగారి అదృష్టం. బాపట్లలో భార్యా భర్త లిద్దరూ పాపతో కాపురం పెట్టినప్పుడు, చిన్నతనంలో ఎన్నో నేర్చుకున్నా వంటనేర్చుకోని లక్ష్మీకాన్తమ్మగారు మొదట చెరగడం, విసరడం, దంచడం అనే పనులు చేయవలసి వచ్చినప్పుడు ఎంతో

అవస్థపడ్డా అవిగ్రహకృత్యాలుగానే కాక సాహితీ శిల్పాలుగాకూడా నేర్చుకొన్నారు. అన్య సిద్ధాంతాలను చెరగడం ఛలోక్తులు విసరడం ప్రతిపక్షాల పిడివాదాన్ని దంచడం ఆమెకు కొట్టిన పిండి.

'నా జీవితమే ఒక తెరచిన పుస్తకం. ఈ తెరచిన పుస్తకంలో ఏ పుట తెరచి అవలోడనం చేసినా ఏదో ఒక అంశం ప్రత్యక్షం అవుతూనే వుంటుంది' అని ఒక పుటలో రాస్తూ ఇందులో అతిశయోక్తి కాలేదన్నారు. అవును, ఇది స్వభావోక్తి. ఈమెవల్ల బొడ్డుపల్లి పురుషోత్తం, భద్రిరాజు కృష్ణమూర్తిగారు ప్రభావితులయ్యారట ఈమె వీణ వాయిస్తూ పాడితే పిలకా గణపతి శాస్త్రిగారు పరవశులై వీధిలో నిలబడి పోయారట. ఈమెకు 'సాహితీ రుద్రమ' బిరుదు దేవులపల్లి రామానుజరావుగారు ఇచ్చారుట ఎన్నెన్ని కొత్త సంగతులు - ఎన్నెన్ని విశేషాలు ఇప్పటివారికి యిందులో కొన్ని కొన్ని తెలిసినవే. రేపటివారికి అన్నీ తెలియాలనే ఈ స్వీయచరిత్ర రచన చేయడం జరిగింది.

చిన్నప్పుడే జాతీయోద్యమంలో పనిచేసిన ఈమె పంచములకు దేవాలయ ప్రవేశం కలగక పూర్వమే తన నామధేయంలో వర్గ పంచమ ప్రవేశాన్ని కలిగించారు. అందుకే మనమంతా "లక్ష్మీకాంతమ్మ" అని రాస్తే తను మాత్రం "లక్ష్మీ కాన్తమ్మ" అని రాసుకుంటారు. ఇది గమనించదగ్గ విషయం.

మరొక సంగతికూడా చెప్పాలి. నేను రాసిన కూనలమ్మ పదాలు దేశంలో ప్రచారం పొందాయి. అనుకరించారు. లక్ష్మీకాన్తమ్మగారు కూడా "ఓ కన్యకమ్మ" అనే మకుటంతో వ్యంగ్య పదాలు రచించారు. ఆకూనలమ్మ పదాల ప్రభావం ఈ పలుకులమ్మమీద పడిందంటే సమకాలీన సాహిత్య ప్రక్రియల కీమె ఎలా స్పందిస్తారో విశదం అవుతుంది. ఎన్నో సత్కారాలను పొంది. యింకా పొందుతున్న లక్ష్మీ కాన్తమ్మగారు చిరస్మరణీయురాలు.

ఈమె అమ్మమ్మగారు రోజూ వేడి అన్నంపై బంగారు రేకులు వేసి కమ్మని నెయ్యి వేసి దగ్గిరుండి తమచేతితో ఈమెకు తినిపించేవారట. రాత్రి కుంకుమపువ్వు పచ్చకర్పూరం జీడిపలుకులతో వేడిపాలు స్వయంగా తాగించేవారట. ఆ రోజు తన స్వీయ చరిత్రతో లక్ష్మీకాన్తమ్మగారు పాఠకులకు రుచి చూపిస్తూ ఈ శతాబ్దపు తొలి దశకాలలో సంగీత సాహిత్యాభిరుచులతో జాతీయోద్యమపు చైతన్యంగల ఉన్నత వర్గాల లోగిళ్ళలో ఆడపిల్లలు ఎలా పెరిగి పెద్దవారై దేశ సేవకు, సంఘసేవకు సాహితీ సేవకు అంకితమయ్యారో విశదంచేస్తున్నాయి.

ఈ సంగీత విద్రుమకు - సాహితీ రుద్రమకు నా అభినందనలు.



అనంతపురంలో శ్రీ కల్లూరు రాధాకృష్ణయ్య దంపతుల కనకాభిషేకం అందుకుంటున్న డా॥ లక్ష్మీకాన్తమ్మ



విజయనగరంలో విజయ భావన వారి పురస్కారం అందుకుంటున్న డా॥ లక్ష్మీకాన్తమ్మ

# కస్తూరీ తిలకం

- డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య
మాజీ ఛైర్మన్, అధికార భాషా కమీషన్

## 1

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, మధురకవి స్వర్గీయ నాళం కృష్ణారావుగారి ఔరసదుహిత-మాత్రమేగాక మానస పుత్రిక గూడ. ఈమె రక్తనాళాలలో సాహితీ ప్రతిభ-అనువంశికంగా స్రవించుచున్నది. అనటానికి నిర్వికల్ప నిదర్శనం-ఈమె పుత్రిక శ్రీమతి సుహాసిని-ఏలూరు మహిళా కళాశాలలో ఉపన్యాసకురాలు-సంగీత సాహిత్యాలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవించే విదుషీమణి. ఈమె కుమార రత్నాలు విదేశాలలో మేధావులలో మేలుబంతులుగా ప్రయోజకులై జీవించుచున్నారు. నాళంవారి ధర్మసత్రాలు ఆంధ్రదేశంలో రాజ మహేంద్రవరంలో పలుచోట్ల ఉన్నాయి. ఆంధ్రదేశంలో వణిక్ప్రభువులు పలువురు దాన ధర్మదయాపారీణులు. పుట్టినిల్లేగాక।శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ మెట్టినిల్లు. ఊటుకూరి వారి వంశం గూడ సుప్రసిద్ధ వైశ్య శిఖామణుల వంగడం. ఈమె అభిజాత్యవతి. అదృష్టవంతురాలు.

## 2

ఆంధ్ర కవయిత్రుల చరిత్ర-ఈమెకు పేరు తెచ్చిపెట్టిన ఉద్గ్రంథం. ఈమె పుట్టి పెరిగిన వాతావరణం-రాజమహేంద్రవరంలోనే వీరేశలింగంగారి కవుల చరిత్ర రాశారు- అందుకు దోహదం చేసింది. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో ఈమెకు వీరేశలింగంగారి ప్రక్కసీటు లభించింది. ఆంధ్ర యావత్‌కళాశాల అంతేవాసినిగా లక్ష్మీకాన్తమ్మ ఆంధ్ర రచయిత్రుల చరిత్ర రాయటానికి ఉత్తమోత్తమ అధికారిణి.

డా॥ లక్ష్మీకాన్తమ్మగారితో నాకు గల ప్రత్యక్ష పరిచయం మిక్కిలి తక్కువ. సంపన్న వైశ్య సహృదయుల ఆదరాభిమానాలు నాకు అనుభవామ్రేడితాలు. ఏలూరులో కొత్తమాసు అయ్యన్న - గుడిమెట్ల శేషగిరిరావు నా బాల్య మిత్రులు నాపై - నా యోగ్యతకు మించిన ఆదరాభిమానాలు వర్షించారు. పశ్చిమ గోదావరి పిప్పర వణిక్ప్రభువులు తుమ్మలపల్లి వీరభద్రరావు - తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తినాకు ధన కనకవస్తువాహన సత్కారాలు సమకూర్చి కస్తూరీ ప్రదానం చేసి సన్మానించిన సహృదయ చక్రవర్తులు. డా॥ లక్ష్మీకాన్తమ్మగారితో నాకు ప్రథమ పరిచయం తుమ్మలపల్లివారి ఇంటిలో జరిగిన పెండ్లిపందిరిలో. సనాతన భారతీయ సంస్కృతికి- తమహృదయాలలో వెన్నెల కోవెలలు కట్టుకుని ఆరాధించే సంపన్న వైశ్య కుటుంబాలలో జరిగే వివాహాలు-ప్రాయికంగా సాహితీ యజ్ఞవాటికలు. విదుషీ మణిగ

డా॥ లక్ష్మీకాన్తమ్మగారికి ఆనాడు ఘనసన్మానం జరిగింది. నాకు కూడా జరిగిన సత్కారం - ప్రహస్త ప్రాయమైన అధిక పాఠంగా ఆనాడు ఆమె భావించకుండా నన్ను ఆమె ఆదరించటం ఆమె ఔదార్య విశేషం. ఈనాడు తన జీవిత చరిత్రకు తిలకం తీర్చిదిద్దమని ఆమె నన్నుకోరటం నాకు ఆనంద ప్రదమేగాని ఆశ్చర్యదాయకం కాదు.

"సాహితీరుద్రమ" ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి స్వీయ జీవిత చరిత్ర మాత్రమేగాదు. ఎన్నో ఉత్తమ కావ్యాలు రాసిన ఒక తెలుగాడపడుచు అంతరంగిక కుటుంబగాథ కాదు. అర్ధ శతాబ్దికి పైగా-ఆంధ్రదేశసామాజిక చరిత్ర. సమకాలీన సాహితీ జగత్తులో చిరస్మరణీయమైన పాత్రలు ధరించిన మహామణులు ఎందరో ఈ గ్రంథంలో కన్పిస్తారు. డా॥ లక్ష్మీకాన్తమ్మగారు - ఈ గ్రంథ రచన చేసి - ఆంధ్ర సాహిత్యానికేగాక ఆంధ్రదేశ చరిత్రకుకూడా ఎనలేని సేవచేశారు. "సాహితీ రుద్రమ" అనే బిరుదు ఈమెకు అక్షరాల సార్థకం. కాకతీయ యుగంలో రాణిరుద్రమ కత్తి - గాంధీ యుగంలో జన్మించిన కలంగా పరిణమించినట్లు అభిజ్ఞులు భావించటం సమంజసం. సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞాశాలినిగా డా॥ లక్ష్మీకాన్తమ్మగారు పేరు తెచ్చుకోటం ఆశ్చర్యకరమైన అంశం కాదు. ఆమెతో పోటీపడే రచయిత్రులు-యావదాంధ్రంలో పలువురు ఉద్భవించవచ్చు. అయితే ఆమె వంటి ఉపన్యాసకురాలు బహుశః కొన్ని తరాలు గడిస్తేగాని ఆంధ్రభూమిలో అవతరించకపోవచ్చు.

జలపాత సదృశమైన అనర్గళ వాగ్ధోరణితో ఆమె ప్రసంగించటం విన్నవారు ఆశ్చర్య చకితులు కావటం కద్దు. లలనాలావణ్యాం మూర్తీభవించిన సుకుమార సుందర శిల్ప విగ్రహం ఆమెది. ఈమె గళంలో ఒకపరి వాణి వేయితంత్రుల వీణ మ్రోగుతుంది. మరొకమారు లీలాతాండవలోలుడైనా నటరాజు చేతిలోని ఢక్కా వినాదం వినిపిస్తుంది. ఒకసారి "చారు పుంస్కోకిలాప సమ్మోదయగు" సాహిత్యోపన్యాసం వెలువడుతుంది. ఎక్కడనుండి వచ్చింది ? ఈమెకు ఈ అత్యద్భుతమైన ఆ ప్రసంగశక్తి? ఈమె పుట్టి పెరిగింది గాంధీయుగంలో. మహాత్ముడు పూరించిన స్వాతంత్ర్య శంఖారావం భారతదేశంలో దశదిశల మారు మ్రోగిన సమయం అది. స్వాతంత్రోద్యమంలో హిమాలయాలనీడ కన్యాకుమారిపై పడింది సహజ కవచకుండలాలతో అలనాడు కర్ణుడు ఉదయించినట్లు - గాంధీయుగంలో దేశ భక్తులు సహజమైన కంఠాలతో అవతరించారు. ఆ దేశభక్తియుగం డా॥ లక్ష్మీకాన్తమ్మగారి గొంతులో సరిగమపదనిసలు సమకూర్చుకున్నది.

*జంకు గొంకులేక-ఢంకా భజాయించి*

*పాడగలదు-మాటలాడగలదు;*

పాల కడలి పొంగు-శ్రీలక్ష్మీకాన్తమ్మ

గొంతులోక దిగ్ దిగంత మెరసి.

డా॥ లక్ష్మీకాన్తమ్మ - ఆంధ్ర కవయిత్రుల చరిత్ర రాసిన విదుషీమణి మాత్రమే గాదు. ఆమె నిలువెల్ల కవితయే. భర్త - హయగ్రీవగుప్తగారు మరణించినపుడు ఈమె రాసిన కవిత - విన్నప్పుడు నా కన్నులు చెమ్మగిల్లినవి.

"కవిత అనిన వేడి కన్నీటి బొట్టులే

ఆ శ్లోకమయ్యె ఆమె వోకమెల్ల"

ఈమె ప్రపంచ పర్యటన చేసివచ్చిన సాహితీయాత్రికురాలు. ఇంగ్లీషు వచ్చి వుంటే ఈమె అమెరికా వాసులను వివేకానంద మహర్షివలె ఉర్రూతలూగించి యుండేది. ఈమె సనాతన భారతీయ సంస్కృతికి సజీవ ప్రతీక.

ఆమె - సాహితీ రుద్రమ ఆంధ్రదేశంలో అర్థ శతాబ్దానికి పైగా సాగిన సామాజిక - రాజకీయ - సాహితీ చరిత్ర - ప్రతిఫలించే అద్దాలమేడ.

## బహుముఖ ప్రజ్ఞాశాలి

- తెమ్మగులెంక తుమ్మల సీతారామమూర్తి

న్నసపార్యుని నుడిలోని నవకమెరిగి,
ఒడలి, తిక్కన్ననుడిలోని నడకనేర్చి,
యా కలీ మణిపుట్టిన యింటి జిగికి,
మెట్టినింటి వన్నియుకును మెరుగుపెట్టె"

కవితయందెకాదు, కమనీయ సంస్కృతి
రక్షయందు, గాన దీక్షయందు,
బహుముఖ ప్రసంగ పరిపాటియదీమె
వీనుమిగిలె, నాంధ్ర విశ్వమునకు

# భారత నారీతత్త్వ ప్రతిబింబాలు :
# డాక్టర్ లక్ష్మీ కాన్తమ్మగారి కృతులు

- డా॥ వి.వి. రాఘవమ్మ
ఆంధ్రోపన్యాసకురాలు
సెయింట్ థెరీసాస్ మహిళా కళాశాల, ఏలూరు.

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ గారిని గూర్చి చర్చించుకునే ముందుగా సంగీత సాహిత్య మూలాకృతి అయిన శారదాంబనొక సారి స్తుతి చేసుకుందాం.

వారు చేసినదే ఈస్తవం.

"వీణా మంజుల పాణి పల్లవయుగళ భ్రాజితామ్
విద్యాధిష్ఠాన దేవతామ్ విజ్ఞానాత్మ ప్రశోభితామ్
నాద బ్రహ్మమయీామ్ నవామ్ ప్రణవనాదోద్భాసితామ్
నానార్థ ధ్వని ప్రణయినీమ్ సావర్ణ వర్ణాత్మికామ్
చంద్రామల శుభ్రమూర్తి లలితామ్ వాగధీశ్వరీమ్
గైర్వాణీమ్ సురభారతీమ్ రమ్యార్థ సూక్తి సుందరీమ్"

అని మహిళా విక్రమ సూక్తంలో సరస్వతిని స్తుతించారు. కళాప్రపూర్ణ కనకాభిషిక్త, ఆంధ్రసరస్వతి, అపరవాగ్దేవి మున్నగు బిరుదులతో శోభించిన డా॥ లక్ష్మీకాన్తమ్మగారు చేసిన శారదాస్తుతిలోనే చాల వరకు ఆమె స్వరూప స్వభావా లిమిడి ఉన్నాయంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

సరస్వతీ సామ్రాజ్యవైభవం, మహిళా విక్రమ సూక్తం, అఖిల భారత కవయిత్రులు, ఆంధ్ర కవయిత్రులు, నాతెలుగు మాంచాల ఇలా ఏది రాసినా ఆరచనల్లో స్పష్టంగా కనిపించేది స్త్రీమూర్తి బాహ్యాంతర స్వరూప చిత్రణ. ఆమె రాతల్లో కల్పిత స్త్రీలులేరు. అతి సహజమైన భారత నారీత్వ సౌందర్యంలోని అణవణువును ఆరాధించిన అభిమాన, అభ్యుదయ భావవీచికలే దోబూచులాడుతుంటాయి. స్త్రీకి గల శక్తి సామర్థ్యాలను, త్యాగరాగ సహనాలను సుందర తమంగా మలచారు. కవితా పాండిత్యాలలో సానలు తీరిన జాతి రత్నాల వంటి భారత వనితామతల్లులకు ఈమె పట్టిన నివాళి స్త్రీజాతి విస్మరించరానిది. మన సమాజంలో మాతృస్వామ్యం మాసిన తరువాత స్త్రీలపట్ల గల తేలిక భావాన్ని బాగా ఆకళింపు చేసుకున్న లక్ష్మీ కాన్తమ్మ గారు ఆవిషయాన్ని అవకాశం ఉన్నంతమేర ఖండింపచేస్తూ స్త్రీ శక్తి స్వరూపాన్ని అనుక్షణం చాటి చెప్పడానికే బద్ధకంకణులైనారు. స్త్రీలోని, ధీరత్వాన్నీ, వీరత్వాన్నీ బాహ్యాంతర శుచిత్వాన్నీ, అనురాగదేవతా స్వరూపాన్నీ ఆ బాల్యంగ ఎన్ని రూపాలు ధరిస్తే అన్ని రంగాల్లో స్త్రీ

శక్తి యుక్తుల్ని, నిస్వార్థసేవా పరాయణతను నిరూపించడానికే యత్నించారు. మహిళా విక్రమ సూక్తంలో తొట్టతొలుత పద్యంలో మహిళలు విక్రమాటోపంతో రణరంగ ప్రవేశం చేస్తే భరత మాత దాస్యశృంఖలాలు విడిపోవడమెంతపని అని స్త్రీ సాహసాన్ని పొగడ్తలతో చూపిన ఉదాహరణలలో రాణి రుద్రమ మొదలుకొని కవి సరోజినిదైన ఘన దేశభక్తిని వివరిస్తూ ఆనాటి మహిళల వలె "ఇందటింతులశౌర్యరసేస్టి నేడు భరత మహిళల నావేశ పఱచెనేని మాతృభారతి దుఃఖమ్ము మాయు నిజము" అని పలికిన లక్ష్మీకాన్తమ్మగారిలో అభ్యుదయ భావాలతో కూడిన చైతన్యవాణి తొణికిసలాడినది. ప్రకృతియే మూలము పరమౌ సృష్టికి, పురుషుడు పుష్కర పలాశముంబలె, అతి నిర్లేపుడు" అంటారు.

"రమణులు పూజ్యత గనిన స్థలమ్మున
రమియింతురు సుమి దేవతలెప్పుడు
రామల భాగ్యమె రసనీభాగ్యము
రామల యున్నతి రసకును ఉన్నతి."

అంటూస్త్రీని భద్రంగా చూడగలిగిననాడే దేశం భాగ్యవంతమంటారు. మహోన్నతులు ఏనాడో ఈవిషయ గ్రహణ చేశారంటూ మాండూక్యాన్నుదహరిస్తూ మహిళలు మహాజ్ఞానవంతులు". 'విదుషీమణులైన చదురాంగ్రీయుగమునవైన పురుషులె సుమి' యటంచు తీర్మానించారు. ధర్మనిరతిలో సతికైన పతికైన సమాన ధర్మమే కాని అంతరాలు కూడదని వక్కాణించారు, స్త్రీపురుష సమానత్వం చాటుతూ "సతికిని, పతికిని శీలం ముఖ్యం. స్త్రీ పురుషులకు దండన విధియొకరీతినె జరుగ గావలె" నన్న మనుధర్మాన్ని వినిపించారు. నస్త్రీ స్వాతంత్ర్యమర్హతిఅన్న మనువు మాటలోని అంతరార్థాన్ని విశదీకరిస్తూ, మగువలు జాతికి మణిపూసలు గదా, వారల రక్షణ మాయా దశలను పురుషులుగావింప వలెనని మారొక్కమారు తెలియ జేశారు. భామినులు "గృహస్థాశ్రమపు కీర్తిపతాకలట" సదాచార సరళిని ప్రోత్సహిస్తూ "పతివ్రతలయ్యెడు పడతుల కడుపున కలిగిన సంతతి వలనవె తిరముగ మహికిని శోకము మాయును" ఘర్షణ రహిత సమాజ స్థాపన యావశ్య కతను యెంచుతూ,

"మానిని గర్భము మాన్యమ్మగుట
మానవ సంఘము బాధ్యతగొనదగు
ప్రకృతి రహస్యమ్మిదిగనకేమియొ
పలవించుటయుప్రయోజన రహితము"

పవిత్రమైన సామాజిక విలువల్ని హెచ్చరిస్తారు. అబల అనే పేరుతో స్త్రీని హింసించే మానవ సమాజాన్నుద్దేశిస్తూ అది మానిని పదానికే అపయశమని వాకొను సందర్భంగా

"ముగుదలు గౌరవమును కోల్పోవుట కంటెను నీచము మహిలోగానము, ఆత్మగౌరవము కలిగిన అతివె, పుడమిని పూజ్యతపొందు" నటంచూ ధీరమతి శకుంతలనతి ధర్మనిష్ఠను సూచించారు. శ్రీరాముని సతిసీతను, బ్రహ్మచారిణియైన సులభను, తపోనిష్ఠలో నున్న పతికి మారుగా రాజ్యమేలిన చూడాలిని, సమరాంగణాన ఘోర రక్కసులతో, దేవతా గణాలతో పోరుసల్పిన కేకయ రాజపుత్రిని, సాత్రాజితిని, మంత్ర ద్రష్టలైనక్రతు నిర్వహణలైన అపాల, విశ్వవార, వాగ్దేవులను ప్రశంసించారు. ఆత్మవిద్యలో ఆరితేరిన గార్గిని, ఆత్మజ్ఞానం పొందిన మైత్రేయిని, ధర్మశాస్త్రవేత్తచే జోహారు లందిన ద్రౌపదిని నుతించారు.

చిరుత ప్రాయంలోనే పూజ్య బాపూజీ వినిపించిన శంఖారావధ్వనులకు తానొక వీరయోధగా ఆరణాంగణాన కాలుమోపి తనతల్లి భారతిని సేవించుకున్న ధన్యచరిత కావడమే ఆమెలోని వీరరసావేశానికి పరమోదాహరణ, సత్యధర్మాల సమరంలో తాను దీక్షా బద్ధ కంకణయే గాక అలనాటి మేటి సమర యోధుల చరిత్రలు, గాంధీజీ ఆశయాలు స్వాతంత్ర్య సముపార్జనతోనే నెమ్మదిగా విస్మరించిన భారతీయుల కలుషిత జీవనసరళి కూడ "ఒక చిన్నదివ్వె" అనే రచనకు ప్రేరణ, "కరగిపోయిన బాపూజీ బంగరుకల"లో విషయాన్ని ఉన్ముక్త కంఠంతో ఆలపించారు. సందర్భోచిత భాషా సాహిత్యాల ప్రయోగం ఎరిగిన ప్రౌఢకవయిత్రి. ప్రాతః స్మరణీయులైన నాళం కృష్ణారావు గారిలోని మధుర కవిత్వమే ఈ కాంతరూపం ధరించెనేమో!

గోదావరీ నదీమతల్లిని తలపోస్తూ తాను జన్మించిన రాజమహేంద్రిపై గల మక్కువో, లేక గోదావరీతల్లి కడుపుచల్లని కమ్మని నీటి కెరటాల లాలనమో! మరి ఆగౌతమీ జలాలనుద్దేశిస్తూ.

తనజీవన రసవాహిని తనతనూ విలాసరేఖ
ఆదికావ్య భారతిగా, భరతదేశసస్యకోశ

సంపదగా ఆంధ్రజనుల విభవమ్మును చాటుచుండ" అని చేసిన ప్రశంస అపురూపం.

చిన్ననాటనే ఆధ్యాత్మిక భావాలను ప్రోదిచేసుకున్న ఈవనిత బ్రహ్మసమాజానికి చెందిన సూక్తి సుధను చవిచూచినందున ఈ రచనకింత మానసిక పరిణతి అందివచ్చినది. కృష్ణశాస్త్రిగారి కలంగళం నుంచి జాలువారిన అమృత సోనలు పుడిసిలించిన లక్ష్మీకాంతమ గారి రుచిరమనోజ్ఞ కృషియిది. సంగీత సాహిత్యాలు రెంటినీ సమపాళ్లలో నేర్చిన వైదుష్యం ఈ కీర్తనా పాటవం. శ్రుతికింపై, రసపూర్ణమై, ఆర్ద్రమై హృన్మందిరంలోని విపంచియ చేత వినిపించిన సంగీతఝురీ భావలహరులివి. ఆర్తితో భగవదారాధన చేయడమే జీవిత ధ్యేయం కావాలనే ప్రబోధ గీతాలివి.

'నీలోని మార్దవమునేనై
నాలోని వైభవము నీవై
నిఖిల మౌ భువనాలు
నిండి వెల్గెదమోయీ ఈశా''

''ఏచోట ఈదుర్విషయ జలధులన్నియు నిండి, అణగిపోవుచునుండు నాయానందసీమ, సుఖియింపగొంపొమ్ము ఓ దేవదేవ... '' ప్రతివ్యక్తి ఎప్పుడో ఒకప్పుడైనా భావించక మానని ఈమాటలు సుందర తమమైనవి. మరొక ఖండికలో ''ఆగలేను సాగలేను ఆగిసాగితూగలేను'' అనే మకుటంతో రాసిన కవితలో ''ఆగడములతో బ్రతుకంతా, వేగిపోయెనోయిదేవ, వేగిరమె నీకరుణలేక ఆగమరూప భవసాగరమీదలేను'' అని పలవించారీమె. ''విలువలేని జీవితమిటు, నలిగిపోయెనోయిదేవ, పలుకరించి వలపునాపై, చిలుకరింపకున్న నింక'' మొదలైన ఊహలు చదివితే అంతధీరగభీరయైన స్త్రీయేనా ఇంతగ పలవించినది అని ఒక్క క్షణమనిపించినా మనిషిలోని నిరహంకారతకూ, నిస్సహాయతకు, ఆత్మైక సాధనకు ప్రథమ సోపానాలివి. శరణాగతితో కూడిన భక్తికి తార్కాణాలు.

''తడివోని కనులతో
ఉడివోని తలపుతో
ఉడుగని వెతలతో
ఉడుగుకొన నీవె నాసామి
తుడువకే కన్నీరు నాచెలియా''

తనకే తెలియని ఉన్మాద స్థితిలో భక్తుడు జలజల కార్చే ఆకవోష్ణధారలవలన కలిగే అనుభూతిని, ఉపశమనాన్నెందుకు నాకు దూరం చేస్తావనే అద్భుతమైన భావ వీచికయిది. అనుభవైక వేద్యమైన ఆనందగీతిక ఎంతటి ఏలికయైనా విశ్వప్రభుని కృప లేనినాడు నిస్సహాయుడై, నిరర్థక జీవితాన్నేగడుపుతాడు. ఆ సత్యనిరూపణమే యిది.

శ్రీరామునికై తపించిన భక్త శబరి మానసిక మాధుర్యాన్ని చవిచూపిస్తూన్న పలుకుల్లో ''నీకై చేర్చితి నీమధువు, నేనీకై చేర్చితి నీమధువు, ప్రాణరాగ రసములొడిచి, తీర్చిన జీవన మధువు . . . '' ఇవి అమృత గుళికలేగాదు హృదయ స్పందన చేసే చక్కని చక్కర పలుకులు. ''నీతపము నందె బ్రతుకు వేగిపోనీవె ప్రభూ, నీ మధుర హాసములోన కఱగి పోనీవె ప్రభూ, ఈ నిఱుపేద జీవికకు ఏలికవు నీవు ప్రభూ...'' సాటివ్యక్తికి ఎంత ఆడంబరంగాకనుపించినా భగవంతుని మ్రోల అంత నిరాడంబరగా నిఱుపేదగా మనగలిగినవాడే నిరహంకారి అనీ సర్వస్య శరణాగతిని తెలియ చెప్పారు, ''జీవితమంతా శిశిరంబేనా'' అని అనుకునే వారి కెవరికైనా భగవంతుని సన్నిధానం

వసంతాగమనమై ఆమనిపూలహాసాన్ని అందిస్తాయనే కమ్మని తలపులివి.

వినమ్రశీలయైన భారత మహిళ ఎన్నటికీ 'లజ్జాకిరీట ధారిణి' ఆకిరీటం భారతదేశోన్నతికి మూలకారణమని వీరి ఉవాచ "ఈ కావ్యఖండతతి వాణీకంఠ మనోజ్ఞ హారనిచయమ్ముకదా' ' అని తుమ్మలవారిచే పొగడ్తలందిన రుచిర రచన. దేశ భాషల లెస్సయౌబాసయేది, అట్టి ఆంధ్రభాషాయోషకంజలింతు" నన్నమాటలో స్వభాషాభిమాన మెంతప్రగాఢమైనదో వినబడినది, కస్తూరిబా త్యాగమయ జీవనాన్ని వర్ణిస్తూ,

"భారత నారీగర్వము
ధీరంబై పురులువిప్పి దిక్కులనాడెన్
సారంబౌనీయునికిని
గౌరవమింతులకు నీవుకస్తురిమాతా"

అలాగే మొల్లమ్మ ఆత్మనివేదనహృద్యం. ఆహృదయమెంత రాగరంజితమో. కంటికి కట్టినట్లు పాత్రల చిత్రీకరించడంలో కూడా దిట్ట. గాంధీజీని వర్ణిస్తూ; స్వరూప స్వభావాలను రూపుకట్టిస్తారు.

"ఖద్దరు మొద్దుదాల్చి చరఖావడి ద్రిప్పుచు నూలు తీసి వే
ముద్దుల గుల్కుమల్లియల పూర్ణ వికాసముబోలు నవ్వులన్
పద్దుగ గ్రుమ్మరించి హిత భాషలు పల్కుచు బోసి నోటితో
హద్దుకుధాని పశ్చిముల నంకెకుదెచ్చెను గాంధిమాయురే"

ఝాన్సీలక్ష్మీబాయ్ రణసూక్తిని దేశభక్తి ప్రపుల్లమైన ఇంపైన రచనగా కూర్చారు. 'అమ్మ' ఖండికలో తల్లికి మించినదైవం లేదనే పరవ పవిత్రభావాలు ప్రకటించి తల్లిఋణవిముక్త అయినారు.

"అమ్మయను శబ్దము చెవుల గ్రమ్ముకొనగ
హృదయమానందజలధియై చదలుముట్టు
అమ్మజీవాళిదన్నెడు నమృతరసము
అమ్మజగతి చైతన్యరసాయనమ్ము
అమ్మసృష్టికాధారమౌ అమల శక్తి
అమ్మలేక జీవం బెట్టులవని బుట్టు
అమ్మపదమది వీనుల గమ్మినంత
పుడమి ఆనందమున పొంగిపొరలు.."

ఇది క్లుప్తంగా అమ్మకై తపించిన లక్ష్మీకాన్తమ్మగారి హృద్గతమౌనగీతం. "గంపెడు రాలను గైకొని ఇంపుగమురియుట మమేలెయిక్కాలమునన్, సొంపగు వజ్రమొకటియే

పెంపును పేర్మిని తెలుపదే విభవముగాదే" ఎన్నో పాత్రలలో స్త్రీ ని చూస్తాం అన్నింటిలో ఒకకొన్నేగణుతికెక్కుతాయి. అలాగే అమ్మ పైమాటలు అందరమ్మలకు వర్తించవు.

"పాపాత్ముడౌగాక పావనమౌ అమ్మ వాత్సల్యమతనికి భద్రకవచం"

అను మాటలు కొందఱుదేవతలవంటి అమ్మలకే వర్తిస్తుంది. వేశ్యతో సుఖించడానికి తల్లి గుండెనుకోసి చేతపట్టుకువెళ్లే వాడికి కూడ ఆ అమ్మ మనసులో వాత్సల్యమే ఉండే తల్లులు కొందరే.

నా తెలుగు మాంచాల పరిశీలిద్దాం. యావద్భారతంలో మాంచాల నామధేయులెందరో! అందుకే 'నా తెలుగు మాంచాల' అంటూ వైశిష్ట్యాన్ని శీర్షికలోనే ఆపాదించారు. తెలుగింటి ఆడపడచు చరిత్ర ఎంత మహిమాన్వితమో వివరిస్తారు. ఆంధ్రరాష్ట్ర భాష,జాతి, సాహిత్యాలతో పాటు ఆంధ్ర ఔన్నత్యాన్ని, ఆభిజాత్యాన్ని చాటిన చరిత్రమిది. ఎందరో మహిళలున్నా మగువ మాంచాలదొక విలక్షణత, ధర్మానురక్తి. అందుకే ఆమె చిరస్మరణీయ. వీరరసావేశ నిర్భరయైన నాట్యావతార మూర్తిగా రూపొంది విశాల వసుంధరానభో భిత్తికలపై తెరవల తెంపరి తనమును పరవళ్ళు ద్రొక్కించి ధ్రువతారగా మలచిన కీర్తి, పదునైన గుండెబలముగల పదునారేళ్ల పసిమొగ్గ మగువ మాంచాలకే దక్కినదను" కాన్తమ్మ గారి మాటల్లో మాంచాల చెఱగని ముద్రవేసుకున్నది.

నూత్నయౌవనారంభ వేళ మాంచాల తీసుకున్న చొరవయే ఆచంద్రార్క కీర్తినార్జించినది. నభూతో నభవిష్యచర్య. ఆమె లక్ష్మీకాన్తమ గారి మాటల్లో మగువ మాంచాలయేగాదు వీరరస పాంచాలియట. ఎంత అందమైన పోలిక ఈ ఖండికలో కూడా ప్రగాఢ దేశభక్తిని ప్రముఖ పాత్రలైన ఐతాంబ బాల చంద్ర, మాంచాలలద్వారా చాటుకున్నారు. ధర్మోద్ధరణ వీరుని కర్తవ్యమని హెచ్చరిస్తూ సుప్రతిష్ఠచేశారు. సంభాషణలు కడుంగడు రమణీయం. కొమరుని యుద్ధ భూమికెళ్లనీక మరలించిన ఐతాంబలోని మాతృ వాత్సల్యం స్వార్థపూరితం. వెంటనే బాలుడు తల్లిని హెచ్చరిస్తూ,

"వీర కాంతవునీవు
వీరపత్నివినీవు
వీరమాతృపదమును
కోరగాదలపవో ...'
ఊర్పుతో శౌర్యమ్ము
దీర్పగా నేర్పితివి
యుద్ధవిద్యలనె
నాకుగ్గుగా గుడిపితివి . . "

ఆమెలోని పిరికి తనాన్ని ఎదుట నిల్పి 'ఇప్పుడిట్లు పలుకంగా పాడియౌనే నీకు' అని ప్రశ్నింపజేస్తారు. ఇక మాంచాల మందిరానికి వీరతిలకం దిద్దించుకోడానికి వెళ్లిన బాలుడు తలవని తలంపుగా తనసతి అతిలోక సౌందర్యానికి పరవశుడై చేత ఖడ్గం సడలగ శ్రుతి, గతి తప్పి నిగ్రహరహితుడైనాడు. వివేకమతియై, విచక్షణతో మాంచాల ప్రవర్తిల్లిన తీరే ఆమెను కీర్తికీయగ మార్చాయి. తన పెళ్లినాట తప్ప అంతదనుక ఆచక్కదనాల చందురుని చూడనోచని ఆబాల నిగ్రహబుద్ధితో సుఖాలకు స్వస్తిపలికి రణభూమికి తన పతిని తరలించడానికి యత్నించిన తీరు గణనీయం. నాయికా నాయకుల అందాల వర్ణన విస్మరించరానిది.

"వీరధర్మము మిగుల
సారవత్తరమౌట
మాతృదేశపురక్ష
మాన్యమగుటయునెంచి
తనస్వార్థసుఖముకై
తల్లిదేశపు సేవ
బలియొనర్చుట దొడ్డ
పాపమని మదినెంచి
జనని దేశపురక్ష
నల్పగా జనుమయ్య
అనుచు మాంచాలపతి
నదలించి మేల్కొలిపె
దేశమాతను రక్షసేసెడి
సమయ మిప్పుడు సమీపంగ
మాతృసేవకు మమత చూపక

అధిక మోహము నంది వీరుడ ..." అనిపలికి కర్తవ్య ప్రబోధం చేసినది. ఆమె చక్కదనానికి బానిసయైన బాలుని మనసు మరలించే యత్నంలో రోషాయత్త చిత్తంతో ఆభామిని బాలుణ్ణి దుర్భాషలాడినా దీక్షతో రణభూమికే తరలిన పతిని చూచి కృతకృత్యమైన సాధ్విగమురిసినది. సామదాన భేద దండోపాయ చతుర. సీతాద్రౌపదులకు దీటైనది. అతి విస్మరమైనది. పరవశంతో తన కొంగు పట్టిన పతిముద్దేశిస్తూ

"కొంగు విడుము ధూర్తుడా కొంగు విడుము
అంగనల జేరి సంగ్రామ భంగిమఱచి
మదన పూజల దేల్చెడి అదనిదియని

చొరవ మాంచాల సదనమ్ము చొరబడితివా" అని తీవ్రంగా మాటాడినా, ఆమె హృదయంలో చెందిన తీవ్రవ్యధ ఎందరికర్థమౌతుంది. ఒక్క బాలునికితక్క. "తల్లి ఐతాంబకడ శౌర్యములుల్లసిల్లగ సల్పినట్టియా వీర ప్రసంగ మంత యెందుబోయె' ' అనిగడుసుతనంతో ప్రశ్నిస్తుంది బాలుని పౌరుషాగ్నిని రగిల్చినది. మనస్విని మాంచాల మంటల కాహుతియైనది . .

"నాతెలుగు మాంచాల
నాణెంపు పతిశీల" అని స్తవనీయ యైనది.

ఇక ఆంధ్రకవయిత్రుల గ్రంథం తెరచిన వెంటనే సుందరమైన వాక్కులతో దీని సౌందర్యాన్ని వివరించే చక్కని వాక్యం ఒకటున్నది. "రమణీ రమణీయ సాహితీ విమర్శ గ్రంథము" అనుమాటలు ప్రత్యక్షర సత్యాలు. ఈ కృతిని తన కాకృతినిచ్చిన సుకృతులకు అంకితమిచ్చి కొనియాడిన విధం జన్మనిచ్చిన వారిపై గల అపారగౌరవానికి ప్రతిబింబం.

"నాకల మాంధ్రవాఙ్మయము నందడుగుంచిన నాడుకన్ననా
యాకలలెల్ల నేడు చరితార్థము లైనవి తండ్రీ ! మన్నమో
వాకముతోడ నీకృతి భవచ్చరణార్పణ సేతు మిస్మిత
స్వీకృతి మత్కటాక్షములివే వది వేలగు చాలునాకికన్".

అని పితృమిగెను. పదమూడవ శతాబ్దిలోని చానమ మొదలుగా నవ్యాంధ్రయుగంలోని చావలి బంగారమ్మ వరకు గల (ద్వితీయ ముద్రణలో) స్త్రీలోకాన్ని సాహితీ ప్రియులకు పరిచయం చేసిన ధన్యచరిత.

ఈ రచనలో సాహితీ చరిత్ర కంటె కవితా కల్పద్రుమయే ఆధిక్యం ఉన్నది. కమ్మని కావ్యగానమాలపించిన రసానుభూతి అందిస్తుంది. ఆదిలోనే చానమ్మ ప్రోలమ్మ. చరిత్రల్ని కమనీయ రమణీయశైలీ విన్యాసంతో, ప్రౌఢ పదబంధ ధోరణుల పసందైన సాహిత్యపు విందులు చవులూరిస్తాయి. ఇది క్లిష్ట సాధ్యమైన కార్యం. తెలుగు మాటలను పాటలుగ మలచగల నేర్పున్నందున కమ్మని రుచిరభావమంజుల మనోహరత్వాన్ని మధువులొలికించే భావరాగ తాళలయాన్వితమైనదిగా చేయగలిగారు.

చివరిగా 'సాహితీరుద్రమ' ను పునః పరిశీలించుకుందాం. నాళంవారు పితామహులైతే ఏలూరులోని మోతేవారు మాతామహులయ్యారు. ఈ రెండింటి కలయికే గాక చీరాల వాస్తవ్యులు ఊటుకూరి వారి వంగడంలో అడుగుమోపిన లక్ష్మీకాన్తమ్మను త్రిపద గామినిగా జేసిబహు సుకృతిగా మార్చాయి. సంగీత విద్రుమ, సాహితీ రుద్రమగా కీర్తినందిన ఈమె తన స్వచరితను మనముందుంచారు. ఇది చాలు ఆమె ఎవరు? అని ప్రశ్నించుకున్న వారికి. ఒక గొప్పపని తన జీవితంలో నెరవేర్చారు. ఇలాంటివి సామాన్య దృష్టితో చూసేవారికి ఒకవ్యక్తి చరిత్రమాత్రమే. కాని ఇలాంటి రచనను కేవలం వ్యక్తి చరితంగా భావించడం అవిచార రమణీయం.



కేంద్రసాహిత్య అకాడమీ సభ్యురాలుగా డా॥ లక్ష్మీకాన్తమ్మ,
డా॥ రాధాకృష్ణన్, డా॥ గోపాలరెడ్డి, డా॥ భానుమతి గార్లతో



అఖిల భారత రచయిత్రుల మహాసభలో డా॥ లక్ష్మీకాన్తమ్మ,
డా॥ భానుమతి, లీలావతీమున్షీ, శ్రీమతి కాసు రాఘవమ్మ, డా॥ కృష్ణకుమారి

# సరసకవితా సరస్వతి

డా॥ వి.వి.యల్. నరసింహారావు,

రీజినల్ డైరెక్టర్, ఓపెన్ స్కూల్స్, హైదరాబాదు.

డాక్టరు ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి సాహిత్యము ఉదాత్తమగు ఒక 'సరస్వతీ సామ్రాజ్యము' మూర్తిభవించిన; 'మధుభారతి'.

'అఖిల భారత రచయిత్రుల' ఆంధ్ర కవయిత్రుల అఖండప్రజ్ఞ లక్ష్మీకాన్తమ్మగారి వలననే లోకమునకు సువిదితమైనది. ఆమె వెలిగించిన 'ఒక చిన్నదివ్వె' 'కాంతి శిఖరాలు' నిలిపి, సాహితీ జోతిర్మండలాలు సృష్టించింది. ఆమెదొక సుందర 'సదుక్తి మంజరి', మహనీయ 'మహిళా విక్రమ సూక్తము' కీర్తికాయులగు 'జాతిపిత' రులకుకూడ మెచ్చుగూర్చు సచ్చరిత్ర.

సిగ్గుచే పులకించెడు చిట్టి పెండ్లికూతులకు స్నిగ్ధకపోలములనుండి శిరసుపైదాక శుచిస్మిత చిరత్నరత్న 'లజ్జాకిరీటము' తొడవి, తొడవులకు తొడవుగా వధూతిలకమునుదిద్ది తీర్చిన దివ్యమంగళకరము లక్ష్మీకాన్తమాంబా కరము. ఆమె సాహితీతత్త్వవేదిని; సంగీతహృదయసంవాదిని.

'విమలగాంధర్వ మీరీతి విశ్రుతిగన బాలమురళి నీవాకడవె బాలుబాలు'ని కవితాగానము చేయగల 'గాన సౌందర్యమాధురీజ్ఞానమూర్తి' ఆమె. ఆంధ్రుల 'కీర్తన వాఙ్మయ కళాసేవ'కు అక్షర ప్రశంసలు అందించిన 'ఆంధ్ర సరస్వతి' ఆమె.

శ్రీ, కన్యక నుద్దేశించిన "సుప్రభాత గీత" దేవీస్తవమైన తారావళి నందించిన దివ్య కవిత - లక్ష్మీకాన్తా సమ్మిత సరస కవిత.



# అపర వాగ్దేవి లక్ష్మీకాన్తమ్మ

*దుగ్గిశెట్టి వెంకట రమణయ్య, నెల్లూరు*

సంగీత సాహిత్య విజ్ఞాన బ్రాహ్మీమూర్తి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. 1917 డిసెంబర్ 21వ తేది తూర్పు గోదావరి జిల్లా మండపేటలో జన్మించారు. 79 సంవత్సరాల సుదీర్ఘమైన, ఫలవంతమైన జీవితాన్ని గడిపి, సాహిత్యాంబరాన దీప్తి వంతమైన తేజోమూర్తిగా వెలుగొంది, ఈ డిసెంబర్ 1వ తేది బాపట్లలో పరమ పదించా రామె.

ఆమె ఏలూరులో జమిందార్లైన మోతేవారి దౌహిత్రి. ఆమె తండ్రి గౌతమీ గ్రంథాలయ స్థాపకులు, మధుర కవి, సంఘ సంస్కర్త నాళం కృష్ణారావు. ఆమె తల్లి ఆంధ్ర మహిళా గానసభ సంస్థాపక అధ్యక్షురాలు నాళం సుశీలమ్మ. వారి స్ఫూర్తితో తన జీవిత సరళిని, ధ్యేయాన్ని రూపొందిచుకొన్న అసమాన ప్రతిభాశాలి, మనీషా వతంసురాలు లక్ష్మీకాన్తమ్మ. సంస్కృతాంధ్రాలలో ఎన్నో గ్రంథాలు రచించారు. ఆమె రచించిన ఆంధ్ర కవయిత్రుల గ్రంథానికి 1953 లో తెలుగు భాషా సమితి ప్రథమ బహుమతి లభించింది.

అఖిల భారత రచయిత్రులు, ఆంధ్రుల కీర్తన కళాసేవ, శ్రీ కన్యకాపరమేశ్వరీ సుప్రభాతం, దేవీస్తవ తారావళి, జాతిపిత, సదుక్తి మంజరి, కాంతి శిఖరాలు, మహిళా విక్రమ సూక్తము, నా తెలుగు మాంచాల, లజ్జా కిరీట ధారిణి, నా విదేశ పర్యటన అనుభవాలు, సరస్వతీ సామ్రాజ్య వైభవాలు, సాహితీ రుద్రమ (ఆత్మకథ), చీకటి రాజ్యం వంటి గ్రంథాలు చాలా రచించారామె.

ఆమె పద్యాలను విశ్వవిద్యాలయాలు పాఠ్య భాగాలుగా తీసుకున్నాయి. చక్కని వక్త కూడా, ఆమె వాగ్ధాటి అనర్గళం. అఖండ గౌతమీ ప్రవాహం వలె వుంటాయామె ఉపన్యాసాలు. తెలుగు సాహిత్యం గురించి, హిందూ మత ధర్మం గురించి దాదాపు 3 వేల ఉపన్యాసాలు చేశారు. కేంద్ర సాహిత్య అకాడమీ నిర్వహించే సాంస్కృతిక వినిమయ యాత్రల్లో ఆమె జర్మనీ, జెకొస్లొవేకియా, రష్యా దేశాలు పర్యటించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆమెను మలేషియాలో జరిగిన తెలుగు ప్రపంచ సమావేశాలకు ప్రతినిధిగా పంపారు. కెనడా దేశం కూడా పర్యటించారు.

సాహిత్యంలోనే కాకుండా సంగీతంలోనూ నిష్ణాతురాలు; వీణావాదన, వక్తృత్వ పోటీలలో అయిదు బంగారు పతకాలను బహుమతిగా పొందిన అపర వాగ్దేవి.

1988 సం॥లో ఆమెకు అనంతపురంలో కె. రాధాకృష్ణయ్య శకుంతలమ్మ సంస్థ వారు

కనకాభిషేకం చేశారు. కళాక్షేత్రం వారు సరోజినీ నాయుడు జ్ఞాపకార్థంగా తెలుగు వెలుగుల బహుమతి ఇచ్చారు. ఆంధ్ర సరస్వతి, సంగీత సాహిత్య కళానిధి, అపర వాగ్దేవి అనే బిరుదులు పొందారామె. 1969లో అప్పికట్లలో మహాకవులు తుమ్మల సీతారామమూర్తి, కాకరపర్తి వెంకటేశ్వర్లు ఆమెకు గజారోహణ మహోత్సవం జరిపించారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆమెకు గౌరవ డాక్టరేట్ ఇచ్చి, కళా ప్రపూర్ణులుగా సత్కరించారు.

ఆమె ధర్మ పరాయణురాలు; సంఘ సేవకురాలు; రాజమండ్రి స్త్రీల సంస్కృత కళాశాలకు రు. 35 వేల నిధి సమీకరించి సమర్పించారు. అఖిల భారత రచయిత్రుల తొలి సమావేశానికి కార్యదర్శిగా, మహిళాభ్యుదయానికి పాటుపడిన సంఘ సంస్కర్త - ఆమె; 1969-71ల మధ్య బాపట్లలో స్త్రీల సంస్కృత కళాశాల నిర్వహించారు.

తన తండ్రి జ్ఞాపకార్థం 'మధుర కవి నాళం కృష్ణారావు విజ్ఞాన పీఠం' స్థాపించి పలువురు కవి పండితులను సన్మానించారు. తెలుగు విశ్వ విద్యాలయం వారు ఆమె బహుముఖ సాహిత్య సాంస్కృతిక జీవితాన్ని డాక్యుమెంటరీ ఫిల్మ్‌గా చిత్రీకరించారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ సెనేటు మెంబరుగా కేంద్ర సాహిత్య అకాడమీ, ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ సభ్యురాలిగా వ్యవహరించారు. ఆమె ఉపన్యాస ఓజస్వి, సాహిత్య తపస్వి, సంగీత మనస్వి, రచయిత్రిగా, కవయిత్రిగా, వక్తగా స్థిర యశస్సు నార్జించిన సుశ్లోక.

ఆమె విశిష్ట వినమ్రమూర్తి. వాగ్దేవి వాత్సల్య ప్రపూర్ణ, ఆమె ఆత్మ ప్రత్యయం అచలం, తన కృతి, తన దృష్టి, తన సృష్టి, తన భాతి, అనుభూతులను అనన్య సామాన్యంగా సాధించి తరించిన ధన్యజీవి. ఆమె జీవితం ఒక రసవత్తర కావ్యం. ఆమె అనుపమాన తేజోరాసి, ఆమె కీర్తి అజరామరం. ఆంధ్ర సారస్వత లోకానికి ఆమె లేని లోటు అపారం. అనంతం.

విరించి కృత మధురగేయం
కరంబు ధరిత్రి నలరించెన్
తరించే సూక్ష్మ తనువునన్
చరించ బోయె విహాయసమునన్

సంప్రదాయ గృహంబున జన్మమొంది
అనితరాసాధ్య సంస్కృత వనము నందు
విద్రుమద్రుమ విజ్ఞాన విసరణమున
దెసల దీధితుల్ ప్రసరించె తెలుగు కాన్త.

# ఆంధ్రికి అందాలు కూర్చిన
# ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

డా॥ పాకనాటి సూర్యకుమారి,
లెక్చరర్, టి.జె.పి.ఎస్. కళాశాల, గుంటూరు.

ఏ భాషనొకమాట హేలగా బల్కిన
వాణి మంజీర నిక్వాణ మొలయు
ఏ వాణి గీతికా ఋతులంచిత శ్రుతి
కమనీయమౌ మధుకచ్ఛపియగు
ఏ పల్కు శౌర్యరసేష్టియై తన మాతృ
దేవి రక్షణకు నాదేశమొసగు
ఏ కావ్యగీతికా లోకము నన్నయ
త్యాగయ కృతులకు రాగమొసగు
సర్వరసభావ సౌష్ఠవ పర్వమగుచు
తెలుగుజనముల పున్నెమై వెలసెనేది
దేశభాషల లెస్సయౌ భాషయేది?
అట్టి ఆంధ్రభాషాయోష కంజలింతు

అని శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ఆంధ్రభాషావైశిష్ట్యాన్ని కొనియాడిన తీరు మనోజ్ఞం. శారదాదేవి దయతో ఈమె కవయిత్రిగా రూపొందడమే కాక ఒక అపర వాగ్దేవియై ఆంధ్రుల నలరించింది.

"మధురకవి" నాళం కృష్ణారావుగారి కుమార్తెగా తెలుగు కవిత్వంలోని మెళకువలను వంటబట్టించుకొని, తాను కలంబట్టి నా తెలుగు మాంచాల వంటి కావ్యాలను సృష్టించి తెలుగు ఆడపడుచులందరికి మార్గదర్శకురాలిగా నిలిచి, అర్ధశతాబ్దికాలంపాటు నిర్విరామంగా సాహితీ వ్యవసాయం చేసి, ఇటీవలనే కన్నుమూసిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ జీవితం ఎంతో ఉదాత్తమైంది.

ఆమె ప్రత్యేక వ్యక్తిత్వాన్ని, కవిత్వంలోని విశిష్టతను, రచనలలోని వైవిధ్యాన్ని స్థాలీపులాక న్యాయంగా చర్చించడం ఈ వ్యాస ప్రధానోద్దేశం. ప్రతి పురుషుని విజయం వెనుక ఒక స్త్రీ ప్రోత్సాహం, సహకారం ఉంటాయని లోకంలో నానుడి. కాని శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ విజయం వెనుక ఆమె భర్త హయగ్రీవ గుప్తా గారి ప్రోత్సాహ, సహకారాలు

ఎంతో ఉన్నాయని ఆమె చెప్పారు. సంస్కృతాంధ్ర గ్రంథాలు: కవయిత్రిగా ఉపన్యాసకురాలిగా, పరిశోధకురాలిగా, అనువాదకురాలిగా ఆమె చిరకీర్తిని సంపాదించుకున్నారు. మూడు సంస్కృత భాషకు చెందినవి. 15 ఆంధ్రభాషకు చెందినవి. మొత్తం 18 పుస్తకాలు ఈమె వెలువరించారు.

సంస్కృత గ్రంథాలు "కన్యకాపరమేశ్వరీ సుప్రభాతమ్" దేవీస్తవతారావళి" "జాతిపిత' ' వేంకటేశ్వర సుప్రభాతాన్ని దృష్టిలో పెట్టుకొని కన్యకాపరమేశ్వరి సుప్రభాతాన్ని, దుర్గాదేవిని స్తుతిస్తూ దేవీస్తవతారావళి' ని రచించారు. లక్ష్మీకాన్తమ్మగారు బాల్యంలోనే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, గాంధీగారికి స్వయంగా విరాళాలందజేశారు. ఆయనపై గల భక్తిభావంతో రాసిన కావ్యమే, జాతిపిత.

ఆమె సాహిత్యాన్ని పరిశీలిస్తే మహిళలు, మహిళాభ్యుదయం, స్వాతంత్ర్యపోరాటం, అప్పటి నాయకులు అనే అంశాలకే ప్రాధాన్యమిచ్చినట్లు కన్పిస్తుంది.

ఆమె రాసిన తెలుగు గ్రంథాలలో రెండు పద్యకావ్యాలు వున్నాయి. 'మహిళావిక్రమ సూక్తము'లో చరిత్ర ప్రసిద్ధిగాంచిన రాణిరుద్రమ చాందుబీబి, రాణి అహల్య, గంగాదేవి, జిజియాబాయి, మాంచాల, వాసవి, చానమ్మ, కస్తూరిబాయి, సరోజినీదేవి మొదలైన మహిళల ప్రాధాన్యాన్ని వర్ణించారు.

"ఇంద్రతింతుల శౌర్యరసేప్టినేడు
భరత మహిళల నావేశ పరచెనేని
మాతృ భారతి దుఃఖము మాయునిజము
ప్రజల దైన్యమ్ము వాయుట నిజము సుమ్మ".

నేటి మహిళలు వారిని స్ఫూర్తిగా తీసుకొన్నట్లైతే ప్రజల బాధలు తొలగుట తథ్యమని భావించారు.

మరొక కావ్యం 'లజ్జా కిరీట ధారిణి'. 'స్త్రీలకు సిగ్గే సింగారం అన్న అలోచనను దృష్టిలో ఉంచుకొని ఈ వాక్యానికి ఈ పేరుంచటం జరిగింది. లజ్జా కిరీట ధారిణియగు భారత స్త్రీ పవిత్ర సౌశీల్యమే జగతికి రక్షయని విశ్వసించిన కారణంగా పుణ్యసతులైన మొల్ల ఝాన్సీలక్ష్మీబాయి, రుద్రమ, కస్తూరిబాయి, సరోజినీదేవి మొదలగువారిని గూర్చి ప్రస్తావించారు.

'నా తెలుగు మాంచాల' మరొక చక్కని గేయకావ్యం. ఇందులో మాంచాల పాత్ర పోషణ చేసిన తీరు పరిశీలిస్తే లక్ష్మీకాన్తమ్మగారికి మాంచాలపాత్రపట్ల, తెలుగు ప్రాంతం, తెలుగుభాష పట్ల ఉన్న అభిమానం వ్యక్తమౌతుంది. వివాహమైన ఏడు సంవత్సరాల పిదపకాని మాంచాల, తన భర్త బాలచంద్రుని చూడదు. ఇన్ని

సంవత్సరాల వరకు తనను భర్త నిరాదరించాడనే బాధను సూచించే భావాలన్నింటినీ మాంచాల కోపంతో, విరసంతో, నిష్ఠూరంతో కూడిన చూపులతో తెలిపిన విధానాన్ని లక్ష్మీకాన్తమ్మగారు ఇలా వ్యక్తపరచారు.

"పులుకు పులుకున జూచె
చూపు చూపున కోప
తాపమ్ము విరియంగ
- - - - - - - - - -
చూపు చూపునను నా
శూరవరు గుండె లద
- - - - - - - - - -
చూపు చూపున నతని
పాపమ్ము తూట్లుపడ'

ఇలా చూపుల్లో కోపాన్ని చూపటం, చిన్న చిన్న మాటలతో చెప్పదలచుకొన్న భావాన్ని చెప్పటం తిక్కన లక్షణం. మాంచాల సౌందర్యాన్ని చూచి బాలచంద్రుడు పరవశించిపోయాడు. కామాతురుడై కర్తవ్యాన్ని మరచాడు. వీరుడైన భర్త తన ధర్మాన్ని, జాతిరక్షణను మరిచి భోగలాలసుడు కావటం వీరజాతికే అవమానం. అది గుర్తించిన మాంచాల కర్తవ్యబోధచేసి బాలచంద్రుని యుద్ధానికి పంపి తాను యుద్ధానికి వెళ్ళి భర్తతో సహగమనం చేసినట్లు లక్ష్మీకాన్తమ్మగారు మాంచాల పాత్రను తీర్చిదిద్దారు. ఇందులో మాంచాల పాత్రద్వారా మగువలు స్వార్థాన్ని విడనాడి, ధైర్యంతో, విజ్ఞతతో దేశ ప్రయోజనం కోసం జీవితాన్ని అర్పణ చేయాలని సూచించారు.

ఆమె జీవితంపై స్వాతంత్ర్యోద్యమ ప్రభావం, ప్రత్యేకించి గాంధీగారి ప్రభావం బాగా ఉంది. అంధకారంలో మగ్గుచున్న భారతీయులకు వెలుగుచూపి, చేయూతనిచ్చి, భారతదేశ దాస్యశృంఖలాలు తెగగొట్టిన వీరనాయకమణి గాంధీగారు 'ఒక్కచిన్నదివ్వె' అని లక్ష్మీకాన్తమ్మగారి అభిప్రాయం.

"నిన్ను పూర్వఋషులు పోల్చి మహర్షి
యనుట మా వాచాలత
వారికేదీ అర్హమైన ఈ ఘనత?
సత్యాహింసలే నిత్యవ్రతముగ
స్వార్థత్యాగ విధి కృతమ్ముగ
జీవన పథమునధిగమించిన
ధైర్య హేమాద్రివి
సర్వస్వము త్యజియించిన

త్యాగహేమాద్రివి" అంటూ

బాపూజీని మహర్షులకంటే ఉన్నతస్థానంలో నిల్పి వర్ణించారు. లక్ష్మీకాన్తమ్మగారు భగవంతుని స్మరిస్తూ చెప్పబడిన భావగీతాల సంపుటి 'కాంతి శిఖరాలు'. ఈ గీతాలను చదివితే ఆమెపై కృష్ణశాస్త్రిగారి ప్రభావమెంతటిదో తెలుస్తుంది.

"తుడువకే కన్నీరు చెలియా
తుడువకే తుడువకే
జడి జడి జల్లులై
జలజలా పారనీ
తుడువకే
అనే ఈ గేయం మీద దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి
'కురియుమురా కన్నీటిని
మరిమరి విలపింపుమురా' అనే గేయ ప్రభావం కన్పిస్తుంది.

భగవంతుని కరుణా కటాక్షవీక్షణాల కోసం తపించి రచయిత్రి తన్నుతాను నివేదించుకొన్నట్లు ఈ కావ్యమంతటా ధ్వనిస్తుంది.

'ఓ కన్యకమ్మా'! అనే మకుటంతో 'కన్యకమ్మ నివాళి' అనే ముక్తక కావ్యాన్ని అధిక్షేపకాత్మకంగా ఆమె రచించారు. ఆరుద్రగారి 'కూనలమ్మ పదాలు' ఈ కావ్య రచనకు స్ఫూర్తినిచ్చినట్లు ఆమె చెప్పారు. ఈ కావ్యంలో విషాదం, చమత్కారం, ఆధ్యాత్మిక చింతన లోక పరిశీలనా నైపుణ్యం మొదలైన గుణాలున్నాయి.

"వేనవులగా బండ్లు
వేంకటేశుని గుండ్లు
మనసునిండా ముండ్లు

ఓ కన్యకమ్మ!

ఇందులో ఆధ్యాత్మిక చింతనకంటె కోరికతో చేరిన భక్తుల్ని ఆక్షేపించడం ధ్వనిస్తుంది.

"సదుక్తి మంజరి" హిందీ సాహిత్యంలో ప్రఖ్యాతిగాంచిన కబీర్‌దాస్, తులసీదాస్, రహీమ్, బృందావనదాస్ అనే నలుగురు భక్తకవులలోని 'దోహా'లను కొన్నింటిని 'సదుక్తిమంజరి' అనే పేరుతో తెలుగులోనికి అనువదించారు. ఈ కావ్యం చదువుతుంటే సంస్కృత శ్లోకాలను, వృత్త పద్యాలను రాయగలిగిన లక్ష్మీకాన్తమ్మగారేనా దేశఛందస్సులో ఇంత చక్కని పద్యాలను సృష్టించింది. అని అనిపించకపోదు. మూలంలోని దోహాలు తెలిస్తే తప్ప ఇవి అనువాదాలుగా అన్పించవు.

'మాలీ ఆవత్‌దేఖ్ కేర్ కలియన్ కరీపుకార్
పూలే పూలే చున్‌లియేకాల్‌హి హమారీబాద్' అనే దోహాను
'వనికి నేతెంచి మాలి యేదినమునందు
మించి వికసించు సుమముల నెంచిత్రుంచు
రేపు మనవంతు: బ్రదుకింతెలే" యటంచు
కుందువనిలోని చిన్నారి కుట్మలముల"

అని అనువదిస్తూ బ్రదుకింతేలే అని పూలచేత పలికించడం లక్ష్మీకాన్తమ్మగారి సొంత ప్రతిభకు తార్కాణం.

'సరస్వతీ సామ్రాజ్యవైభవం' తెలుగుసాహితీ రంగంలో ఇది ఒక ప్రయోగంగా నిలిచిపోతుంది. భువన విజయం, కవనవిజయం, యమసభ, ఇంద్రసభ మొదలైన రూపకాలలో ఎక్కువగా స్త్రీలకు అవకాశం లేకపోవడాన్ని గుర్తించి పెద్దల సలహామేరకు ఈ రూపకాన్ని తీర్చి దిద్దింది. ఇది పలుచోట్ల ప్రదర్శనకు నోచుకుంది. ఆకాశవాణి ద్వారా కూడా ప్రసారమైంది.

లక్ష్మీకాన్తమ్మగారు కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను, పలు సంస్థల వేదికలమీద, దేశవిదేశాల్లో కూడా కలుపుకొని దాదాపు 3000 పై చిలుకు ఉపన్యాసాలు చేసినట్లు తెలుస్తుంది. ఈ ఉపన్యాసాలు సాహితీ పరమైనవి. మహిళాభ్యుదయానికి చెందినవి.

ఈ విధంగా సాహిత్యరంగంలోనూ, సామాజిక రంగంలోను సేవచేసి, ఎన్నో బిరుదులను, కనకాభిషేక సత్కారాన్ని, గజాధిరోహణ సన్మానాన్ని పొందిన స్త్రీలు ఆధునికులలో లేరన్నా అతిశయోక్తికాదేమో.

మందారమాలలతో ఆంధ్రికి అందాలు కూర్చి, విందైన తన మనసుకు ఆనందం కల్గించుకొని, బ్రతికినన్నాళ్ళు రసరమ్యసాగరంలో మునిగితేలి, హైందవ సమాజ విశిష్టతను ఖండాంతరాలకు చాటి, ఒక పరిపూర్ణ జీవిగా కన్ను మూసిన లక్ష్మీకాన్తమ్మ ధన్యజీవి.

# రచనాదక్షతగల లక్ష్మీకాన్తమ్మ

- డాక్టర్ ద్వానాశాస్త్రి

"చదవకుండా, శ్రమపడకుండా వెంటనే కీర్తిరావాలి అనుకుంటున్నారు ఈ తరం. అలా వచ్చిన కీర్తి నిలవదు. ఎన్నేళ్ళు తపనపడితే ఓ మంచి కావ్యం వస్తుంది? ఇప్పుడు శాశ్వతమైన విలువల కోసం రచనలు చెయ్యడం తక్కువైపోయింది. ఇది కాలధర్మం అనుకోవాలి".

అని పదేళ్ళ క్రితం ముఖాముఖిగా తమ ఆవేదనను వెలిబుచ్చారు. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు. నాళం కృష్ణారావుగారి కుమార్తెగా మొదట్లో పేరు సంపాదించుకున్నా, ఆ తర్వాత పాండిత్యం సంపాదించి, పరిశోధనపై మనసు మళ్ళించి సాహిత్య ప్రపంచంలో తన కాళ్ళపై నిలబడ్డారు. ఆతరం (1917లో జన్మించారు) స్త్రీలు ఇంత 'విచ్చలవిడి'గా రచనలు చెయ్యడం చాలా అరుదు. అలా చేసే స్వేచ్ఛ కూడా వుండేది కాదు. పైగా సాంప్రదాయ కుటుంబంలో పుట్టి పెరిగిన వాళ్ళకి ఆ వెసులుబాటు తక్కువే. అయితే లక్ష్మీకాన్తగారి అదృష్టంకొద్దీ హయగ్రీవగుప్తాగారు భర్తగా దొరికారు. ఆయన లక్ష్మీ కాన్తంగార్కి పూర్తి రచనా స్వేచ్ఛ ఇచ్చారు. "మావారు నేను ఏం రాసినా, ఎక్కడికి వెళ్ళినా, ఎంతగా పుస్తకాల పురుగునైనా నా మీద కసురుకునేవారు కాదు - అదే నాకు సహకారమైంది" అనేవారు.

లక్ష్మీకాన్తంగారు ఏలూరులో పుట్టినా రాజమండ్రిలోనే పెరిగారు. నాళం కృష్ణారావుగారి అంశ ఈమెలో బలంగా వుంది. సంస్కృతాంధ్రాలలో మంచి పాండిత్యం సంపాదించారు. ఉభయ భాషాప్రవీణురాలైంది. ఆధ్యాత్మిక జ్ఞానం అలవడింది. "విద్వత్కవయిత్రీ తిలక" వంటి బిరుదులు చాలా లభించినా జమ్మలమడక మాధవరామశర్మగారి ఈ మాటల్ని అసలైన బిరుదు'గా గ్రహించాలి. "పేరులో, వాక్కులో, భావములో, సమాజములో, ధర్మములో, గృహములో లక్ష్మీకాన్తమ్మ కొంత స్వభావ, జిగిబిగి చేర్పుకూర్పుకల పొందిక ప్రియ భంగురము, స్పపంద సుందరము, భావభర భాసురము అయిన యొకానొక భాష తనకై తాను సృష్టించుకొనెను. వీణా వేణునాట్యభాషావిద్యాగీత సంగీత విశేషాభిజ్ఞయగుటలో హయగ్రీవ గుప్తాంగీకారమె సర్వహేతువు".

లక్ష్మీకాన్తమ్మగారిని చాలామంది కవయిత్రిగా ప్రశంసిస్తారు. పద్యకవిత్వంలో - దానికంటే గేయ కవిత్వంలో ఆమె సిద్ధహస్తురాలే. దేశభక్తిని ప్రబోధిస్తూ మంచి కవితలు మాత్రాఛందస్సులో రాశారు. స్త్రీల సాహసాన్ని, త్యాగాన్ని, అనురాగాన్ని వివరిస్తూ కవిత్వం రాశారు. అయితే ఎందుకోగానీ లక్ష్మీకాన్తమ్మగారిని 'కవియిత్రి'

అనటం కంటె పరిశోధకురాలు, విమర్శకురాలు అనటమే సమంజసమనిపిస్తుంది. "అఖిలభారత కవయిత్రులు", "ఆంధ్ర కవయిత్రులు" అనే గ్రంథాలు లక్ష్మీకాన్తమ్మగారిని పరిశోధకురాలిగా నిరూపిస్తాయి. "ఆంధ్రుల కీర్తన వాఙ్మయసేవ' ' అనే ఒక్క పుస్తకం చాలు ఆమె మంచి విమర్శకురాలని చెప్పటానికి. భారత కవయిత్రులు గురించి, తెలుగులోని కవయిత్రులు గురించి మొట్టమొదటగా పుస్తకం రాసిన ఖ్యాతి ఈమెకే దక్కుతుంది. నలభై అయిదు సంవత్సరాల క్రితమే కవయిత్రుల జీవితం - రచనలపై సమీక్షాగ్రంథం రాయటం ప్రశంసనీయమే. రెండు వందల మంది కవయిత్రుల వివరాలు సేకరించి సమీక్షించడం మామూలు పనికాదు. దానికి ఎంతో పట్టుదల, ఓపిక, ఆసక్తి వుండాలి, ఏ సంస్థలోనో చెయ్యవలసిన పని అది. లక్ష్మీకాన్తమ్మగారు సంగీత శాస్త్రంలో కూడా అభినివేశం మాత్రమే కాదు. పాండిత్యం కూడా కలిగి వున్నారు. దానికి సాక్ష్యం "ఆంధ్రుల కీర్తన వాఙ్మయ సేవ" అనే పుస్తకం ఇందులోవాగ్గేయకారుల గురించి మాత్రమే కాకుండా "పదములు - జావళీలు" "తత్త్వములు - సంకీర్తనములు", "స్త్రీల కీర్తన వాఙ్మయము", "బ్రహ్మ సమాజ కీర్తనలు - హరికథా వాఙ్మయమూ" మొదలైన అంశాలను విశ్లేషించారు. ఆమె సునిశిత పరిశీలనా దృష్టికి ఈ విమర్శ, ఉదహరణగా నిలుస్తుంది. పదవాఙ్మయ శాఖలు, పీఠాలు ఏర్పడకముందే "ఆంధ్రులకు గర్వకారణమైనట్టిదియు ప్రథిత భారతీయ, సాహిత్యములలో నొకటియై వాసిగాంచుచున్నట్టియునో తెలుగు సారస్వతమునందలి కీర్తన, లేక కృతి అను పేరుగల పదవాఙ్మయ శాఖ సహా విశిష్టమైనది" అని గుర్తించి ప్రచారం చేసిన కళోపాసకురాలు లక్ష్మీకాన్తమ్మగారు. ఇటీవలే వీరు మరణించారు.

"మనం మస్తిష్కంగల
మాన్యమూర్తులం
ఈ మాన్య ధరిత్రీమాత ప్రసవిం
చిన మహా పవిత్రమూర్తులం"

అని దేశభక్తిని చాటిన లక్ష్మీకాన్తమ్మగారు తొలితర కవయిత్రులలో, పరిశోధకులలో ముందువరసలోనే వుంటారు.

# కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

- డాక్టర్ కె. మలయవాసిని
తెలుగు శాఖ, ఆంధ్రా యూనివర్సిటీ.

సరస్వతీ స్వరూపిణి, కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు నాకు గురుతుల్యులు. ఆమెను గురించి మా నాన్నగారు ఆంధ్ర శేషగిరిరావుగారు గొప్పగా చెబుతూండేవారు. నాళం కృష్ణారావుగారి అమ్మాయి అనీ, ఆమె 'కృష్ణకుమారి' అనే పేరుతో 'నాచన సోమనాథుడు - నవీన గుణ సనాథుడు' అనే విమర్శక వ్యాసం రాసారనీ దాన్ని వెదికి తీసి నాకు ఇచ్చారు. 1960లో నన్ను తెలుగు ఆనర్సుకు పంపుతూ ఇచ్చిన పుస్తకాల్లో ఆ పుస్తకం కూడా ఒకటి. ఆమె పేరు, ఆమె రచన అలా పరిచయం అయ్యాయి నాకు.

ఆ తరువాత ఆమె రాసిన ఆంధ్ర కవయిత్రులు పరిశోధక గ్రంథం ద్వారా ఆమె పరిచయం అయ్యారు. ఆనర్సు క్లాసులో ఆమెను గురించి ఆమె ఉపన్యాసధోరణి గురించి ఆచార్య యస్వీ జోగారావుగారు బహుధా ప్రశంసిచేవారు. వారి మాటలు విన్నప్పుడల్లా ఆమె ఉపన్యాసం వినాలనే కూతూహలం పెరుగుతూ ఉన్నది.

1961లో వారి అమ్మాయి శ్రీమతి సుహాసిని ఎం.ఎ. లో చేరింది. మేమిద్దరం ఎంతో సన్నిహితంగా మసలే వాళ్లం. శ్రీమతి సుహాసిని నన్ను సహోదరిగా భావించి ఎన్నో విషయాల్లో నాకు మార్గదర్శకంగా ఉండేది. ఇప్పటికీ ఆమెకు నామీద అవ్యాజమైన ప్రేమే. ప్రియమైన చెల్లీ అని ఉత్తరాలు రాస్తూ ఉంటుంది.

1962లో మహారాజా కాలేజీ విజయనగరం ప్రిన్స్‌పాల్ వసంతరావు వెంకటరావు గారు శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారిని ఆ కళాశాల వార్షికోత్సవానికి ప్రధాన అతిధిగా ఆహ్వానించారు. ఆమె విశాఖ వచ్చారు. కంచెర్ల వారి యింట్లో బస చేశారు. మా హాస్టల్ విద్యార్థినుల అభ్యర్థన మేరకు హాస్టల్‌లో చక్కని ప్రసంగం చేసారు. శ్రీనాథుడు వర్ణించిన 'కంచుగీసిన తెరంగున ఎలుంగెత్తి" భాషించడం ఆనాడు విన్నాను. ఆ వాక్పటిమ, ఆకంఠమాధుర్యం, ఆ భావగాంభీర్యం, ఆ విషయ విశ్లేషణా పద్ధతి ఈ నాటికీ నా చెవుల్లో మారుమ్రోగుతూనే ఉన్నాయి. చదువుకునే ఆడపిల్లలు సంఘంలో ఎంతధైర్యంగా వ్యవహరించాలో, కార్యకలాపాలు ఎలా నిర్వర్తించుకోవాలో, సాంఘిక దురాచారాల్ని ఎలా ఎదుర్కోవాలో, ఎట్టి పరిస్థితుల్లోనైన మన సంస్కృతి సంప్రదాయాల్ని ఎలా పరిరక్షించుకోవాలో వివరించి చెప్తున్న విధానానికి ఆనాడు ముగ్ధులమైపోయాం. హాస్టల్ వార్డెన్ శ్రీమతి రుక్మిణమ్మగారు లక్ష్మీకాన్తమ్మగారిని ప్రియమార కౌగలించుకుని ఆమె ఉపాన్యాసాన్ని పలురీతుల కొనియాడారు. మీరంతా

ముందు ధైర్యంగా మాట్లాడడం నేర్చుకోండి అంటూ మమ్మల్ని హెచ్చరించారు ముగింపు మాటల్లో.

ఆమార్నాడు డా॥ లక్ష్మీకాన్తమ్మగారు విజయనగర ప్రయాణం. సుహాసినితోపాటు నన్నూరమ్మన్నారు. మేమంతా కారులో విజయనగరం వెళ్ళాం. వేంకటరావుగారికి పరిచయం చేస్తూ ఆమె సుహాసిని, ఈమె మలయ వాసినీ. ఇద్దరూ మా అమ్మాయిలే అన్నారు. ఆ తరువాత ఆంధ్ర విదుషీమణులు రాసిన ఆంధ్ర శేషగిరిరావుగారి అమ్మాయి. ఇద్దరూ వాల్తేరులో ఒక హాస్టల్‌లో ఉన్నారని పరిచయం చేసారు. ఆనాటి నుండి నన్ను అమ్మాయిగానే చూసుకున్నారు. మహారాజా కాలేజీలో పెద్దవేదికమీద వేయిమందికి పైగా ఉన్న విద్యార్థుల సభలో - అంతకు ముందు వక్తలు మాట్లాడుతూ ఉండగా కోతి చేష్టలు చేసిన విద్యార్థులు - శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి జలదస్వన గంభీరోపన్యాసం ప్రారభం కాగానే చేష్టలు దక్కి కూర్చున్నారు. "వింజమాకిడి నట్లుండె విశ్వసభయు అన్న వాక్యం గుర్తుకి వచ్చింది. ఉపన్యాసం చివరిలో ఎవరో విద్యార్థి కూసిన కూతకి ఆమె - ఈ సభలో "శీతమర్కటాలే" అనుకున్నాను - పుంస్కోకిలలు కూడా ఉన్నాయేఅంటూ, ఆ అల్లరిని తీవ్రంగా నిరసిస్తూ మందలించారు. వేంకటరావుగారు ముగింపుమాటల్లో ఆమె మందలింపు కూడా మధురగంభీరంగా ఉందని చమత్కరించారు. ఆమెతో పరిచయం ఒక మహద్భాగ్యం. ఆమె ఉపన్యాసం వినడం ఒక అదృష్టం.

మా ఆడపడుచుగారి ఊరు బాపట్ల కావడంతో బాపట్ల వెళ్ళినప్పుడల్లా ఆమెను చూసివచ్చేదాన్ని ఎప్పుడు మాట్లాడినా ఆమె రాసిన పుస్తకాల గురించో, ఆమె నిర్వహించిన సభల గురించో ఎంతో ఉత్సాహంగా చెప్తూ ఉండేవారు. వార్ధక్యమనేది వారి మనస్సుకు అంటనేలేదు. ఆమె నిత్యోత్సాహి 'అఖిల భారత రచయిత్రులు కూరుస్తున్న రోజుల్లో ఒకసారి వారి ఇంటికి వెళ్ళాను. ఆ రచనకు సంబంధించిన వ్యాసాలన్నీ పెట్టుకుని ఎంతో దీక్షతో పనిచేస్తున్నారు. ఆ దీక్ష ఆమెకు దైవదత్తం అని పించింది.

లక్ష్మీకాన్తమ్మగారు ఆమె రాసిన 'నా తెలుగు మంచాల' పుస్తకానికి నన్ను పుత్రికా వాత్సల్యంతో పీఠిక రాయమని కోరడం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. అది ఆమె నాకు కలగజేసిన ఒక మంచి అవకాశంగా భావిస్తూ ఉంటాను. ఆ పుస్తకం తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం కూడా పొందింది.

ఆమె గురించి చెప్పవలసిన మరో ముఖ్య విషయం 1976లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ స్వర్ణోత్సవాల్లో ఆమె అందుకున్న కళాప్రపూర్ణ గౌరవం గురించి. నేను ఆంధ్ర

విశ్వకళాపరిషత్‌లో లెక్చరర్‌గా జేరిన కొత్త. తెలుగు సాహిత్యరంగంలో కృషిచేసిన ఈ విదుషీమణికి అందిన గొప్ప పురస్కారం అది. ఆనాడు ఆమె ముఖంలో వెలిగిన విజయగర్వరేఖ ఈ నాటికీ మర్చిపోలేను. నిరంతరం చిరుహాసంతో నిండయిన విగ్రహం ఆమెది. ఆనాడు ఎందరో ఆమెను అభినందనలతో ముంచెత్తారు. ఆదృశ్యం చూసే భాగ్యం నాకూ కలిగింది.

ఆ తరువాత మళ్లీ ఏలూరులో శ్రీమతి సుహాసిని పుస్తకావిష్కరణ సభలో ఆమందస్మితీ విజయరేఖ ఆమెలో చూసాను నేను. తల్లీకూతుళ్ళు కలిసిరాయడమే అపురూపం. అందునా కలిసి ఒక వ్యాస సంపుటిని కూర్చడం అపూర్వం. ఆనాటి సభ ఎంతో విలక్షణంగా జరిగింది. ఆ సభలో ప్రత్యేకత శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు తనకు లభించిన గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని తమ వారసురాలు సుహాసిని చేతికి తొడిగి మురిసిపోవడం అదొక అపూర్వ సన్నివేశం. ఆనాడే నాకు ఆమె 'సాహితీరుద్రమ' స్వీయచరిత్రను 'సరస్వతీ సామ్రాజ్యవైభవము' అనే రూపకాన్ని బహూకరించారు. ఆమె స్వీయ చరిత్ర చదువుతూ ఉంటే ఎంత సాహిత్యకృషి, ఎంతటి సాంఘిక కృషి - ఇల్లాలై, తల్లియై కూడా అవిశ్రాంతంగా శ్రమించారీమె అనిపించింది. బాల్యం నుండి తన ఉపన్యాసాలతో ఆంధ్రజాతిని ఉర్రూతలూగించి, ఉత్తేజపరచిన ఉపన్యాస శిరోమణి ఆమె. ఉపన్యాసకురాలిగా ప్రసిద్ధికెక్కిన తొలితెలుగు మహిళామణి ఆమె.

గుప్తా ఫౌండేషన్ వారి ప్రతిష్ఠాత్మక పురస్కారాన్ని అందుకునే లోపు ఆమె ఈ లోకం నుండి నిష్క్రమించారు. ఆంధ్రదేశంలో ఆమె అందుకోని పురస్కారం లేదంటే అతిశయోక్తిలేదు. ఆమెవల్ల ప్రభావితులైన మహిళామణులెందరో, ఆమెకు పరోక్షశిష్యు లెందరో ఆదీరురాలు స్త్రీ జాతికి మార్గదర్శకురాలు.

తెరచిన పుస్తకంవంటి ఆమె జీవితం సర్వులకు పఠనీయం.



మైసూరు ఆర్యవైశ్య సభలో ప్రసంగిస్తున్న డా॥ లక్ష్మీకాన్తమ్మ




బెంగుళూరు ఆర్యవైశ్య మహిళా మండలి సమ్మేళనంలో పాల్గొన్న డా॥ లక్ష్మీకాన్తమ్మ

# లక్ష్మీకాన్తమ్మగారి ప్రతిభా పాండిత్యాలు

- నూలి వెంకటలక్ష్మీదేవి రంగారావు
గౌరవ అధ్యక్షురాలు
ఆం.ప్ర. వైశ్యమహాసభ మహిళా విభాగం.

నవనవోన్మేష శాలినియగు ప్రజ్ఞకే ప్రతిభయని పేరు. అట్టి సర్వతోముఖమైన ప్రతిభ వివిధ రూపాలలో లక్ష్మీకాన్తమ్మగారి రచనలలో అభివ్యక్తమయినది. వీరి రచనలు వీరి సృజనాత్మక, విమర్శనాత్మక, వర్ణనాత్మక ప్రతిభలకు నిదర్శనాలు. వీనియందెల్లె డల దైవభక్తి, దేశభక్తి, సమాజసేవాసక్తి, కవితాశక్తి, సాహిత్యరక్తి, ఆత్మపరిశీలనా సక్తి, సంస్కృతీ ప్రవీణత అనే వీరి గుణాలు భాసిస్తుండటాన్ని గమనించగలం.

వీరి రచనలను మూడు విధాలుగా విభజించవచ్చును ఒక చిన్నదివ్వె, కన్యకమ్మ నివాళి, నా తెలుగు మాంచాల, మహిళా విక్రమ సూక్తం, మనసాహితి - మధురభారతి, సరస్వతీ సామ్రాజ్య వైభవం. లజ్జాకిరీటధారిణి, కాంతి శిఖరాలు, శ్రీ కన్యకాపరమేశ్వరీ సుప్రభాతమ్ (సంస్కృతం) - అనునవి సృజనాత్మక రచనలు. ఆంధ్రకవయిత్రులు, ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళాసేవ-అనునవి విమర్శనాత్మక రచనలు. నా విదేశ పర్యటన అనుభవాలు, సాహితీ రుద్రమ (స్వీయ చరిత్ర) - అనునవి వర్ణనాత్మక రచనలు. వీటన్నింటిలోను వీరి ప్రతిభా పాండిత్యాలు వ్యక్తమౌతాయి.

'ఒక చిన్న దివ్వె' లో 'ఓహో మహాత్మా - ఓ మహితాత్మా' అనే కవితా ఖండికలో వీరి ఉక్తివైచిత్రి గమనింపదగి ఉంది.

'నిన్ను పూర్వఋషుల పోల్చి మహర్షియనుట

మావాచాలత,
వారికేది ఆర్షమైన ఘనత'
'జీవనపథము నధిగమించిన
ధైర్యహిమాద్రివి
సర్వస్వము త్యజియించిన
త్యాగహేమాద్రివి'
'రాగమందు త్యాగబుద్ధిజొనిపి
రాగభోగమ్ముల త్యాగమ్మొనరించిన
రాజయోగి నీవు !

గాంధీజీని ధైర్యహిమాద్రిగా, త్యాగహేమాద్రిగా పోల్చి చెప్పడం చాల సమంజసంగా ఉంది. రాజయోగిగా చెప్పిన తీరు, పూర్వ ఋషులకంటె గొప్పవాడని చెప్పినవిధం

వారి ఉక్తి చమత్కారానికి నిదర్శనం. 'ఆనంద రసహేల' అనే ఖండికలో సాయంకాల చండీశుతాండవ వర్ణనలోని శబ్దగుంఫనం వారి ప్రతిభా పాండిత్యాలకు నిదర్శనం -

'ప్రళయ మరుతోద్గార ప్రభంజనాలంకార'
'చంద్రప్రభాస్థపిత సౌదామనీమహిత'
'మందాకినీ కవిత మధుర సుధాప్లవిత'
'మంజుమంజులగీతి శింజన్మణీనూపుర
చ్ఛటా విభ్రాంత కాంతి మందహాసోత్ఫుల్లమా' . . .

ఈ విధంగా ఓజోగుణ భరితంగా సాగినరచన శివతాండవవర్ణన సందర్భంలో నృత్య, సంగీత, సాహిత్యముల మేళవింపుతో, సంస్కృత సమాసాలతో ఔచితీ రుచిరంగా ఉంది.

'కన్యకమ్మనివాళి' మాత్రాఛందంలో నడచిన నీతి ప్రబోధాత్మక కావ్యం. సున్నితమైన భావాలు సూటిగా ఎదనుతాకేవిధంగా ఈ రచన సాగింది. ఇది వీరి సృజనాత్మక శక్తికి, సూక్ష్మవివేచనా శక్తికి నిదర్శనం -

'చుక్కలంటే ధరలు
బక్కవాడికి ఉరులు
లంచగొండికి సిరులు
ఓ కన్యకమ్మా !
ప్రజల రక్తము పిండి
పన్ను హెచ్చుగ దండి
ప్రభుత నెఱపుట మొండి
ఓ కన్యకమ్మా !
మంత్రి రౌడీకి రక్ష
మంత్రికి రౌడీ రక్ష
పేదవి చేటురా కక్ష
ఓ కన్యకమ్మా !

ఇది సమాజహితాన్నికోరి చెడును వేలెత్తి చూపిన కవితల ఖండకావ్యం.

'మన సాహితి - మధుభారతి' రచన వారిలోని అభ్యుదయ భావాలకు మణిదర్పణం-

"గడ్డ కట్టిన రక్తం
అభ్యుదయ భానుని కిరణకాంతులకు

*కఱఁగి, స్వేదజలాల కాలువుగా ప్రవహించి*
*ప్రజల దుఃఖదైన్యాలను పోరార్పదా !*

*ఈ చిమ్మచీకటి విరిగి*
*ఈ అనంత విశాలవిశ్వం కొమ్మల ఱెమ్మలలో*
*విరగబూసిన వసంతోదయం*
*మన నేత్రేంద్రియ తర్పణం చెయ్యదా !*
*ఎందుకు నయన తర్పణం చెయ్యదు !*

అదే ఉషోదయం !"

ఈవిధంగా ఈగేయాలలో వారి అభ్యుదయ భావాలకు రూపకల్పన చేశారు.

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి కవితావాహినిలో వికసించిన వేరొక కావ్యపుష్పం 'నా తెలుగు మాంచాల'. తెలుగువారి ఆడపడుచు దేశభక్తికి, కర్తవ్యనిష్ఠకు ఉదాహరణగా నిలిచిన ధర్మశీల మాంచాల. ఈమె సమగ్ర వ్యక్తిత్వమును ఆవిష్కరించిన కావ్యమిది. దీనియందు ఐతాంబ, బాలచంద్రుడు, మాంచాల - ఈ ముగ్గురు ప్రధాన పాత్రలు. ఐతాంబలోని పుత్రవాత్సల్యం, బాలచంద్రుని సతీ ప్రణయం, మాంచాలలోని పతిభక్తి ప్రస్ఫుటంగా వ్యక్తమగుచూనే ముగ్గురిలో మాంచాల ఉన్నతమైన ఆదర్శవ్యక్తిత్వం సంపూర్ణంగా ఆవిష్కరింపబడినది. వీరి పాత్రలను చిత్రించుటలో కవయిత్రి చూపిన ప్రతిభ ప్రశంసింపదగినది.

ఐతాంబ పాత్రలో తల్లి మనస్సు గొప్పదనం సూచన ఉంది. దేశభక్తి, పుత్రవాత్సల్యం ఈ రెండింటిలో పుత్రవాత్సల్యమే తల్లి మనసును జయించినది. కావుననే ఐతాంబ బాలచంద్రుడు యుద్ధానికి వెళ్ళుటకు సిద్ధపడుచుండగా తనకుమారునికి ఎట్టి ఆపద సంభవించునోయని ఐతాంబలోని తల్లిహృదయం తల్లడిల్లినది. ఆమె తనయుని చేరదీసిన విధానాన్ని కవయిత్రి ఇట్లు వర్ణించారు.

*'రతిరాజు మెచ్చేటి*
*రణశాస్త్రకోవిదుని*
*తన తనయు గనుగొనుచు*
*కఱవెల్ల దీరంగ*
*కాంక్షననలెత్తంగ*
*నొడలెల్ల పుడుకుచును*
*కడుప్రేమ లాలించి*
*కరములను దానెత్తి*

నెఱికురులు సవరించి
శిరసు మూర్కొని ప్రేమ
తలను మెటికలు విఱిచి
తల్లి యైతమ పలికె''

ఇందు తల్లి పుత్రప్రేమ స్వభావసిద్ధమైన రీతిలో లలిత పదజాలంతో సరళంగా, రసస్ఫూర్తి కల్గింపచేస్తూ వర్ణించారు.

ఎంత వారించినను కొడుకు యుద్ధానికేగుటకే ఉత్సాహపడుచుండగా ఎట్లైనను అతనిని యుద్ధవిముఖుని చేయవలెనని ఉపాయంతో అతనిని భార్య మాంచాలతో చెప్పి యుద్ధానికి వెళ్ళమని పంపినది. మాంచాల రూప, గుణ, సౌందర్యాలకు అతడు ముగ్ధుడై ఆమె ప్రణయంలో యుద్ధవిషయం మరచునని ఆ తల్లి ఆశపడినది. కాని ఆవిషయం అతనికి తెలియనీకుండగ యుద్ధానికి ప్రోత్సహించుచున్నట్లుగనే ఆమెచే మాట్లాడించిన తీరు మాతృమమతకు ప్రతీక.

'యుద్ధమ్మునకు నేగ
సిద్ధపడుటకు ముందు
నీవు, నీ యర్ధాంగి
నిర్మలాంత కరణ
ధర్మమున, నీకు శుభ
కర్మఫల సిద్ధ్యర్థ
మొసగు శుభాశిషము
లొకపరింగైకొను, ట
త్యంత మావశ్యక మ
త్యంత శుభదమ్మను''

అని మాంచాలకడకు తప్పనిసరిగ వెళ్లునట్లుగ పలికినది.

ఇక చివరిగా మాంచాల దేశభక్తిని, త్యాగనిరతిని రచయిత్రి వ్యక్తం చేసినవిధం సాహిత్యలోకానికే మకుటాయమాన మనదగింది -

సతియయ్యె మాంచాల - వీరసతి యయ్యెనే
నాతెలుగు మాంచాల - నాణెంపు పతిశీల
మందార సుమమాల - నాణెంపు పతిశీల
మందార సుమమాల - మా మగువ మాంచాల..'
వీర ధర్మమే కాని - ప్రేమ ధర్మమెఱుగని

ముగ్ధతో పసియాయె . . . . . . . . . . . . . .'
'బలిపశువుగా దాను - అసువులనే విడనాడి
మంటలన్ మసియాయె . . . . . . . . . . . .'

ఇంతటి గంభీర సన్నివేశాన్ని అలకి అలకి పదాలతో చిత్రించిన కవయిత్రి ప్రజ్ఞా పాటవ మెంతటిదో సహృదయ హృదయైక వేద్యమనడం అతిశయోక్తి కాబోదు.

'మాంచాల దేహమ్ము మంటలోపల పొగిలి కుమిలి బూడిద యాయె
మాంచాల ఘనకీర్తి మంటతో తాగలిసి మింటికెగసెను గాదె . . .'

ఇది ఎంత సునిశితమైన భావన -

'కాలము కదలుచు పోవును - కాని మనుష్యులు, ప్రవృత్తి,
శీలము, భావము, ధర్మము - కాలము నందున నెన్నడు
కదలక నిలచియె పోవును.'

జీవక సత్యము మనముల నిలచిపోయే విధంగా చిత్రీకరించిన విధం ఇది.

ఈ 'నా తెలుగు మాంచాల' కావ్యం తెలుగు జాతి గుండెల్లో చిరస్థాయిగా నిలచి వుండే వీర రసస్ఫూర్తి దాయకమైన కావ్యం.

నవవిధ భక్తి మార్గాలలో ఆత్మసమర్పణమనునది సర్వోత్కృష్టమైనదిగా భావింపబడుతూ ఉంది. 'త్యాగేనైకేన అమృతత్వమానశుః' త్యాగం చేతనే అమృతత్వం పొందగలమని భారతీయ తత్త్వ సిద్ధాంతం. అట్టి త్యాగానికి పరాకాష్ఠయే ఆత్మసమర్పణం. ఈ ఆత్మసమర్పణ మార్గంలో భక్తుడు భగవంతునితో తాదాత్మ్యం చెందినట్లు భావిస్తాడు. తనకంటూ ఎట్టి ప్రత్యేకతలూ మిగలవు. అంతా భగవన్మయంగా భావించి, దానిలో తాను లీనమవుతాడు. ఈ భక్తితత్త్వం వంటబట్టిన లక్ష్మీకాన్తమ్మగారి 'కాంతి శిఖరాలు' లోని గీతమాధుర్యం అందరికీ ఆస్వాదయోగ్యం

'ఎందుకో నామనస్సెందుకో' - అనే గీతంలో

'జాతిలోపల ప్రీతి
మ్రానులోపల మమత
నదులలో జీవనము
కడలిలో స్పందనము'
'ఈవిశ్వరీతిలో
ఈ వివిధ ప్రకృతిలో
నీ వికాసమే శశ్వ

(ప్ర)కాశమై యలరు
ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు'

ప్రకృతి యందంతటా ఆపరమాత్మ వ్యాపించినట్లుగా భావించటం ఇందులో కనిపిస్తుంది.

'నిఖిలమౌభువనాలు నిండి వెల్గెద మోయి' అనే గీతంలో
'చూపు చూపులు లేక
పలుకు పలుకులు లేక
నిశ్చలమౌ నీరవమౌ
నిబిడ ప్రాత్రీమలతో

నిలిచి పోదమటోయీ
విలుచు కొందము
విపుల జగతీ సారము నీశా !

మాటలకందని భావనను మాటలలో అందించిన తీరు కడు రమ్యం. ఒక భక్తుడు భగవంతునితో తాదాత్మ్యం చెందినవిధం దర్శనమిస్తుంది.

ఇదేవిధంగా 'క్రొందమింజిందేటి అందగాడా' అన్నగీతంలో

'నింగినేలను నిండు నాస్వామి నిన్నెపుడు
పిల్లతెమ్మెరనై అల్లుకొనియేనురా ..'

అనడంలో చక్కని భావన ఇమిడి ఉంది. విశ్వమంతా వ్యాపించినవాడు పరమాత్మ. వాయువు కూడా వ్యాపకత్వలక్షణం కలదే. అందుకే భక్తురాలు తాను పిల్లతెమ్మెరై అంతటా వ్యాపించి సామితో తాదాత్మ్యం చెందాలని భావిస్తోంది.

వీరి భక్తి ప్రపత్తికి మణిదర్పణం వీరి 'శ్రీకన్యకాపరమేశ్వరీ సుప్రభాతమ్, దేవీస్తవతారావళీ' అనే కావ్యాలు. వీరి సంస్కృత భాషా పరిజ్ఞానం, వీరి సంస్కృత సాహితీ విభవం వీనిలో కనబడుతాయి. వీరికి తెలుగులో వలెనే సంస్కృతంలో కూడ అలవోకగా శబ్దాలు శ్లోకాలలోకి వచ్చి చేరతాయని ఈశ్లోకాలలోని ధారాశుద్ధిని బట్టి చెప్పవచ్చు -

సృష్టిస్థితి ప్రళయ కారణ మూలరూపా
కన్యా శివప్రణయినీ కలిహారిణీ త్వమ్
అగ్నిప్రవేశ సుభగా కిల లోకమాతా
శ్రీ కన్యకే పరశివే తవ సుప్రభాతమ్॥

ఈవిధంగా కన్యకా సుప్రభాతమంతా సహజ సుందరంగా, మృదుమధురంగా సాగింది.

వీరి భక్తి ప్రధానకృతులలో 'దేవీస్తవ తారావళి' రచనా విషయికంగా విశిష్టతను సంతరించుకున్నది. ఇందులో 28 శ్లోకాలున్నవి. ఇందు చాలా శ్లోకాలలో శ్లోకం ఏ హల్లుతో ప్రారంభమైందో, అందులో ప్రతిపదం అదేహల్లుతో ప్రారంభమై యుండటం ఇందలి విశేషం. ఉదా:

కామ్యే కామ్యపుమర్థధాత్రి కమలే కామేశి కల్యాణదే . . .
రామే రమ్యగుణే రవీన్దునయనే రాకేన్దుబింబాననే . . .
చంద్రే చంద్రకలావతంస మహితే చంద్రప్రకాశాధికే . . .

అన్త్యానుప్రాస, యమకాలను కూడా విరివిగా వాడటం జరిగింది. శబ్దపుష్టి, భావగంభీరతలతో ఈ కావ్యం అలరారుతోందని చెప్పవచ్చు.

వీరి కవిత్వ ధార మధురరస గుంభితమై శోభిల్లిన మరొక ఖండకావ్యం - 'లజ్జాకిరీట ధారిణి'. మాన్య మహనీయ కీర్తి చంద్రికలను నలుదెసల వెదజల్లిన స్మరించిన ఖండికలిందున్నవి. భావానుగుణమైన పదాల పోహళింపు ప్రశంసావహమై ఉంది.

మొల్ల - ఆత్మనివేదనము అనుఖండికలో మొల్ల శ్రీరాముని నీలమేఘ శరీరమును వర్ణించిన తీరు గమనింపదగినది.

> "కమ్మనిఇంద్రనీలమణికాంతులు వాకలుగట్టె దిగ్దిగం
> తమ్ముల, స్వామి భవ్యకరుణా తరుణా భ్రమనంగా భక్తులన్
> సమ్మతి బ్రోవగా ప్రభుడు సాచిన హస్తమనంగ దైత్యవ
> ర్గమ్ముల దర్పమార్పగ ఛటాలునదూసిన ఖడ్గమోయనన్"

ఇందులో రామునిదేహచ్ఛాయ ఇంద్రనీలమణికాంతులుగా సంభావింపబడినది. ఆ కాంతి ప్రవాహం దయారూపమైన మేఘంగా, భక్తుల బ్రోచుటకై సాచిన ప్రభుని హస్తంగా, రాక్షసులను చంపుటకు దూసిన ఖడ్గంగా ఊహింపబడింది. ఒకే వస్తువును భిన్న భిన్న వస్తువులుగా సంభావించడం ద్వారా ఉల్లేఖాలంకారం కూడా ఇందులో అలంకరింపబడిందనవచ్చు. దేహకాంతిని తరుణాభ్రంతో పోల్చడం కవయిత్రి భావనాపటిమకు నిదర్శనం. అంటే రామునిదేహం నిగనిగలాడుతూ అంత సౌందర్యంగా ఉందని ఇందలి భావం. అభయహస్తంగా భావించడమే గాక, ఖడ్గంగా భావించడం చేత భక్తుల పాలిట వరదుడు, రాక్షసులపాలిట యముడని చెప్పినట్లయింది.

ఇది రాముని వ్యక్తిత్వాన్ని ఆవిష్కరిస్తున్నది.

బాపూజీ త్యాగశీలతను, సత్యనిష్టను, మాతృదేశ దాస్య శృంఖలాలను త్రెంచుటకు సల్పిన కృషిని ప్రశంసించుట భారతీయ కవులకు ఆత్మగౌరవకారకమనవచ్చును. కవయిత్రికి బాపూజీ అనిన గౌరవం మెండు. 'పూజ్య బాపూజీ' అను ఖండికలో బాపూజీని ఈవిధంగా వర్ణించారు -

'ఎవ్వాని త్యాగమ్ము లీరేడు భువనాల
కళ్యాణరేఖలై కాంతినిచ్చె
. . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . .

ఈ పద్యం చదవగానే తిక్కన ధర్మరాజును పరిచయం చేసిన 'ఎవ్వాని వాకిట నిభమద పంకంబు . . .' అను పద్యం గుర్తురాకపోదు. పద్యం ఎత్తుగడే కాదు, చివరివరకూ అదే బిగితో సీసపద్యాన్ని నడిపి శ్రీమతి లక్ష్మీ కాన్తమ్మగారు తమ రచనాపటిమను నిరూపించుకొన్నారు.

ఇదేవిధంగా మరొక పద్యానికి చక్కగా విరోధాభాస నలంకరించారు-

మోహనుండై ధరమోహింపజేసి, దా
నింద్రియ భోగ మోహితుడు గాడు -
కర్మచంద్రుడయి నిష్కామమౌకర్మసం
ఘటియించి, కర్మలంపటుడుగాడు
కరుణ సాంద్రుండయి కడతేర్చె గోవు న
హింస కేమాత్రమహితుడు గాడు
సౌగంధ్య గంధియై స్వార్థరహితుడయ్యె
గుణధర్మసుఖవిముఖుండు గాడు
పరులనైనను సమ్మోహపఱుపగల్గు
వాగ్మి; మితభాష ! నెపుడతి భాషికాడు
ఆర్షధర్మ ప్రవృత్తి మహాత్ముడైన
గనుడు ! గాంధి ! అనాగర జనుడు కాడు !

ఇందు కవయిత్రి చక్కని ఆలంకారిక రీతిని ప్రదర్శించారు.

మోహనుడు, మోహితుడు కాదు; కర్మచంద్రుడు, కర్మలంపటుడుకాదు; గోవును కడతేర్చి, అహింసకు అహితుడుకాడు, స్వార్థరహితుడు, సుధివిముఖుడు కాదు - అని పరస్పర విరుద్ధ విశేషాలతో వర్ణించి, విరోధాభాసము నలంకరించినారు. 'మోహన్ దాస్ కరమ్ చంద్' గాంధి' పేరును ఇందులో పందర్భశుద్ధిగా ఉపయోగించి ఆయన వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారు. ఇందలి అర్థపర్యాలోచనతో విరోధం ఇట్టే తొలగి పోతుంది.

సాహితీక్షేత్రంలో మాత్నప్రక్రియా సంకేతం వీరి 'సరస్వతీ సామ్రాజ్య వైభవము' అనే

కావ్యలతిక. ఇందిరామందిరం, ఇంద్రసభ, కవన విజయం, భువన విజయం వంటి రూపకాలను పోలియున్న ఈ రూపకం వీరి స్వోపజ్ఞతకు నిదర్శనం. ఇందలి చమత్కార సహితమైన సంవాద చాతుర్యం, సమయోచిత వాక్య విన్యాసం వీరి రచనావిన్నాణానికి నిదర్శనాలు. ఇందు కలభాషిణీముఖమున 'భారతీమూర్తి' ని ప్రస్తుతించిన తీరు భావగభీరతను గల్గి సహృదయ హృదయైక వేద్యంగా అలరారుతున్నాయి.

వేదాంత తత్త్వార్థ విజ్ఞాన రూపమై
భాసిల్లు నేతల్లి పదము జంట
ప్రణవార్థ సంస్మర శ్రవణమై నినదించి
శబ్దించు నేతల్లి స్వాదు జిహ్వ
ఉపనిషదటనీ మయూరియై సతతమ్ము
నర్తించు నేతల్లి జ్ఞానవీధి
కరపద్మ భాసిత కచ్ఛపీగాన వి
లోలయై యేతల్లియోలలాడు ?

భాసమాన ప్రత్యేక జిహ్వాసన మయి
సకల ప్రకృతి జీవద్వాణి సంస్థ యెవరు ?
సర్వహృద్రస వాహియౌ సంవిదాత్మ
భారతీ మూర్తి నాతల్లి ప్రస్తుతింతు!

ఇట్టి వాగ్వైఖరి ఆ వాగ్దేవి చలువ వన్నెలలు పచరించుటచే గాక అన్యథా సాధ్యపడునా?

వీరి 'మహిళా విక్రమ సూక్తము' భారతీయ మహిళలవిక్రమ స్ఫూర్తికి, త్యాగ నిరతికి నీరాజనం పట్టిన ఖండకావ్యం. ఇందు వేదాలు పురాణాలు, స్మృతులు, కావ్యాలు, చరిత్రలు, ఆధునిక కాలాల్లోని అనేక మహిళల పరాక్రమోపేతమైన చరిత్రలు ప్రస్తావించారు. ఎందరెందరినో గుర్తించి, వారికి గ్రంథంలో చోటు కల్పించిన ఘనత శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారికే దక్కినది. మహిళను గూర్చి వీరు చెప్పిన మాట అక్షర సత్యం.

సత్త్వ రజస్తమములు - త్రిగుణమ్ములు
ప్రకృతిని సమముగ మేళన మందిన
స్త్రీయుదయించును త్రిగుణాత్మికయై
స్త్రీ వర్తించును త్రిగుణాతీతగ'

ఈ పంక్తులు వారి గంభీర భావ వ్యక్తీకరణకు మచ్చుతునకలు.

ఆచదువుల తల్లి కృపాకటాక్షాలకు సంపూర్ణపాత్రత గల్గిన శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి గ్రంథపఠనమే సహృదయులకు ఆనందదాయకం. విజ్ఞాన దాయకం కూడ. వారి ప్రతిభా పాండిత్యాలు సమపాళ్ళలో రంగరించి సంతరించిన కృతులు సహృదయ శిరోమణులందరికిని సర్వదా ఉపాదేయాలు.

# ఆంధ్ర సరస్వతి

చిట్టిప్రోలు కృష్ణమూర్తి, గామాల పాడు

కరమున నుండిన వేణువు పొరపాటునైన జాఱి
పోవునాయని హృదయమునే మురళీనాళముగ మలచి
గీతామృత మొలికించిన కృష్ణయ్యకు ఆత్మజవగు
నీలో పొలుపులు మెలుపులు నివ్వటిల్లు టబ్బురమా?

నిర్మలనిశ్చల జలమున నిండియుండు కొలనువోని
రసమయ రుచిరాంతరంగ మెసలారెడి సుశీలమ్మ
ఉగ్గుబాలతో నిత్యము నిగ్గులు జగ్గులు నోయగ
కాంతమవు కళాలక్ష్మీ కాంన్తవై రహించితివి

నన్నయ్య గంటమ్ము తపమొనర్చిన నెలవున జనించి
తిక్కన కంఠమ్ము తీపికెక్కిన సీమను వరించి
తెలుగు వెలది వెలుగులకై నిలువెల్లను ధారవోసి
ఆంధ్ర సరస్వతివై పేరంది ధన్యతను గంటివి.

కమ్మని పాకమున నేమి కవితా పాకమున గూడ
పొలతుల కడువలతులనుచు తెలియజెప్పితివి జగతికి
లాలిత్యమునకు గాంభీర్యమునకు కాంతగళమ్మే
స్నేహస్థలమని చెప్పక చెప్పితివో కాంతమ్మా!

స్వరములలో స్వరూపములు స్వరూపములలో స్వరములు
రాగమ్ములలో రంగులు రంగులలో రాగమ్ములు
దర్శింపగ నేర్చి పరామర్శించిన బాల నీవు
కళాదేవతానేత్రోద్గతమయూఖమాల నీవు

పలుసీమల కవయిత్రీ కల కంఠుల రసగీతులు
ముమ్మరింప వవరమయె పులకించెను భాగ్యనగరి
ఆ మహస్సునకు కారణమైన వసంత శ్రీవని
మను గుండెల కెత్తుకొనెను నిను గాదిలి తెలుగుతల్లి

భువనాభ్యుదయైకకాంక్షి రవణించెడి రవళించెడి
నీ కమ్మని మేల్కొల్పున నిత్యమ్మును మేలుకాంచు
పరమేశ్వరి కరుణా నిర్భర నేత్ర జ్యోత్సులొలసి
ప్రతిప్రభాతమ్ము సుప్రభాతమ్మై వెలయుగాక!

# డా॥ లక్ష్మీకాన్తమ్మగారి వ్యాసరచనా వైభవం

శ్రీమతి నూనె త్రిపుర సుందరి
తెలుగు లెక్చరర్
సెయింట్ థెరిసా కాలేజి, ఏలూరు.

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి వ్యాసాలన్నీ రత్న గుళికలవలె భాసిస్తున్నాయి. ఒక్కొక్క వ్యాసరత్నం ఒక్కొక్క పరిశోధనాగ్రంథమై తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానం అలకంరించింది. ప్రాచీన సాహిత్యం నుండి అత్యాధునిక సాహిత్య ప్రక్రియల వరకు అన్ని రచనల గురించి పరిశీలనాత్మక వ్యాసాలు రాసినారు. రసవంతమైన తమ వ్యాసరచనలతో పఠితల హృదయాల నాకట్టుకొనినారు. పద్యరచనయందువలె వ్యాస రచన యందును విశిష్టమైన పదప్రయోగాలను చేసి సాహిత్యంలో చిరస్మరణీయమైన స్థానమలంకరించినారు. డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు తమ రచనా వైవిధ్యంతో తెలుగు సాహిత్యంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన విశిష్టస్థానం అలంకరించి పఠితల హృదయాలలో చెరగని ముద్రవేసినారు.

అత్యంత సౌందర్య విధానాన్ని, అపురూప పదప్రయోగ వైశిష్ట్యాన్ని, మృదుమధుర ఉచ్చారణలో, మనోహర వర్ణనాలంకార శోభితమగు ఆంధ్రసారస్వతంలో అలంకార ప్రాయాలైన కావ్యరత్నాలను, వ్యాసరత్నాలను సమర్పించి తెలుగు భాషామతల్లికి ముద్దుబిడ్డయై అలరారి పూర్వకవుల రచనా విశేషాలను తమ వ్యాసాలలో ప్రశంసించినారు.

నాచన సోమనాథుడు - నవీన గుణ సనాథుడు

నన్నయను గురించి మనోహరంగా వర్ణించినారు. "నాచన సోమనాథుడు నవీన గుణసనాథుడు" అను వ్యాసంలో "ప్రాజ్యాంధ్ర సారస్వత సామ్రాజ్యానికి దొలిహజార మగు రాణ్మగరిని నివసించు వాగనుశాసనుడు పంచమామ్నాయమును, బరమ పూజ్యమునగు భారత సంహితనాంధ్ర సరస్వతీమహాదేవికి సకలార్థప్రదాయియగు తన భారత గ్రంథమునుపాహారముగా సమర్పించిన మహోదారుడగు గృహమేధి, వైదిక ధర్మములు క్రమముగ దెలియక ధర్మకార్యా చరణముపట్ల సామాన్యప్రజానీకము సంశయాకుల మగుచుండ, స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః! లోకే బహుమన్యంతే వైకృతకావ్యానిచాస్య నపహాయ" అనుసూక్తి ప్రకారం "సామాన్యప్రజల కవబోధమగునట్లు, దేశభాషలో సకల ధర్మసంగ్రహమగు భారతోద్గ్రంధాన్ని రచించి, తన్మూలంగా నందరకు ధర్మబోధామృతాన్ని పంచియిచ్చిన పరమగురువు. ఆద్యసూక్తీ వైచిత్ర్య మెఱుంగక అచ్చపడియున్న స్వదేశీయులకుం దన భారతాంధ్రీకరణము మూలమునం దత్సౌందర్యము నవలోకించిన మనీషి. తెరుతీయములు లేక అల్లిబిల్లిగ నల్లుకొనిపోయిన తెలుఁగుబాసను బరిష్కృతము సేసి, సరియగు మార్గాన నుంచి, దానికిఁ బుస్తకరూప మిచ్చినది వాగను శాసనుండు" అని

పంచమవేదంగా పరిగణింపబడిన మహాభారతాన్ని తెలుగులోనికి అనువదించుటకు శ్రీకారంచుట్టిన నన్నయను గురించి తమ విశిష్టమైన అభిప్రాయాన్ని వెల్లడించినారు.

కాళిదాసకృతమైన "కుమారసంభవమును'' తెలుగులోనికి అనువదించిన "నన్నెచోడుని గురించి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు "ఒకయూరు పురాధీశుఁడనగు నన్నెచోడుని కవిత కన్నడ పదమిశ్రితమైనది. ఆతని "కుమారసంభవము'' కాళిదాసకృతి కనువాదము, ఐనను సొంతమట్లుగ రచించినాడు. కవిత్వధోరణి స్త్రీప్రత్యంగ వర్ణనల తోడను, నకలర్తువర్ణనములతోడను గావ్యధోరణి నడిచినను, శైలీచమత్కారమునకుఁ దడవఁబనిలేదు. 'వేంచెయొళ్' 'కొండవడము' మొదలగు కన్నడపదముల దొరలిపోయినవి "పొండిగ, ఉంగటము, ఉన్నాతఁడు'' మున్నగు చిత్ర ప్రయోగములు చిక్కుకొన్నవి. ఇంతేకాక, మార్గకవితను రూపుమాపుటయందే యాతని దృష్టి కేంద్రీకృతమైనట్లు నాకగపడుచున్నది. "మును మార్గ కవిత లోకంబున వెలయగ దేశికవిత పుట్టించి తెనుంగును నిలిపి రంధ్ర విషయంబునఁ జనచాళుక్యరాజు మొదలుగఁబలు వుర్'' అనియును, "దేశి మార్గంబులు దేశీయములుగా' 'జాను తెనుంగున నింపుపెంపుతో రచింపవలె' ననుట యాతని మతమైయున్నది.'' అని వివరించారు.

ఉభయకవిమిత్రుడైన తిక్కన గురించి లక్ష్మీకాన్తమ్మగారు "సుందరమగు నాంధ్రవాఙ్మయోద్యాన వాటియందు కల్పతరువట్టివాడు. ప్రాచీన సారస్వతమును బూచిక పుల్లవలె నెత్తివైచు నాధునిక 'భావకవి' నామక కళాభాయీలు సైతము 'లావణ్యామృద్వీకలాక్షాగుళుచ్ఛమాధురియు, నవపుష్పరాగ సుందర పటిష్ఠతయు, మధురగోవ్రాతము, నవనీతము అని వినుతించి యాతని కవితాశక్తికి జోహారు లిడినారు. తెలుఁగు సొబగును తెలుగు వారి కెఱుంగ జెప్పిన దిట్ట. పాత్రౌచితి యందేమి, భాషామాధుర్యమునందేమి, అర్థపాటవము నందేమి, రసస్ఫూర్తియందేమి, దేవ సుభగత్వమునందేమి - "అతనికతండె సాటి చతురబ్ధిపరీత మహీతలమునన్' ' అని యనిపించుకొని, యాంధ్ర దేశజులకు, నాంధ్రభాష కుఁదన రచనచే సమాన గౌరవ మాపాదించిన మహాఘనుఁడు, యశస్వి, తిక్కయజ్వ కావ్యదృష్టియేకాని, పాండిత్య ప్రకటనకుఁ దాసై యత్నింపలేదు. కథవేగముగ నడవవలసినచోట్ల నలంకారములఁ దడవలేదు. శృంగారరసమెంత ప్రగాఢముగ నల్లుకొన్నను, నైచ్యమునకు బాల్పడలేదు. ఇందుకు కీచక చరిత్రమునందలి శృంగారవర్ణనము ప్రబల తార్కాణము. "ఇంపైన ప్రియ కావనచ్చినిల్చిన మధువాదట నాను మత్తాళివిభుడు

'ఏమి! యా యపూర్వ కల్పనాగరిమము! ద్రుపదనందన సైరంధ్రీవేషమున విరటుపత్నిం గొల్వ వచ్చినపుడామె మహానుభావు కత యెంత మఱుగువడియున్నను, రాజపత్నియగు సుదేష్ణచే నయాచితముగను, నప్రేరితముగను, నప్రయత్నముగను నెట్టి సేవచేయించుకొన్నదో గమనించి, తిక్కన యాసూక్ష్మభావోన్మీలనా ప్రదర్శక మగు

కళా రహస్యవు గమనీయతకు మ్రొక్కులిడి యీతనినుండి సెలవు గైకొందము గాక'

' అని పఠితల హృదయాల నాకట్టుకొనునట్లు విషయాన్ని విశదీకరించి ప్రబంధ పరమేశ్వరుడై ఎఱ్ఱన గురించి ఉభయభాషా ప్రవీణురాలైన డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు "ఈతడు ప్రతిభావ్యుత్పత్తుల యందేరికిని దీసిపోయెడువాఁడు కాఁడు. ఒక్కొక్క విషయమున 'అతనికంటె ఘనుఁడు ఆచంటమల్లన' యను నట్లందఱం దలదన్నినవాఁడుకూడ ఎట్లందురా ఆతడు కావ్య నిర్మాణమునఁ దనమార్గము తనకు వేరుగనున్నను, భారత పూరణమున నన్నయ కవిత్వము నుండి మొదలిడినపుడు తిక్కన ధోరణితోఁ గలియునట్లును, అతుకు కనఁబడకుండునంత మెలఁకువతో స్వర్గమర్త్యలోకముల సంధిప్రదేశమట్లు, మనోజ్ఞమగు రచనా విశేషమును మెఱయించి రసికులను ముక్కుపై వ్రేలిడికొని యబ్బురంపడునట్లు చేసిన యప్రతిమాన శేముషీ ధురంధరుడు. అట్టియనుభావకుని సృష్టి హరివంశము. అయ్యది సామాన్యమా! కాని, యేలకో అప్పటికవులెవ్వరు గాని రచనాచమత్కృతి కంతగఁ బాటువడరైరి. ఆ సామాన్య ధర్మమెఱ్ఱననుఁగూడ సోఁకక విడువలేదు. అట్లని పదశక్తిమీఁదనె యాధారపడి భావమును సులలితముగఁ రోపింపజేయు రచనా విశేషమును లేకపోలేదు.

"అంటినఁగందు మేనుఁ, బసనారెడురాస్తు జవ్వనమున్, రసంబుపె
న్నింటలఁ గూర్చుకామమును, నిబ్బరమైన మనంబునై..."

కాని యిట్టి సన్నివేశము లరుదు." అని పఠితల హృదయములనలరించు విధంగా వర్ణించినారు.

"పుట్టుకతోనే భక్తి సౌరభాలు వెదజల్లుతూ పరిమళించిన గోదాదేవి చిన్ననాటి నుండి రంగేశుని నిజేశుగా భావించి ఆమధురభక్తి పారవశ్యంతోనే శుక్లపక్ష చంద్రికవలె దినదినాభివృద్ధి నొందుతూ ఎలజవ్వని అయింది". అని లక్ష్మీకాన్తమ్మగారు గోదాదేవి బాల్యయౌవనాలను గురించి విలక్షణమైన పదాలతో వివరించినారు. శ్రీ కృష్ణదేవరాయల రచనా విధానం గురిచి "ఆంధ్రసరస్వతి" యైన లక్ష్మీకాన్తమ్మగారు "రసరాట్టైన శ్రీకృష్ణదేవరాయ ప్రభువు చాలారుచిరంగా వర్ణించియున్నాడు" అని విశిష్టమైన పదాలతో రాయలను అభినందించినారు. గోదాదేవిని గురించి లక్ష్మీకాన్తమ్మగారు

"ప్రేమపారవశ్యమ్మున స్వామిగొలిచి
భద్రచయనమౌ "తిర్పావు" పాడినట్టి
భక్తితన్మయ, సుమధుర భావలలిత
ధన, గోదామహిదేవి ధరణిబ్రోచు" అని

వచనరచనలోనే పద్యరత్నమును గుప్పించి పఠితల హృదయాల నాకట్టుకొనినారు.

శకుంతలను తీర్చిదిద్దుటలో వ్యాసుడు కాళిదాసు చూపిన వైవిధ్యాన్ని డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఎంతో చక్కగా విశదీకరించినారు.

"వైలక్షణ్యమున్ననాడే ప్రజయాకర్షితమగును. ఒక వస్తువును జూచి మరలనట్టివస్తువునే చూచుటకు లోకులు విసుగందుదురు. "క్రొత్తయొక వింత ప్రాతయొక రోత! అనికదా! యార్యుల నుడి!"

తొలమనం వ్యాసశకుంతలను దర్శించినచో ఆ శకుంతల ప్రౌఢతను ముక్కున వ్రేలు వైచుకొని యాశ్చర్యమందుదుము. మరలనట్టి చిత్రాన్ని కాళిదాసుచూపెను. కాని భావాలు వేరు. ఆముదరు రంగులులేవు. అప్పటి పరిస్థితులే లేవు. ఆవ్యాసుని వైదిక ప్రపంచమునుండి కాళిదాసుని కళాప్రపంచమునకు పరుగులిడినది మనసు. ఆమోటు శకుంతలను జూచి యాశ్చర్యపడి సంభ్రమించిన మనసే కాళిదాసుని ముగ్ధాశకుంతలను జూచి తెప్పరిల్లినది."

"మహాకవి యాప్సితమీడేరినది. ప్రియము దివ్యమై లౌకికోపభోగములకు గట్టువడక మార్గదర్శకమై నిలిచినది". అని లక్ష్మీకాన్తమ్మగారు శకుంతల స్థానమును చక్కగా వర్ణించినారు.

సాహితీరుద్రమగా ప్రసిద్ధికెక్కిన డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమగారు "ఉభయభారతి' 'ని గురించి రాస్తూ "భూ ప్రజలకేకాదు, ఈరేడు భువనాల యందలి ప్రజలకు సహితము సమ్మాన్యమై ప్రశస్తి కెక్కినది హిందూధర్మము. ఆ హిందూ ధర్మ పరిరక్షణార్థమై సాక్షాచ్ఛంకరులు శంకరాచార్యులుగా భూమియందవతారము గైకొని యేతెంచినప్పుడు బ్రహ్మ మందన మిశ్రుడుగా అవతరించెను. బ్రహ్మదేవుని కులవధువైన సరస్వతి దుర్వాసుని శాపకారణంగా ఉభయ భారతిగా దేవాతీరంలో విష్ణుమిత్రుని తనయగా అవతరించినది.

భగవత్తత్వ ప్రతిపాదనకై భువినవతరించి శ్రమించుచున్న నీకు మాతోడ్పాటు పూర్తిగా నుండవలసి ఉన్నది. కావున నీవు నాపతికి సన్యాశాశ్రమమిచ్చి కొంపొమ్ము, నేను నా స్థానానికి తిరిగివెళ్ళుచున్నాను. నీకు జయమగుగాక, అని నాతనినాశీర్వదించి గగన మార్గమున వేగనుద్యమించెను. అంత శంకరులు మున్ముందు నేను ప్రతిష్ఠించు మఠాలలోని శారదానామాప్నదిష్ఠించి లోకకళ్యాణం తీర్చుమని కోరగా నామె యట్లేనని సెలవిచ్చెను.

ఈ విధంగా లోకకళ్యాణార్థము శ్రమించిన ఉభయభారతి మనకు వంద్యురాలుఅని ప్రశంసించినారు. పై వ్యాసాలేకాక ఇంకా ఎన్నో వైవిధ్యంగల వ్యాసరత్నాలను రచించి డా॥ లక్ష్మీకాన్తమ్మగారు తెలుగు సాహిత్యంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన విశిష్టస్థానము నలంకరించినారు.

# మూర్తీభవించిన మహిళోద్యమ స్ఫూర్తి

కోకా విమలకుమారి

కార్యదర్శి, సంస్కృతీ సమాఖ్య, విజయవాడ

నాకు తెలిసిన అమ్మ మా ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. అద్వితీయమైన ఆత్మ విశ్వాసం. అసమాన ధైర్యసాహసం, వాటికి జతగా కరుణ, ఉదారస్వభావం, దానగుణశీలత, ఒక టేమిటి, అమ్మ ఎన్నో సద్గుణాలను తమ సొంతం చేసుకున్నారు.

ఆంధ్ర సరస్వతి, విద్వత్ కవయిత్రి, ఉభయభాషాప్రవీణ సరస సంగీత సాహిత్య సరస్వతి మా అమ్మను 'సాహితీ రుద్రమ' అనడంలో అతిశయోక్తిలేదు.

ఒక్క సాహిత్యంలోనే కాదు సంఘసేవలో ఓ మదర్ థెరిస్సాలా, స్వాతంత్ర్య సమరంలో ఓ దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్‌లా ముందుకునడిచిన నవనారీ శిరోమణి డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు. ఆమె మహిళాభ్యుదయమెంతో ప్రశంసనీయమైంది. సాహితీ రంగాన ఆమె చేపట్టని పదువులు లేవు. ప్రాచీనాధునికాంధ్ర సరస్వతి డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారు పదహారేళ్ళ వయసులోనే స్వాతంత్రోద్యమంలో పాల్గొని విదేశీ వస్త్రబహిష్కరణకు కృషిచేశారు.

'మహిళ' అనేపదం ఓ మహత్తరశక్తి. సమాజంలో సగభాగం అయిన స్త్రీ నేడన్ని రంగాలలోను ఉద్యమిస్తూ, ఆదపలెదురైనప్పుడు తమ సమస్యలను తామే ఎదుర్కోగల ఆత్మవిశ్వాసం, ధైర్యం కలిగియుంటున్నది. స్త్రీ మనోభావాలలో సామాజిక చైతన్యం చోటుచేసుకొంటున్నది అనుటకు నాడు-నేడు మన లక్ష్మీకాన్తమ్మగారే తార్కాణం.

అభ్యుదయ పథంలో స్త్రీ అభ్యున్నతి నాకాంక్షించి స్త్రీ హితైషిణీ మండలి, శారదా మహిళా విజ్ఞానసమితులను స్థాపించి సంఘసేవలో పాలుపంచుకొన్నారు డా॥ లక్ష్మీకాన్తమ్మగారు. సాహిత్య సంస్థలకేగాక అనేక సేవా సంస్థలకు దేవాలయాలకు విరివిగా విరాళాలనిచ్చెడివారు. వీరి ఆధ్వర్యంలో ఉన్న మహిళాభ్యుదయ సంస్థలు రాష్ట్ర వ్యాప్తంగా ఉన్నతినిచెంది పటిష్ఠమైన మెరుగులు దిద్దుకొనేవి.

రోటరీవారి ఆహ్వానంపై నెల్లూరు వెళ్ళిన లక్ష్మీకాన్తమ్మగారు అక్కడ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారితో కలిసి రచయిత్రుల సంఘాన్ని ఏర్పాటు చేశారు. అటు తరువాత అమితోత్సాహంతో హైదరాబాద్‌లో అఖిల భారత రచయిత్రుల సమావేశాలు జరిపించారు. ఈ సమావేశాలకు లీలావతీమున్షీ అధ్యక్షత వహించగా శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ప్రారంభోత్సవం చేశారు. ఈ సమావేశంలో మహిళాభ్యుదయం గురించి చక్కని ఉపాన్యాసాలిచ్చి శ్రోతల్ని అలరింపచేశారామె.

డా॥ లక్ష్మీకాన్తమ్మగారు మహిళాభ్యుదయ ప్రసంగాల కొరకు ఆంధ్రదేశం అన్ని దిశలనుండి ఆహ్వానాలు వచ్చేవి. ఆహ్వానంపై ఒక ఊరు వెళ్తే వివిధ సంస్థలవారు ఆమెను రెండు రోజులపాటు అక్కడే ఆపివేసి ఆమెచేత ఉపన్యాసాలు ఇప్పించు కొనేవారట. తమ అత్తవారింట్లో గృహస్థాశ్రమ విధులను నిర్వహిస్తూ తన భవిష్యద్బాటకు

బంగారు కలలపంటయిన గర్భస్థ శిశువులను సహితం ఉద్యమోన్ముఖంగా గ్రామాలకు తరలి వెళ్ళే సందర్భంలో ఒకటి, రెండు గర్భస్రావాలు జరిగినను తాను నమ్మిన భగవంతునిపై భారంవేశారే తప్ప బాధపడలేదు. వెనుకంజ వేయలేదు.

పన్నెండు సంవత్సరాలు వయసులో లక్ష్మీకాన్తమ్మగారు సత్యాగ్రహోద్యమ కార్యక్రమాలలో పాల్గొని పికెటింగులకు వెళ్ళడం, ఖాదీ వస్త్రాలు అమ్మడం, విదేశీ వస్త్రాలను తగులపెట్టడం, ఊరేగింపులలో పాల్గొని ఉపన్యాసాలివ్వడం వంటి ఉద్యమ కార్యక్రమాలు చేయడమేగాక తమ తండ్రిగారైన నాళం కృష్ణారావుగారు సబర్మతీ ఆశ్రమంనుండి, కాంగ్రెసు నాయకులనుండి తెప్పించిన ఇంగ్లీషు రహస్య పత్రాలను రాత్రిపూట కృష్ణారావుగారు తెలుగులోకి అనువాదం చేసి చెబుతూ ఉంటే ఆమె రాసేవారు. తెల్లవారేసరికి అవి అచ్చురూపంలో కరపత్రాలై ప్రజలకు అందుతూ ఉంటే సత్యాగ్రహోద్యమానికి ఏరోజు కారోజు క్రొత్త ఊపిరినిస్తూ ఉంటే ఆమె ఎంతో సంతోషంతో పొంగి పోయేవారు.

వివాహానంతరం లక్ష్మీకాన్తమ్మగారు బాపట్ల వచ్చాక కనుపర్తి వరలక్ష్మమ్మగారుస్థాపించిన స్త్రీ హితైషిణీ మండలిలో సభ్యురాలిగా చేరి వరలక్ష్మమ్మగార్కి భారం కలుగకుండా మండలిలోని అన్ని కార్యక్రమాల బాధ్యత ను స్వయంగా నిర్వహిస్తూ విరాళాల సేకరణ గావిస్తూ మహిళాభ్యుదయానికెంతో సేవచేశారు.

1937లో శ్రీమతి తలారి చంద్రమతిగారితో కలిసి మహిళాసమాజాన్ని స్థాపించారు. అంతేగాక నిండు చూలాలిగా ఉన్నప్పటికి లెక్కసేయక మహిళాగాన కళాశాల కార్యక్రమాలలోను చురుకుగా పాల్గొనేవారు. బాపట్లలోని మహిళామండలి నిర్మాణానికి అనేక ఊళ్ళు తిరిగి విరాళాలు సేకరించుటే గాక జయపురం మహారాజుగారిని దర్శించి చక్కని తెలుగు పద్యాల ప్రశంసలతో వారిని మెప్పించి మండలి భవన నిర్మాణానికి విరాళాలను సేకరించారు.

1947లో ఆంధ్రయువతీ సంస్కృతీ కళాశాల స్థాపకురాలు ప్రిన్సిపల్ గారయిన శ్రీమతి కామాక్షమ్మగారి షష్టిపూర్తి మహోత్సవం చేయాలని సంకల్పించారు మన లక్ష్మీకాన్తమ్మ గారు. ఇది చాలా వ్యయంతో కూడిన పని. అయినను ధైర్యంతో ఆమె నడుంకట్టి కొన్ని నెలలపాటు ఆంధ్రదేశమంతటా తిరిగి 30 వేల రూపాయలు విరాళాలు సేకరించి ప్రముఖ వ్యక్తుల్ని ఆహ్వానించి మూడురోజులపాటు కామాక్షమ్మగారి షష్టిలు పూర్తి ఉత్సవాలు చాలా వైభవోపేతంగా జరిపించారు. స్త్రీలకు జరిగిన మొట్టమొదటి షష్టిలుపూర్తి ఉత్సవం ఇదే అవడంవలన ఆంధ్ర దేశంలోనే ఈ వేడుకకు మంచి చైతన్యం కలిగింది.

స్త్రీలకు ఎన్నో కార్యక్రమాలలో ప్రవేశం కల్పించి సంగీతము, నాట్యము మొదలైన ఉత్తమ లలితకళలతో పరిచయం పెంపొందింప చేయాలని వార్తాపత్రికలు తెప్పించి, వారికి ప్రపంచంలో విజ్ఞానాభివృద్ధికి దోహదం కల్పించవలెనని, మహిళలలో సంఘ సేవాసక్తిని పెంపొందింప చేయాలని, స్త్రీలలో ఉత్తమ సాహిత్యాభిరుచిని కల్పించాలని

''శిశుత్వం స్త్రైణంవా భవతు ననువంద్యాసి జగతాం పూజాస్థానం గుణిఘునచలింగం సచవయః''

మున్నగు అధిభాషణములూ గంగాభగవతి, పృధ్వీమాత సీతవిషయమున పల్కిన పల్కులు సాధ్విచిత్రణమున పూర్తిగా కవికి ఉపబలకములైనవి కదా . . .

ఇది యిట్లుండగా సీతపాత్రను స్వస్థితిలో కడవరకు అమాయికగాను, విధేయాత్మగానే పాలించినాడు. సీత భూదేవితో అన్న ఈ క్రింది వాక్యాలను చూడండి...

నయతు మమాత్మనాంగెషు విలయమంబా .. నన్ను నీలోగలుపుకొమము తల్లీ నన్నీ యపవాదమునుండి రక్షింపుము. అంతేకాక కట్టకడపట భర్తను, తండ్రిని కలిసి కొన్నపుడు రఘరాముడు తన్ను తిరిగి పత్నిగా అంగీకరించినట్లు తెలిసికొన్నప్పుడు ప్రత్యుజ్ఞ పితాస్మి అని మాత్రమే ఎంతో హర్షముగను, ఆర్ద్రముగను. అమాయిక ముగను, పలికి బిగబట్టిన ఊపిరిని మెల్లగా విడచినది. ఇంత అతిమాత్రముగా ఉదాత్తురాలైనది కనుకనే గంగిగోవువంటి యామెను గూర్చి కవియే స్వయముగా పూనుకొని ఈ మాటలు యాధావాచాం తథాస్త్రీణాం సాధుత్వే దుర్జనో నః అని వాచ్యముగా సమర్పింపకుండా ఉండలేక పోయినాడు.

ఆమె మూలమున శక్తి స్వరూపణి అంశారూపమున మూర్తీభవించిన కష్ట సహిష్ణువుగా ప్రపంచమునకు ఆదర్శము దిద్దినది. పరస్పర అభిమాన, అనుమాన గవిష్ణువై ఒండొరుల నీడలు చూచిభయపడుచు, స్వార్ధముతో ఎదుటివారిని రక్తదాహముతో పీల్చిపిప్పిచేయు సాధరణ జనతా ప్రపంచము సముద్ధరింపబడవలెనన్న పవిత్రప్రేమార్ద్ర ప్రచారము నిదర్శనపూర్వకముగా జరుగవలెను. దానికి సర్వసమర్ధమైన శక్తియే పూను కొనవలెనుగాని యితరుల ద్వారా అది జరుగలేనిపని. కష్టసహిష్ణుత్వము చేతనే ఆ ప్రేమ సంచారము జరుగగలదు. కావుననే సాక్షాచ్ఛక్తి, భువనైక మాత, పూతచరితయగు సీతగా అవతరించిన తనజీవితమును పణముగా ఒడ్డి గ్రుడ్డిలోకమునకు దివ్యా దర్శమును దిద్దిచూపినది. ఆదియొక ఉద్దీప్తి. ఆ కాలమొక రసతరంగము. ఆచరిత మొక దివ్యద్ధిప్రకాశము.

ఆ ప్రణయరసోల్బణము, ఆ నియమనిగ్రహము, ఆ పరస్పర విశ్వాసము, ఆ పవిత్ర రస సంపుటీకరణము ఆ ఆదిమ దంపతులకే చెల్లినది. ఏరీ మఱల ఈ పృథ్వీస్థలిపై రాముని వంటి రాజును సీతవంటి సాధ్వియును .... !!!

# మొల్ల రామాయణము నందలి నారీ చిత్రణము

తాత్త్విక చింతా పరమగుట చేతను, త్యాగ సుందరమగుట చేతను భారతీయ సాహిత్యము ప్రపంచ సాహిత్యమునకే తల మానికమైనది. అట్టి భారతీయ సాహిత్యమునకు మౌలిక గ్రంథమైన శ్రీ మద్రామయణము నందు ఈ త్యాగ సౌందర్యము పరమోదాత్తముడుగా వర్ణింపబడింది. కావుననే ఈ ఉత్తమ కావ్యము భారతీయ భాషలలోనికే కాదు, అఖిల ప్రపంచ భాషలలోనికిని ఈ గ్రంథమ నూదితమగుటకు కూడా ఈ మహాకావ్యము ఈ త్యాగ సౌందర్యమే కారణము!

మన ఆంధ్ర వాఙ్మయము నందుకూడా ఈ మహాకావ్యము ఎన్నో విధములగు అనువాదములను బొంది చిత్ర, విచిత్ర రీతుల వెలసియున్నది. అంతేకాదు, ఆంధ్రులకు శ్రీరామచంద్రుడిష్ట దైవమైనట్లు ఇతర దైవములిష్ట దైవములుకారు. సీతమ్మ అభిమానమైనట్లి తరనాయిక లభిమాన పాత్రములు కాదు.

ఆంధ్ర సారస్వతము నందలి వివిధములగు సంగ్రహ రామాయణములలో మొల్ల రామాయణము మిక్కిలి ప్రసిద్ధమైనది - కవయిత్రీమతల్లియైన మొల్ల ఆంధ్ర ప్రజానీయమునకుఆదర్శపూర్ణమైన శ్రీరామ గాథను సంగ్రహముగా తెలుపవలెనను ప్రధానాశయముతో ఈ కావ్యమును రచించినది. ఈ ఉద్దేశ్యము తోనే కాబోలు రామాయణము నందలి కొన్ని ఘట్టములను, కొన్ని పాత్రలను కూడా విడిచివేసినది. కొన్ని ఘట్టములను, కొన్ని పాత్రలను కథా ప్రధానముగ స్పృశించి విడిచినది.

అట్లు విడువబడిన ఘట్టములలో మంథరా ప్రబోధ ఘట్టమొకటి. మంధరా ప్రబోధ ఘట్టమునకు శ్రీమద్రామాయణ మహాకావ్యమున నెంతో ప్రాధాన్యమున్నది. శ్రీ మద్రామాయణమును "జానక్యాశ్చరితం మహత్త, నియు, 'పౌలస్యవధాతథా అనియు వాల్మీకి పేర్కొని యుండెను - లోక విద్రావణుడైన రావణుని హత మొనర్చుటయు, ఆలోక శ్రేయస్కర కావ్యమునకు సాధ్వి సీతమ్మ స్వార్థ త్యాగమొనర్చుటయునను నవియే రామాయణమున ప్రధానాశయములు. ఈ ప్రధానాశయ నిర్వహణమునకు మంధారా ప్రబోధము అతి ప్రధాన ఘట్టము అట్టి యెడ మంథరా పాత్రమునే విసర్జించుటలో మొల్ల మనస్సులో ఏదేని ఒక మహదాశయము దాగి యుండ వచ్చును. దీనిచే శ్రీరామ వనవాసమును మంథరా ప్రేరణము లేక తానే స్వయంబుద్ధితో వరముగా గోరిన కైకేయి పాత్ర పైననే రావణ వధా కార్యనిర్వహణమునకు ప్రేరణము బరువుగా మోపబడినదనియే మన మూహింపవచ్చును. మొల్ల కావించిన పాత్ర చిత్రణముల తీరు తెన్నుల యందలి రహస్యమును కనుగొనజాలినచో ఇట్టి మహత్తర విషయము లెన్నేని బయట పడగలవు.

ఆమె కావించిన ఈ మార్పులకు, భారతీయ తాత్త్విక చింతన పట్ల ఆమెకు గల ప్రగాఢ విశ్వాసమును, భారతీయ నారీమణుల త్యాగమహిత జీవిత పద్ధతి యెడల ఆమెకు గల శ్రద్ధా గౌరవములును కారణములు. భారతీయ సాహిత్య మంతయు నిట్టి మహాద్భుత విషయములతో నిండి యుండుటయు. త్యాగేనైకే నామృత మశ్నుతే' ' అను సూక్తికి మూల పురుషులగు మహనీయుల చరితములనే కావ్య నాయకులుగా నాయకురాండ్రుగా నెన్నుకోబడుటయు జూడ మన కవులకు గూడనీయుదార చరిత్రలపై గల గౌరవాభిమానములే కారణములని, మన, మూహింపవచ్చును. ఇందులకై మన కవులకు మనము జోహారులర్పింపవలసి యున్నది.

భగవానుని సృష్టి సంకల్పోద్దేశమైన ధర్మార్థ కామమోక్ష రూపమగు చతుర్విధ పురుషార్థ సాధన ఏమాత్రము లోపము వాటిల్లకుండ మనుజ సంఘముచే నిర్వహింపబడుటయే సృష్టికి పుష్టిని, తుష్టిని గూర్చు ముఖ్యోద్దేశము! ఈ సాధనకు త్యాగమొక్కటియే మూల సాధనము. యుగయుగముల నుండియు, సర్వ జగములకు ధర్మ సందేశమొసంగ జాలిన మన భారతీయ సాహిత్యాత్మ సర్వతో భద్రముగ, సర్వతోముఖముగ ఈ ధార్మిక దృక్పథమును ముఖరిత మొనర్చుచు మానవాళిని జాగరత మొనర్ప బూనుట యందలి పరమార్థమును ఇదియే. కావున మనము ప్రామాణిక గ్రంథములైన శ్రీమద్రామాయణ, మహాభారతముల యందలి ప్రధాన పాత్రములన్నియు త్యాగ ప్రధానములై ప్రపంచ సాహిత్యమునకే వెలుగు గూర్చినవి.

ముఖ్యముగ శ్రీమద్రామాయణమునందలి పాత్రములకు, అందును స్త్రీ పాత్రములకొక విశిష్టతగలదు. భూమిపై ధర్మగ్లాని సంభవించిపుడంతయు తన్ను భూమిపై సృజియింప జేసుకొని ధర్మాభ్యుత్థాన మొనరింతునని అభయమొసంగిన భగవానుడు అధర్మాభ్యుదయమునకు మూలపురుషులైన సోమక హిరణ్య కశ్యపాది రాక్షస ప్రభువులను గూల్చుటకై, అంతకు మున్నె ఆరుమార్లు ధరణిపై అవతరించి యున్న విషయము మనమెరింగినదే. రామావతారమునకు పూర్వము నందలి ఘట్టములలో పరమేశ్వరుడొంటరిగా మాత్రమే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామావతారములను దాల్చి, ఏడవ అవతారమున, జగన్మాతతో భువికవతరించుటలోనే ఈ అవతార విశిష్టత మనకు స్పష్టమగుచున్నది. అంతేకాక, సవతి తల్లులు, సవతి తమ్ములు, బంధు మిత్ర పరివార సంఘము కలిగి, వీర్య, శౌర్య, గర్వ ప్రతాపాటోపముల కాలవాలమైన రాజకుటుంబమున, జాగరూకతతో బాధ్యతలు తీర్చవలసిన జ్యేష్ఠ కుమారుడుగా, ధర్మగ్లానిని సమయించి, ధర్మాభ్యుత్థాన మొనరింప మహాపురుషుడుగా అవతరించవలసి వచ్చుటచే పరాశక్తి తోడ్పాటు కూడా అవతారమున ముఖ్యముగా కావలసి యుండుటయు మనకు తెల్లము కాగలదు.

తన సాత్త్విక పరాక్రమ తేజో బలవీర్య సంపత్తితో మాత్రమే దుర్గర్వాంధకార విక్రమాటోపాహంకార దీపితుడును, అధార్మిక ప్రభువును అయిన రావణాసురుని పొలయించు దీక్షతో అవతారమెత్తిన ఆ మహాపురుషునకు ఆదుష్ట శిక్షణ, శిష్టరక్షణ కార్య నిర్వహణకై తోడ్పడవలసి యున్న శ్రీ మద్రామాయణ స్త్రీ పాత్రలకు త్యాగ ప్రధానత హెచ్చుగానుండవలసిన అవసరమెంతేని కలదు.

రామాయణ మందలి రమణీమణుల చిత్రణకు ఈ భూమికను ఆధారముగ తీసుకొన వలసివచ్చుటచేతనే మొల్ల తన కావ్యమునందలి నారీ చిత్రణమునందు హెచ్చు శ్రద్ధ వహించినది. ముఖ్యముగ కైక పాత్రను గూర్చి ముచ్చటించునపుడు మొల్ల గైకొన్న ఈ మెలకువ మరింత కొట్ల వచ్చినట్లు కన్పట్టకమానదు. సవతికొడుకగు శ్రీ రామభద్రుని అభ్యున్నతి నోర్వ.జాలని ఈర్ష్యాళువుగా ఆ చంద్రతారార్కము లోకమువారిచే అపకీర్తింపబడినది. పాపము కేకయనందన. కాని నిజమున కామె అట్టి ఈర్ష్యాళువు కానేరదు. సవతి కుమారుడైనను శ్రీరాముని ఎంతో గారాబముగా పెంచి, లాలించినది కైకేయి! కాని శ్రీరామ చంద్రుని అవతార కార్య నిర్వహణమున కామెయే మూల స్తంభమగుటచే ఆమె తనను ఈర్ష్యాళువుగా లోకమువారి యెదుట చిత్రించుకొనుటకు వెనుదీయలేదు. రాఘవుడు పట్టాభిషిక్తుడై అయోధ్యయందే ఉండి పోవుచో లోక విద్రావణుడగు రావణ వధ జరిగియుండెడిదేకాదు. ఈ లోకకల్యాణ సంఘటనమునకై, కేకయాత్మజ, ప్రాణమున కంటె ప్రీతియైన కీర్తిని త్యాగము చేసి ప్రతిష్ఠా త్యాగ మొనర్చుటకు సహితము సంసిద్ధురాలైనది. రఘురాముని వనవాసమునకు మంథరా ప్రోత్సాహమే కారణమగుచో ఆ ఖ్యాతి యంతయు మంథరకే దక్కెడిది. మొల్ల మంథరా పాత్రను తొలగించి ఆ కీర్తి నంతను కైకకే చెంద జేసినది.

అసలు రామాయణమునందలి నారీ పాత్రలలో ప్రధానపాత్ర, భూజాతయగు సీత. తక్కిన కౌసల్య, శబరి, తార, మండోదరి, కైకసి, లంకిణి, సులోచన, త్రిజట మున్నగు పాత్రలకు కథా నిర్వహణమున గల అల్ప ప్రాధాన్యమును బట్టి మొల్ల ఆ పాత్రల యెడ అంతశ్రద్ధ తీసుకొనలేదు. శూర్పణఖ మాత్రము కథా నిర్వహణముపట్ల ప్రధాన పాత్రయే. మొల్ల కూడా ఈ ప్రాధాన్యమును గుర్తించి యే ఈ పాత్రను మలచుటలో మెలకువచూపినది. ముందు శూర్పణఖయందే తప్పుచూపి తర్వాత లక్ష్మణునిచే ముక్కు చెవులు గోయించినది! ఆ రాక్షసి మనుజేంద్రసూనుల దండింప దలంచుట, నెరింగి భరతానుజుండు, దాని నాసికా కర్ణంబుల గోసివైచె" నట. పాత్ర చిత్రణము పట్ల మొల్ల చాలా బుద్ధి సూక్ష్మతచూపి, సూక్ష్మమగు ఒక్క వాక్యముతోనే ఎంతో చక్కగా ఆయా పాత్రల స్వభావమును వెలువరింప జేయగల్గిన చదురాలు. ఈ

చతురత సీతా మహాదేవి పాత్రోన్మీలనము పట్ల పరాకాష్ఠకెక్కినది.

త్యాగమునకు, కష్ట సహిష్ణుతకు, అభిమాన ప్రధానతకు, వీర్య పరాక్రమములకు, ముఖ్యముగాపాతివ్రత్యమునకు, బుద్ధి సూక్ష్మతకు ధర్మ రక్షణమునకై సర్వస్వ మర్పించి భర్తలకు సాయపడుటకు భారత నారీమణులు మిక్కిలి ప్రశస్తి కెక్కియుండిరి. ప్రపంచ వాఙ్మయముల నెన్నింటిని పరిశీలించినను, అద్భుతమైన ఈ సౌశీల్య సంపద భారత మణులయందే తప్ప మరి యింకెందును గాంచబోము. ఆ సీమంతినులలో సీతా సాధ్వి అగ్రగణ్య. తేజోవంతమైన, ఓజస్వంతమైన ఈ పాత్రకు రూపకల్పన చేయుటలో మొల్ల చూపిన జాగరూకత స్తవనీయము. ప్రప్రథమమునందే, మైధిలిని, పౌరుష ప్రధానగా మానధనురాలుగా, శౌర్యశీలగా, అతిశయమగు ఆత్మాభిమానము కల దానినిగా ప్రవేశ పెట్టుట యందే మొల్ల గొప్ప విజ్ఞతను, విన్నాణమును ప్రదర్శించినది.

"ఇనవంశోద్భవుడైన రాఘవుడు,
ధనువుదునిమి నంత ధరణీశ సూనులు
శిరములెల్ల వంచి సిగ్గుపడిరి
సీతమేను పెంచె'' నట గమనించితిరా, మొల్ల ప్రత్యేకత!

మరల ఎప్పుడును, ఎట్టి కష్టములయందను ఇట్లు పెంచిన మేనిని, మరల ఆసాధ్వి కుంచింపజేయలేదు, ఆత్మాభిమానమును వంచింప జేయలేదు. అంతనేర్పు చూపినది సీతా పాత్ర చిత్రణమున మొల్ల తల్లి!

అవును మరి! భారతీయ మహిళా ప్రపంచమున ధ్రువతారయై, పౌలస్త్యవధా ప్రధానమైన, జానకీదేవి, మహచ్చరితమును, రఘురాముని ఇల్లాలైన సీతా సచ్చరిత్రమునురామ రామపదపంకజయుగము నిచ్చలు భజించు నీ మొల్ల వేరొక విధముగా, న్యూనతా పాదకముగా నిర్వహించునా?

తరువాత మదన వ్యామోహితుడై, ఉచితానుచితము లెరుగకుండ, తనతో ఆలపించిన రావణునిదుష్ట భాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనక భూపాల నందనయిడిన ప్రతివచనంబుల సొబగు వాకొన నలవికానిది.

తన త్రైలోక్య విజయ వైభవ గర్వమును చాటుచు, దాశరథిని అల్పునిగా పేర్కొనుచు రావణు డాడిన మాటలకు వైదేహి ప్రథ్రమమున తన పాతివ్రత్యవైభవాన్ని గూర్చి పేర్కొనుచు బదులిడినది.

పతి దైవముగా నెన్నడు, మతి దలచుచు
మండునట్టి మగువల కెందున్,
బ్రతినగల యిట్టినీతో బ్రతి వచనము
లాడు కంటె బాపము గలదే''

అని తన పాతివ్రత్య బలమును, అతని నీచత్వమును ఉగ్గడించినది. తరువాత పరదారాపేక్షకులగు పురుషుల కాయువు నశించునని హితము బలికినది, "తనసాహసము తానే పొగడు కొనువాడు హీనసత్వుడని నిరూపించి నిష్ఠూరమాడినది. ఏమీ త్రిలోక విజయునని గర్వించునీవు రఘురాము తోడను పోరంగనోపక దొంగిలించి నన్ను తెచ్చి, ఇప్పుడు తులబువాతుచ్ఛపు పల్కులు పల్కెదవా ? అనిపిచ్చలించి, నిలువరించినది. ఇక కడసారిగ లక్ష్మణాగ్రజుని ఘనశక్తి, శౌర్యమహిమలనుగడించుచు,

"పాదరజమున కొక రాయిబడతిజేసె
రాజమాత్రుడే మేదినీరక్షకుండు,
రామ భూపాలకుండాదినారాయణుండు . . .
అట్టి మహానుభావుని దూషించు నీనాల్కకోయుటయేకాదు :

"అట్టి రామునకీయబ్ధి యనగనెంత
లంకయననెంత దనుజుల పొంకమెంత
నీవనగనెంత, నీలావుచేవయెంత
చెప్పనేటికి నీవె, చూచెదవు గాక . . .
వీరాలాపము లాడనేల . . . .

క్రూరాస్త్రంబులమస్తముల్ దునిమిభుక్తుల్ పెట్టు భూతాళికిన్ . . . . నేడెల్లి శాంతింపుమా.

అనియు, ఓరీతుచ్ఛుడా పాశవికశక్తి యుక్తుడవైన నీ ప్రతాపములపుడే డీలుపడినవి. నీచావు ముందున్నది, చూచుకొమ్మనియుపల్కి రావణుని వాగాడంబరము నంతకును మాటకు మాటతూచి నట్లు బదులిడినది. లంక యందు హనుమ కానబడినపుడు సీతా సాధ్విపడిన వేదనను మొల్ల కడు సహజముగ మిక్కిలి కరుణా విలముగను చిత్రించినది.

"పతి బాసినప్పటి యాపదలకంటె వివిధ మాయలచేత వేగివేగి.
రాముదలచుకొంచు రాముని బేర్కొంచు
రామరామయనుచు. నిడుద పెన్నెఱి వేణి
జడలుగా సవరించి . . . మహితలంకామహాద్వీప గహనసీమ దపము

సేయుచున్న సీతను మనకండ్లకు దర్శింపజేసిన మొల్ల ప్రావీణ్యమప్రతిమానమైనది - అంతేకాదు సీతచే రాముని కొరకై తపము చేయించినది. మాయా మృగ సందర్భమున లక్ష్మణుని పోనాడి నందున కామెను పశ్చాత్తప్తురాలను గావించినది ! గత కిల్బిషురాలైన సీతమ్మకు పతి దర్శనము, బంధ మోచనముగాకుండ నెట్లు

దప్పును, అట్టి ఒడుపులో సీతమ్మను తీర్చిదిద్దినది.

అంతయునైనది ఏ పతి సన్నిధానమునకై సీతమ్మ అన్ని పాట్లు బడియు, ప్రాణములను నిలువరించుకొన్నదో, ఆ పతియే రావణ వధానన్తరము తన్ను "కులసతిని జెరగొని పోయిన . . . . శాత్రవు . . . గెలిచితి, పగ జంపితి నెలతా నీ యిచ్చజనుము - నేనిన్నొల్లన్ అన్ని పోనాడినాడు. ఆ వేడి మాటలు కర్ణంబులకు వాడిగల్గినట్టి నారసములు సోకినట్లు కాగా తలకొట్టిన నాగ కాంతవోలె "నరవర! నాదుచిత్తము, మనంబును, నీవయెరుంగుదు. ఎరింగియుండియున్ బరుసములాడ నేమిటికి, నాయెడ బాపములేదు. కాదు సురలు నుతింప మేటి సొదజొచ్చెద, మెచ్చుడని ధీరముగా మేలు నెంచి, శిరము నెత్తినిలువరించి పలికినది రామో - విగ్రహవాన్ ధర్మః అనిపించుకొన్న రాముని ధర్మకవచము ఈ ఒక్క వాక్యముతో తునాతునకలైనది. తానెంతపతి శీలయయ్యును, ధర్మువుదప్పిన పతికి బానిస కాలేక పోయినది. ధర్మసంరక్షణ మనునది శీలసంపన్నురాండ్రును, సాధ్వీలునైన నారీమణుల త్యాగముచేతనే సిద్ధించును కాని, మిముబోటి భీరువుల వలన కాదని, మోమోడక రామునిమోముపై గొట్టి మాట్లాడి, తన సౌశీల్యమునకు జయ పతాకమెత్తి భారతీయసాహిత్యాంబరమున చెరగని కాంతి పుంజముల ధ్వజమెత్తినది. ఈ తన కావ్యరచనలో మేను పెంచిమనకు దర్శనమిచ్చిన సీతా సాధ్విని మేను వంచకుండునట్లు గానే చిత్రించి సూక్ష్మంలో మోక్షంగా ఉన్నంతలో సీతమ్మ శీలానికి విజయ కిరీటం పెట్టింది మొల్ల !

చాలు! మొల్ల ప్రచురించిన నారీ పాత్ర చిత్రణానికి ఈ శిల్పం జయగీతిక!

# సంస్కృత వాఙ్మయము - మహిళల కృషి

భాష జాతికి ప్రాణము. జాతికి గౌరవ కారణము. ప్రతిష్ఠాకరము కూడ. ఏ దేశీయులు తమ భాషను సర్వాంగీణమైన భక్త్యాదరాలతో అభిమానించి, సేవించి, పూజించి, కొలుచుకుంటారో ఆ దేశము, ఆ జాతి సర్వ సేవా భాగ్యాలను అనుభవిస్తూ ప్రప్రంచంలో ఒక ఆదర్శజాతిగా, ఒక మహాదేశంగా పరిగణింపబడి కీర్తింపబడుతాయి.

ఇంకా వివరించి చెప్పాలంటే ఒక జాతి నాగరికత, సంప్రదాయాలు, సంస్కృతి, అభిరుచులు, ఆచారములు, మత విశ్వాసములు, కళాభిజ్ఞత మొదలైన ఉత్తమోత్తమ విషయాలనన్నింటిని వాఙ్మయరూపంతో భద్రంగా రికార్డు చేసి దేశ దేశాలలో, యుగయుగాలలో నిత్యనూతన చైతన్యంతో కీర్పింపజేయ గల్గేది భాష ఒక్కటే. అందువలననే భాష జాతికి సర్వస్వము అని చెప్పవచ్చును.

ఇక మన భారత దేశంలో హిందువులందరకు ఈ విధంగా ఆధారమైన ఏకైక భాష సంస్కృత భాష.

భాషా లక్షణ దృష్టితో పరిశీలిస్తే విశ్వ భాషలన్నింటి లోకి సర్వవిధ ఉచ్చారణ సౌకర్య సౌష్ఠవాలు, సర్వరస, భావ గుణ ప్రకటనా సమర్థత, మాధ్యుర గాంభీర్య సౌకుమార్య సర్వగుణ సంపూర్ణత కలిగిన ఏకైక భాష కూడ, సంస్కృతమే. అంతే కాకుండా ముఖ్యంగా చెప్పుకోదగిన విషయమింకొకటి ఏమంటే ఈ సువిశాల వసుంధరలో ఈశ్వర సంబంధమైన మత, చింత, విశ్వాస విషయాలలో, ఆధ్యాత్మికమైన భావ ప్రపత్తిని తన జాతికి ఒక విశిష్ట లక్షణంగా, తన దేశానికే ఒక ఉన్నత గౌరవ ప్రపత్తిని తన జాతికే ఒక విశిష్ట లక్షణంగా, తన దేశానికే ఒక ఉన్నత గౌరవ ప్రపత్తిగా తన ఉనికికే ఒక గర్వకారణంగా ప్రకటించ గల్గిన భాష కూడా సంస్కృతం ఒక్కటే. అంతేకాక ఆగమశాస్త్రము, శిల్ప, వాస్తు శాస్త్రములు, మంత్రశాస్త్రము, రాజనీతి, అర్థనీతి మొదలైన భారతీయ సంస్కృతి సంప్రదాయాలకు మూలకందములైన శాస్త్రములు అపార ఆర్షవాఙ్మయము, ఋషితుల్యులైన వ్యాస, కాళిదాసాదుల అమోఘ సారస్వత సందేశములను ఒకే ఒక ప్రపత్తితో గర్భీకరించుకొని ప్రపంచం యెదుట సాటిలేని నిండుతనంతో నిలువబడ గల్గిన భాష కూడా సంస్కృతమే.

కాబట్టే సంస్కృతం ఆనాటికీ ఈ నాటికీ ప్రపంచం మొత్తం మీద అఖండ గౌరవాన్నీ, అత్యధిక పూజనాన్నీ అందుకొంటూ భారతదేశానికి తరుగని, విరుగని కీర్తి ప్రతిష్ఠల నార్జించింది. ఇట్లా ఆధ్యాత్మికంగా, వైజ్ఞానికంగా, సాంస్కృతికముగా, చారిత్రకంగా, సాంఘికంగా, ఆర్థికంగా ఉన్నతోన్నతమైన, ఉత్తమోత్తమమై చరమ సీమల నధిగమించి,

తన జాతి నధిగమింప జేసినేల నాలుగు చెఱుగుల తన ఈ భారత జాతికి నివాళులిప్పించిన ఈ పవిత్రభాషను, ఈ ఉత్కృష్ట వాఙ్మయాన్ని రూపుమాపితేనే తప్ప తమ ఆంగ్లేయుల పరిపాలన ఇక్కడ సుస్థిరం కాదనే ఉద్దేశంతో డెడ్ లాంగ్వేజ్ - మృతభాష అనే ప్రచారం లేవదీసి, ఆంగ్లేయులు మనలను మన సౌభాగ్యానికి దూరం చేస్తే, అన్ని విధాలా అజ్ఞులమైన మనం ఆ ప్రచారానికి మోసపోయి మన ఉన్నతికి, మన శ్రేయస్సునకు కారణభూతమైన ఈ దివ్య నిక్షేపాన్ని తలదన్ని, కాలరాచి విసర్జించి అగౌరవపరిచాం, కాని మన ఈ గీర్వాణ వాఙ్మయం మహత్త్వాన్ని, అవసరాన్ని తెలిసి జర్మనీ, రష్యా మొదలైన ఇతర నాగరక దేశాలవారు మాత్రం చాల గౌరవిస్తూ ఉన్నారు.

పూర్వ భారత దేశంలో సంస్కృతం రాజభాషగా ఉండడం వలన భారతీయుల సర్వస్వమూ ఈ వాఙ్మయంలో నిక్షేపితమై ఉండడం చేత భరత ఖండంలోని తక్కిన అన్ని దేశీయ వాఙ్మయాలకూ సంస్కృతమే ఆదర్శప్రాయము, ఆధార కారణమూ కూడ అయింది. అందులోనూ మన ఆంధ్రవాఙ్మయానికి మరీ వెన్నెముక సంస్కృతమే అని చెప్పాలి. అంతేకాదు. ఆంధ్రులలో ఒక విధమైన ప్రవేశ పాండిత్యాలు కలగాలంటే సంస్కృత వాఙ్మయ ప్రవేశం ఏలవలేశమైన లేకపోతే చాలా కష్టమే అని కూడా చెప్పవచ్చు. ఇక ఈ ఆర్యభాషా ప్రథమ వాఙ్మయమైన వైదిక సాహిత్యం దగ్గఱనుండీ కూడా మహిళల ప్రాభవ పాండితీ పరిచయం అతి సన్నిహితంగా కనబడ్తూనే ఉన్నది. అపాల, శశ్వతి, విశ్వవార మొదలైన సీమంతినులు అనేకమంది దేవ వాఙ్మయంలో కనబడ్తూ ఉన్నారు. గార్గి, మైత్రేయి సులభ మొదలైన వారు కొందరు బ్రహ్మవాదినులుగా కూడా ఉన్నట్లుగా చరిత్ర పేర్కొంటున్నది.

విశేషించి గార్గి బ్రహ్మవాదిని, బ్రహ్మచారిణి కూడా. ఆమె జనకు నాస్థానిగా ఉండి తన విశేష ప్రజ్ఞాప్రాభవాలతో అక్కడి మహా పండితులతో సమంగా ఆధ్యాత్మిక చర్చలు జరిపేదట. కనుకనే, వాక్శుద్ధి, వాదస్ఫూర్తి కలది అనే అర్థం వచ్చేటట్లు 'వాచక్నవి' అనే బిరుదు నిచ్చి ఆనాటి పండితలోకం ఆమెను సమ్మానించుకొన్నది.

యాజ్ఞ్యవల్క్యుని కులవధువు మైత్రేయి విజ్ఞాన శేముషీధురంధరురాలు. తన భర్త గృహస్థ ధర్మాన్ని విడిచి ఆత్మ చింతనకై అడవులకు వెళ్తూ, నేను అమృత పదవీ ప్రాప్తికై వెళ్తున్నాను. నీవు ఇక్కడనే ఉండి ఈ గృహకార్యకలాపాన్ని చక్కబెట్టుకోవలసింది, అని భార్యయైన మైత్రేయితో అంటే, "గృహస్థాశ్రమ నిర్వహణం వలన నేను అమృతత్వాన్ని సాధించలేక పోయినపుడు నాకు మాత్రం ఈ గృహస్థాశ్రమం ఎందుకు? అనే అర్థం వచ్చేటట్లు, 'యే నా హం సా మృ తా స్యాం కి ం యే న మ మ'

అని భర్తను ప్రశ్నించి తాను కూడా అమృత పదవి కొఱకై భర్త వెంట వెళ్ళిపోయింది. సంస్కృత వాఙ్మయం భద్రంగా నిత్యనూతనంగా మన జాతికి అందజేసే సందేశాల్లో ఇది ఒకటి. ఈ విధంగా పరిశీలిస్తూ ఉంటే ఇంకా విచిత్రమైన విషయాలనేకం మనం తెలుసుకోగలం. కావ్య మీమాంస రచించిన రాజశేఖరుడు తన ఈ లాక్షణిక గ్రంథంలో ఉక్తివైచిత్ర్యము, విదగ్ధ భంగీ ఫణితి మొదలైన ఉత్కృష్టాంశాలలో తన అర్ధాంగి అవంతి సుందరి అభిప్రాయాలను తలస్పర్శిగా స్వీకరించి గౌరవించాడు. శంకరునితో వాదించిన శాస్త్రాన్ని ప్రదర్శించిన కామాంధకి మొదలైన తల్లుల ప్రతిభ అప్రతిమానమైనది. కావ్యకళలో కూడా ఆరితేఱి వినిర్మల గీర్వాణ వాఙ్మయాంబ రంలో ధ్రువతారలై వెలుగొందిన ఇందుబాల, వికటనీతంబ, లీలావతి, నాచి, శారద, త్రివేణి మొదలైన కవయిత్రుల వాఙ్మయ సేవ ఎన్నటికీ ప్రస్తూయ మానమే కదా.

వైజ్ఞానికముగా ఈ దేవ భాషా వాఙ్మయాన్ని సేవించి కీర్తి నార్జించిన వీరి నటుంచి సామాన్య కుటుంబాలలో నిత్య వ్యవహారాలలో కూడా మహిళలు సంస్కృతాన్నభ్యసించి, సంస్కృతానికెంత గౌరవం ఇచ్చేవారో ఈక్రింది సందర్భాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో పెండ్లి కెదిగిన కన్యకు ఆ తండ్రి విద్యావిహీనుడైన యువకుణ్ణి వరునిగా తీసుకొని వస్తే, సంస్కృత భాషా పండితురాలైన ఆ కన్య ఆ యువకుణ్ణి పరీక్షించి అతడు అజ్ఞాని అని తెలిసికొని తండ్రితో యుస్యషష్ఠచ, చతుర్థాచ వివాస్యచ, విహాయచ ద్వితీయాస్యాత్ కథమహన్ ద్వితీయా న్యామహంకథన్. విహస్య, విహాయ, షష్ఠీ, చతుర్థి విభక్తులనీ, కథం, అహం అనేవి ద్వితీయా విభక్తి అని అనుకునే ఈయనకు నేను ద్వితీయ భార్య నెట్లు కాగల్గుదును? అనగా, నాకీ సంబంధం ఈడైనది కాదని చెప్పివేసినదట. ఇది స్థాలీపులాకన్యాయంగా సంస్కృత వాఙ్మయంలో పూర్వ మహిళ లొనర్చిన కృషి. ఈ సూక్ష్మదృష్టితో మనకు తేలిందేమి టంటే గీర్వాణ భాష మహామహిమోన్నతమైనదని, భారతీయుల సర్వవిధి సంస్కారాలు, సకల సత్సంప్రదాయాలూ, సమస్త విజ్ఞాన విషయాలూ, సంస్కృతంలో నిక్షేపించబడి ఉన్నాయి అనే విషయాలు.

ఇవిచాలు, సంస్కృత భాష పట్ల జాతి అవశ్య కర్తవ్యాన్ని ఉద్బోధించడానికి ఇంక మిగిలింది. ఇప్పట్లో ఆభాషాభివృద్ధికై మనం చేయవల్సిన కృషి ఎట్లాంటిది అనేది? జాతిపరంగా ఒకేమాటు ఒక బృహత్ప్రయత్నంతో విస్మృతమైన ఒక మహా సంస్కృతి స్రవంతిని పునరుద్ధరించడం తేలికగా అయ్యేపని కాదు.

కాని మెల్లమెల్లగా మన జాతికి మన సంస్కృతిని జ్ఞాపకం చెయ్యడం కోసం ప్రయత్నాలు చేసుకోవాలి. మన మహిళా సమాజాలలో గృహ సంబంధమైన సంస్కృత భాషా

పదాలతో పరిచయం కల్గించాలి. చిన్నచిన్న సంభాషణాత్మకమైన ప్రయోగ విన్యాసాలు సమకూర్చ జేయాలి. పత్రికలలో ముఖ్యంగా మహిళా పత్రికలలో ఇట్లాటి ప్రచార ప్రబోధాలు, సందేశాలు విరివిగా జరగాలి. ప్రభుత్వ పక్షంగా రేడియో సంస్థలో ఆకర్షణీయమైన పద్ధతుల్లో ప్రచారం జరగాలి. భండార్కర్, కాశీ కృష్ణాచార్యులు వంటి అనుభవజ్ఞుల సంస్కృత బోధన గ్రంథాలముఖంగా పాఠం జరగాలి. కొడె గ్రామరు, ఆప్టేస్ కాంపోజిషన్ గైడుల ననుసరించి వ్యాకరణ వివేచనం సూక్ష్మరూపంలో వారికి కల్గించాలి. ముఖ్యంగా సులభరూపంలో ధాతువివేకం కల్గించాలి. అప్పుడు జాతికి ఉజ్జ్వల భవిష్యత్తునకు ఆయువుపట్టులైన మహిళలలో సమ్యక్ప్రాచీన సంస్కృతి సాంప్రదాయిక ధార అఖండ స్రోతస్సుగా ప్రవహించి సుస్థిర శాంతి కాముకమైన ప్రజాసస్యాలనుత్పాదింప జేయగలవు. అప్పుడే మన రాజ్యం రామరాజ్యం కాగలదు. ఇదంతా మాతృస్వరూపిణియైన మహిళ చేతిలో పని.



**1. కన్యకా సుప్రభాతమ్ :-**

యా పార్వతీ కుసుమగుప్త తపః ప్రపన్నా
యాసా పవిత్ర లలితావత తార భూమౌ
తామ్, త్వామ్, శివస్యమ వృణోన్నవ బాల్య ముగ్ధామ్
శ్రీ కన్యకే పరశివే తవ సుప్రభాతమ్!

**2. కన్యకాస్తోత్రమ్**

మహిళా జన పావన ధర్మరతే
వర వర్ణిని, వాసవి, సౌమ్యమతే
హరసుందరి, భారతి, భవ్యరమే
విజయీభవ హే పెనుగొండ హితే

**3. దేవీస్తవ తారావళి**

యాచాంద్రీకృత సర్వలోక సుషమా స్థాణ్వర్థకాయానతిః
యా యోగీశ హృదున్మఖీ హరిహృదబ్జాలంక్రియా శ్రీసతిః
యాసాహిత్య రసాకృతిః విధిముఖాసీనా శుచిర్వాక్సతిః
త్రైలోక్యా భరణా త్రిమూర్తి లలితా సాపాతు దుర్గాంబికా

# గోదాదేవి భక్తి సౌరభము

ఉల్లము పల్లవింప నయనోత్పలముల్రహి చెమ్మగిల్ల
త్యుల్ల సితమ్ములే సుమధురోక్తుల వెనుని బాడిప్రీడితా
పల్లవపాణి 'గోద' హరిభక్తి సువాసితమౌ పుష్పమాలగా
నల్ల సిలంగ జేసే రుచిరోన్నత సంస్కృతి సాహితీ స్థలిన్॥

శ్రీపతిమీది కూర్మిమెయి చేతము పొంగగగ ప్రేమ భక్తియు
ద్దీపన మొందగా కవిత దీరిచి ముప్పది పాశురంబులా
లాపన మీర భూనభములం దనుతాపము పాపమారగా
గోపికయౌచుపాడె మునుగోద జగమ్ములు పుల్కరింపగా॥

పుట్టూనే పరిమళించిన పవిత్ర పుష్పమాలిక; గోదాదేవి! ఈ పుష్పమాలిక నలుదెసగా వ్యాపింపజేసిన భక్తి గేయసౌరభం అనన్యం! తమిళ వాఙ్మయ ప్రాభవ సౌందర్య శోభకు ముష్టి గూర్చిన ఈ కావ్యమాలికల రమణీయ యశశ్చంద్రికలు విరజిమ్మిన కాంతిపుంజం శాశ్వతమై, భారతీయాధ్యాత్మిక శక్తికి స్థిరమైన పునాదుల నేర్పరచింది. శ్రీ మహావిష్ణువును గాన సంకీర్తనతో సంప్రీతుణ్ణి చేసి జగతికీ, జగతి యందలి మానవులకూ దివ్యత్వాన్ని, అమృతత్వాన్నీ లభింపజెయ్యాలనే పవిత్ర సంకల్పంతో భూదేవి మహిభక్తుడైన విష్ణుచిత్తునకు తులసీ వనభూమిలో బిడ్డగా దొరికింది.

"ఇతఃపురా పఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధుడూ, ఆ రామక్ష్మా ఖనన క్రియా ఖరఖనిత్ర గ్రాహితోద్యత్కిణాస్తమాస్నిగ్ధ కరుడూ అయి. దేవ "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహినమో" మాత్రమే తెలిసిన అమాయిక సాత్విక భక్త శిఖామణి; విష్ణు చిత్తుడు! ఆ పరమభాగవతోత్తముడు తనకు తులసీవనంలో లభించిన ఆ చిన్నారి చిట్టిపాపను, అపూర్వ సౌందర్య రాశిని, సౌభాగ్యశ్రీలు కురిపించే ఆ ముద్దు బిడ్డను ఆండాల్ దేవిని ఇంటికి తీసికొనిపోగా ఆ దంపతులు పేదకు దొరకిన పెన్నిధి అని ముద్దుగా పేరు పెట్టి గారాబంగా ఆ అందాల బరిణెను పెంచుకొన్నారు.

మహాభక్తుడైన విష్ణుచిత్తుడు నిస్వంతు తాను తన చేతులతో నీరుపోసి, పాదు త్రవ్వి స్వయంగా పెంచిన తన ఇంటి పెరటితోటలోని సుందర తులసీ పుష్పాలతో మాలలు కట్టి తన స్వస్థానమైన శ్రీ విల్లిపుత్తూరులోని వట పత్రశాయి స్వామికి మాలా కైంకర్యం చేయుడం తప్ప వేరేపని లేని లతాకిక తపస్వి!

ర పూల దండలను గోదాదేవి (కోద్రై అనియేకాక గోదా అని కూడా ఆమెకు
ం కలదు) తండ్రికి తెలియకుండా నిత్యమూ ఒకమారు తన సిగలో
్కొని, తోటలోని నూతిలో తన చెలువము చూచుకొని మరల పూజా
ూా ఎరగనట్లు పెట్టేసేది. ఏ మాత్రం ఈ విషయం తెలియని విష్ణుచిత్తుడు
ండలనే తీసికొని వెళ్ళి స్వామికి అలంకార నివేదన చేసేవాడు.

కుమార్తె స్వామి మాలలను అలంకరించుకొని ఉండగా విష్ణుచిత్తుడు
ా, అది భగవదపచారంగా భావించి, తన బిడ్డను మందలించి ఆనాడు
ంలలను నివేదించక పోవడమూ జరిగింది. కాని ఆ రాత్రి స్వామి విష్ణుచిత్తుని
డి ఆ బాలికలనుభవించి విడిచి (ఆముక్తమాల్యద) మాల్యమే తనకు
ప్రీతికరమనీ, ఆ బాలిక తలలో ముడువని పూలను తాను ఒల్లననీ చెప్పి

్కతోనే భక్తి సౌరభాలు వెదజల్లుతూ పరిమళించిన గోదాదేవి, చిన్ననాటి
గేశునే నిజేశునిగా భావించి ఆ మధుర భావభక్తి పారవశ్యంతోనే శుక్లపక్ష
3 దినదినాభివృద్ధిని పొందుతూ ఎలజవ్వని అయింది. జవ్వని అయిన
వయస్సుతో బాటు శ్రీరంగభర్తపై వలపుకూడా అతిశయిం జొచ్చినది.
టికే లగ్గలమయ్యే ఆప్రేమ తాపాన్ని భరింపలేక గోదాదేవి విర
యినది. ఆమె ఆ విరహతాపంలోని సౌకుమార్యాన్ని రసరాట్టైన శ్రీ
య ప్రభువు చాలా రుచిరంగా వర్ణించి యున్నాడు.

శ్రీపతి మీది గేతములఁ బ్రేమఁ విపంచిక నంట బాణినఁ
తాపము సోకిమెట్ల మయి నంబు గరంగిన డించి పాడు - నా
లాపిని దాల్చి, పెన్జెమటలన్మఁటి తంత్రులు జజ్వాగాగలా
లాపిని దానపాడును. గళంబును గద్గదమైన మ్రాన్పడున్॥

ు కుమారి విరహతాపం ఇంత అతిశయమైనది అట్లాంటి అంత అతిశయ
లో తన స్వామి పొందుకొఱకు సాధనాంతరాలను రోయుగోదాదేవికి,
ుగంలో శ్రీకృష్ణుని పొందడానికి గోపికలు నిష్ఠతో ఆచరించిన మార్గళినోము
రణీయంగా కనబడింది.

గోదా ఆమార్గళినోము పట్టితానే గోపికయై మధురభావభక్తి పారవశ్యంతో
మాసం ముప్పది రోజులలో ఆనోముకు సంబంధించిన పాటలను
కవితాఝురిగా, శృంగార రసధునిగా సంకల్పించి పాడింది. తమిళభాషలో
ంటే పాట. ఇది శ్రీ కరమైన పాట కాబట్టి 'తిరుప్పావు' అని దీనికి పేరు.

ఈ తిరుప్పావు దివ్య ప్రబంధమై ద్రావిడ వేదమనబడే దివ్యప్రబంధాలలోని ముదలాయిరములలో జేరినది. ఈమె తన అపారమైన భక్తిప్రాబల్యం చేతను, అఖండమైన భగవదను భవసామర్ధ్యం చేతనే ఈమెమహావైష్ణవస్వాములైన పన్నిద్దఱాళ్వారులలో చేరినది.

చెప్పవలపికాని సుకుమార కవితా శిల్పమూ, భావసామనస్యమూకల ఈతిరుప్పావు దివ్య ప్రబంధము భారతీయ సాహిత్యంలో ఒక ఉత్తమ గ్రంథం కావడానికి; ఈ కావ్యంలోని విశ్వశ్రేయస్సాధనాచింతనమూ, మధురమంజుల భావపుష్టీ మనోహర కవితా శిల్పమూ అకతీంక భగవదభిరల కారణాలుగా కన్పడుతున్నాయి. గోదాదేవి లేక ఆండాళ్లు రచించిన ఈ తిరుప్పావు, ఆ కృష్ణుని వాల్లభ్యం కోరి గోపికలు చేసిన మార్గళినోముకు సంబంధించినది,. మెట్టమొదట ఈ వ్రతమునకు ప్రధమాంగమైన స్నానము కొరకై గోపికలు ఒక్కొక్కరిని మేల్కొలుపుకుంటూ, పిలుచుకుంటూ వెళ్లడంతో ఈ తిర్పావు ప్రబంధం ప్రారంభమౌ తుంది.

ఇందు మొదటిదైన “మార్గళిత్తిబల్ మదినిఱైన్ద నన్నాళాల్” లినే పాశురంలో తల్లి యశోదా దేవికి సింగపు గోదమవలెముద్దుమారిపెములు దీర్చు. వాడియైన యీటెను ధరించినందుకు మారగోపుడు మన నోమునకు వలసిన సౌకర్యములను చేయును.“ అని చెప్పుటలోను, యశోదైఇళశ్శింగమైన” నందగోప కుమారుని దివ్య సౌందర్యమును గానమొనర్చుటలోను ఈ వ్రతము ఔన్నత్యము, వ్రతము చేయువారి అభీష్టము, అందలి వారి మధురభక్తి రూపమైన పరమార్ధము, అన్నింటిని గోదాదేవి చాలా మనోహరముగా సుకుమార ధ్వనితో ఉపలక్షింప జేసినది. తరువాత “ఓఙ్గయుల గళన్ద ఉత్తమన్ పేర్పాడి” అనే పాశురంలో వ్రతాంగమైన స్నానక్రియచే లోకమునకు కల్గుమేళ్లను ఆమె స్పష్పముగా అభివర్ణించినది. పండివంగిన యెఱ్ఱ వరిమళ్లలో పొర్లాడే చేపలు, కలువ కన్నెలో నిశ్చింతగా నిదురించే తుమ్మెదలు, గోపికల కుండలకు మిగులు క్షీరధారలను గురిసే ధేనువులూ స్నాన ప్రయోజనంగా సిద్ధించే శ్రేయల్గ ప్రయోజనాలని ఈ పాశురంలో గోదాదేవి వర్ణించిన తీరు ఎంత లలితంగా ఉన్నదో అంత సంపుష్టమైన విశ్వశ్రేయో భావనతో నిండిఉన్నది.

శ్రీమద్రామాను జయతికి పరమ ప్రతీకరమైన “ఉన్దుమఱుదగళిన్” అనే పద్దెన్మిదవ పాశురంలో నప్పిన్నైపిరాట్టి (నీళాదేవి)ని మేల్కొలిపే పాశురమూ, నందగోపకుమారుని శరీర సౌభాగ్యశ్రీని వర్ణించి తమ్ముదయతో చూడుకుని ప్రార్థించు 23, 24 పాశురములు, ఏమీ తెలియని తమ్ము (గోపికలను) ఏలుకొమ్మని సర్వసమర్పణా భావంతో ప్రార్ధించే కరవైగళ్లుపిన్ శెన్ఱు” అనే 28వ పాశురమూ మృదులమైన శయ్యా పరిపాకంతో, ప్రసన్నమైన శైలితో, రుచిరమైన భావార్ధంతో తమిళ మహాసారస్వత

పరిశ్రీ్ప్రియాయోగ్యములై లిఖిల భారత సారస్వత మహనీయ తను వేనోళ్ల చాటుతూ ఉన్నవి.

ఇందు గోపకిశోర గత భావనకల గోపికలు నందబాలుని కొరకు వ్రతం చేయడం, దానికి యశోదాసింగమైన పురుషవరేణ్యుడు రక్షకుడై యుండె కావలసిన కుపకరణ, సౌకర్యాలను కూర్చడం, వ్రతంలో గోపికలు సర్వసమర్పణ భావంతో ఆ లీలా మానుష దివ్య సుందరుణ్ణి వేడుకోవడం అన్నీ భగవత్పరములే.

యజ్ఞము, యజ్ఞసాధనము, యజ్ఞాంగమూ, యజ్ఞ పురుషుడూ, యజ్ఞధ్యేయము, యజ్ఞ ప్రయోజనము, చివఱకు యజ్ఞకర్తా, యజ్ఞభోక్తా తానేఅయి అపరమపురుషుడే ఆ గోపికా మహాయజ్ఞాన్ని నిర్వహిస్తుంటే లోకంలో శోభన సమృద్ధి వర్ణించక ఇంకొక విధం ఎట్లాఒన గూడుతుంది?

గోదామహాదేవి జన్మించి ఎన్నివందల సంవత్సరాలైనదో ఆ మహానుభావురాలి లలిత మధుర భక్త్యా రాధనతో గూడిన విశ్వకళ్యాణ సందేశం ఆమె పేరుకు తగ్గట్లు నిత్య సౌరభాలను విరజిమ్ముతూ భారతీయ సాహిత్యాన్నే శాశ్వతంగా సుమాళింప జేస్తూ ఉంది. ఇంత మహోన్నత సాహిత్య ప్రయోజనాన్ని లలితచయనంగా, మధుర మార్గంలో శివేతరక్షతి ఫలోద్దేశంతో నిర్వహించి గోదాదేవి నిజంగా మనకు ఆరాధ్యురాలు!

ప్రేమ పారవశ్యమ్మునస్వామి గొలిచి
భద్రచయనమౌ "తిర్పావు" పాడినట్టి
భక్తితన్మయ, సుమధుర భావలలిత
ధన్య, గోదామహిదేవి ధరణి బ్రోచు॥



## ఒక్కచిన్నదివ్వె

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా
నీమోసిన పదము జాడ సకల తీర్థమనుగమించె
నీయెత్తిన కరము నీడ శాంతిదేవి విశ్రమించె
నీ పల్కిన పల్కుచాయ శ్రుతి శిరములు ప్రతిరవించె
నీ పిల్చిన పిలువునంది భువనపాళి తలలు వంచె
ఓహోమహాత్మా, ఓహోమహితాత్మ!

# కాంతి శిఖరాలు

నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండి వెల్గెద మోయీ!
కడలి లోతులు తఱచి
కడల యెల్లలు చఱచి
నిండారి భావత
రంగాలు శబలింప
సంభ్రమించెద మోయీ
విభ్రమించెద మోయీ
విధివిరామము లేక ఈశా॥ నీలోని॥
చూపు చూపులు లేక
పలుకు పలుకులు లేక
నిశ్చలమౌ, నీరవమౌ
నిబిడ హృత్సీమలతో
నిలిచి పోదమటోయీ
విలుచు కొందమటోయీ
విపుల జగతీ సారము నీశా॥ నీలోని॥
అంతయును ఏకమై
అన్నియును ఒకటియై
అంతరంగము నిండ
అంతర్ము ఖులమై
అనంత పదసీమ
ఆనంద ధామాలు
అల్లుకొందమటోయీ ఈశా॥ నీలోనూ॥

✡ ❁ ✡

సత్యాన్ని తెలుసుకున్న తరువాత మీ రచనల్లో కనిపించే అస్పష్టత ద్వారా సుస్పష్టత వెల్లడయింది.

మీరు నన్ను సమగ్రంగా కాకపోయినా అసమగ్రంగా అయినా స్పష్టంగా తెలుసుకున్నందుకు సంతోషం. నేను జడవాదిని చైతన్యవాదిని కూడా. మీలో జడవాదం ఎంతవరకు అస్తిత్వాన్ని కలిగి వున్నదో తెలియదుకాని మీరు పూర్ణ చైతన్యవాదులని నాకు తెలుసు.

ఆమెగారు తిరిగి అన్నారు, ఏది ఏమైనా పరవాలేదు కాని వాటి ప్రభావాలు తమ రచల మీద ఎంతవరకు పడతాయా అనేది ముఖ్యం. రచన రచయిత జీవితం యొక్క ప్రతిబింబం అనేది ఎంతవరకు సత్యమా అని.

ఈ విషయం మీద నాకు కొన్ని స్వీయాభిప్రాయాలున్నాయి. వాటినే ఆమెగారికి ఎరుకపరచాను. రచన కేవలం రచయిత జీవన ప్రతిబింబం కాదు, అందుకని రచనయిత రచించిన రచన, రచయిత జీవితపు ప్రభావాలనుంచి పూర్తిగా దూరమై వుండదు, మధ్యేమార్గంలో వుంటుంది. ఇంకా అన్నాడు రచనలో వాస్తవవాదం మాత్రమే సర్వస్వం కాదు, ఆదర్శవాదం కూడా అవసరం. తమ రచనల్లో సమాజంలోని చీకటిని మాత్రమే అభివ్యక్తిత్వాన్ని మాత్రమే కాక సన్మార్గుల దుష్టత్వాన్ని మాత్రమే కాక సన్మార్గుల సచ్చరిత్రను కూడ చూపాలి. జరుగుతున్నఘటనవాస్తవ వాదానికి చెందితే ఎట్లా జరిగితే బాగుంటుందో అనేది ఆదర్శవాదానికి (idealism) చెందుతుంది.

ఈ జీవనమర్మాలూ కళామర్మాలూ ఆమెకు తెలియనివికావు. అయినా నన్ను సంతోష పెట్టటానికని తనకు తెలియనట్లు నటించారు ఆమె.

అంతటితో ఈ చర్చలను ఆపి ఆమెజీవితంలోని విలువైన వివరాలను, ఆమెవైదుష్యంలోని వైవిధ్యాలను, వైరుధ్యాలను గురించీ అడిగి తెలుసుకొని ఆనందించాను.

తాను ప్రధానంగా పద్యరచయిత్రి అయినప్పటికీ తనకు గద్యరచనలను చదవటంలోను రచించటంలోను అధికానందం జనిస్తుందని తెలిపేరు ఆమె. తన సాహితీ ప్రతీతి ఇటు అధునాతన రచనల మీద వున్నట్లుగానే అటు సనాతన రచనల మీదకూడ వుంటుందన్నారు.

నేను అడిగాను, మీ భూతకాలపు సాహితీ జీవితం, వర్తమానపుదీ ఉజ్వల మైనట్టివి. మీ భవిష్యత్ కూడా అదేవిధంగా కాక ఇంకా గొప్పగా వుంటుందని మీకు నమ్మకం వున్నదా ?

నమ్మకం లేకేమి, నమ్మకం వున్నది. కాని నమ్మకాలన్నీ సఫల రూపాంతాలిస్తాయి అనే నమ్మకం మాత్రం తగినంతగా లేదు!

# ప్రతిభాశాలి

- కల్లూరి రాధాకృష్ణయ్య
పారిశ్రామిక వేత్త
అనంతపురం జిల్లా.

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు నాళం కృష్ణారావుగారి కూతురు. శ్రీ కృష్ణారావు గారు గొప్ప సంస్కర్త. శ్రీ కందుకూరు వీరేశలింగము గారితో కలిసి వుద్యమంలో పాల్గొన్నవారు. మధురకవిగా పేరుపొందినవారు. జమిందారు వంశములో జన్మించిన వారు ఇట్టి వుత్తమ శ్రేణిలో గణుతి పొందిన వారు ఈమె తండ్రిగారు. కనుకనే లక్ష్మీ కాన్తమ్మను కడు ప్రేమతో చాల శ్రద్ధగా పెంచినారు. వీరి తండ్రిగారు చిన్నతనమునుండి వారి యింటికి వచ్చిపోతున్న పెద్దలమధ్యలో పెద్దవారిచేతులలో పెరిగినది. ఆమె అభివృద్ధికి ఏవిధమైన ప్రతిబంధకము లేకుండా పెరిగినది. అనేక కళలలో పిన్నవయస్సులోనే ఆరితేరినది. వీరు రాసుకొన్న జీవితచరిత్రలో తన చిన్నతనమును గురించి గణనీయంగా విపులముగా వ్రాసుకున్నారు.

వీరు సాహిత్యంలో, సంస్కృతం తెనుగు లలో ద్విభాషా కోవిదురాలుగా పేరుగాంచి నారు. వీరు సాహిత్యరంగంలో అవిరళ కృషి జరిపి వచనము, పద్యకవిత్వం ద్విపద మూడింటిలో ప్రథమ శ్రేణికి చెందిన కావ్యాలు రచించినారు. ఏ సభలో పాల్గొన్నప్పటికి పాటి వార్కితీసిపోక జంకక ముందంజవేసి చక్కగా తన భావాలు పటుతరముగా తెలియపరుస్తూ పలువురితో శ్లాఘించబడినారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు రాష్ట్రములో పలువురి పెద్దలకు కళా ప్రపూర్ణ బిరుదము యివ్వవలయునని వుద్దేశించిన సమయములో లక్ష్మీకాన్తమ్మగారు అందులో ఒకరుగా పేర్కొనబడినారు. వీనివలన తనకాలంలో పెద్దపేరున్న మహిళ అని తెలియబడగలదు. ఇదే విశ్వవిద్యాలయము వార్కి డాక్టరేటు పట్టా యివ్వడము చూస్తే ఆమెకు సాహిత్య కళారంగంలో వున్న శక్తి సామర్థ్యాలు గుర్తుకు రాగలవు. యీవిధంగా ఎన్నో బిరుదులు పొందిన గొప్ప వ్యక్తి. ఆమె జీవితంలో ఓటమి ఎరుగదు. సాహిత్య అకాడమిలో రాష్ట్రంలో వున్న నలుగురి పెద్దలలో ఒకరుగా పేరొందినవారు.

వీర్కి సంతానం ఎక్కువగా వున్నప్పటికి తాను స్త్రీ అయి కూడా గర్భవతిగా కొన్ని ముఖ్యసభలకు తప్పి పోకుండా హాజరై తన ప్రతిభ చాటుకొన్నది. అమిత సాహసం గలవారు. తన పిల్లలందరికి ఉన్నత విద్యలు అభ్యసింపచేసి అందరిని ఉద్యోగాలలో చేర్పగలిగింది.వీరి భర్త వకీలు వృత్తి గలవారు. జీవితంలో ఏ కొరతలేని మనిషి.

వీరియీ గొప్పతనం సాహిత్యరంగంలో గమనించి నేను వీరికి అనంతపురం లలితా కళాపరిషత్తు యందు కనకాభిషేక మహూత్సవం జరిపివున్నాను. ఆరోజువుదయము డాక్టర్ వి.వి.ఎల్. నరసింహారావుగారి ఆధ్వర్యమున తొమ్మండుగురు మహాకవులతో కవితా గోష్ఠి జరిపించి సాయం కాలము డాక్టర్ దోణప్ప గారి అధ్యక్షతన పెద్దలు శ్రీ కొణిజేటి రోశయ్య గారు ముఖ్య అతిధిగా అనేకమంది కవుల మధ్యలో చాల గణనీయంగా కనకాభిషేకం జరిగినది. అనంతపురంలో యీ నాటికి మరల అట్టి కవితా గోష్ఠి కనకాభిషేకం జరగలేదు. ఆ సభలో యిపుడు హైదరాబాదులో వున్న పొట్టి శ్రీరాముల విశ్వవిద్యాలయము వైస్ చాన్సలరు డా॥ నాయని కృష్ణకుమారిగారు పాల్గొని ఉభయులు చిన్ననాటి మైత్రిని స్మరించుకొని ఆనందించి ప్రస్తుతించుకొన్నారు. వీరు సభలలో ఎక్కడ ఎపుడు విందులో పాల్గొన్నప్పటికి పదుగురు పెద్దలతో తాను ఒకరుగా ప్రాముఖ్యత గలిగి సెబాస్ అనిపించుకున్నారు.

ఆఖరు జీవితములో ఏ ఒకటి రెండు సంవత్సరాలో ఏ సభలలో పాల్గొనలేదు. వారి వృద్ధాప్యదశలో కూడా పాల్గొని ఆ దశలో కూడా తన సామర్థ్యము కోల్పోలేదని రుజువు చేసుకొన్నది. ఆమె ప్రజాజీవి తము సాహిత్యరంగంలో దాదాపు యాభై సంవత్సరాలు అనర్గళంగా శ్రమించి గడిపి పేరు గాంచిన మహామనీషి. వీరి జీవితాన్ని గమనించి వీరిపైన నాకు అమితమైన గౌరవం ప్రేమ కలిగినవి.

# ప్రజ్ఞాపాటవాల పూబంతి

***- అద్దేపల్లి వివేకానందాదేవి***

రాజమండ్రి

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందని నానుడి. గౌరవనీయమై, సంస్కృతీ సాహిత్య నిలయమై, దానగుణ ప్రధానమైన నాళంవారి కుటుంబములో జన్మించినది మా అక్కయ్య లక్ష్మీకాన్తమ్మ. అటు పుట్టిన యింటితో పాటు మాతామహులై కీర్తి చంద్రికల్ని నలుదిశలావ్యాప్తి చెందించిన మోతేవారి వంశంలో జన్మించిన ఈమె తల్లి సుశీలమ్మగారు, సుగుణాల రాశి, గాంధేయవాది. నాళం కృష్ణారావుగారు, కవియై సాహితీ వేత్త కందుకూరి వీరేశలింగం వారి శిష్యుడై, వారినుంచి స్ఫూర్తి పొందినారు. నాళం కృష్ణారావు గారి గారాలపట్టి మాసోదరి.

చిన్ననాటనే వీణాపాణియై, సంగీతాన్ని మాతృదేవి నుంచీ, సాహిత్యాన్ని పితామహులనుంచి సంతరించుకున్న ప్రజ్ఞాశాలిని. ఈమె కృష్ణకుమారిగా రాజమహేంద్రవాస్తవ్యులకు సుపరిచిత. గలగలపారే గౌతమీ ప్రవంతిలా, ఏకధాటిగ

ఆమె ఉపన్యసిస్తూ ఉంటే మావంటి వాళ్లము, ఆశ్చర్యానందాలతో తిలకిస్తూ, నిశ్చేష్టులమై ఉండిపోయేవాళ్లం. అలనాడే చిన్ని, చిట్టి కవితామాలలల్లేది మా అక్కయ్య.

చిన్నతనంలోనే వివాహం హయగ్రీవగుప్తగారితో జరిగింది. కొద్దికాలం సంసార భారంతో, చిన్నారిబిడ్డల పెంపకంలో కాలచక్రం దొర్లిపోయింది. సకలసంపంగి ఎన్నాళ్లు ఆకులందున అణిగిమణిగి వుండగలదు ? సాహితీ, సౌరభాలు, నలుదిశలా వ్యాప్తిచెందాయి. కవితా స్రవంతులతోపాటు పెల్లుబికిన దేశభక్తి ముఖ్యంగా భారత కవయిత్రుల, ఆంధ్ర కవితామతల్లుల పరిశోధన గ్రంథాలను వెలుగులోకి తెచ్చి తనయశశ్చంద్రికలతోపాటు, కవితామణులకీర్తి పతాకాలను భారతాకాశంలో ఎగురవేశారు.

ఆమె పాండిత ప్రకర్షతో పాటు సాంస్కృతి అభినివేశం, పొగడదగినవి, కీర్తించదగినవి. ఆమె సాక్షాత్తు చదువుల జనని శారదాదేవి అనుంగు బిడ్డ. భూరి కుటుంబిని మాసోదరి. తన కుమార్తెలను, కుమారుల్నీ తీర్చిదిద్ది వారి భవిష్యత్తుకు బాటవేసిన సాధ్వి. ఆఖరు క్షణంవరకూ చిన్నబిడ్డను సాకినట్లు, అనారోగ్యంతో వున్న భర్తను సాకినదీ సాధ్వీమతల్లి.

తన పితామహుని యశస్సునిల్పిన పుత్రిక. నాళం కృష్ణారావుగారి శతజయంతి ఉత్సవాలకై ఆంధ్రావని నాల్గుచెరగుల పర్యటించి రాజమహేంద్రవర గౌతమీ గ్రంథాలయ స్థాపకులు తనతండ్రిగారని చాటిచెప్పి ఉత్సవాన్ని దిగ్విజయంగా నిర్వర్తించారు. పితౄణం తీర్చుకొనుటకై ఆయన పేర సాహితీ పురస్కారాన్ని ప్రతి సంవత్సరం పేరుకాంచిన రచయితలకు, కవులకు అందించిన వీరవనిత.

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మను, ఆమె గుణగణాలను, వైశిష్ట్యాన్ని గురించి రాయడం మావంటివారికి అలవిగానిపని. ఆమె ఒక సంస్థ. అది బహుముఖశాఖలు గల సంస్థ. ఒక సంస్థ అభివృద్ధిని గురించి రాయడానికి దాని ఔన్నత్యాన్ని గురించి రాయడానికి పరిశోధన పాటవం గల ప్రజ్ఞాశాలులు అవసరం. ఇంత ప్రతిభ గల్గి, సర్వకళా, పరిపూర్ణ, సహజ, యశశ్చంద్రికలను వెదజల్లు స్త్రీమూర్తి ఆంధ్రావనికే మకుటమని ఆమె జ్ఞాపకానికి ఇంతకన్నా నేను హెచ్చుగా రాయలేనందుకు అశక్తతను తెలియజేయుచున్నాను.

# వాగ్దేవి వరపుత్రి

*- పోలవరపు జగదీశ్వరరావు*

మాన్యసోదరి స్వర్గీయ లక్ష్మీకాన్తమ్మగారితో నా పరిచయం 1960 ప్రాంతంలో ఆమె ఏలూరు సర్ సి. ఆర్. రెడ్డి కళాశాలలో సాంస్కృతికోత్సవాలలో సారస్వతోపన్యాసానికి

వచ్చినపుడు ప్రారంభమై ఆమె అంతిమదినాల వరకు కొనసాగింది. గంగాజల ధారాపాతాన్ని మరపించు ఆమెముగ్ధమనోహర మధుర వాగ్ధార నన్ను ముగ్ధుణ్ణికావించింది. ఆనాటినుండి ఆమె పట్ల ప్రత్యేక శ్రద్ధ ఏర్పడింది. ఆ తరువాత 1966లో నేను చీరాల కళాశాల ప్రిన్స్‌పాల్ పదవి చేపట్టిన తరువాత వారితో నాకు అత్యంత సాన్నిహిత్యమేర్పడింది. వారిని 2, 3 పర్యాయాలు చీరాల కళాశాలలో సన్మానించే భాగ్యం కల్గింది. ఆమె ఉపన్యాసాన్ని అధ్యాపకులు, విద్యార్థులు శ్రద్ధాభక్తులతో ఆలకించేవారు. ఆమెను అపరవాగ్దేవి అంటే అతిశయోక్తికాదు.

పరీధావి సంక్రాంతి పర్వదినాన (1973 జనవరి 14) సర్వశ్రీ వి. గోపాలరావు, కంభంమెట్టు మధుసూదనరావు, కోటంరాజు సత్యనారాయణశర్మగార్లు బాపట్లలో ఏర్పాటు గావించిన "ఆంధ్రభోజ, సాహితీ సమరాంగణ సార్వభౌమ, విజయగనర పురాధీశ్వర శ్రీకృష్ణదేవరాయ ప్రవర్థిత భువనవిజయమహా సభ" లో నేను శ్రీకృష్ణ దేవరాయలుగా, లక్ష్మీకాన్తమ్మగారు కవయిత్రి మొల్లమాంబగా మామా పాత్రలను మనోరంజకంగా పోషించి ఆనాటి సభకు హాజరైన షుమారు పదివేలమంది సాహితీ ప్రియుల మన్ననలందుట మాభాగ్యము.

లక్ష్మీ కాన్తమ్మగారు నేల నలుచెరగులా చేసిన ప్రసంగాలు ఆమె రచించిన మూడు పదులకు పైగా గల విశిష్టరచనలు ఆ వాగ్దేవి అక్షర జైత్రయాత్రకు, ఆమె తెలుగు తల్లికి చేసిన మరువలేని, మరువరాని అత్యుత్తమసేవలు.

నేను మా మిత్రులు మోటమర్తి బాలంకేశ్వరరావుగారు రచించిన 'శ్రీకృష్ణావతార వైభవము అను గ్రంథముపై ఆమె వెలువరించిన 'ప్రశంసా పారిజాతము' అను అభిప్రాయము చిరస్మరణీయము - ఆమె ఆధ్యాత్మికతకు గీటురాయి.

నాకు లక్ష్మీకాన్తమ్మగారితో గల సన్నిహితసంబంధంతోనేను చెప్పగల్గింది ఆమె కరుణామయి. సహృదయ, సంఘసంస్కరణాభిలాషి, దేశభక్తి ప్రపూరిత మీదు మిక్కిలి ఆధ్యాత్మిక తత్త్వవేత్త. ఆమె కమనీయ రచనలు ఆంధ్ర సరస్వతికి కర్పూర నీరాజనాలు. ఆమె ఉపన్యాసాలు వాగ్దేవి నోటవెలువడ్డ సాహితీ రసగుళికలు. ఆమెరచన 'సాహితీ రుద్రమ' అను ఆత్మకథ అత్యంత రమణీయము.

సాహిత్య ప్రియులు బెజవాడ గోపాలరెడ్డిగారి అంచనా ప్రకారం డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఈతరం మహిళలలో అగ్రగామి. ప్రముఖ సాహితీవేత్త ఆరుద్రగారు లక్ష్మీకాన్తమ్మగారిని సంగీతవిద్రుమ - సాహితీరుద్రమ, అనడంలో వాస్తవం ఎంతోఉంది.

# పెద్దక్కయ్య

- డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు
నాగభైరవ కళాపీఠం, గుళ్ళపల్లి,
ప్రకాశం జిల్లా.

1987లో ననుకుంటాను. రవీంద్రభారతిలో ఉగాది కవిసమ్మేళనం జరిగాక, అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్. కవులను సన్మానిస్తున్నారు. అది తెలుగు విశ్వవిద్యాలయం వారు ఏర్పాటు చేసిన సభ. ఆనాడు కవితాగానం చేసిన వారిలో కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు కూడా ఉన్నారు. ఎన్.టి.ఆర్ అన్నారు. "పెద్దక్కగారూ! రండి. మా సన్మానం స్వీకరించండి" అని సభికుల కరతాళధ్వనుల మధ్య. ఆమె వచ్చారు. ఆయన పూలదండ యిచ్చి నమస్కరించి, మెమెంటో యిచ్చి, మహారాజుల విధంగా సంచీలో మూట గట్టిన వెయినూటపదార్లు వరకు రిజర్వుబ్యాంకు రూపాయి నాణేలు యిచ్చి, శాలువా కప్పి పునః నమస్కారం చేసినంత సేపు ఆయన ఏదో అంటూనే వున్నారు. ఈమె జవాబులు చెబుతూనే వుంది. ఛలోక్తులు విసురుతూనే వుంది; మా పెద్ద ఆడపడుచు" ఆయన సభకి చెప్పినప్పుడు కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి. ఆ దృశ్యం నాకళ్ళల్లో యింకా నిత్యహరితం.

అప్పుడూ అంతకు పూర్వమూ, ఆతర్వాత అక్కయ్యతో చాలసభల్లో పాల్గొన్నాను.

ఆమె పద్యం బాగారాస్తుంది. ఆమెకు గేయ కవిత్వం రాయాలని వాంఛ. 'నా తెలుగు మాంచాల' కావ్యమే రాసింది. పద్యంలో ఉండే పసందైన ఆమె పలుకుబడి గేయంలోనూ వచనగేయంలోనూ పలుకలేదు.

ఆమె బాపట్లలో ఉండేవారు. నేను ఉద్యోగించింది చీరాల ప్రభుత్వ స్త్రీల కలాశాలలో, ఒకసారి ఆమె కాలేజీకి వచ్చింది ఓ సభకి - ఓ ఛలోక్తి "ప్రభుత్వ స్త్రీల కళాశాల ఏమిటి? ప్రైవేటు స్త్రీలకు వేరే కళాశాలలుంటాయా ?" అని నవ్వించారు.

నా "రంగాజమ్మ" కావ్యానికి వస్తువు ఆమె ఆంధ్ర కవయిత్రులు గ్రంథంలోంచే ప్రధానంగా స్వీకరించాను. ఆమెకి చెప్పాను. కాని ఆమె ఆకావ్యం చదవనే లేదు.

వీరరాఘవ పేటలో మెట్లన్నీ ఎక్కివచ్చి - మండువేసవిలో - తన పుస్తకాల కొత్త ముద్రణలను యిచ్చి పోయిన అక్కను ఎలా మరువగలం ? సాహిత్యంలో రాజీలేని ఉపన్యాసం చేసే విదుషీమణిని ఎలా మరువగలం ? ఆమె కవయిత్రిగా ఒక ఎత్తయితే - ఆమె తీర్చిదిద్దినవారు కవయిత్రులుగా వెలుగొందడం యింకో ఎత్తు, ఆమె ప్రోత్సాహం అలాంటిది. చిల్లర భవానీ దేవి, కోకా విమలకుమారి ఆమె ప్రోడక్ట్స్.

ఆమె ధన్యజీవి, స్థాయిగా రాసింది, గంభీరంగా బ్రతికింది. ఉదాత్తంగా ఉపన్యసించింది.

ఆమె 'ఆంధ్ర కవయిత్రుల' గ్రంథం చాలదూ ఆమెని కాలంలో బ్రతికించడానికి ?

# విదుషీమణి: ఆకాశవాణి

*- డా॥ ఆర్. అనంత పద్మనాభరావు*

మాన్యురాలు, కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారితో నా పరిచయం రెండు దశాబ్దాల నాటిది. 1978లో నేను విజయవాడ ఆకాశవాణిలో తెలుగు ప్రసంగ శాఖ ప్రయోక్తగా పని చేస్తున్నాను. ఆమె బహుముఖీన సాహితీ వైదుష్యాన్ని విని వున్నాను. కవి సమ్మేళనానికి ఆహూతుల సమక్షంలో వారిని ఆహ్వానించాం. కమ్రకంఠంతో, గళమెత్తి పద్యం చదివితే శ్రోతలు మంత్రముగ్ధులు కావలసిందే. భాష, భావము, అనుభూతి ముప్పిరిగొనినడిచేవి.

ఆమె 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథం ఆ కోవలో వచ్చిన గ్రంథాలలో మొదటిది. సాధికారికంగా అనేకమందిని ఒక చోట చేర్చి వారి జీవిత విశేషాలను వెలుగులోనికి తీసుకొచ్చారు. వారి కృషి అభినందనీయం.

ఆంధ్రదేశంలోని అన్ని సాహిత్య సంస్థలు, ఆకాశవాణి కేంద్రాలు వారిని ఆదరించి సత్కరించాయి. డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు ఆదరించిన రచయిత్రులలో లక్ష్మీకాన్తమ్మ గారొకరు. సాహిత్య అకాడమీ అనుబంధంతో ఆమె మరింత సాహితీ సేవ చేశారు.

1995లో నేను విజయవాడ కేంద్ర డైరెక్టరుగా మార్చిలో చేరాను. నెలాఖరులో ఉగాది కవి సమ్మేళనం తుమ్మలపల్లి వారి కళాక్షేత్రంలో నిర్వహించాం. అందులో లక్ష్మీకాన్తమ్మగారు పాల్గొన్నారు. ఆమె కవిత హైలెట్. ఎంతో ఆదరంగా మాట్లాడారు. ఎన్నో సాహితీ విషయాలు ముచ్చటించుకొన్నాం. సౌమనస్యంగా జరిగిన సంభాషణ అది.

నిరంతర సాహితీ సేవ ధ్యేయంగా, మహిళాభ్యున్నతి లక్ష్యంగా సాహితీ నందనోద్యానాలలో నాలుగు దశాబ్దాలు విరబూసిన పారిజాతం ఆమె. ఆమె తనయ ఊటుకూరి సుహాసిని గారు సాహితీవేత్తకావడం హర్షదాయకం. నాళం కృష్ణారావుగారి పేర తెలుగు విశ్వవిద్యాలయంలో లక్ష్మీకాన్తమ్మగారు స్మారకనిధిని ఏర్పాటు చేసిన విషయం యిక్కడ స్మరించుకోవాలి. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ, వంటి ప్రముఖ రచయిత్రుల తరానికి చెందిన లక్ష్మీకాన్తమ్మగారు

రచయిత్రిగా, కవయిత్రిగా, పరిశోధకురాలుగా చిరస్మరణీయురాలు. కనకాభిషిక్తురాలైన కొద్దిమంది రచయిత్రులలో వారిని గుర్తుంచుకొంటుంది ఆంధ్రదేశం. అందుకే ఆమె సాహితీ రుద్రమ!

# విరామమెరుగని నిస్వార్థజీవి

- పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారితో నా పరిచయం దాదాపు నాలుగున్నర దశాబ్దాల నాటిది, 1952 ప్రాంతంలో నేను భీమవరం కాలేజీలో తెలుగు డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తున్నప్పుడు, మా కళాశాల ఆంధ్ర సారస్వత సమితి ఆహ్వానంపై ఆమె వచ్చి కాలేజీలో సాహిత్యోపన్యాసం ఇచ్చినప్పటిది. నాకు ఆశ్చర్యం వేసింది. ఏం వాక్ప్రవాహం ? ఏం భాషా పాటవం? ఏం ఉపన్యాస జలపాతం ? జమ్మలమడక మాధవరామశర్మ గారి తర్వాత, నేనంత ఉపన్యాసాలకేసరిని ఎవరినీ చూడలేదనిపించింది. అప్పట్లో నాకు లక్ష్మీకాన్తమ్మగారితో ముఖపరిచయం మాత్రమే అయింది.

తర్వాత సన్నిహిత పరిచయం ఏర్పడింది, 15 ఏళ్ళతర్వాత, అనగా 1966లో నేను ఉద్యోగరీత్యా బాపట్ల వెళ్లినప్పుడు, లక్ష్మీకాన్తమ్మగారి పుట్టినిల్లు రాజమండ్రి అయితే, మెట్టినిల్లు బాపట్ల - నాళం వారి ఆడబడుచు, ఊటుకూరి వారి కోడలూను, పుట్టినింటితో పరిఢవిల్లిన అతిమధురమంజులమైన తియ్యని తెలుగు. ఆమె తండ్రిగారు, మధుర కవి నాళం కృష్ణారావుగారి రూపం నాకు లీలామాత్రంగా జ్ఞాపకం; నాదీ రాజమండ్రియే కావడం వల్ల వారిని, 2,3 సార్లు చూసినగుర్తు. రాజమండ్రి మైన్ రోడ్డులో వెళుతూ ఉంటే, కూరల మార్కెట్టూ పెద్ద మసీదూ, ఇంకా ఫర్లాంగు, రెండు పర్లాంగుల దూరం ఉంది అనగా, కుడి చేతి వైపున ఉండేది వారి ఇల్లు, ఆయన రాసిన పుస్తకాల పేర్లు, 'మీగడ తఱకలు', వెన్నముద్దలు, అని రాసిన బోర్డులు వారి ఇంటిముందు, వచ్చేపోయే వారిని ఆకర్షించేవి.

పుట్టింట్లో ఇలా తాను తెనుగు పూజాపీఠంలో పూజలందుకుంటే, అత్తింట్లో సంస్కృత భాష, సంస్కృతవాఙ్మయం, కిరీటాన నిలిచింది. లక్ష్మీకాన్తమ్మగారి భర్త శ్రీహయగ్రీవగుప్త గారు వృత్తిరీత్యా న్యాయవాది అయినా, ప్రవృత్తిరీత్యా సంస్కృత వాఙ్మయాను శీలనా పరాయణుడు. శుద్ధమైన సంస్కృత భాష అన్నా, ప్రసిద్ధమైన సంస్కృత శ్లోకాలన్నా ఆయనకి ఎంతో ఇష్టం. వారి ఇంట్లోనో, మాయింట్లోనో, మేం ఇద్దరం కలిసి ఏ కొర్రపాటి గంగాధరరావుగారి ఇంట్లోనో కలిసినప్పుడు, మాటలమధ్యలో శ్రీ హయగ్రీవగుప్తగారు అలవోకగా ఎన్నో సంస్కృతశ్లోకాలు చదివేవారు. సంస్కృత కావ్యాల్లోని, రసమయ ఘట్టాల్ని గురించి కూడా చర్చించేవారు.

ఉభయ భాషా ప్రవీణ పట్టంతోనూ, స్వయంకృషితోనూ, విదుషీమణిగా వినుతికెక్కిన లక్ష్మీకాన్తమ్మగారికి ఈవిధంగా, సంస్కృతాంధ్ర వాఙ్మయ వాతావరణం అదృష్టమైన వరంగా లభించింది.

1966 మొదలు 1996 వరకూ, దాదాపు 30 ఏళ్ళు, బాపట్లలో ఉండడం, భావపురి రచయితల సంఘం, కళాభారతి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వంటి సంస్థలలో ఇద్దరమూ సభ్యులుగా ఉండడం, ఆమెకీ, నాభార్య రాజ్యలక్ష్మికీ స్నేహం, హయగ్రీవగుప్త గారిపట్ల ఓ విధమైన ఆత్మీయత ఏర్పడ్డం, ఈ అన్నికారణాలవల్లా, లక్ష్మీకాన్తమ్మగారి గురించి ఆత్మీయంగా తెలిసే అవకాశం నాకు లభించింది.

వ్యక్తిగా ఆమె నిష్కపటి, గుండెల్లో ఒక అభిప్రాయం పెట్టుకొని మరోరకంగా మాట్లాడ్డం ఆమెకి చేతకాదు. అభిమానం వచ్చినా ఆగ్రహం వచ్చినా అనెయ్యడమే - కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడ్డం వల్ల కొందరికి ఆమె దూరం అయ్యారుకూడా. ఏదైనా పట్టు పట్టినా, ఏదైనా తల్చుకున్నా సాధించి తీరాల్సిందే - అడ్డంకులకి ఆమె ఎప్పుడూ భయపడేవారుకాదు. అసాధ్యం అనేది ఆమెనిఘంటువులో లేదు. భావ పురి సంగీత సభప్రారంభ దశలో ఆమె ఆ సభకి బాసటగా నిలిచి కృషి చేశారు. అకాడమీ సమావేశాల్లో, మాలాంటి వాళ్ళం ఎంత అడ్డుకోవాలనిప్రయత్నించినా కాదని పోరాడి, అధ్యక్షులైన బెజవాడ గోపాలరెడ్డిగారిని ఒప్పించి, రచయిత్రులకి వేరేసభలు, వారి సర్వతోముఖాభివృద్ధికి కొన్ని నిధులు, అకాడమీ కేటాయిస్తూ, తీర్మానించేలా చేశారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో అరవై మంది సభ్యులున్నా, ఎక్కువగా చర్చల్లో ఏ ఏడెనమండుగురమో పాల్గొనే వాళ్ళం. మాలో, ఆమెది కంచుకంఠం - గంభీరమైన వాణి - ఖంగునమోగేది. ఆమెతో వాదించడానికి హేమా హేమీలు, సందేహించేవారు. కనుపర్తి వరలక్ష్మమ్మ గారితో విభేదించి విడిపోవడంలో ఎంత నిజాయితీ ఉందో, తర్వాత ఆమె సౌజన్యాన్ని గుర్తించి తిరిగి కలవడంలోనూ అంతనిజాయితీ ఉంది - ఎవరికేనా సాయం చెయ్యదల్చుకుంటే సర్వాత్మనా సాయం చెయ్యడమే ! లేకపోతే "నేను మీకు సహాయం చెయ్యను" అని మొహం మీద చెప్పెయ్యడమే !

"లక్ష్మీకాన్తమ్మగారు గర్విష్ఠి అహంకారి", అని కొందరు అంటారు. కాని సన్నిహితంగా తెలిసినవారికి తెలుసు ఆమె ఎంత భోళామనిషో ! ఎంత పెద్ద పదవిలో ఉన్నవ్యక్తినైనా ఆమె జంకూ గొంకూ లేకుండా కలుసుకొనేవారు. సంకోచం ఏకోశానా ఉండేది కాదు. సరోజనీ నాయుడు, విజయలక్ష్మీపండిట్‌లను కలుసుకొని, ఆంధ్ర రచయిత్రుల సభలకీ, అఖిల భారత రచయిత్రుల సభలకీ వారు హాజరయేలా ఒప్పించారు. ఆమె చొరవకీ, చురుకుదనానికీ లోపల్లోపల సంతోషిస్తూనే, పైకిమాత్రం పరిహాసానికి అనేవారు హయగ్రీవగుప్తగారు, అదైనా అన్యాపదేశంగా నన్ను ఉద్దేశిస్తూ వేళాకోళంగా

"అవునండీ ! మీరంటే రాజమండ్రివారు. తూ.గో.జి. కదా ! మీగడుసుదనం,నేర్పరితనం, మా గుంటూరు జిల్లావాళ్ళకి ఏదీ ? మాదంతా మొరటు పద్ధతి" అంటూ.

వ్యక్తిగా లక్ష్మీకాన్తమ్మగారు ఇలా ఒక ప్రత్యేకమైన వ్యక్తి. ఇక రచయిత్రిగా ఆమెది మరో తరహా పాత్ర.

ప్రజల్లో తెలుగు భాషపట్ల ఆసక్తి కలిగించడానికి ఝంఝూ మారుతంలా పర్యటించి యావదాంధ్రలోనూ, ఆంధ్రేతర ప్రాంతాల్లోనూ వేలాది ఉపన్యాసాలియ్యడానికీ, రచయిత్రుల్ని ప్రోత్సాహపరచి వారినందరినీ సుసంఘటితం చేసి, వేర్వేరు పట్టణాల్లో ఆంధ్ర రచయిత్రుల సభలు దిగ్విజయంగా నిర్వహించడానికీ ఆమె వెచ్చించిన సమయంలో, పదవవంతయినా, హాయిగా ఇంట్లో స్థిమితంగా కూర్చుని, మహా గ్రంథాలూ, కావ్యాలూ రచించి, తానుగా మహా రచయిత్రిని అని పేరుతెచ్చుకోవడం కోసం, స్వార్థ ప్రయోజనం కోసం, ఆమె కేటాయించలేదు. తన స్వార్థమే ఆమె చూసుకొంటే, వాసవికన్యకా సుప్రభాతం, మా తెలుగు మాంచాల, సాహితీ రుద్రమ ఏమిటి, ఇంకా ఎన్నో, ఎన్నెన్ని గ్రంథాలో రాసి ఉండేవారు.

ఆమె శక్తియుక్తులూ సాహిత్య ప్రాభవాలూ, ప్రజ్ఞా పాటవాలూ, అన్నీ తన స్వార్థానికీ, తన కుటుంబ సౌకర్యాలకీ, వెచ్చించకుండా, పదిమంది అభ్యున్నతికీ, చుట్టూ ఉన్న సమాజ చైతన్యానికీ వినియోగించారు. అవును - అంతే - కొందరి జీవితాలు, నిస్వార్థంగానే సాగుతాయి. అందుకే అటువంటి వ్యక్తులు అజరామరులు - ఆకోవకి చెందినవారు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు -

# పురుషాధిక్యత నధిగమించిన ధీరవనిత

- పోలాప్రగడ రాజ్యలక్ష్మి

బాపట్ల అనగానే రచయితలూ రచయిత్రులూ, పేరుమోసిన రాజకీయ వేత్తలూ, నాటకరంగంలోని, కళాకారులూ జ్ఞాపకం వస్తారు అంటారు అందరూను, అందరికీ సుపరిచితురాలైన డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారి గురించి నా జ్ఞాపకాలు చెప్పాలంటే, చాలా ఉన్నాయి.

పందొమ్మిది వందల అరవై ఆరు నుంచి, దాదాపు ముప్పై ఏళ్ళ పరిచయం మరి.

రచయిత్రిగా ఉపన్యాసకురాలిగా గృహలక్ష్మి స్వర్ణకంకణమువేసుకున్న విదుషీమణిగా ఆమె ప్రసిద్ధురాలు, లక్ష్మీకాన్తమ్మగారికి తోటి స్త్రీలంటే అపారమైన ప్రేమ. అందునా, రచయిత్రులన్నా, ఏ కళలు అభ్యసిస్తున్న వారన్నా అభిమానించే వారు.

ఆనాటి స్త్రీలు ఇంటిగడప దాటి రాని రోజుల్లో, ఈమెని ఉభయ భాషా ప్రవీణగా తీర్చిదిద్దారు, తల్లి తండ్రులు. సంగీతం కూడా నేర్చుకొన్నారు. భారత రామాయణాల్ని, చదివి, అందలి, అంతరార్థాన్ని, ఆకళింపు చేసుకొని అనర్గళంగా, ఉపన్యాసాలు ఇచ్చి, ఎందరి మెప్పును పొందారు.

జీవితంలో ఎంతో శ్రమకోర్చి సాహిత్య సేవ చేసి పేరు సంపాదించుకున్నారు. అయితే లక్ష్మీకాన్తమ్మగారు, మనిషి, వెనుక ఒకమాట, ముందు, ఒకమాట మాట్లాడేవారు కాదు. సంతోషం వచ్చినా, కోపంవచ్చినా, ముఖం మీద చెప్పేది. దానివల్ల, కొందరికి, విరోధమైనా ? మరికొందరికి, మనిషిలోని, మంచితనం అర్థం అయ్యేది.

సాహిత్య అకాడమీలో స్త్రీల విభాగంలో కొందరు రచయిత్రులం, మెంబర్సుగా, ఉండే వాళ్ళం.

మీటింగుల్లో, గోపాలరెడ్డిగారికి కొన్ని సంగతులు చెప్పడానికి భయపడి, ముందుగా లక్ష్మీకాన్తమ్మగారికి చెప్పి ఆమె ద్వారా చెప్పించేవాళ్ళం - ఈమె వాగ్ధాటికి, కాదన లేక, సరే, అనే వారు అధ్యక్షులు డా॥ గోపాలరెడ్డి గారు. ఇంక బాపట్లలో, కమపర్తి వరలక్ష్మమ్మగారూ, దేశిరాజు భారతీ దేవిగారూ, కర్లపూడి కమలమ్మగారూ, స్త్రీల ఉన్నతి కోసం కష్టపడ్డవారే, హితైషిణీ మండలి, శారదా మహిళా విజ్ఞాన సమితి, ద్వారా స్త్రీలందరికీ సత్ కాలక్షేపం కోసం, పాటుపడ్డవారే, నాగరికత ప్రబలక స్త్రీలు వీధిలోకి వస్తేనే తప్పుపట్టే ఆ రోజుల్లో, మహిళామండలి స్థాపించి, తల్లులారా ? మీరురండి, మీ ప్లిలలకు కళలు, విద్య నేర్పించండి అని ఇంటింటికీ వెళ్లి చెప్పి పురుషులలో కూడా, అంగీకరించని వారు ఉంటే, మాటలద్వారా చెప్పి మార్పును తీసుకువచ్చారు.

లక్ష్మీకాన్తమ్మగారు జిల్లా మహిళామండలి అధ్యక్షురాలుగా ఉన్నప్పుడు, భాషాప్రవీణ కాలేజీ పెట్టినప్పుడు, నా సలహా, సహాయమూ కోరారు. నాకు చేతనైనంత సహాయం చేశాను. నాతోబాటు, కాళిదాసుగారి కోడళ్ళూ, నిర్మలా, అన్నపూర్ణా వెలగపూడి వైదేహీ, ఇలా మేమంతా, ఉండేవాళ్ళం, ఆమె చేసిన మంచి పనులు ఆమెకి ఎంతో సంతోషాన్ని కలిగించాయి. అని సంతోషంగా చెప్పేవారు.

అనేక వేదికల మీద పురుషాధిక్యతకి భయపడకుండా, ఉపన్యాసాలు ఇస్తూంటే, ఎందరో ప్రముఖులు, లక్ష్మీకాన్తమ్మ మాట్లాడాక ఇంక మాట్లాడేందుకు లేదు, అని సభాముఖంగా ఒప్పుకున్న సందర్భాలు ఉన్నాయి. దుర్గాభాయి దేశ్‌ముఖ్ కూడా ఆమెని పొగిడిన సంగతి నాకు తెలుసును - చాలా పట్టుదలతో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. వారి కృషినిచూసి, సంతోషించే వారు ఎందరుంటారో ఈర్ష్యపడేవారు కూడా అందరు ఉంటారు కదా ! లక్ష్మీకాన్తమ్మగారికి కూడా ఈ బాధ్యత తప్పలేదు. చదువుకునే

రోజుల్లో మంచి మార్కులు వచ్చి కూడా, తోటివారి ఈతిబాధలను గురించి ఆమె జీవిత చరిత్రలు రాసినట్లు, కొన్ని ఇబ్బందులు పడ్డారు. మరి ఈమె ఎప్పుడూ తీరిగ్గా ఉండడం నేను ఎరుగను; ఏదోపని కల్పించుకునేది, ఇరుగుపొరుగు పిల్లలకి వీణా పాఠాలుచెప్తూ తను వెళ్ళివచ్చిన మీటింగులు సంగతులు చెప్తూ, రచనలు చేస్తూ కాలక్షేపం చేసేవారు.

వారి పిల్లలు అందరూ మంచి ఉన్నతమైనభావాలుకలవారు, ఉదాత్త స్వభావము కలవారు ఇదంతా లక్ష్మీకాన్తమ్మగారి అదృష్టం అని చెప్పవచ్చును.

ఈ అనంత విశ్వంలోని చిత్రం, భగవంతుని సృష్టి. అది ఎంతోవిచిత్రం.

విభిన్నమైన వ్యక్తులను సృష్టించి, మనసులను సృష్టించి, అందర్నీ కలసి ఉండండర్రా అని, ఈ జీవితాన్ని శాశ్వతమని భ్రమింపచేసి, అనునిత్యమూ, నిత్యనూతనంగా బ్రతుకమన్న సమయంలో ఈజగన్నాటకంలో, నీ పాత్ర అయిపోయింది. రా, అని పిలుస్తాడు. లక్ష్మీకాన్తమ్మగారికి మంచి దైవభక్తి ఉంది. ఆమె, ఉన్నా వెళ్ళినా, మన మధ్యన జ్ఞాపకాలతో శాశ్వతంగా ఉండిపోయారు. ఆమె ఆత్మకు శాంతి కలగాలని, ఆ భగవంతుడిని ప్రార్థిస్తూ ఉంటాము - అందరమునూ -

# సదనం కీర్తి పతాక

- తుమ్మపూడి హనుమంతరావు
సెక్రటరీ, వైశ్య సేవాసదనం, రాజమండ్రి

సంపూర్ణంగా వికసించిన జీవిత పద్మం వెదజల్లి కీర్తి పరిమళాలు తరతరాలను ప్రభావితం చేస్తాయి. అటువంటి అదృష్టం కొందరికి మాత్రం పడుతుంది. ఆ కొందరిలో లక్ష్మీకాన్తమ్మ ఒకరు.

ఆమె జీవితం తెరచియుంచిన ఉద్గ్రంధం.
ఆమె జీవిత మార్గం భావితరాలకు సందేశం.

ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని నిజాయితీగా, నిర్ద్వంద్వంగా నిర్దుష్టంగా చూపించగల్గేది ఇటువంటి సంచికలే. ఇవి జీవిత చరిత్రకంటె విలువైనవి. ఆ వ్యక్తి విరాడ్రూపాన్ని, దివ్విటీ యెత్తి చూపించగల్గేవి ఈ స్మరణికలు, ఈ సంచిక ద్వారా ఆమెకు అమరత్వం కల్పించి భావితరాల వారికి స్ఫూర్తిని చైతన్యాన్ని, స్పందనను కల్గిస్తున్న మీ ప్రయత్నం బహుధా శ్లాఘ్యం.

మానవ జీవిత వైశిష్ట్యాన్ని ఆకళింపు చేసుకున్న ఆమె, బాల్యంనుండి సమాజానికి, దేశానికి ఉపయోగపడేవిధంగా జీవితాన్ని మలచుకొని సంగీత సాహిత్య సమాజ సేవా దృక్పధాలను మూడింటిని సంగమింప చేసికొని, ఉపన్యాసాలను సాధనంగా చేసికొని

భారత దేశమందే కాక విదేశాలలో కూడ మన సంస్కృతిని, దేశభక్తిని జాగృతం చేసిన మానవ "నగారా" ఆమె.

స్త్రీజాతి చైతన్యానికి, అభివృద్ధికి, గుర్తింపుకి అవసరమైన బాట వేసి అవరోధాలను అవలీలగా అధిగమిస్తూ మేరు నగ సమానమైన ధైర్య స్థైర్యాలతో, వాగ్ధాటితో ఎంతటి వారినైనా పరవశింప చేసికొని కార్యసిద్ధిని సాధించు ఆమె ధీశక్తి సమకాలీనులకు, భావితరాల వారికి ఆదర్శప్రాయమైనది.

ఆమె ఒక శక్తి. ఆమె ఒక జీవనది.

ఆశక్తికి మరణం లేదు. ఆ జీవనదికి జవం తగ్గదు. భౌతికంగా దూరమై, దైవికంగా దగ్గరైన మానవతా మూర్తి ఆమె,

సదనం విషయానికి వస్తే తాను ముందుండి సారథియై సదన రథాన్ని నడిపిస్తూ ఎగుడు దిగుడులు వచ్చినపుడు నేర్పరి తనంతో నిరపాయంగా ముందుకు నడిపిస్తూ పాలక వర్గానికి ఆలోచనలలో మంత్రిత్వం నడుపు ఆమె ప్రజ్ఞ అనితర సాధ్యమైనది.

సదనం ప్రారంభంనుండి పెద్ద దిక్కుగనుండి వేలకు వేలు విరాళములు వసూలు చేసి సదనమున గదులు చేయించుటలోను, కామాక్షమ్మగారికి కార్య సాధనలో చేదోడు వాదోడుగా ఉండి ముందుకు నడిపించుటలోనూ ఆమె చేసిన కృషి మరుపురానిది.

అటు పిమ్మట కామాక్షమ్మ గారి మరణానంతరము ఆమె పాలరాతి విగ్రహాన్ని - చేయించుటలో ఆమె కనబరచిన శ్రద్ధాశక్తులు ఆమె కార్యనిర్వహణ శక్తికి అద్దం పట్టినవి . ప్లాటినం జూబ్లీ ఉత్సవాలలో అంతట తానై నిండియుండి తేజోమయం చేసిన సంఘటనలు సదన చరిత్రలో మధుర పుటలు.

# "సాహితీ రుద్రమ్మ"

- "వైశ్యరత్న" కబళవాయి రాధాకృష్ణారావు
సుల్తాన్‌బజార్, హైదరాబాదు

అసమాన సాహితీ ప్రజ్ఞావంతురాలు, సాహితీరుద్రమ, సాధ్వీశిరోమణి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు మనకికలేరు. అనే విషయం విన్నప్పుడు నా కళ్ళు కన్నీళ్ళతో నిండి పోయాయి.

'మధురకవి' నాళం కృష్ణారావు, సుశీలమ్మల ముద్దుల తనయగా జన్మించిన లక్ష్మీకాన్తమ్మగారు తండ్రిని మించిన తనయగా పేరు ప్రఖ్యాతులు సాధించినారు.

'విశిష్ట ప్రతిభగల ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు మహారచయిత్రిగానేకాదు, ఉన్నతవ్యక్తిత్వం, మానవత్వం ఆపాదించుకున్న మహనీయురాలిగా నేనెరుగుదును. ఆమె పాల్గొన్న ఎన్నోసభల్లో ఆమె సాహచర్యం లభించింది. నన్నెంతో ఆదరంగా పలకరించేది. ఆమె ఉపన్యాసం విని ఆనందించి, ఉత్సాహం, స్ఫూర్తి పొందిన వారిలో నేనొకడిని.

"ఒక కిరణం దివ్యతేజమై, ప్రజ్వలకాంతులు విరజిమ్మి అజ్ఞాన అంధకారాలు తొలగించే అఖండ దీపమై .నిలిచినట్లుగా, ఆ కళామతల్లి దివ్య అంశతో జన్మించిన సాహితీ సౌజన్యమూర్తి లక్ష్మీకాన్తమ్మగారు. ఆమె రచించిన "ఆంధ్రకవయిత్రులు" ఇతరత్రా ఎన్నో గ్రంథాలు ఆమె బహుముఖ కళా తృష్ణకు రుజువులు. ఉభయభాష ప్రపూర్ణగా పొగడబడిన డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారు, ఆ సరస్వతీ మాత కుంకుమ తిలకంగా వెలుగొందినారు.

'నశ్వరమైన ఈ జగత్తులో
శాశ్వతమై నిలిచేది కీర్తి,
శాశ్వతమై నిలచేది అక్షరం'

- లక్షల విలువలచేసే అక్షరాన్ని తన కీర్తి చంద్రికగా మిగిల్చి వెళ్లిన ఆమె లోటు పూరించబడేది కాదు. ఆమె ప్రతిభ, పాండిత్యం, రచనాభ్యాసం, అనర్గళ ఉపన్యాసం అందరిని అలరించాయి.

కళామతల్లి ముద్దుల తనయగా, కళాసృష్టిచేసిన ఆవిడ అంతటితో ఊరుకోలేదు. స్వాతంత్ర్య సముపార్జనలో తన గళాన్ని, కలాన్ని కదిలించిన ఆవిడ, తాను పుట్టిన సంఘానికి కూడా ఎంతో సేవ చేశారు. మహిళాభ్యుదయం, మహిళా చైతన్యం, మహిళా సంఘాల ఏర్పాటులో ఆమె కృషి మరువరానిది.

ఆమె జ్ఞాపకాలు కలబోసుకున్న సంచికగా పలువ్యాసాలతో 'సంస్మరణిక' ప్రచురించాలనుకున్న 'సంపాదక మండలి' ఆలోచన హర్షనీయం.

వారి జ్ఞావకాల జాగృతితో ఎన్నో కార్యక్రమాలను చేపట్టాలని, నా పూర్తి సహాయసహకారాలు అందించగలనని తెలియజేస్తున్నాను.

# బహుముఖి ప్రజ్ఞాశాలి

- మల్లాది సుబ్బమ్మ
ఎడిటర్, స్త్రీ స్వేచ్ఛ మాసపత్రిక

నిన్నటిదా మొన్నటిదా అది 20 ఏళ్ల (1952-72) అనుబంధం. నన్ను తీర్చిదిద్దిన లక్ష్మీకాన్తమ్మ భవబంధం.

తాలూకా మహిళా మహాసభ పెడుతున్నాం చందాయిచ్చిసహకరించండంటూ ఒకరోజు మెరుపులా దూసుకొచ్చింది లక్ష్మీకాన్తమ్మగారు. అది మా ప్రధమ పరిచయం. అది 1952వ సంవత్సరం. అప్పటికి నాకింకా సాహిత్యమన్నా, సంఘసేవఅన్నా, ఉద్యమాలన్నా అంత పెద్ద చొరవ లేనందువల్ల రామ్మూర్తిగారితో సభా వివరాలు ముచ్చటించి వెళ్లింది లక్ష్మీకాన్తమ్మగారు. 1953లో మరలా వచ్చి బాపట్ల కోపరేటివ్ కాలేజి ఇండస్ట్రీస్ సొసైటీకి నన్ను సెక్రటరీగా ఉండమని, తాను ప్రెసిడెంటుగా ఉంటున్నానని ప్రోద్భలపరిచి ఒప్పించారు. 10 సం॥ల ఆ సొసైటీ కార్యక్రమాలు మా ఇద్దరినీ మంచి కార్యకర్తలుగా హితులుగా, స్నేహితులుగా మా అనుబంధాన్ని పెంచాయి. అప్పటికే రామ్మూర్తిగారు, హయగ్రీవ గుప్తగారు ఆత్మీయులుగా ఉండేవారు. నా పిల్లలు, ఆమె పిల్లలు క్లాసుమేట్సుగా ఉండేవారు. ప్రక్క ప్రక్క ఇళ్లలో ఉండటంవల్ల సాహితీ సదస్సులకు, మహిళోద్యమ సభలకు, కుటుంబ నియంత్రణోద్యమంలో, జిల్లా, రాష్ట్ర సభలకు కలిసి వెళ్లడంవల్ల ఆయా రంగాలలో ఆమెవల్ల నేను ఎంతో అనుభవం గడించాను. అప్పటికే ఆమె ఉభయభాషాప్రవీణగా, మంచి వక్తగా, కార్యకర్తగా, రాజకీయవేత్తగా ఎంతో పేరు ప్రఖ్యాతులున్న విదుషీమణి. ఆమె ఉపన్యాసం గంగా ప్రవాహంలా రాళ్లనూ, రప్పల్నీ దొర్లిస్తూ, పరవళ్లు త్రొక్కుతూ మహాప్రవాహంలా పొర్లిపొయ్యేది. ఎప్పుడూ ఎడతెగని కార్యక్రమాలతో రాష్ట్రమంతటా పర్యటిస్తూ - షష్టిపూర్తి సభలలో, మహనీయుల జయంతుల్లో, అవార్డు ప్రదానాల్లో పాల్గొనడమే కాక అనేకానేక సంచికల్లో వైవిధ్యంతోకూడిన వ్యాసాలువుండేవారు.

లక్ష్మీకాన్తమ్మగారు సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. ఆమె ప్రావీణ్యం విశిష్టమైనది. సాహితీ స్రష్ట, గ్రంథకర్త, సంస్కర్త, ఉపన్యాస శిరోమణి సంస్థల వ్యవస్థాపకురాలే కాక నిర్వహణా బాధ్యతలను కూడా స్వీకరించిన ధీరోదాత్త. తన జీవితం మైనపు వత్తిలా కరిగించి ఇతరులకు వెలుగునిచ్చిన నిస్వార్ధ తత్వం ఆమెలో తొణికిసలాడేది. ఆరోజుల్లో ఆంధ్రలో ఆమె పర్యటించని ప్రదేశం లేదు. ఎప్పుడూ ఆమెను ఆహ్వానిస్తూ సభలకు, సమావేశాలకు రమ్మనే పిలుపులు మిక్కుటంగా వచ్చేవి. పిల్లల్ని సైతం వదిలేసి తిరగక తప్పేది కాదు. ఇంటా, బయటా ఎప్పుడూ సాహితీ చర్చలు జరుపుతూనే

వుండేది. బాపట్లకు ఏ గొప్ప రాజకీయవేత్త వచ్చినా, ఏ సంస్కర్తవచ్చినా, మరే పండితులొచ్చినా వారింటికెళ్లడం సర్వసామాన్యం. ఊర్లో ఏ సభ జరిగినా ఆమె అందులో భాగస్వామిగా వుండక తప్పేది కాదు. అనేకమంది ఈమెను సలహాలు అడగడం జరుగుతుండేది. నేను ఎప్పుడు వారిని కలవాలని వెళ్లినా ఆమె ఏదో కార్యభారంతో తలమునకలుగా ఉండేది. హయగ్రీవ గుప్తగారి లాంటి భర్తలభించడం ఆమె అదృష్టమనక తప్పదు. ఆయన వృత్తిరీత్యా ప్లీడరయినా ఎంతో విజ్ఞానం, సాహితీ పిపాసగల వ్యక్తి కనుక ఆమె అభ్యుదయానికి తోడ్పడడం నేనెన్నోసార్లు చూచాను. ఇద్దరూ ఒకేమాటగా, ఒకే బాటగా ఉంటూ ఒకరికొకరు కామ్రేడ్సుగా పనిచెయ్యడంవల్ల ఇద్దరూ జాతీయోద్యమంలో కూడా భాగస్వాములయ్యారు.

ఆమెతో నా పరిచయం 1952లో ఐనప్పటినుండి ఆలిండియా రేడియోవారి స్త్రీల కార్యక్రమాల్లో పాల్గొంటూనే వున్నాను. ఆమె రేడియో ఏడ్వయిజరీబోర్డు మెంబరుగా కాటేజీ ఇండస్ట్రీస్ మెంబర్లకు ప్రోగ్రామ్సు యిప్పించడంవల్ల నేను చాలాసార్లు ప్రోగ్రాముల్లో పాల్గొన్నాను. అలాగే అనేక చోట్ల సభలు జరిగినప్పుడు తనతో నేనూ వెళ్లి కొద్దికొద్దిగా చిలకపలుకుల్లా మాట్లాడటం నేర్చుకున్నా. నేను మాట్లాడటం, రాయటం నేర్చుకున్నది ఆమె సాహచర్యం వల్లనే అని చెప్పుకోడానికి గర్వపడుతున్నా. ఒక విధంగా చెప్పాలంటే లక్ష్మీకాన్తమ్మగారు మా గురువుగారు అని పేర్కొనడానికి ఆమెఎడ నాకెంతో గౌరవమే కాదు సంతోషంగా కూడా ఉంటుంది.

అది 1965వ సం॥ నేనప్పుడే పి.యు.సి. పాసై బి.ఏ.కు ఎగ్జమ్షన్ కట్టాను. ఆరోజుల్లో బి.ఏ. తెలుగు చాలా క్లిష్టంగా ఉండేది. ప్రాచీన సాహిత్యం, కావ్యాలు, చిన్నయసూరి వ్యాకరణం, పద్యం, గద్యం, వచనం అన్ని ప్రక్రియలూ ఉండేవి. ద్వంద్వార్థాల వివరణ చెయ్యాలి. మహాకవుల పాండిత్యపు తీరులను వివరించాలి. ఇనప గుగ్గిళ్లలాంటి కందం. సీసం, మత్తేభం, శార్దూలం లాంటి పద్యాలకు పదవిభాగం చెయ్యాలి. నానార్థాలు చెప్పాలి. వ్యుత్పత్తి అర్థం, టీకా, తాత్పర్యం రాయాలి. చక్కనిశైలిలో చెప్పాలి. భాష పకడ్బందీగా ఉండాలి. గ్రాంధికంలో రాయాలి. ఆరోజుల్లో ఇంగ్లీషు, హిందీ పరీక్షల పేపర్లు లిబరల్‌గా దిద్దేవారు. కాని మాతృభాష అయిన తెలుగును చాల కఠినంగా దిద్దేవారు. స్కూలు విద్య, క్రమశిక్షణ లేక కుప్పిగంతులేసే నాబోటివారికి సొంత పఠనం రక్తికట్టక లక్ష్మీకాన్తమ్మగారిని అభ్యర్థించాను. ఆమె పరమానందభరితురాలై "చళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి విశ్వనాధవారు శిష్యులైనట్లుంది' ' మన గురుశిష్య సంబంధం అంటూ పకపకా నవ్వి గుప్తగారితో ఇకముందు నేనొక ఏనుగును మనింట్లో కట్టేస్తున్నానండీ ! అంటూ తన సంతోషాన్ని, సమ్మతిని వ్యక్త పరచింది. లక్ష్మీకాన్తమ్మగారి శిష్యరికంవల్ల బి.ఏ. తెలుగు మంచి మార్కులతో

ఉత్తీర్ణురాలినయ్యా. ఆనాటి తెలుగు భాషా బీజాలే క్రమంగా వృద్ధిచెంది మహావృక్షంగా మారి నన్నింత ఉచ్ఛస్థితికి తెచ్చాయంటే అతిశయోక్తి కాదు.

1963లో అప్పికట్ల సాహితీ సమాఖ్యవారు ఆమెకు గజారోహణ ఉత్సవం జరిపారు. అందులో నేనూ పాల్గొని ప్రసంగించాను. నాకూ శాలువ కప్పి సన్మానించారంటే అందుకామె ప్రతిభావ్యుత్పత్తులే కారణం. బాపట్లలో కొందరు ప్రముఖులైన సాహితీ పిపాసువులతో నెలనెలా సాహిత్య సభలు జరిగేవి. పాంచాలి, సత్యనారాయణమూర్తి, జ్వాలాశాస్త్రి, ఎం.వి. రామ్మూర్తి, సత్యనారాయణాచార్యులు, గంగాధరరావు గారు వంటిఉద్దండులతో పాటు నాలాంటి నూతన రచయితలచేత, యువకులచేత సాహిత్య సృష్టి చేయించి వారిలో ప్రేరణ కలిగించే సమావేశాలు జరిపేవారు. ఆ కార్యక్రమాలకామె తరచూ అధ్యక్షత వహిస్తూ ఉండేది. అలాంటి దశలో సాహిత్య అకాడమీ సభ్యురాలిగా, సాహితీవేత్తగా ఎంతో సేవ చేసింది. 1958 ప్రాంతాల్లో ఆంధ్ర కవయిత్రులు, అఖిలభారత కవయిత్రుల చరిత్రలు రాశారు. ఆమె ప్రతిభా పాండిత్యాలు చూచి నేనుకూడా అలా రాయాలనే అభిలాష ఆనాడే నాకు కలిగింది. ఆమె ప్రభావమే నన్నొక రచయిత్రిగా తీర్చిదిద్దిందనే కృతజ్ఞత నాకు ఆమెపై వున్నదనేది నగ్న సత్యం.

1967లో లక్ష్మీకాన్తమ్మగారు అధ్యక్షురాలిగా, నేను సెక్రటరీగా వనితా మహా విద్యాలయ స్థాపన జరిగింది. అది కండెన్సుడు కోర్సు. 25మంది వయోజన స్త్రీలను (18 ఏళ్లుదాటిన వారిని) 2 సం॥ల కోర్సుతో మెట్రిక్ పాసు చేయించే కోర్సు అది. సంస్కృత భాషలో చదవడం, వ్రాయడం దాని ప్రత్యేక విశిష్టత. సెంట్రల్ సోషల్ వెల్ఫేర్ వారి గ్రాంటుతో ఈ కోర్సును ఢిల్లీనుండి లక్ష్మీకాన్తమ్మగారు బాపట్లకు తెచ్చారు.

1963లో నేను కుటుంబ నియంత్రణ డిప్లమా చేశాక గుంటూరు జిల్లా ఆనరరీ ఎడ్యుకేషన్ లీడరుగా పనిచేసేటప్పుడు దాని సంబంధమైన సభలు, సమావేశాలు, చర్చలు, సెమినార్లు, ఓరియంటేషన్ ట్రయినింగు క్యాంపులు ప్రతివారం జరిపేదాన్ని. ఆ కార్యక్రమాలన్నింటికి ఆమె ప్రెసెడెంటుగానో, వక్తగానో వచ్చి తన సహాయ సహకారాలందించేది.. తను తరుచు కాంగ్రెసు మహిళా సభలకు తాలూకా, జిల్లా, రాష్ట్ర సభలకెడుతూ వాటిల్లో భాగస్వామ్యం వహించేది. ఇందిరా గాంధీ గుంటూరు సభలకొచ్చినప్పుడు కూడా లక్ష్మీకాన్తమ్మగారు సారధ్యం వహించారు. ఆమెతోపాటు నేనూ వేళ్లేదాన్ని. ఒకసారి చేబ్రోలు సభ కెడుతుండగా రోడ్డుమీద నన్ను ఒక పిచ్చి కుక్క కరిచి రక్తం స్రవించింది. అప్పుడామె తన కారులో తీసుకెళ్లి నాకు కట్టుకట్టించి, ఇంజక్షన్ యిప్పించి డాక్టరు సలహాతో నన్ను తీసుకువెళ్లిన దృశ్యం మరువరానిది. ఇలా 1952 నుండి 1972 వరకు బాపట్లలో నేను ఉన్నంతకాలం మా ఇద్దరిమధ్య



సరస్వతీ సామ్రాజ్య వైభవ నాటకంలో సరస్వతి పాత్రలో
డా॥ లక్ష్మీకాన్తమ్మ, బాపట్ల 1994

జరిగిన రకరకాల సన్నివేశాలు, అనుభవాలు, జ్ఞాపకాలు ఎన్నో ఉన్నాయి. ఒక్కరోజు నన్ను చూడకపోతే మా ఇంటికొచ్చేవారు. ఆనాడు ఆమె సహాయం, తోడ్పాటు లేకపోతే నేను ఈనాడు ఇంత ఉన్నత స్థితికి వచ్చేదాన్ని కాదు. గురువుగా, మంచి హితురాలిగా, గొప్ప స్నేహితురాలిగా, నా శ్రేయోభిలాషిగా నన్నెంతో ఆదరించి, గౌరవించి, వ్యక్తిత్వంతోబాటు సంఘసేవాభిలాషిగా నన్ను తీర్చిదిద్ది ఒక రచయితగా మార్చి, వక్తృత్వం నేర్పి నన్ను తీర్చిదిద్దిన మహామనిషి లక్ష్మీకాన్తమ్మగారు. నన్నేకాదు మరెందరో మహిళలకు మార్గదర్శకత్వం వహించిన ధీరోదాత్త ఆమె. స్త్రీలు అసూర్యం పశ్యలుగా వున్న రోజుల్లో వారిని బైటికి తెచ్చి వివిధ రంగాల్లో పాల్గొనమని పిలుపుయిచ్చి, వారికి చేయూతనిచ్చిన సేవా పరాయణి. అందుకే ఆమె సాహిత్యానికి, ఆమెను ఆంధ్ర సరస్వతిగా గుర్తించిన నేను చంద్రుడికొక నూలుపోగు అన్నట్లు 1988 హైదరాబాదులో నాపేర ఒక అవార్డు యిచ్చి శాలువా కప్పి సత్కరించడం జరిగింది. ఆ సభకు రచయిత్రులు, కవయిత్రులు అంతా హాజరు కావడం నా అదృష్టం అనక తప్పదు. అది ఆమెపై నాకున్న కృతజ్ఞతకు చిహ్నం.

అది 1964 ప్రాన్నాలో ఆలిండియా ఫ్యామిలీ ప్లానింగు కాన్ఫరెన్సు కెళ్లి వస్తూ వైజాగ్ యూనివర్శిటీ కెళ్లాం. అక్కడ ఒక ప్రక్క వైస్‌ఛాన్సలర్ మరోప్రక్క రిజిస్ట్రార్‌ల మధ్యలో అభినవ సరస్వతిలా నుంచుని గంభీరోపన్యాసం ఇస్తోంది లక్ష్మీకాన్తమ్మగారు. 2,3 వేలమంది విద్యార్థులున్నారు సభలో. రామ్మూర్తిగారు నేనూ ఈమె ఎంత అదృష్టవంతురాలోననుకున్నాం. ఆ దృశ్యం నాకిప్పటికీ కళ్లల్లో మెదులుతోంది. ఇలా ఎన్నో కాలేజీలు, మరెన్నో సంస్థలు, ఇంకెన్నో సాహితీ సభలు, సాంస్కృతిక వేదికలు, కవి సమ్మేళనాలు, సెమినార్లు, వర్కుషాపులు, ఆరోజుల్లో ఆంధ్రదేశంలో ఆమె పాల్గొనని సాహిత్య వేదిక లేదంటే అతిశయోక్తి కాదు. ఆమె సాహచర్యం వల్ల కొందరు నన్ను కూడా ఆహ్వానించేవారు. 'మధురకవి కన్నబిడ్డ' కావటాన కవితా ప్రవంతి ఏరులై పారేది. ఇటు పిల్లలూ, అటు కుటుంబ బాధ్యతా, వచ్చేపోయే జనవాహినితో ఉక్కిరిబిక్కిరై పోయేది.

1966లో లక్ష్మీకాన్తమ్మగారికి జాండీస్ వచ్చి హైదరాబాదులో యశోదా నర్సింగుహోంలో ఆమె ఉన్నప్పుడు చూడటానికి వెడితే నన్ను తన ప్రక్కలో కూర్చోపెట్టుకొన్నప్పుడు ఇద్దరం మా పూర్వస్మృతులన్నీ నెమరేసుకున్నప్పుడు నాకళ్లు చెమ్మగిల్లాయి. కాని ఆమె మాత్రం చలించలేదు. చెయ్యేదగ్గదంతా చేశాను. ఇంకా విముక్తి అనేది ఎంతటి వారికైనా తప్పదుగదా! అని నన్ను సముదాయించింది. జాతస్య మరణం ధ్రువం అన్నట్లు ఆమె భౌతికంగా మరణించినా సేవా కార్యక్రమాలలో ఒక ధృవతారగా నిలిచే ఆమె అమరజీవి. బాహ్యంగా ఆమె మన మధ్యన లేకపోవచ్చు కాని ఆంధ్ర కవయిత్రుల చరిత్ర గ్రంథకర్తగా, సాహితీ వేత్తగా చిరస్మరణీయురాలు.

# అష్టైశ్వర్యాల మా వదినె

-మద్ది రామకుమారి
ఉపాధ్యాయురాలు,
ఆంధ్రప్రదేశ్ మహిళాకాంగ్రెస్, గుంటూరు

అది డిశెంబరు ఒకటి తొంభైఆరు. మధ్య రాత్రి ఒక ఫోన్ వచ్చింది. నేను వింటున్నాను కానీ, మాటలు రావటం లేదు. ఏది చూద్దామన్నా నా కళ్ళకు ఏమీ కనుపించటం లేదు కన్నీటితో అపూర్వమైన ఒక నక్షత్రం రాలిపోయిందని తెలిసిన సమయాన స్థాణువై స్థంబించినప్పుడు మా అమ్మ నన్ను పలకరించింది. ఏమీ మాట్లాడ కుండా ఏడుస్తున్నాను. మా అమ్మ "ఏమైంది ఏదీ ఫోను నేను మాట్లాడతాను", అని ఫోన్ తీసుకుంది. కానీ, అప్పటికే అది 'క్లిక్' అవటం అయింది. "గొప్పవారు పోయినప్పుడు చుక్కలు నేలరాలతై అంటారు కదమ్మా?" అన్నాను. "అవును అలా చెప్పటం నేనూ విన్నాను ఇంతకీ ఎవరు పోయింది ?" అని మా అమ్మ అడిగింది. "ఇంకెవరమ్మా లక్ష్మీకాన్తమ్మ వదిన" అన్నాను. అంతే అమ్మ బొమ్మలా నిలబడి పోయింది. వారిద్దరు వరుసకి అత్తా కోడల్లు. ఆమెను బాపట్ల పంపగలిగేను, కొన్ని కారణాలవల్ల నేను వెళ్ళలేకపోయాను. నాలో ఉక్రోషం పెరిగిపోయింది వెళ్ళలేని నా అశక్తతయే.

ఆమె కేమండి ! అష్టైశ్వర్యాలు గల తెలుగు వారి అనుంగు బిడ్డ మా వదిన. భిన్న కళలు కదలే బొమ్మయే మా వదిన. తత్వం, భక్తి తత్వం, మంచి తనం, ఇన్ని మంచి గుణాలు కలిగిన ఉన్నత వ్యక్తిలో చలనం ఆగి పోయింది అంటే చలించని వారు ఉంటారా! మా వదినా నేను పుట్టింది ఒక ఇంట్లోనే ! అది ఏలూరు. శ్రీయుత మోతే కృష్ణరావు జమిందారు ఇల్లు ఆమెకు మామ, నాకు తండ్రి, అల్లరిచేయడంలో నాకు నా తండ్రి పోలికలు ఎక్కువలే. నేను మా వదినని చాలా సార్లు అల్లరి చేసేదాన్ని. తను గలగలా నవ్వి, "నీవుఎంత అల్లరి చేసినా నాకు కోపం రావటం లేదు. ఎందుకో తెలుసా ? నీ కన్ని మా మామయ్య పోలికలే !" అనేది.

ఆమె సంఘ సంస్కర్త అయ్యారు. నేను ఏదో కొద్దిపాటి చిన్న కార్యకర్తనయ్యాను ఆమె స్నేహం వలన.

ఆమె ఒక మహాశక్తి. నాకు తన అనుభవాలు ఎన్నో చెప్పేది. ఆమె స్వప్నంలో శేషమండలాన్ని చూచి తరించిన తరుణి, కన్యకాపరమేశ్వరినే తన కవిత్వ పూరణకు తన ఇంటికి రప్పించుకొన్న రాగమయి. (ఆమె కన్యకాపరమేశ్వరి స్తోత్రం రచించు చున్నపుడు జరిగిన విశేషం ఇది) తన బిడ్డలు ముగ్గురికి ఒకేసారి మశూచి వచ్చినపుడు గ్రామదేవత మారేడమ్మని కూడ ముంగిట నిలచేలా చేసిన ముదిత. ఆమె గురించి

నేను ఎంతచెప్పినా, రాసినా కూడా చాలా చాలా తక్కువే అవుతుంది.

మనసులో మెరుపులా, తనువులో తలపులా, కన్నులలో కాంతిలా ఆత్మానందాన్ని అందించిన అమ్మ. సుగుణ శీల, సౌజన్య రాశి, హసిత వదన. ఇన్ని సుగుణాల కణాల కలయికే శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. అంతేకాదు ఆమె సర్వ జృంభిణి, సర్వాకర్షిణి, సర్వ సమ్మోహిని. తన అనర్గళమైన గళంనుండి జాలువారే సుభాషితాల వెల్లువతో అందరిని వశపరచుకొని సమ్మోహితులను చేసుకొన్న మగువ. ఎన్ని మకరంద మందార మాలలు వేసి ఆమెను సత్కరించగలను? ఎన్ని మాలలు తస్కరించి తెచ్చి వేసినా ఆమె సన్మానానికి అవి తక్కువే అయ్యేవి.

ఆమెకు ఎవ్వరూ సరికాదు, రారు, లేరు. అలాంటి నవరస మందార మాలలోని ఒక పుప్పొడి రేణువునైనా నా జన్మ తరించేదేమో ! తన నిరంతర కృషి ఫలితం తరతరాల వారికి విజ్ఞానాన్ని అందిస్తుంది. జలపాత ధారవంటి వాక్ప్రవాహం, ఎన్ని నిడివులో కొలవలేనంత లోతైన విజ్ఞానం, సాగర గంభీరత పుట్టుకతోనే పెట్టుకు పుట్టిన ఆభరణాల వెలుగు జిలుగులు, బ్రహ్మవరాలు. ఆమె గురించి రాయాలంటే - ఆకాశాన్నంతా కాగితంలా, సముద్రాన్ని సిరాగా, అడవులను పెన్నులుగా మార్చగలిగినప్పుడు రాయగలరేమో ఎవరైనా !

అలాంటి తల్లి గర్భాన జన్మించిన ఈ బిడ్డలు ఎంతటి సౌభాగ్యవంతులు ! ఆమె పిల్లలు, మనుమరాండ్రు మనుమలు అందరూ కూడా కళామతల్లి ప్రియసంతతియే! ఆమె సంస్కృత పదాల పల్లవులు పాడుతుంటే, నేను తెలుగు పదాల పల్లె పదాలు పాడేదాన్ని. పుష్పాలు ఎన్నో పూస్తై. కానీ, కొన్ని మాత్రం దేవుని చేరతై. మా వదిన దేవుని చెంతకు చేరిన జాజి పువ్వు. నేను ఆమె ప్రేమాభిమానాలను పొందగలిగేను. అందుకే, నాలోని మమతలను మాలగా అల్లి ఆమె మెడను ధరింపజేసి ఎంతో ఆనందానుభూతులను పొందుతుంటాను అది నాకు తప్ప ఎవ్వరికీ కనుపించని అదృశ్యమాల.

మా ఇద్దరి అనుబంధానికి అవధులూ ఎల్లలూ లేవు. ఎప్పుడూ నాతో ఎంతో చక్కగా ఊసులాడే వదిన ఇప్పుడు వూసులాడడం ఆపేసింది "వూసులాడితే జీవుడు, వూసులాడితే దేవుడు" అంటాడు. చితి చనిపోయిన వారిని దహిస్తే, చింత చనిపోయే వరకు దహిస్తుంది. ఆ మంటలు మాలో చల్లారటానికి చాలా కాలమే పట్టవచ్చు.

# మరపురాని మహిళామణి

- డాక్టర్ ఎస్.వి. చలపతిరావు
సేవావాచస్పతి, గీతా ప్రచార భారతి, బాపట్ల

సుకృతాత్ములు, రససిద్ధులైన కవీశ్వరులు ధన్యులు. వారి యశశ్శరీరాలకు జరామరణ భయం ఉండదు. ఆవిలక్షణమైన కోవకు చెందిన విదుషీమణి, కళాప్రపూర్ణ, కనకాభిషిక్త, డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు. కవయిత్రిగా, రచయిత్రిగా ఆంధ్రమాత గర్వించిన ఉపన్యాసకురాలిగా ఆమె సాహితీ ప్రియంభావుకులందరికి సుపరిచితురాలు. ఆమె ఉపన్యసించని వేదిక, సన్మానాలు అందుకోని పట్టణం లేదంటే అతిశయోక్తికాదు. అంతటి మహావ్యక్తితో నాకు సన్నిహిత పరిచయం ఉండడం, నేను వారి కుటుంబ సభ్యులలో ఒకనిగా, ఆ దంపతుల అభిమానాన్ని చూరగొనడం నా పురాకృత పుణ్యవిశేషంగా నేను భావిస్తున్నాను. వారి పిల్లలలో కూడా నాపట్ల ఎంతో అభిమానం, గౌరవం వుంది.

డా॥ లక్ష్మీకాన్తమ్మగారి కుటుంబంతో నా పరిచయం ఒక డాక్టరుగా ప్రారంభమైంది. నాళంవారి వంశంలో పుట్టి, ఊటుకూరి వారి యింట అడుగుపెట్టిన డా॥ లక్ష్మీకాన్తమ్మగారి కుటుంబంతో నాకు మొదటిసారిగా 1956లో పరిచయమైంది. ఆమె భర్త హయగ్రీవగుప్తగారు వృత్తిరీత్యా న్యాయవాదులు, ప్రవృత్తిరీత్యా సంస్కృతాంధ్ర సాహిత్యాభిమానులు. వారి చిన్న కుమారుడు డా॥ విజ్ఞాన్‌కుమార్ (ప్రస్తుతం అమెరికాలో ఉన్నాడు) హైస్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడు మలేరియా జ్వరం వచ్చింది. ఆసందర్భంగా నేను వైద్యునిగా వారింటికి వెళ్లాను. ఆ నాటినుంచి ఆమె అంతిమశ్వాస తీసుకునేవరకు నేను వైద్యునిగా వారి కుటుంబానికి సేవలందించాను.

ఇంట్లో ఎవరికి ఏ అనారోగ్యం వచ్చినా ఆమె నాకు కబురు పంపేది. ఏవైనా సభలకు వెళ్ళవలసి వస్తే మీరున్నారనే ధైర్యంతో నిశ్చింతగా వెళుతున్నానని అనేవారంటే వైద్యునిగా నాపై ఆమెకుగల నమ్మకం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. హయగ్రీవగుప్తగారి అంతిమ యాత్రలోను, శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి అంతిమయాత్రలోను వారి కుటుంబ సభ్యులతో సమానంగా బాధ్యతను నిర్వహించేఅవకాశం నాకు రావటం నా అదృష్టమే అనుకుంటాను. ఆమె కూడా ఎప్పుడూ నన్ను సోదరునికన్న మిన్నగా భావించి, ఎంతో అభిమానించేది.

పరిచయం వైద్యరీత్యా ప్రారంభమైనా, నాలోనూ సాహిత్యాభిమానం ఉండడంవలన. కవిగా కొంత గుర్తింపు పొంది ఉండటం వలన క్రమంగా సాహిత్యపరంగా కూడా

పరిచయం పరిఢవిల్లింది. తరచూ ఆమె రచనలు వినిపిస్తూ ఉండడం, అభిప్రాయాన్ని సహర్షంగా స్వీకరిస్తూ ఉండడం ప్రారంభమైంది. ప్రత్యేకంగా కన్యకాపరమేశ్వరీ సుప్రభాతం రాస్తున్న సమయంలో ఆమె ప్రతి శ్లోకాన్ని నాకు వినిపించి, నాతో రాగయుక్తంగా పలికించి ఎంతో సంతోషపడేవారు. ఈ విషయాన్ని ఆమె తన సుప్రభాత పీఠికలో కూడా ఉటంకించారు. ఆతరువాత ఎన్నో పట్టణాలలో ఆ సుప్రభాతాన్ని శ్రోతలకు వినిపించి, విశ్వజనని కన్యకాంబ కృపకుపాత్రుడనయ్యే అదృష్టాన్ని నాకు కల్పించారు.

అలాగే అవార్డు పొందిన "మగువమాంచాల' రాస్తున్న రోజులలో కూడా ప్రతి చరణాన్ని నాకు వినిపించారు. ఒకరకంగా ఆమెతో మాట్లాడినప్పుడల్లా నేనెన్నో సాహిత్య విషయాలను, కవుల విశేషాలను క్షుణ్ణంగా తెలుసుకున్నాను. తనకు తెలిసిన విషయాలను నాకు చెప్పాలని ఆమె ఎంతో అభిలాషపడేవారు. ఆమె స్థాయికి తగినవాడిని కాకపోయినా నేను రాసిన పద్యాలను, గేయాలను విని మనసారా మెచ్చుకోవడం ఆమె ఉన్నత వ్యక్తిత్వానికి ఒక నిదర్శనం. వారింటికి ఎంతోమంది కవులు, సాహితీ వేత్తలు, సంఘసంస్కర్తలు, పండితులు వస్తూ ఉండేవారు. వారందరికి నన్ను ఆమె ఎంతో అభిమానంగా పరిచయం చేసి "మాయింటి డాక్టరు గారండీ" అని చెప్పటమేగాక "కవీ, నటుడూకూడా నండోయ్" అనేవారు.

సాహిత్యమంటే ఆమెకెంతో ప్రాణం. ఏ చిన్న సమావేశానికి పిలిచినా ఆమె ఎంతో ఉత్సాహంగా హాజరయ్యేవారు. తమకు తోచిన మంచి మాటలతో కార్యకర్తలను ప్రోత్సహించేవారు. కేవలం నామీదే కాదు మా కుటుంబ సభ్యులందరిమీద ఆమెకపారమైన అభిమానముంది. మాయింట్లో జరిగిన ఏ చిన్న కార్యక్రమానికైనా ఆమె తప్పకుండా వచ్చి తన అభిమానాన్ని తెలియపరచేది. వారి తండ్రి పేరుమీదుగా బాపట్లలో నెలకొల్పిన మధురకవి నాళం కృష్ణరాయ విజ్ఞాన పీఠానికి మా చిరంజీవి ఎస్.వి.ఆర్. కుమార్‌ను ప్రధాన కార్యదర్శిగా ఆమె నియమించింది. సాహితీ రంగంలో ఉదీయమానుడైన మా అబ్బాయిపై ఆమెకుగల అభిమానానికి, వాత్సల్యానికి ఇది తార్కాణం.

ఇలా చెప్పుకుంటూ వెళ్తే జ్ఞాపకాల పుటలలో ఎన్నెన్నో సంగతులు ! మమతను పంచిన ఆ మనీషి వ్యక్తిత్వానికి అద్దంపట్టే మరెన్నో అనుభవాలు! మధురమైన ఆ జ్ఞాపకాలను మననం చేసుకుంటూ ఆ మాతృమూర్తి ఆత్మకు శాంతి చేకూరాలని ఆశించడంకన్నా నావంటి సామాన్యులు చేయగలిగింది ఏముంటుంది.

# ఆధ్యాత్మిక రసధుని

- *బి.ఎస్. నారాయణ భట్టు*
రాష్ట్ర రెడ్‌క్రాస్ కార్యవర్గ సభ్యులు

ఆమె మేఘగంభీర స్వరంతో వాక్ఝురిని గంగా ప్రవాహంగా ఉత్తేజ తరంగంగా, ఉద్రేకపు వెల్లువగా జనాళి హృదయాలలో ప్రతిధ్వనించే అక్షర లక్షలను క్రుమ్మరించ గల్గిన స్ఫూర్తి !, అనురాగ మూర్తి ? ఏరంగంలోనైనా రంగరించుకున్న కళాప్రకీర్తి ! బాపట్ల పట్టణంలో సాహిత్య, సాంఘిక, కళా రంగాలకు ఆమె మణిపూస. మానవతా వాదం, సంస్కరణ భావం పడుగుపేకల్లా ఆమెనరాలలో అల్లుకుని సమాజ జీవన సౌందర్యానికి తానూ ఆలంబనయై ఉపన్యాస ప్రకంపనలతో సభావేదికలను ఉర్రూతలూగించి శ్రోతలను రసాస్వాదనానుభూతులకు లోనుచేసిన మహిళామణి డా॥ లక్ష్మీకాన్తమ్మ డా॥ లక్ష్మీకాన్తమ్మగారు లేని సభ వెల వెల పోతుందంటే అతిశయోక్తి కాదు. ఆదికవి నన్నయ అక్షరాలా ఆంధ్ర మహాభారతానికి శ్రీకారం చుట్టిన గోదావరి తీరాలనుంచి కృష్ణమ్మ తరంగాలలో శబ్దార్థాల చిరుమువ్వల సవ్వడి నుంచి ఆధ్యాత్మిక నాదాలనూ, ఆంతరంగిక వేదాలనూ రుక్కుల్ని దిక్కుల్లో వ్యాపింపచేయాలని అనంత ప్రయాణాన్ని ఆధ్యాత్మిక ప్రచారానికి సాగించిన ఏకైక మహిళ డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. రాష్ట్ర విశ్వ హిందూ పరిషత్ కార్యవర్గ సభ్యురాలిగా, ఒక దశాబ్దకాలం బాపట్లలో పరిషత్ అధ్యక్షురాలిగా హిందూ ధర్మాన్నీ, హైందవ నాగరికతా సంస్కృతులను పాశ్చాత్య వ్యామోహాలనుంచి వెలికితీయడానికి హైందవ జ్యోతుల్ని జాజ్వల్యమానంగా భారతీయ తత్వాలతో వెలిగించడానికి ఆమె అనంత అవిశ్రాంత పథికురాలిగా పురోగమించడం స్పష్టమైన నిదర్శనం. చికాగోలో స్వామి వివేకానందుడు భారతీయ బాణిని ఏ బాణీలో వినిపించాడో వినని వారికి డా॥ లక్ష్మీకాన్తమ్మ ఉద్విగ్న పూరిత హైందవ ధర్మ ఉపన్యాసవిన్యాసాలు ఆనాడు వివేకానందుడు ఈలాగే చెప్పి వుండవచ్చుననిపిస్తాయి. పాశ్చాత్య దేశాలలో కూడా విశ్వహిందూ ధర్మాన్ని జాగృతం చేసిన ఘనత ఆమెది ! సంస్కరణవాదంతో హిందూ మత సంస్కరణమూ, సాంఘిక వాదంతో సామాజిక మార్పునూ ఆమె ఉపన్యాసాల్లో స్పష్టపరిచేది. ఆంగ్ల సంస్కృతి ప్రభావానికి వెలవెలపోతున్న భారతీయ సంస్కృతిని పునరుద్దీపన చేయడం అత్యంత ఆవశ్యకం! అని డా॥ లక్ష్మీ కాన్తమ్మగారు ఎన్నో వేదికలనుంచి తన భావాలను అందించారు. ఆమెప్రబంధాలను మానవతా ప్రమోదాలుగా మార్చాలని ఆ మార్పు జనాళికి అందించాలని తహతహలాడారు. ఆ ఆధ్యాత్మిక నవోన్మేషకెరటం నిత్యమూ ప్రవహిస్తుంది. అనునిత్యం స్పందిస్తుంది. ఆమెలా ఆదర్శవంతంగా సమాజం ముందుకు వచ్చి పురోగమనానికి పాటుపడే మహిళలను వ్రేళ్లమీద లెక్కించవచ్చు.

# కళాభారతి

-దాసరి శారద

గుంటూరు

అవి నేను 'ఇంటర్మీడియెట్' మొదటి సంవత్సరం చదివే రోజులు. మా గుంటూరులోని ఏ.సి. కాలేజీలో వార్షికోత్సవాలు జరుగుతున్నవి. ఆరోజు 'మహిళాదినోత్సవం'. అంటే ఆనాటి సభలో అంతా స్త్రీలే పాల్గొనేవారు. మా కాలేజి ఆడపిల్లలంతా నాటికలు, వినోద ప్రదర్శనల హడావిడిలో ఉన్నారు. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ముఖ్య ఉపన్యాసకురాలిగా సభనలంకరించారు. శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారిని పుష్పమాలాలంకృతురాలిగా చేసే భాగ్యం నాకు లభించింది. అంతకుముందే నేను ఆమె రచించిన 'ఆంధ్ర కవయిత్రుల చరిత్ర' చదివాను. ఇది నా బాల్యంలో డా॥ లక్ష్మీకాన్తమ్మగారితో కలిగిన ప్రధమ పరిచయం అనవచ్చు. తరువాత అనేక సందర్భాల్లో ఆమె ఉపన్యాసాలు వినటం జరిగింది. ఒక సురనదీ ప్రవాహంలా సాగిన ఆమె సాహితీ స్రవంతి నన్ను ముగ్ధురాలను చేసి, ఆమెపట్ల నాకు ఎనలేని గౌరవాభిమానాలు కలిగించాయి. డా॥ లక్ష్మీకాన్తమ్మగారి సారస్వత సేవకు బాపట్ల కేంద్రస్థానమని చెప్పవచ్చు. ఆంధ్రదేశంలో ఆమెను తెలియని వారు లేరంటే అతిశయోక్తి కాదు. ఆమె సాహిత్య రంగంలో చేసిన కృషి దేశానికి ప్రజానీకానికీ ఎంతో తోడ్పడినాయని చెప్పాలి. ఆమె తండ్రి మధురకవి నాళం కృష్ణారావుగారి రచనల ప్రభావం లక్ష్మీకాన్తమ్మగారిపై ఎంతగానో ఉంది. డా॥ లక్ష్మీకాన్తమ్మగారు సాహితీ వ్యాసంగంలో అడుగు పెట్టినపుడు స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. ఆమె ఆ ఉద్యమానికి ఎంతగానో స్పందించి అనేక కార్యక్రమాల్లో పాల్గొని తమ ఉపన్యాసాలద్వారా, దేశభక్తి గీతాలు పాడటం ద్వారా ప్రజానీకాన్ని చైతన్యవంతుల్ని చేశారు.

చాలామంది మహిళలు వివాహం వల్ల తమరచనా వ్యాసంగానికి దూరమౌతుంటారు. కాని ఈమె అలాకాక మరింతగా రాణించి అభివృద్ధిని సాధించారు. ఆమె భర్త హయగ్రీవగుప్తగారు ఆమెకు ఎంతగానో సహాయ సహకారాలందించారు. ఈ విషయం స్వయంగా డా॥ లక్ష్మీకాన్తమ్మగారు తమ ఆత్మకథలో చెప్పుకున్నారు.

డా॥ లక్ష్మీకాన్తమ్మగారు బాపట్లలో స్థిరనివాసమేర్పరచుకునే సమయానికి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మహిళాభ్యుదయం కొరకు ఎంతగానో పాటుపడుతున్నారు. స్త్రీ హితైషిణి (మండలిని స్థాపించి, ఆ సంస్థద్వారా మహిళాచైతన్యం, సమాజ సేవలతో స్త్రీలలో నూతనోత్తేజాన్ని కలిగిస్తున్నారు. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. శ్రీమతి

లక్ష్మీ కాన్తమ్మగారు ఆ సమాజంలో చేరి తమవంతు సేవ అందించారు. ఆ స్త్రీహితైషిణీ మండలిలో యువతీ విద్యాలయం స్థాపించి వయోజనులైన మహిళలకు విద్యను నేర్పించి ప్రయోజకుల్ని చేశారు. ఆ సంస్థలో నేను ఉపాధ్యాయినిగా చేరటంతో బాపట్లతో నాకు అనుబంధమేర్పడినది. క్రమంగా బాపట్లలో ప్రముఖ రచయిత్రులయిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగార్లతో సన్నిహితంగా మెలిగే అవకాశం కలగటం నాకు కలిగిన అదృష్టంగా భావిస్తాను.

ఏ మధురక్షణాన డా॥ లక్ష్మీకాన్తమ్మగారితో పరిచయం ఏర్పడిందోగాని, అప్పటినుండి ఆమె నన్ను ఒక సోదరిగా, ఆత్మీయురాలిగా ఆదరించారు. 'కళాభారతి', నాళం కృష్ణరాయ విజ్ఞానపీఠం మొ॥వారు ఏర్పాటు చేసే సభల్లో ఆమెను కలుసుకునేదాన్ని. ఆమె నన్ను ఎంతో ఆప్యాయంగా పలకరించేవారు. వారి ఇంటికి వెళ్తే ఎంతో ప్రేమగా మాట్లాడేవారు. ఎన్నో విషయాలు చర్చించేవారు. ఆమె గృహం ఒక సారస్వత నిలయం - ఆంధ్రసరస్వతి కదా ఆ మహిళామణి !

డా॥ లక్ష్మీ కాన్తమ్మగారు "సరస్వతీ సామ్రాజ్యవైభవం" అనే రూపకం రాశారు. అంతా ప్రాచీన కవయిత్రుల సమ్మేళనమయిన ఈ రూపకంలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి పాత్రను ప్రవేశ పెట్టటం ఆమెకుశ్రీమతి వరలక్ష్మమ్మగారి పట్ల గల గౌరవాన్ని చాటిచెపుతూంది. ఈ రూపకంలో సరస్వతి పాత్రను శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు పోషించేవారు. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ పది పాత్రను నిర్వహించే బాధ్యత నాకు అప్పగించారు. ఆమె నాపట్ల చూపిన అభిమానాన్ని నేనెప్పుడూ మరిచిపోను. తెలుగు విశ్వవిద్యాలయంవారు వయోధికులైన తెలుగు జాతి ప్రముఖులపై డాక్యుమెంటరీ చిత్రాలు నిర్మించారు. ఆ క్రమంలో డా॥ లక్ష్మీకాన్తమ్మగారిపై 3-3-1992న బాపట్లలోని ఆమె నివాసంలో డాక్యుమెంటేషన్ తీశారు. ఆసందర్భంగా, ఆమెను పరిచయం చేసే అవకాశం నాకు కలిగింది. ఇది నా జీవితంలో మరపురాని సంఘటన!

డా॥ లక్ష్మీకాన్తమ్మగారికి దేశభక్తితో పాటు దైవభక్తికూడా మెండు. ఆమె చివరగా రాసుకున్న ఆత్మకథ 'సాహితీరుద్రమ'ను తమకిష్టదైవమైన శ్రీరామచంద్రమూర్తికి అంకితమిచ్చారు. ఆ సందర్భంలో తమ మిత్రులను, ఆప్తులను ఆహ్వానించారు. డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారి మాటల్లో చెప్పాలంటే "ఈ గ్రంథం - సాహితీ రుద్రమ - ఆంధ్రదేశంలో అర్థశతాబ్దానికి పైగా సాగిన సామాజిక - రాజకీయ - సాహితీ చరిత్ర - ప్రతిఫలించే అద్దాల మేడ".

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ ఒక ఆదర్శమహిళ. ఆమె ఆదర్శాలు, సందేశాలు అందరికీ ముఖ్యంగా మహిళా లోకానికి శిరోధార్యాలు శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు చిరంజీవి.

# సాహిత్య సరస్వతి

- చిల్లర భవానీదేవి
హైదరాబాదు

అవి నేను బాపట్ల సరస్వతీ మెమోరియల్ బాలికల పాఠశాలలో ఏడవతరగతి చదివేరోజులు. మా స్కూల్లో ప్రతిశనివారం సాయంత్రం రెండు పీరియడ్స్ సమయాన్ని కల్చరల్ స్టడీకి కేటాయించి ఆ సమయంలో ప్రముఖ వ్యక్తుల చేత ఉపన్యాసాలు ఇప్పించేవారు. పలువురు రచయితల వాక్కు వినే అవకాశం ఆవిధంగా నాకు బాల్యంలోనే లభించింది. తెలుగు లిటరరీ అసోసియేషన్ కార్యదర్శిగా ప్రముఖులను ఆహ్వానించి వారిచే ఉపన్యాసాలు ఇప్పించటం చాలాసార్లు జరిగింది. ఈకార్యక్రమాల్లో భాగంగా లక్ష్మీకాన్తమ్మగార్ని ఆహ్వానించటానికి వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ఆవిడ తాదాత్మ్యంతో వీణను వాయిస్తున్నారు. నేను సంకోచంతో భయంతో వరండాలోనే ఆగిపోయి వీణాగానాన్ని వింటూ నిల్చుండిపోయాను. తర్వాత ఆమె లేచివచ్చి ఆదరంగా పలకరించి నా ఆహ్వానాన్ని అంగీకరించారు. అంతటి వ్యక్తి నాతో అలా ఆదరంగా మాట్లాడటం నాకు ధైర్యాన్నీ ఆనందాన్నీ కలిగించాయి.

తర్వాతికాలంలో చాలాసార్లు గంగాఝరి లాంటి వారి వాక్ప్రవాహం వినటం జరిగింది. ఆ వాక్కులో తీక్షణత, ఆ వదనంలో ఉద్వేగం, ఆత్మవిశ్వాసం ఓ లక్ష్మీబాయినీ, మగువ మాంచాలను తలపింప జేసేవి. వారి ఉపన్యాసంలో చాలా అంశాలు, పదాలు నాకు పూర్తిగా అర్థం కాకపోయినా మళ్ళీ మళ్ళీ వినాలనిపించేది. వారితో తరచూ మాట్లాడే అర్హతగానీ, వయస్సుగానీ నాకు లేవు. బాపట్లలో పలువేదికలపై మన్ననలందుకునే వారిని గురించి క్రమంగా తెలిసిందినాకు.

మా నాన్నగారు కోటంరాజు సత్యనారాయణశర్మగారు లక్ష్మీకాన్తమ్మగార్ని 'అక్కయ్య' అని సంబోధించేవారు. ఆమె కూడా నాన్నగార్ని తమ్మునిలా సంభావించేవారు. అలా వారిని 'అత్తయ్యగారూ' అని పిలవటంమాకు అలవాటయింది. నాన్నగారికున్న సాహిత్యాభిలాష వల్ల మాకుటుంబం వారికి ఆప్తమై నాకు వారికి మరింతగా చేరువయే అవకాశాన్ని కల్పించింది.

మనుపర్తి వరలక్ష్మమ్మగారి 'స్త్రీహితైషిణి మండలి' నిర్వహించే వివిధ పోటీలలో బహుమతులు గెల్చుకున్న నన్ను వారు విశాల హృదయంతో వెన్నుదట్టి ప్రోత్సహించటం నేను మర్చిపోలేని అపురూపస్మృతి ! భారతీయసంస్కృతి గురించి మాట్లాడుతుంటే వారికి కాలవ్యవధికూడా గుర్తుండేదికాదు. సంస్కృతశ్లోకాలతో, భావావేశ ధోరణిలో అలవోకగా ప్రసంగిస్తుంటే ఆదమరిచి వినటం ఓ అనుభూతి. బాపట్ల టౌన్‌లో వారి

ఉపన్యాసం ప్రతిధ్వనించని స్కూలుగానీ, సంఘంగానీ, సమావేశ మందిరం గానీ లేదంటే అతిశయోక్తికాదు.

వృత్తిరీత్యా న్యాయవాది అయినా స్వయానా కవి, సాహిత్యాభిమాని అయిన నాన్నగారి వెంట వెళ్ళి లక్ష్మీకాన్తమ్మగారి ఉపన్యాసాలు చాలాసార్లు వినటం జరిగింది. వారు సంస్కృత తరగతులు ఆరంభించటం నాకు గుర్తుంది. వారిని విజయవాడలో శ్రీరంగం గోపాలరత్నం గారితో బాటు సన్మానించిన సభకు నేనూ వెళ్ళాను. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి. అఖిల భారత రచయితల మహాసభ. కేంద్ర సాహిత్య అకాడమీ లాంటి గొప్ప సంస్థల పేర్లు వారిద్వారానే నాకు పరిచయం.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా విదేశీ పర్యటన చేసి తిరిగివచ్చినప్పుడు జరిగిన సన్మానసభలో వారుతమ అనుభవాలు వివరించగా విని ముగ్ధురాలినైనాను. ఆయా దేశాలలో భారతీయ సంస్కృతి పరమైన గౌరవ విశ్వాసాలతో కూడిన అనుభవాలను అందరికీ పంచిపెట్టిన తీరు నా మనసును ఆకట్టుకుంది. స్వదేశ సంస్కృతిపట్ల ఆత్మవిశ్వాసంతో కూడిన అభిమానం వారిది.

కవి సమ్మేళనాలలో కవుల కవితలు వింటూ నేనుకూడా కొన్ని కవితలు నా క్లాసు నోట్సుల వెనక పేజీలలో రాయటం అలవాటయింది. కవి సమ్మేళనాలలో లక్ష్మీకాన్తమ్మగారి నిండైన స్వరం - నాకు స్ఫూర్తినిచ్చే నాగస్వరం ! తనదైన ధీశక్తితో వారి వ్యక్తిత్వం నన్ను ఆకర్షించింది.

'కళాభారతి' కార్యదర్శిగా నాన్నగారు వివిధ సాహిత్య కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నప్పుడు నేను కార్యనిర్వహణారంగంలో ప్రవేశించి వారికి సహాయపడేదాన్ని. 'కళాభారతి'కి లక్ష్మీకాన్తమ్మ గారందించిన సలహాలు, సహాయ సహకారాలు 'కళాభారతి' కొక చరిత్రను సృష్టించగలిగాయి. 'కళాభారతి' నాకొక దివ్య సాహితీలోకాలకు ద్వారాలను తెరిచింది.

నేను బి.ఏ. పూర్తి చేయబోయేముందే నా తొలికవిత (నవ్వు - ఆంధ్రజ్యోతి) (1973) (స్వాతి - మారని ఆంతర్యం) ప్రచురితమైనాయి. నాకథకు బరంపు 'వికాసం' వారు బహుమతి ప్రకటించినప్పుడు మనసారా అభినందించి నా సాహిత్యాభివృద్ధిని కాంక్షించిన విశాల హృదయిని వారు ! హఠాత్తుగా ఓసారి ఫోన్ చేశారు. రేడియో కార్యక్రమంలో కవిత చదవమని. నాకు ఆనందం కలిగింది. సరేనని ఆటైముకు వారింటికి వెళ్ళాను. నండూరి సుబ్బారావుగారి బృందం లక్ష్మీకాన్తమ్మ గారింట్లో కదంబ కార్యక్రమాన్ని రికార్డ్ చేశారు. 'కాలం' అనే నా కవితతో నా తొలిరేడియో పఠనాన్ని ప్రారంభింప జేశారు అత్తయ్యగారు. నా జీవితంలో చాలా మరపురాని అంశాలను తొలిసారిగా ప్రారంభించింది వారే కావటం నిజంగా నా అదృష్టమే !

ఆనాడు వారు తమ అమృత హస్తాలమీదుగా అందరికీ భోజనం వడ్డించారు. దానితో బాటు సరస్వతీ కటాక్షాన్నీ అందించారేమో ! నా జీవితంలో సాహిత్యారాధన ప్రధానాంశంగా మారింది. నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానాన్ని వృద్ధి చేసుకుంటూ రచనావ్యాసంగాన్ని కొనసాగిస్తూ వచ్చాను. ఆ రేడియో కవిత చదివిన నాటినుండీ నన్ను కవయిత్రిగా అంతా గుర్తించటం మొదలు పెట్టటం నాకెంతో థ్రిల్లింగ్‌గా ఉండేది. నోట్సులలోని కథలు, కవితలు ప్రచురితమయి ప్రజల్లోకి వెళుతున్నాయి. వయసులో అనుభవంలో చిన్నదాన్నయినా నన్ను ప్రోత్సహించిన మంచి మనసున్న వ్యక్తుల్లో లక్ష్మీకాన్తమ్మగారు ముఖ్యులు.

1976లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు వారికి కళాప్రపూర్ణ ప్రదానం చేశారు. అప్పటికే 'వనిత'కు పలు వ్యాసాలు రాస్తున్నాను నేను! వనిత సంపాదకులు నాకో లేఖ రాశారు. లక్ష్మీకాన్తమ్మగారిని ఇంటర్వ్యూ చేయమని ఇలా నేను నిర్వహించిన తొలి ఇంటర్వ్యూ వారిదే కావటం విశేషం. అంతటి విశిష్ట వ్యక్తిని ఇంటర్వ్యూ చేయటం 'వనిత' వారు నాకిచ్చిన గౌరవం నేను అడిగిన ప్రశ్నలకు విలువైన సమాధానాలను నిజాయితీగా ఇచ్చి ఆదరించిన విదుషీ మణి ఆమె! ఆ ఇంటర్వ్యూలోనే నూతన రచయితలకు రాశికంటే వాశి ముఖ్యమనీ వాస్తవ దృక్పథంతో కలం పట్టాలనీ, స్వార్థంకోసం కాక, ధనం కోసం కాక సమాజానికి ఉపకరించే రచనలు చేయాలనీ ఇచ్చిన సందేశం నేనూ హృదయస్థం చేసుకున్నాను. ఆవిధంగా నా సాహితీ ప్రస్థానానికొక కరదీపికను వెలిగించి ఇచ్చారు ఆ ఓజోమూర్తి !

బాపట్ల 'కళాభారతి' ఆధ్వర్యంలో పరీధావి సంక్రాంతి సందర్భంగా నిర్వహించిన 'భువన విజయం'లో జమ్మల మడక, కరుణశ్రీ, వావిలాల, ధనకుధరం లతో లక్ష్మీకాన్తమ్మగారు మొల్లగా పాల్గొన్నారు. వారి అనర్గళ వాక్పటిమ, నాహృదయాంతర జ్యోతిస్సీమలను వెలిగించింది. ఆ కార్యక్రమానికి పనిచేసిన కార్యకర్తల్లో నేనూ ఉండటం గర్వకారణం. 1975 ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా విశిష్ట కవయిత్రిగా వారు సన్మానింపబడినప్పుడు వారికి బహూకరింపబడిన తెలుగు సభల జ్ఞాపికను చూపించారు నాకు. చిన్నపిల్లలా నిర్మలమైన వారి హృదయం నాకు చిత్రంగా అన్పించేది అప్పుడప్పుడు. నాబాల్య విద్యార్థి దశల్లో వారి పరిచయం నింపిన సంఘటనలు చాలా ఉన్నాయి. నాకు తెలీకుండానే అవి నన్ను ప్రభావితం చేశాయేమో! నేను కార్యక్రమాల పట్ల సాహితీ వ్యాసంగం పట్ల ఆసక్తి చూపిస్తుంటే మా అమ్మగారు 'నువ్వు రెండో లక్ష్మీ కాన్తమ్మవవుతావా' అనేవారు. అంతటి శక్తి నాలో లేకపోయినా ఆ మాటేనాకు కొండంత ఉత్సాహాన్నందించేది.

ఉద్యోగరీత్యా హైద్రాబాదు నివాసినై వివాహమై ఇక్కడే స్థిరపడటం వలన తర్వాతి కాలంలో వారిని అప్పుడప్పుడు మాత్రమే కలవటం జరిగింది. నా వివాహానికి వారు

పద్యరత్నాలు చదివి ఆశీర్వదించారు. నా సాహితీ వ్యాసంగాన్ని కొనసాగించమని సలహాఇచ్చారు. 1979లో నా కవిత 'ఆవేదన'కు వంశీ బర్కిలీ అవార్డు వచ్చినప్పుడు, సంగతి తెలిసి నేను బాపట్ల వచ్చినప్పుడు నాళం కృష్ణరాయ పీఠం పక్షాన ప్రేమగా సన్మానించారు. కవయిత్రిగా నా తొలిసన్మానాన్ని వారి అమృతహస్తాలమీదుగా అందుకోవటం నా అదృష్టం. మచిలీపట్నంలో జరిగిన ఆంధ్ర సాహిత్య అకాడమీ - కవయిత్రీ సమ్మేళనంలో పాల్గొనటానికి నన్ను ప్రోత్సహించి నన్ను సాహితీలోకానికి పరిచయం చేసిన సహృదయిని వారు !

చాలాసార్లు నా ఉత్తరాలకు ప్రేమగా జవాబు రాసేవారు. చిన్నకథ, కవిత ఏది రాసినా, ప్రచురితమైనా చదివి కలిసినప్పుడు అభిప్రాయం తెలిపేవారు. 1986లో నా తొలి కవితా సంపుటి 'నాలోని నాదాలు'కు ముందుమాట రాయటమేగాక ఆనాటి ఆవిష్కరణ సభలో నా కవితల్లోని అంతస్సూత్రాన్ని తన సహజ గంభీరశైలిలో ప్రేక్షకులకు పరిచయం చేయటం నేను మరువలేని మధుర సంఘటన.

నేను 1995లో నాళం కృష్ణరాయ స్మారక ధర్మనిధి పురస్కారాన్ని తెలుగు విశ్వవిద్యాలయం నుండి అందుకున్నప్పుడు ఆనందంతో అభినందించి ఆశీస్సు లందించారు. నా ప్రతి రచన వారి అభిప్రాయంకోసం పంపేదాన్ని వారి 'మగువ మాంచాల' కావ్యంపై సమీక్షా వ్యాసాన్ని రాసినప్పుడు ఎంతో ఆనందించి ధన్యవాదాలు తెలుపుతుంటే వారి ఉదాత్త వైఖరికి విస్తుపోయాను.

వారి ఆరోగ్యం బాగాలేదని మేము దంపతులం చూడటానికి వెళ్ళాము. అంతటి ధీరగంభీరమూర్తి నా చేయిపట్టుకుని పక్కలో కూర్చోబెట్టుకుని కన్నీళ్ళు పెట్టుకోవటం నాకూ కళ్ళు చెమరింపజేసింది. అనారోగ్యం ఎంతటివారినైనా కుంగదీస్తుందేమో ! తర్వాత 20 రోజులకే హైద్రాబాదులో వారిగురించిన కడపటి వార్త అందటం నాకు విచారాన్ని కలిగించింది. సనాతన భారతీయసంస్కృతిని పోషించే యవనిక వాలిపోయింది.

'ఆంధ్ర సరస్వతి' బిరుదాంకితురాలు 'సాహితీరుద్రమ' లక్ష్మీకాన్తమ్మగారు రుద్రమలాగే జీవించారు, వారి సాహితీప్రకర్ష ఒక కోణమైతే నిలువెత్తు వ్యక్తిత్వం మరో మెరుపుకోణం. వారి అపార సాహితీవ్యాసంగ సాగరంలో నేనో బిందువునైనా కానేమో! కానీ వారు నాకిచ్చిన స్ఫూర్తి ఒక చైతన్య తరంగం! నిత్య నూతన ప్రవాహం ! సరస్వతీ కంఠాభరణంలోని పచ్చలపతకం తిరిగి యథాస్థానం చేరింది.

వారు నావంటి వారికిచ్చిన స్ఫూర్తి దీప్తిగా ఎన్నో సాహితీ దీపాలను వెలిగిస్తూ ఉంటుందనీ, వారితో నా పరిచయం నా జీవితంలో నేనిష్టపడే ఓ ప్రవృత్తిని నిండుగా నిలబెట్టిందనీ భావిస్తూ వారి దివ్య స్మృతికి అంజలి ఘటిస్తున్నాను.

# కారణ జన్మురాలు

- నాగనూరు సులోచన

బాపట్ల

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు గొప్పకవయిత్రి, మహావిదుషీమణి, చాలాపేరు ప్రఖ్యాతులు గాంచిన మహిళ - యిదీ నా చిన్నతనంలో నేను చదువుకునే రోజులలో ఆమె గురించి తెలిసికొన్నది.

మావారు ఎన్.ఆర్. రాజేశ్వరరావుగారు, శ్రీమతిలక్ష్మీకాన్తమ్మగారి ప్రథమ పుత్రుడు ప్రతాప్ చంద్రగారు మద్రాసులో చదువుకునే రోజులలోని స్నేహాన్ని పురస్కరించుకొని వారిద్వారా బాపట్లలోని ఆర్ట్సు ఎండ్ సైన్సు కాలేజీలో అధ్యాపకునిగా ఉద్యోగం సంపాదించుకొని యిల్లు చూడకుండానే మావారుతనతో లక్ష్మీకాన్తమ్మగారింటికి అతిధులుగా తీసుకువచ్చారు. అంతటి మహాకవయిత్రి యింటిలో 10 రోజులుండి పోవడం ముందు చాలా చాలా భయపడ్డాను. కాని అంతటి విదుషీమణి ఏమాత్రం, ఏకోశానా గర్వంలేకుండా నన్ను స్వంత బిడ్డలాగా ఆప్యాయంగా ఆదరించి, అభిమానించి ఆశ్రయమిచ్చిన ఆ పదిరోజులు నా జీవితంలో మరువలేనివి. ఆమెలాంటి మహోన్నత మహిళ నా జీవితంలో మరల ఎక్కడా తారసపడలేదంటే అతిశయోక్తి కాదు. ఈనాడు ఆమెను స్మరిస్తే ఆనంద భాష్పాలే !

ఆవిధంగా పరిచయమైన ఆమెనుండి ఎన్నో విషయాలు తెలిసికొన్నాను. ఏవిషయాన్నయినా అనర్గళంగా మాట్లాడగలిగే ఆ వాక్పటిమ ఎదుటివారిని మంత్ర ముగ్ధులను చేస్తుంది. ఉభయ భాషలలోని ఆమె కవితా ప్రావీణ్యతే కాక ఆమెలో ఆమెలోని అద్భుత భావాలను తెలిసికొన్నవారు నిశ్చేష్టులవుతారనిపిస్తుంది. స్వాతంత్ర్యోద్యమంలోని అనేక ఘట్టాలలో ఆమె సాహసవనితగా ఆ వయస్సులోనే ఆమె ముందడుగులేస్తూ అనేక మందిని చైతన్యవంతులను చేయడం ఆశ్చర్యకరంగా కనిపిస్తుంది. సాంఘిక దురాచారాలపట్ల, మూఢవిశ్వాసాలపట్ల, అజ్ఞానంతో కూడిన మూఢ సంప్రదాయాలపట్ల ఉద్వేగంతో కూడిన ఆమెలోని వ్యతిరేకత ఆచరణ పూర్వకంగా ఆమెలో గమనించినపుడు మంత్ర ముగ్ధులమే అవుతాము. ఎంతో మంది మాటలకే గాని, చేతలలో ఆశయాలు, సిద్ధాంతాలు కనబడవు. ఇందుకు విరుద్ధంగా వుండే ఆమె ప్రవర్తన అనుసరణీయంగా వుంటుంది. సమాజంలో వ్రేళ్ళూనిన కులవ్యవస్థమీద ఆమె వాక్కులు విని ఆమెపట్ల గౌరవ భావం పెల్లుబికింది ఆనాడు ! వృత్తిని బట్టి ఏర్పడిన కులాలు, కాలగతిలో స్వార్థపరుల అవివేకంతో కులాన్ని వంశపారంపర్యంగా ఎలా మార్చుకున్నారో ఆమె చెప్తుంటే సంస్కృతాంధ్రాలను ఔపోసన పట్టిన, మనపురాణ గ్రంథాలను, వేదాలను కూడా పూర్తిగా చదివి సరయిన

భావాలను గ్రహించగల్గిన అంతటి మహా మహిళను అందరూ ఆదర్శంగా ఎందుకు తీసికొనరో అర్థం అయ్యేదికాదు.

గోవధకు వ్యతిరేకంగా నిండు చూలాలిగా వుండి కూడా ఆమొరటు మనుష్యులకు ఎదురు నిలిచిన ఆమె సాహసం తెలిసిననాడు మరో ఝాన్సీ లక్ష్మీబాయి అవతరించిందా ? అనిపించింది. ఇంతటి సాహసవనితను, మరోకోణంలో లలిత కళలలో ఆమె ప్రావీణ్యత అనిర్వచనీయమైనది. గాత్ర సంగీతం, వీణలలో ఆమె నైపుణ్యం అబ్బురపరిచేదిగా వుండేది.

డా॥ లక్ష్మీకాన్తమ్మగారిలో ఉండే మరో విశిష్ట లక్షణం ఆమె దయాహృదయం ! ఆమె ఎంతో మందిని ఆపదలో ఆదుకుని, ఉపాధికల్పన చేయడం కూడా జరిగింది. ఇన్ని విశిష్టరంగాలలో సేవాతత్పరత కలిగిన ఆమె బంధు, మిత్రులను ఆదరంగా, ఆప్యాయంగా చూచుకుంటూనే ఆమె మామూలు సాత్విక గృహిణివలె మెలగుతూ పిల్లలకు చక్కటి విద్యాబుద్ధులను నేర్పించి ప్రయోజకులుగా తీర్చిదిద్ది విశిష్ట స్థానాలను అలరింపజేసిన ఘనత ఆమెదే ! ఆమె జీవితంలో దేనినీ నిర్లక్ష్యపరచలేదు.

ఇంతటి సలక్షణ గృహిణి అయిన ఆమెలోని దైవభక్తి అచంచలమైనది. ప్రతిరోజూ క్రమంతప్పకుండా ఒక పద్ధతిగల దైవ చింతన ఆమెలో గమనార్హంగా ఉండేది. అటువంటి మాననీయురాలు, మహనీయురాలు భర్తపట్ల ఎంత అణుకువగా, వినయంగా ప్రవర్తించేదో దగ్గరనుండి గమనించిన ప్రతివారికీ తెలుసు !

స్త్రీజాతికే గర్వకారణమయిన ఆమె జీవన విధానం చూస్తూ ఆమె జీవిత చరమాంకంలో - యింతటి మహనీయురాలిపేరున శాశ్వత గ్రంథాలయమేదయినా ఒకటి నెలకొల్పితే బాగుండుననిపించేది. ఆమె మహిళలలోకెల్లా మాణిక్యం ! ఆమెగురించి ఎంత రాసినా, ఎంతవిన్నా తనివి తీరనిది ! కుండ బద్దలు కొట్టినట్లు ఖచ్చితంగా ఆమె అభిప్రాయం చెప్పగలధీమణి, మంత్రముగ్ధులను చేసే ఆమె ఉపన్యాసధోరణి గణనీయమైనది.

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి పాండిత్య ప్రకర్ష, వాక్చటిమ, స్వాతంత్ర్యోద్యమ సాహసాలు, లలితకళలు, సాహితీసేవ, మానవసేవ, దయార్ద్ర హృదయం - యివన్నీ ఆమెకు అతిదగ్గరగా వచ్చి గమనించిన నేను ఆమెకు పలు రంగాలలో పలువురు ప్రముఖులనుండి వచ్చిన బిరుదులు, గౌరవ సన్మానాలు - చాలవనీ, ఇంకా ఇంకా చాలా చాలా జరిగి ఉండాలనీ అనిపిస్తుంది. డా॥ లక్ష్మీకాన్తమ్మగారు కారణజన్మురాలు! ఒకతార రాలిపోయింది ! భగవంతుడు ఆమె ఆత్మకు శాంతి భప్రసాదించు గాక!

# సాహితీ రారాణి

- కవిరత్న బండారు సుజాత శేఖర్
నల్గొండ.

డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారితో నాకు ముఖాముఖి పరిచయం ఎక్కువగా లేనప్పటికి, సాహితీ శిఖరంగా ఆమె సాహిత్యం బాగా పరిచయమైనది !

అప్పుడప్పుడే సాహితీ ప్రపంచంలో చిన్న 'కవితా పుష్పాన్ని' ఆవిష్కరించుకొన్న నేను, సాహితీ రారాణిగా విలసిల్లుతున్న కవయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారిగురించి విన్నాను. హైద్రాబాద్‌లో గొప్ప సంఘసేవా తత్పరతగల వ్యక్తిగా పేరుపొందిన మహనీయులు, సాహితీ సౌజన్యశీలురైన "వైశ్యరత్న" కబళవాయి రాధాకృష్ణారావు అన్నయ్యగారి ఇంట్లో లక్ష్మీకాన్తమ్మగారి రచనలు చూడటం, వాటిని తీసుకోవడం జరిగింది. ఆమె రచనా వైశిష్ట్యం తెలుసుకొన్న తరువాత, ఎప్పుడెప్పుడు ఆమెను చూస్తానా అని నామనసు తపించింది. వారి దర్శనం కోసం ఎదురుచూసిన నాకు ప్రథమంగా 'ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహిళావిభాగ్" వారు నిర్వహించిన రాష్ట్ర మహిళా సభ 1993లో హైద్రాబాద్ నందు, వారిని చూడటం, పరిచయం చేసుకోవడం జరిగింది. ఆనాటి సభలో "ఆధునిక సమాజంలో స్త్రీ అభివృద్ధి' అనే అంశంపై ఎందరో ఉపన్యసించారు. ఆపోటీలో నాకు 'బెస్ట్ స్పీకర్' గా బహుమతి లభించింది. ఆ సమావేశానికి ముఖ్యవక్తగా హాజరైన లక్ష్మీకాన్తమ్మగారు నన్ను ఆశీర్వదించడం నాకెంతో ఆనందాన్ని కల్గించింది. ఆపైన 'ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య సంఘం" దశాబ్ది ఉత్సవంలో వారితో పాటు నాకు సన్మానం జరిగింది. ఉభయభాషా ప్రవీణురాలైన లక్ష్మీకాన్తమ్మగారి అనర్గళ ఉపన్యాసం నన్నెంతో ఆకర్షించింది. ఇంచుమించు 70 సం॥రాల వయస్సులో కూడా కంచుకంఠంతో ఆమె ఇచ్చే ఉపన్యాసం వింటుంటే ఆశ్చర్యం కల్గింది. ప్రతిభ, పట్టుదల గల వారిముందు వయసుకు ముసలితనమే రాదేమో ! అనిపించింది. స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న వనితగా, సాహితీ రుద్రమ్మగా అనుభవాన్ని సారంగా ఆమె ఇచ్చే ఉపన్యాసానికి ముగ్ధులు కానివారెవరైనా ఉంటారా ! ఆ సమయంలో ఆమె సాహితీ మాతృమూర్తిగా నాకు కన్పించింది. శారదాంశగల వారికి ఆంధ్ర సరస్వతి, ఉభయభాషా ప్రవీణ, 'కళాప్రపూర్ణ' బిరుదులు ప్రసాదించడం, ఆ బిరుదులకే వన్నె వచ్చిందనడంలో అతిశయోక్తి లేదు. ఆ సమావేశ అనంతరం, రెండు మూడు సమావేశాల్లో వారితో కలవడం, మాట్లాడటం, నా కవితా సంపుటిలను అందించడం జరగింది. ఒక విద్వత్ కవయిత్రితో చెలిమి, ఆశీర్వాదం భాగ్యంగా భావిచాను. కాని ఆ అదృష్టం ఎంతో కాలం నిలవకపోవడం నా దురదృష్టం.

కీర్తిశేషులుగా భౌతికంగా కన్పించినా ఆమె సాహితీ ప్రపంచంలో చిరకాలం నిలిచే తార. నశ్వరమైన అక్షరసేవకు అంకితమైన ఆమెకు అశ్రుతర్పణం చేస్తూ అక్షర సుమాలతో శ్రద్ధాంజలి అర్పించటం వారి అభిమానిగా, రచయిత్రిగా నా భాగ్యం, బాధ్యత. ఈ పరిచయవ్యాసాన్ని రాయడం భాగ్యంగా భావించిన నేను హైద్రాబాద్ 'బి' కేంద్రం వారికి అందించడం కూడా జరిగింది. త్వరలో ప్రసారం కావచ్చునని భావిస్తున్నాను.

# లక్ష్మీ సరస్వతి

-శ్రీమతి గుడిపాటి సావిత్రి
సెంట్ థీరీసా కాలేజి, ఏలూరు

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారిది పండిత, సంపన్న కుటుంబం. ప్రాచీనకాలం నుండి ఏలూరులో ప్రసిద్ధి పొందిన సంపన్నులైన మోతే కృష్ణారావుగారికి ఈమె మేనకోడలు. ఈమె పేరు లక్ష్మీకాన్తమ్మ అని కాకుండా లక్ష్మీసరస్వతి అని పెట్టి ఉంటే చాలా సార్థకంగా ఉండి ఉండేది. లోకంలో లక్ష్మీ సరస్వతులు ఒకేచోట కాపురం చేయరని ఒక వాడుకుంది. కానీ ఈమె విషయంలో ఆ వాడుక అపజయం పొందింది. కారణమేమంటే ఈమె ఎంత విద్యావతో అంత సంపన్నురాలు కూడా ఈమెకు గల పాండిత్య ప్రకర్షను గూర్చి చెప్పడానికి నావంటి అల్పభాషా పరిజ్ఞానం గల వాళ్ళకు సాధ్యంకాదు. లక్ష్మీకాన్తమ్మ ప్రజ్ఞా విశేషాలు ఒక మహా సముద్రం లాంటివి. ఆమెను గూర్చి చెప్పాలని ఎంతో ఆసక్తి ఉన్నప్పటికి కూడా నావంటివారికి అది అసాధ్యమే అవుతుంది. ఆమె ఎన్నో పాండిత్య కవితా పురస్కారాలను పొందారు. కవితా పురస్కారాలను పొందారు. ఎన్నో గ్రంథాలను రచించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం కూడా ఆమె గొప్పతనాన్ని గుర్తిస్తూ ఆమెను "కళాప్రపూర్ణ" తో గౌరవించింది.

'పద్మరాగాల గనిలో గాజు' పుట్టదు. పద్మరాగమే పుడుతుంది అన్నట్లుగా డా॥ లక్ష్మీకాన్తమ్మగారికి ఆమె ప్రజ్ఞా పాటవాలను, పాండిత్యాన్ని పుణికి పుచ్చుకున్న వారసురాలిగా, పుత్రికగా శ్రీమతి సుహాసిని జన్మించింది. లోకంలో పండిత పుత్రులు అని, అగస్త్యభ్రాత అని చెప్పే నానుడికి వ్యతిరేకంగా 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అన్నరీతిలో తల్లికి తగిన పుత్రికగా, తల్లికీర్తిని నిలబెట్టే వారసురాలిగా శ్రీమతి ఊటుకూరి సుహాసిని ప్రసిద్ధికెక్కారు. సామాన్యంగా జ్ఞానవిజ్ఞానాలలో పురుషులే అధికులుగా ఉంటారనే భ్రాంతిని ఈ తల్లీ, పుత్రికలు తొలగించి తమ శేముషీ విశేషాలతో కీర్తి చంద్రికలను లోకంలో వెలయింపజేసినారు. తల్లివలే సుహాసిని కూడా విజ్ఞాన సోపానాలను

ఎన్నిటినో అధిగమించిది. తన విజ్ఞాన సంపదతో తల్లి రుణాన్ని తీర్చుకున్నది. ఇకముందు కూడా ఎన్నో కీర్తి ప్రతిష్ఠలను, ఔన్నత్యాన్ని పొందగల శక్తిని పరమేశ్వరుడు ఈమెకు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను. సహజంగా మానవ జీవితానికి సార్థకతను చేకూర్చేది పాండిత్యం మాత్రమే. అందులో కూడా కళాత్మకత సౌధాగ్రముపై భాసించే మణిదీపంలాగ ప్రకాశిస్తుంది. చిరంజీవిని శ్రీమతి సుహాసినిలో ఈ కళాత్మకతాప్రజ్ఞ అసమానం. భగవంతుడు ఈమెకు చిరాయురారోగ్య భోగభాగ్యాలు ప్రసాదించి లోకహితమైన ఎన్నో సాహిత్య కార్యాలు ఈమె చేత తప్పక జరిపించాలని, జరిపించగలడని ఆకాంక్షిస్తూ వయస్సులో పెద్దనయిన నేను ఆశీర్వదిస్తున్నాను.

# ఈ తరం మహిళ

- డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి

అధ్యక్షులు: చైతన్య వేదిక, తెనాలి.

తన పాండితీ ప్రకర్ష, సాహితీ సంపదతో దాదాపు ఐదు దశాబ్దాలపాటు విజ్ఞాన వీచికలు ప్రసరించిన విదుషీమణి డాక్టర్ లక్ష్మీకాన్తమ్మ. సిరిసంపదలుగల కుటుంబంలో జన్మించినా, జాతీయోద్యమానికి స్పందించి - స్వాతంత్ర్య సమర సమావేశాలలో పాల్గొన్నారు. సామాన్య ప్రజానీకంలో మద్యపాన అలవాటును మాన్పేందుకు ఎంతో కృషిచేశారు. ఈ సంగతి ఆమె ఇలా చెప్పారు.

ఆ రోజుల్లో జరిగిన సంఘటనలలో 'మద్యపాన పికెటింగ్' నేను మరువలేనిది, ఊరూరా తిరిగి కల్లు తాగేవారిని మాటలతో మార్చాలని చూసేవాళ్లం. కానీ ముందు వాళ్లు వినేవారుకారు. ఆవేశంకొద్దీ వాళ్ల దగ్గరున్న ముంతలను లాక్కునేవాళ్లం. వాళ్లుకూడా ఆడపిల్లనయిన నన్ను ఏమీ చేయలేక ఆ ముంతలను నా నెత్తిన పగులగొట్టేవారు ఏది ఏమయినప్పటికీ ఆ రోజుల్లో ప్రజలు చెప్పిన మాట వినేవారు. పైగా మాట ఇస్తే నిలబెట్టుకునే ఆత్మవిశ్వాసం ఉండేది. ఈనాడు ప్రజల్లో ఏమాత్రం మోరల్ వాల్యూస్ వుండడంలేదు' అదీ డాక్టర్ లక్ష్మీకాన్తమ్మగారి ప్రత్యేకత.

# భాగం - 4



డా॥ లక్ష్మీ కాన్తమ్మగారి

- మృతి వార్తలు
- అశ్రుతర్పణం - కవితలు
- సంతాప సభలు, తీర్మానాలు
- బాపట్ల ప్రముఖుల నివాళి
- స్మారక సమితి

# A STAR IN THE FIRMAMENT OF TELUGU LITERATURE

The reputed scholar and poetess Utukuri Lakshmeekanthamma of Bapatla, who was chosen for the Gupta Foundation's Mandupalli Krishnamurty Saahitya Puraskara Award, 1996 died on December 10. She was 79. She had been ailing for some time. A native of Vijayalakshmipuram in Bapatla, Lakshmeekantamma was a well-known personality, thanks to here recitation of poems in Prachina Khanda Kavyas and Kavitas in a perfect raga style.

Born to Madurai Kavi Naalam Krishna Rao and Suseelamma at Mandapet in West Godavari District on December 21, 1917, Lakshmeekantamma studied up to Ubhaya Bhaasha Praveena. Inspired by her father she cultivated oratorical and writing skills in ancient poetry.

In 1976 the Andhra University conferred on Lakshmeekantamma the title of "Kalaa Prapoorna" In the veena ganam and elocution competitions. She won five gold medals. She was a member of the Andhra Pradesh Sahitya Academy, the Baalala Academy, the Telugu Bhasha Samiti and the Viswa Hindu Parishat.

In her 12th year Lakshmeekantamma was married to Utukuri Hayagreeva Gupta, an advocate. She settled in Bapatla more than sixty years ago. She authored several Telugu and Sanskrit *kaavyas.* Her well-known work, *Andhra Kavayitrulu* won the first prize from the Telugu Bhasa Samiti in 1953. She also penned *Akhila Bharata Rachyitrulu, Sree Kanayaka Paramesware Suprabhatam* Jaati Pita, *Naa Telugu Maanchala, Saraswatee Saamaraajyam* and other geya and *padya kaavyaas* and her own autobiography under the title of *Saahitee Rudramma.*

In 1953, Lakshmeekantaamma won the "Grihalakshmee Kankana Puraskaaram", in 1983 the Tikkavarapu Sudarasanamma Award, in 1986 Viswanatha Satyanarayana Award, in 1984 Sueela Narayana Reddy Award, and in 1953 the Sarojinee Naidu Memorial Telugu Velugula Award.

Besides her literary activities Lakshmeekantamma was involved with serveral women's movements. She attended the Telugu Mahasabha in Russia and was felicitated there for her literary achievements.

Lakshmeekantamma's other notable works include: *Andhrula Keertana Kalaseva, Devistava Taravali. Sadukti Manjar,* (translationof Hindi dohas written by Kabir, Tulasi Binda Rahim), *Bharata Desa Charitra - Konnigunapathalu, Kanti Sikharalu* (devotional songs), *Mahila Vikrama Suktam, Mana Sahitee Madhu Bharathi,* (geya kavyam)", and *Kanyakamma Nivali* (Satirical pada kavym).

Lakshmeekantamma's upublished works include: *Story of Chandramathi* (For children - to be published by the T.T.D.) *Sahitya Vyasa Manjari* and *Rutamabari* (vachana geya kavyam)

*N.H. Sitarama Sarma* - ***THE HINDU***

# డా॥ లక్ష్మీకాన్తమ్మకు శ్రద్ధాంజలి

## పత్రికలలో వార్తలు

బాపట్ల, డిసెంబరు1, 1996 (న్యూస్‌టుడే) : ప్రముఖ కవయిత్రి సాహితీరుద్రమ, కళాప్రపూర్ణ డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ (79) ఆదివారం ఉదయం స్థానిక విజయలక్ష్మీపురంలోని ఆమె స్వగృహంలో మృతిచెందారు. స్వాతంత్ర్యోద్యమకాలంలో గ్రంథాలయోద్యమాన్ని నడిపిన గౌతమి గ్రంథాయలం (రాజమండ్రి) వ్యవస్థాపకుడు నాళం వెంకటకృష్ణారావు కుమార్తె అయిన లక్ష్మీకాన్తమ్మ 1938లో వివాహం అయ్యాక బాపట్లలో స్థిరపడి, ఆరు దశాబ్దాలుగా కవయిత్రిగా సాహితీ సేవలతో పాటు స్త్రీ అభ్యుదయానికి పలు ఉద్యమాలు నడిపారు. రాష్ట్రంలో గృహలక్ష్మి అవార్డు అందుకున్న తొలి మహిళ కనుపర్తి వరలక్ష్మమ్మ ప్రధాన శిష్యురాలిగా ఆమెతో కలిసి బాపట్లలో స్త్రీ హితైషిణీ మండలిని స్థాపించారు. ఈ మండలి కార్యక్రమాల నిర్వహణలో లక్ష్మీకాన్తమ్మ ప్రధాన భూమిక నిర్వహించారు. 1975లో రష్యాలో జరిగిన తెలుగు ప్రపంచ మహాసభల్లో పాల్గొని అక్కడ ఘన సత్కారం అందుకున్నారు. 1990లో కెనడా, టొరొంటో నగరాలకు ఆహ్వానితురాలిగావెళ్ళి టొరేంటో ప్రభుత్వ గ్రంథాలయానికి తన రచనల్ని బహుకరించారు. కళాప్రపూర్ణ, సాహితీరుద్రమ లాంటి అవార్డుల అందుకున్న ఈమె ఉభయభాషాప్రవీణురాలుగా ఆంధ్రప్రదేశ్, కేరళ, కర్ణాట మహారాష్ట్రలలోని పలు ఫౌండేషన్‌ల సాహితీ పురస్కారాలను అందుకున్నారు. 191/ డిసెంబరులో జన్మించిన లక్ష్మీకాన్తమ్మ నెల రోజులుగా అస్వస్థతకు లోనై ఉన్నారు. ఈమెకు ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. తన సాహితీ జీవితంలో సుమారు 28 అవార్డులు అదుకుని పలు సత్కారాలు పొందిన లక్ష్మీకాన్తమ్మ ఈ ఏడాది గుప్తా ఫౌండేషన్ మడుపల్లి కృష్ణమూర్తి సాహిత్య పురస్కార అవార్డుకు ఎంపికయ్యారు. ఈ అవార్డుకింద రూ. 25 వేల నగదు, బిరుదు ప్రదానం ఈ నెల 22న ఏలూరులో జరిగే గుప్తా ఫౌండేషన్ వార్షికోత్సవంలో అందుకోవాల్సిన ఈమె తనువు చాలించటం పలువురు సాహితీవేత్తలను విషాదంలో ముంచెత్తింది. బాపట్ల మహిళా కళాశాల పాలక వర్గానికి సభ్యురాలిగా వ్యవహరించారు. లక్ష్మీకాన్తమ్మ మృతికి సంతప సూచకంగా సోమవారం కళాశాలకు సెలవు ప్రకటించారు. - ఈనాడు.

## లక్ష్మీకాన్తమ్మ అంత్యక్రియలు

బాపట్ల, డిసెంబర్ 1: ప్రముఖ సాహితీవేత్త రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ భౌతికకాయానికి స్థానిక త్యాగరాజ నగర్‌లోని స్మశానవాటికలో ఆదివారం సాయంత్రం ఐదుగంటలకు అంత్యక్రియలు జరిగాయి. లక్ష్మీకాన్తమ్మ ఆదివారం ఉదయం ఇక్కడ మరణించిన విషయం తెలిసిందే. - ఆంధ్రభూమి.

# అశ్రుతర్పణం

వాకల్ బాకులు దూసి ముష్కరతఁ ద్రోవన్నేర్చి విద్వజ్జనుల్
జేకొట్టన్ దరియించితిని తల్లీ! నాకలోకమ్మునన్
నీ కన్నయ్య్య కరంగి మూర్కొనియెనో నీ మూర్ధమున్ దృప్తిమై
మా కన్నీటి నివాళులందుకొనుమమ్మా! సాహితీరుద్రమా!

**కవిశేఖర చిట్టిప్రోలు కృష్ణమూర్తి**
గామాలపాడు.

# శ్రద్ధాంజలి

భాస్వానుదేతి వితనోతి చదివ్యతేజ:
కాలాగమే చ ప్రతిగచ్ఛతి పశ్చిమాద్రిమ్
లోక స్వభావ ఇతినాస్తి విశేపచిన్తా
ఆత్మీయతా మమహి దు:ఖకరీ సబాష్పమ్ 1

యా సాహిత్య ధుర్య పరివర్తిత సర్వదేశా
యా సంగీత గాన బహురాజిత దివ్యకీర్తి:
యా వాగ్వైఖరీ విలసితానన శుభ్ర దీప్తి:
సా దివ్యలోక పథికా చరితాకిలాహో! 2
యా వైశ్యకుల వారధి చంద్రరేఖా
యా పుణ్యాసుదతీ జనకీర్తి లేఖా
యా కావ్య కవితా దృతపాణిరేఖా
సా దివ్యలోక పథికా చరితాకిలాహో!

ఆ బాల్య సంప్రాప్త కళావిభూతి:
ఆ జన్మ సంస్కార మహావిభూతి:
ఆ మృత్యు సంసేవన లబ్ధకీర్తి:
సా దివ్యలోక పథికా కిలాహో! 3

సౌజన్యం పరిశీల దృష్టి మనిశం సంస్కార భావోన్నతిమ్
ఔదార్యం గుణగౌరవం చ మహతాం సేవారతిం నిర్మలాం
వైశ్యానాం మహిళోన్నతి ప్రతిపథం సంగీతకం బిభ్రతీ
లక్ష్మీకాన్త మహోదయాననుగతా! హా! సాహితీ రుద్రమా 5

నూలి వెంకట లక్ష్మీదేవి
అధ్యక్షురాలు: ఆర్యవైశ్య మహాసభ మహిళా విభాగ్, భీమవరం.

## కనరాని తీరం చేరే కాన్తమ్మ

లక్ష్మీకాంతమ్మ లయమాయె వాణిలో!
సాహితీ రుద్రమ్మ లేదు ఇకలేనే లేదు!
సాహితీ జగతిలో ప్రకాశించే సాధ్వి!
తెలుగు వెలుగు నందించె లలామ!
పండిత వంశాన ప్రభవించిన నారి
అవార్డు రివార్డులందుకొన్న మనీషి!
కళాప్రపూర్ణ బిరుదాంకితురాలు!
మహిళా లోకానికి వన్నె తెచ్చిన మాత!
స్త్రీ జాతి నుద్ధరించ బూనె కారణజన్మ!
అశేష కీర్తి గడించె వైశ్యకుల సంజాత.

ఆర్కే గుప్త
మడకశిర

## సాహిత్య తపస్వి డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ సంస్మరణం

శ్రీమతి శిఖాకొల్లు లక్ష్మీమోహన్
హైదరాబాదు.

సాహిత్య తపస్వి, ఉపన్యాస ఓజస్వి,
సంగీత సరసి, అపురూప మనస్విని
అసమాన తేజస్విని, విజ్ఞాన స్రోతస్విని
సుగుణ సంపన్న, విశేష ప్రతిభా సంపన్న

బ్రాహ్మీమూర్తి, ప్రరిమలకీర్తి!
లక్ష్మీకాన్తామణీ, నారీ శిరోమణీ!
సాహిత్యాంబరాన మణి మకుటమై వెలిగావు.
తేజోవంతమై, దీప్తిమంతమై నిలిచావు.
మీ ప్రజ్ఞాపాటవాలు అత్యద్భుతం, అప్రతిహతం
సరస్వతీ కరుణాకటాక్షం తమకాభరణం
వనితాలోకాన వెలసిన ఆణిముత్యం నీవు
అఖిలాంధ్రావనికే గర్వకారణం నీవు
మధురకవి సంఘ సంస్కర్త, కృష్ణరాయునిపుత్రికవై
మధుర భావ వల్లరిని చేజిక్కించుకున్నావు
ఆంధ్ర మహిళాగాన సభ సంస్థాపకురాలు సుశీలమ్మ గారాబు పట్టివై
సంగీత సామ్రాజ్యాన్ని ఏలిన "సంగీత సరస్వతి నీవు"
మాతా పితల తపః ఫలితం నీవు
సఫలీకృతం మీ జన్మం, ఆదర్శప్రాయం మీ చరితం
కళాప్రపూర్ణాది బిరుదులనెన్నింటినో పొందితివి
చిన్ననాడె స్వర్ణపతకాలను పొందినావు
అపురూపమౌ కనకాభిషేక సత్కారం లభించింది నీకు
అక్షరమాలను పంచి అపరవాగ్దేవివై నిలచావు
దేశ విదేశాలలో నిల్పినావు నీ ఖ్యాతి, నీ దేశ కీర్తి
వైశ్యకుల మణిదీపమై నిలచావు
నీదైన అద్భుత వాక్పటిమతో చరిత్రపుటల కెక్కావు
ఓలలాడించావు పండిత పామరులను నీ అమృత వాక్సరసిలో
కారణ జన్మురాలవు నీవు, పుణ్య చరితవు నీవు
తల్లీ! లక్ష్మీకాన్తా! నీ జీవితం పరిపూర్ణం, చరితార్థం
నీ మరణవార్తతో శోకతప్తులయ్యాం మేమంతా
తరలి వెళ్లావు సుదూర తీరాలకు
పరమేశు ఒడిలోన సేద దీరుటకై పయనించావా తల్లీ!
నీలి నీలి గగనాన ధృవతారవై వెల్గొందుతున్నావు

నిలుస్తుంది ఎల్లపుడు అజరామరమైన నీ కీర్తి ఈ లోకాన
భగవానుడిచ్చు గాకనీ ఆత్మకుశాంతి
నడుస్తాము మేమంతా నిండైన నీ బాటలో
కోరుతున్నాము అందరం నీ ఆశీర్వాదాల్ని
దీవించవమ్మా లక్ష్మీకాన్తమణీ! నారీ శిరోమణీ
నాదైన ఈ కవిత నీకే అర్పితం.

# వివిధ ప్రాంతాల సంతాప తీర్మానాలు

## *సంతాప తీర్మానం*

ఆధునికాంధ్ర సాహిత్య వినీలాకాశములో ప్రజ్ఞాపాటవాలతో వెలుగుల వెదజల్లిన ఒక తార శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు. స్థిర చిర యశస్సంపన్నులు శ్రీ నాళం కృష్ణారావుగారి పుత్రికయై పుట్టి ఊటుకూరి వంశమున మెట్టి యెనలేని కీర్తిని సముపార్జించి రెండు వంశములను యశస్సంపన్నులగావించిన అసమాన శేముషీధురంధర. ఆంధ్రప్రదేశము నలుచెరగుల తన ఉపన్యాసఝరితో ఆంధ్ర సారస్వతలోకాన్ని ఆనందపారవశ్యములో నిండింపజేసిన సుప్రసిద్ధ సాహితీమూర్తి, సంగీత సాహిత్య కళానిధి, అపరవాగ్దేవి, కనకాభిషిక్త, సంఘసేవాపరాయణి, సాహితీ రుద్రమ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారు తేది 1-12-1996న పరమపదస్తులు గావటం తెలుగుజాతికి, తెలుగు సాహిత్యానికి తీరనిలోటు. వారి ఆత్మపరమాత్మలో సంలీనము కావాలని ఈ సభ తీర్మానించుచున్నది.

- బెజవాడ గోపాల రెడ్డి

## సంతాప ప్రకటన

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు పరమపదించిన వార్త విని, చదివి తెలుగు శాఖ, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తమ ప్రగాఢ సంతాపం ప్రకటించింది.

తెలుగు కవయిత్రులు, అఖిల భారత రచయిత్రుల మీద చక్కని విమర్శనాత్మక గ్రంథాలు ప్రచురించి, మంచి కవిత్వం రాసి, ఉత్తమ ఉపన్యాసాలు, గొప్ప రేడియో ప్రసంగాలు చేసి, ఆధునికాంధ్ర సాహిత్యంలో స్త్రీ ప్రాముఖ్యం, చైతన్యం విస్తృతంగా ప్రకటించిన విదుషీమణి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి మరణం వల్ల తెలుగు శాఖ తమ ప్రగాఢ సంతాపం తెలిపింది. రెండు నిమిషాలు ఆమె

ఆత్మశాంతికి మౌనంగా నివాళి ఘటించారు. ఆమె కుటుంబ సభ్యులకు తమ సంతాపం సానుభూతి తెలిపారు.

**ఆచార్య కొలకలూరి ఇనాక్**
శాఖాధ్యక్షులు - ఆంధ్రభారతి,
శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయము

# సంతాప తీర్మానం

విదుషీమణిగా, బహుగ్రంథకర్త్రిగా, సాహితీ రుద్రమగా, సహృదయురాలిగా విశిష్టమైన పేరు ప్రఖ్యాతులొంది సార్థక జీవనము గడిపిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి హఠాన్మృతి (1-12-1996) తెలిసి దిగ్భ్రాంతి నొందినాము వారి తండ్రిగారి సాహితీ వారసత్వం మెట్టినింటి ఔదార్యం వారిని సారస్వత నికేతనానకు మిక్కిలి సన్నిహిత మొనర్చినవి. వారి యశస్సు అజరామరం.

ఈ విషాద సమయాన సారస్వత నికేతనం శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి కుటుంబ సభ్యులకు తమ సానూభూతి, సంతాపాలు తెలియజేయుచున్నది. పరమేశ్వరుడామె ఆత్మకు శాశ్వతానందం ప్రసాదించు గాక!

**కె.వి.డి. మల్లికార్జునరావు**
అధ్యక్షులు
**ఆర్.వి.శేషగిరిరావు**
కార్యదర్శి
**కె. సుబ్రహ్మణ్యం**
గ్రంథపాలకులు

# మహాసభ తీర్మానం

ఖ్యాతిప్రపూర్ణ "సాహితీరుద్రమ" బిరుదాంకితురాలు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారు భౌతికంగా మనకిక లేరను వార్త దిగ్భ్రాంతిని కలిగించింది. అష్ట దశాబ్దాల కాలం వివిధ సాహిత్య ప్రక్రియలలో విశేష కృషిచేసి, అశేష కీర్తి గడించిన ఆమె ఎన్నో అవార్డులు, రివార్డులు అందుకొని సాహితీ ప్రపంచంలో చరిత్ర సృష్టించిన మహాకవయిత్రి. ఈమె గృహ లక్ష్మి కంకణ గ్రహీత, ప్రముఖ పారిశ్రామిక వేత్త, సాహితీ పోషకుడు కానంశెట్టి రాధాకృష్ణయ్య గారిచే కనకాభిషేకం గావించుకొన్న

ఈమె మరణంతో సాహితీ లోకం ఎంతో నష్టపోయినది. ఈ నెల 22వ తేదీన ఏలూరులోని 'గుప్తా ఫౌండేషన్' పురస్కారాన్ని అందుకోనున్న ఈమె కీర్తిశేషులవడం నిజంగా దురదృష్టకరం. వీరి సేవలు మననం చేస్తూ, వీరి ఆత్మకు శాంతి కలగాలని వాసవీ మాతను ప్రార్థిస్తూ రెండు నిమిషములు మౌనము వహించడమైనది.

- ఆర్యవైశ్య మహాసభ, హైదరాబాదు

## ఛాంబర్ ఆఫ్ కామర్స్ తీర్మానం

ప్రముఖ కవయిత్రి, గృహలక్ష్మి కంకణ గ్రహీత శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఆదివారం ఉదయం బాపట్లలో మృతి చెందినందుకు ది రాజమండ్రి ఛాంబర్ ఆఫ్ కామర్సు లిమిటెడ్ వారు తమ ప్రగాఢ సంతాపము తెలియచేసారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించడమైనది.

కొక్కిరాల సత్యసాయి కుమార్
గౌరవ కార్యదర్శి
రాజమండ్రి ఛాంబర్ ఆఫ్ కామర్స్.

## RESOLUTION

The Managing Committee of the Vysya Seva Sadanam in its Committee Meeting held on 11-12-1996 at Sadanam premises ananimously resoved to share the grief due to sudden death of Smt. Utukuri Lakshmikanthamma Garu who served as committee Member for several years.

The Committee also resolved to keep on record the excellent services rendered to the Institution for several years.

The Committee further resolved to send condolence message to the bereaved family and pray God "MAY HER SOLE REST IN PEASE"

T. HANUMANTARAO
Secretary
Vysya Seva Sadanam, Rajahmundry.

# సంతాప సందేశాలు, ప్రకటనలు

తెలుగు సాహిత్య రంగంలో విలువైన గ్రంథాల ద్వారా తమ రచనా ప్రతిభను చాటిన లక్ష్మీకాన్తమ్మగారు వారి కృతుల రూపంలో శాశ్వతంగా జీవిస్తారు. ఆమె స్మృతికి నా అక్షరాంజలి.

డా॥ సి. నారాయణరెడ్డి
అధ్యక్షులు, ఆంధ్రసారస్వత పరిషత్

జస్టిస్ ఆవుల సాంబశివరావు, హైదరాబాదు
శ్రీ కె. రోశయ్య, అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ, హైదరాబాదు.
డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ, మధుర
శ్రీ ఎం.ఎం. గుప్త, ఛైర్మన్, మడుపల్లి గ్రూపు, మద్రాసు.
డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి, తెనాలి.
శ్రీ ఐ. సదాశివగుప్త, ఛైర్మన్, వైశ్య బ్యాంకు లిమిటెడ్, బెంగుళూరు.
శ్రీ బి.సిహెచ్. వి. సుబ్బారావు, ఛైర్మన్, అశ్వని ప్రాడక్ట్సు, హైదరాబాదు.
శ్రీ పడుచూరి వెంకటేశ్వర్లు, అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ, హైదరాబాదు.
శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, విజయవాడ.
శ్రీ జి. నారాయణశెట్టి, మాజీ అధ్యక్షులు, వాసవి అకాడమీ ఆఫ్ ఎడ్యుకేషన్, హైదరాబాదు.
శ్రీమతి చిల్లర భవానీ దేవి, హైదరాబాదు.
శ్రీ బొండాడ రాధాకృష్ణగుప్త, పాలకొల్లు.
శ్రీ కె.సి. గుప్త, రాష్ట్ర ఆర్యవైశ్య సంస్థల సమాఖ్య, హైదరాబాదు.
శ్రీ పోతుకూచి సాంబశివరావు, సికింద్రాబాదు.
ఫెసర్ కె. మలయవాసిని, ఆంధ్ర విశ్వకళాపరిషత్, విశాఖ పట్నం.
కె. రామోహన్‌రాయ్, గుంటూరు.
శ్రీ డి. సుబ్బిరామిరెడ్డి, హైదరాబాదు.
శ్రీ ఎన్ కనకయ్య, చిలకలూరిపేట.
శ్రీ గెల్లి సత్యనారాయణమూర్తి, మచిలీపట్నం.
శ్రీ అమళ్ల దిన్నె గోపీనాథ్, అనంతపురం.

శ్రీమతి మల్లాది సుబ్బమ్మ, హైదరాబాదు.

శ్రీమతి ఎం. పద్మావతి, సికింద్రాబాదు.

శ్రీ ఎం. రామచంద్రరావు, చెన్నై.

శ్రీ వై. కృష్ణకుమార్, మచిలీపట్నం.

శ్రీ డా॥ సి.హెచ్. మార్కండేయ గుప్త, రాజమండ్రి.

శ్రీమతి ఆర్.కె. అనంతలక్ష్మి, ఏలూరు.

శ్రీ బి.ఆర్.సుబ్బారావు, హైదరాబాదు.

శ్రీమతి ఎం. మల్లికాంబ, నరసరావుపేట.

శ్రీమతి లింగమల్లు సావిత్రి, రాజమండ్రి.

శ్రీ సి.హెచ్. రామారావు, చీరాల.

శ్రీ కాకరపర్తి సాంబశివరావు, వేటపాలెం.

శ్రీ పి. శ్రీరామమూర్తి, తెనాలి.

శ్రీ కోడూరి బాలగంగాధరరావు, తెనాలి.

శ్రీ మద్ది రామకృష్ణ, గుంటూరు.

శ్రీ వి. సీతారామారావు, హైదరాబాదు.

శ్రీ పరుచూరి అచ్యుతరామ్, తెనాలి.

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ, పొన్నూరు.

శ్రీ డి. సుధాకర్, చెన్నై.

శ్రీ మున్నలూరి వి.ఎన్. బ్రహ్మానందం, గుడివాడ.

శ్రీ పి. బ్రహ్మానందం, గుంటూరు.

శ్రీమతి ఎన్. లక్ష్మీకాన్తమ్మ, చెన్నై.

శ్రీ టి.వి.ఎన్.ఆర్. ఆంజనేయులు, హైదరాబాదు.

శ్రీ టి. రాజగోపాల్, హైదరాబాదు.

శ్రీ టి. చంద్రమౌళి, హైదరాబాదు.

శ్రీ త్రిపురారిభట్ల చిరంజీవిశాస్త్రి, తెనాలి.

శ్రీ సి.హెచ్. సుబ్బారావు, ఏలూరు.

శ్రీమతి బి. వాసుమాంబ, మదనపల్లి.

శ్రీ టి. బి. జి. తిలక్, ఏలూరు.

శ్రీమతి ఎన్. కమల, మచిలీపట్నం.
శ్రీమతి ఎస్. మీనాక్షి, నరసరావుపేట.
శ్రీమతి ఎన్. త్రిపురసుందరి, ఏలూరు.
శ్రీ పాల్వాది హనుమంతరావు, వినుకొండ.
శ్రీ రమేష్ ప్రసాద్, ఏలూరు.
శ్రీ ఐ. వెంకటేశ్వరరావు
శ్రీమతి హైమ, సుధాకర్, విశాఖపట్నం.
డా. ఎల్. వెంకట రత్నం, హైదరాబాదు.
డా. వెలగా వెంకటప్పయ్య, తెనాలి.
శ్రీ కె.ఎస్.ఎన్. మూర్తి, విజయవాడ.
శ్రీ జి. వెంకటరావు, హైదరాబాదు.
శ్రీమతి టి. విజయలక్ష్మి, గురజాడ.
శ్రీ పి.ఎస్. కృష్ణమూర్తి, కాకినాడ.
శ్రీ నాళం లక్ష్మీకాంతం, రాజమండ్రి.
శ్రీ ఊటుకూరి ప్రభాకర్, చీరాల.
శ్రీ శ్యామసుందర్, విజయవాడ.
శ్రీ కె. జనార్ధనరావు, హైదరాబాదు.

## బాపట్ల ప్రముఖుల నివాళి

బాపట్ల ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు చీదెళ్ల సత్యనారాయణ, కార్యదర్శి కోళ్ళపూడి లక్ష్మీనారాయణ, ఆర్యవైశ్య యువజన సంఘం అధ్యక్షుడు శ్రీ కోళ్ళపూడి సురేష్ బూర్లె రామ సుబ్బారావు, రాష్ట్ర కౌన్సిల్ సభ్యుడు శ్రీ ఎస్.వి.ఆర్. కుమార్, వెంకట సాయి కిరాణా మర్చంట్ అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ కొత్తమాసు సత్యనారాయణ తదితరులు కళాభారతి కార్యదర్శి డాక్టర్ కె.వి.ఎస్. ఆచార్య, కె.ఎస్.టి. శాయి, దర్భా బాబూరావు, ఆకునూరి హసన్, ఎస్.వి. చలపతిరావు, మంతెన నరసింహమూర్తిరాజు, బిజెపి జిల్లా కోశాధికారి బూర్లె శివరామకృష్ణ లక్ష్మీకాంతమ్మ మృతిపట్ల సంతాపం ప్రకటించారు.

# స్త్రీ విద్యావశ్యకతను గుర్తెరిగి కృషిచేసిన లక్ష్మీకాన్తమ్మ

బాపట్ల, డిసెంబరు 2 (న్యూస్‌టుడే) : కవయిత్రిగా సాహితీరంగానికి విశిష్ట సేవలందించిన ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ స్త్రీ విద్యావంతురాలు కావాలని అయిదు దశాబ్దాల క్రితమే స్త్రీ హితైషిణి మండలిని స్థాపించి మహిళలను చైతన్యవంతులుగా చేసేందుకు కృషి చేశారని, ఆమె కృషి, ఆశయాలు నేటి విద్యార్థినులకు ఆదర్శం కావాలని ఆశయాలు నేటి విద్యార్థినులకు ఆదర్శం కావాలని బాపట్ల మహిళా డిగ్రీ కళాశాల పాలక వర్గ కార్యదర్శి డాక్టర్ ఎన్. కేశవమూర్తి అన్నారు. సోమవారం కళాశాలలో ప్రిన్సిపల్ వి.వి. సుబ్బయ్య అధ్యక్షత వహించారు. కళాశాల పాలక వర్గం అధ్యక్షుడు చీదెళ్ళ సత్యనారాయణ ప్రసగించారు. తదుపరి ఈ దిగువ తీర్మానం చేసి రెండు నిముషాలు మౌనం పాటించడమైనది.

## సంతాప తీర్మానం

డాక్టర్ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి కుటుంబ సభ్యులకు, మా కాలేజి పాలక వర్గసభ్యురాలు, ముఖ్యసలహాదారులు కళాశాల ప్రగతికి నిర్విరామ కృషిని సల్పిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి మృతి మమ్మల్ని కలవర పరచినది. శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి సేవలను స్మరించుకుంటూ వారి ఆత్మకు శాంతి కలగాలని భగవంతుని ప్రార్థిస్తూ మా ప్రగాడ సామనుభూతిని తెలియ చేస్తున్నాము. సంతాప సూచకంగా మా కళాశాలకు ఈ రోజు సెలవు ప్రకటించడ మైనది.

డా. ఎన్. కేశవమూర్తి
కార్యదర్శి
కన్యకాపరమేశ్వరి లక్ష్మీనారాయణ
ఎడ్యుకేషనల్ సొసైటీ

సభ ప్రెసిడెంట్‌గారైన డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఆకస్మికంగా స్వర్గస్థులై నందున, కార్యవర్గం తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియచేయుచూ వారి ఆత్మశాంతికి రెండు నిముషాలు మౌనం పాటించడమైనది.

డి. దక్షిణామూర్తి శాస్త్రి
ఉపాధ్యక్షులు, సంగీతసభ, బాపట్ల.

# మూడు వంశాలకు కీర్తి తెచ్చిన మహిళ

- జయం సుబ్రహ్మణ్యం శెట్టి
అధ్యక్షులు : ఆం. ప్ర. ఆర్యవైశ్య మహాసభ
హైదరాబాదు

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. మనిషి బాల్యంలో వికసించు సందర్భంలో సాహస విజ్ఞాన ధాతృత్వ లక్షణాలు గోచరిస్తాయి. స్త్రీగా పుట్టిన లక్ష్మీకాన్తమ్మగారు చిన్ననాడే గుర్రపు స్వారీ, కత్తిసాము అభ్యసించుటలోనే ప్రతిభ వ్యక్తమగుచున్నది. ఆర్య వైశ్యులలో గొప్ప ఖ్యాతిని ఆర్జించిన వారి మూడు వంశాలు నాళంవారి వంశానికి కోడలుగా వచ్చిన మోతే వారి ఆడపడుచుకు పుత్రికగా జన్మించి, ఊటుకూరివారి యింటికి కోడలుగా వచ్చి 3 వంశాల ప్రభావం సూర్యచంద్రులున్నంత కాలం ప్రకాశించుటకు కవయిత్రిగా శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి రచనలే ప్రత్యక్ష సాక్ష్యం.

ఆర్య వైశ్యులలో దిగ్గజాలైనటువంటి వీరేశలింగంగారి సమకాలీనుడైనటువంటి నాళం కృష్ణా రావు గారి తనయగా, రచయిత్రిగానే కాక సాహిత్య సంగీతాల అభిమానం ఉన్న మహా వనితగా ఎన్నో వేదికలలో పాల్గొని కవిత్వం, పాండిత్యం, రచనలలో ప్రధమ శ్రేణి స్త్రీగా గుర్తింపబడిన స్వర్గీయ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి ఆశీస్సులు పొందినప్పటి నుండి ఆమె అభిమానిగా ఎన్నో సందర్భాలలో ఆమెతో ఎన్నో విషయాలు తెలుసుకున్న నేను ఈ వర్ధంతి సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షునిగా పాల్గొనుట, సందేశం పంపుట నా పూర్వ జన్మ సుకృతంగా భావిస్తున్నాను.

# యువతకు ఆదర్శనీయురాలు

- బి.వి. రాధారమణ గుప్త
సాహితీ బంధు, కళాప్రియ, పాలకొల్లు

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ప్రతిపలుకూ వున్నమాట! ఆమె గద్దించి పలికితే ఉలిక్కిపడతారు ఎవరైనా - ఎందుకంటే ఆమెలో వున్న నిజాయితీ అలాంటిది. వైశ్యజాతికి వన్నెతెచ్చి వీరవనిత, ధీరచరిత! కవితల్లో చూపిన చాకచక్యం, చక్కని పదాల అల్లికలో, పద్యరచనల్లో తనకి తానే సాటి, విదుషీమణి, విద్వత్కావిరేణి - మకుటం కోరని మహారాణి. ఆంధ్ర మహిళా ఉద్యమాలకి ఆమె ఊపిరిపోసి, ఉత్సాహం నింపి సాహిత్యపరంగా ప్రాణప్రదమైన రచనల్ని ఉపన్యాసాలుగా పుంఖాను పుంఖాలుగా కొనసాగించిన ధీశాలిని.

ఈనాడు ఆమె లేనిలోటు తీరేది కాదు గాని ఆ వరవడిని యువతకి వారసత్వంగా ఇచ్చి జాగృతం చేసిన జాడ నేడు నిండుగా కన్పిస్తుంది.

# భాగము - 5



డా॥ లక్ష్మీకాన్తమ్మగారి కొన్ని
ముద్రిత ఆణిముత్యాలు
- గోదాదేవి భక్తి సౌరభం
- రామాయణంలో నారీ చిత్రణ
- ప్రాచ్యవాఙ్మయంలో
  నాయికా చిత్రణ
- సంస్కృత - మహిళాకృషి ఇత్యాది



సాహితీరుద్రమ - ఆవిష్కరణ సభలో డాక్టరు లక్ష్మీకాన్తమ్మ, చీరాల 1994

# గోదా దేవి భక్తి సౌరభము

ఉల్లము పల్లవింప నయనోత్పలముల్ రహిచెమ్మగిల్లప్రీ
త్పుల్ల సి తమ్ముమే సుమధురోక్తుల వెన్నుని బాడిపాడితా
పల్లవపాణి 'గోద' హరిభక్తి సువాసిత పుష్పమాలగా
నుల్లసిలంగజేసె రుచిరోన్నత సంస్కృతి స్థాపిత స్థలిన్॥

శ్రీపతిమీది కూర్మిమెయిచేతము ప్పొంగగ ప్రేమ భక్తియు
ద్దీపన మొందగా కవిత దీరిచి ముప్పది పాశురంబులా
లాపన మీర భూనభములం దనుతాపము పాసమారగా
గోపిక యౌను పాడెమును గోద జగమ్ములు పుల్కరింపగా॥

పుట్టగానే పరిమళించిన పవిత్ర పుష్పమాలిక, గోదా దేవి! ఈ పుష్పమాలిక నలుదెసలా వ్యాపింపజేసిన భక్తి గేయ సౌరభం అనన్యం! తమిళవాఙ్మయ ప్రాభవ సౌందర్యశోభకు పుష్టి గూర్చిన ఈ కావ్యమాలికల రమణీయ యశశ్చంద్రికలు విరజిమ్మిన కాంతిపుంజం శాశ్వతమై. భారతీయాధ్యాత్మిక శక్తికి స్థిరమైన పునాదులనేర్పఱచింది. శ్రీ మహా విష్ణువును గాన సంకీర్తనతో సంప్రీతుణ్ణి చేసి జగతియందలి మానవులకూ దివ్యత్వాన్నీ అమృతత్వాన్నీ లభింపచేయ్యాలనే పవిత్ర సంకల్పంతో భూదేవి మహాభక్తుడైన విష్ణుచిత్తునకు తులసీ వనభూమిలో బిడ్డగా దొరికింది. "ఇతఃపురా పఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధుడూ, ఆ రామక్ష్మాఖనన క్రియా ఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ స్తోమాస్నిగ్ధ కరుడూ అయి, దేవ! "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహనమో" మాత్రమే తెలిసిన అమాయిక సాత్విక భక్త శిఖామణి, విష్ణుచిత్తుడు, అపూర్వ సౌందర్యరాశిని, సౌభాగ్య శ్రీలు కురింపచే ఆ ముద్దు బిడ్డను ఆండాళ్ దేవిని ఇంటికి తీసికొని పోగా ఆ దంపతులు పేదకు దొఱకిన పెన్నిధిగా ఆ అందాల భరిణెను కోద్తై అని ముద్దుగా పేరు పెట్టి గారాబంగా పెంచుకున్నారు.

మహాభక్తుడైన విష్ణుచిత్తుడు నిస్సంతు. తాను తన చేతులతో నీరుపోసి, పాదుత్రవ్వి స్వయంగా పెంచిన తన ఇంటి పెరటి తోటలోని సుందరతులసీ పుష్పాలతో మాలలు కట్టి తన స్వస్థానమైన శ్రీవిల్లి పుత్తూరులోని వటపత్రశాయి స్వామికి మాలా కైంకర్యంచేయడం తప్ప వేరేపని లేని ఆ లౌకిక తపస్వి! తండ్రి కట్టిన పూల దండలను గోదాదేవి (కోద్తై అనియేకాక గోదా అని కూడా ఆమెకు నామాంతరం కలదు. తండ్రికి

తెలియకుండా నిత్యమూ ఒక మాఱుతనసిగలో సింగారించుకొని, తోటలోని నూతిలో తన చెలువము చూచుకొని మఱల పూజా పాత్రలో ఏమీ ఎఱుగనట్లు పెట్టేసేది. ఏ మాత్రం ఈ విషయం తెలియని విష్ణుచిత్తుడు పాపం ఆదండలనే తీసికొనివెళ్లి స్వామికి అలంకార నివేదన చేసేవాడు.

ఒకనాడు తన కుమార్తె స్వామి మాలలను అలంకరించుకొని ఉండగా విష్ణుచిత్తుడు చూడడమూ, అది భగవదపచారంగా భావించి, తన బిడ్డను మందలించి ఆనాడు స్వామికి మాలలను నివేదించకపోవడమూ జరిగింది. కాని ఆ రాత్రి స్వామి విష్ణుచిత్తుని కలలో కన్పడి ఆ బాలిక అనుభవించి విడిచిన ఆముక్త మాల్యద మాల్యమే తనకు అత్యంత ప్రీతికరమనీ, ఆ బాలిక తలలో ముడువని పూలను తాను ఒల్లననీ చెప్పివేశాడు. ఇట్లా పుట్టుకతోనే భక్తి సౌరభాలు వెదజల్లుతూ పరిమళించిన గోదాదేవి, చిన్ననాట నుండీ రంగేశునే నిజేశునిగా భావించి ఆ మధుర భావభక్తి పారవశ్యంతోనే శుక్లపక్షచంద్రికవలె దినదినాభివృద్ధిని పొందుతూ ఎలజవ్వని అయింది.

జవ్వని అయిన గోదాదేవికి వయస్సుతో బాటు శ్రీరంగ భర్తపై వలపు కూడా అతిశయింపజొచ్చినది. నాటి నాటికీ అగ్గలమయ్యే ఆ ప్రేమ తాపాన్ని భరింప లేక గోదాదేవి విలవిలలాడిపోయినది. ఆమె ఆ విరహతాపంలోని సౌకుమార్యాన్ని రసరాట్టైన శ్రీకృష్ణ దేవరాయ ప్రభువు చాలా రుచిరంగా వర్ణించియున్నాడు.

> 'శ్రీపతి మీది గీతముల, బ్రేమ విపంచిక నంట బాణిసం
> తాపము సోకిమెట్ల మయినంబు గరంగిన డించి పాడు - నా
> లాపిని! దాల్చి, పెన్జిమటలన్మఱి తంత్రులు జజ్జ్వగాగలా
> లాపిని దాన పాడును. గళంబును గద్గదమైన మ్రాన్పడున్!!
> అట ఆ సుకుమారి విరహతాపం ఇంత అతిశయమైనది.

అట్లాంటి అతిశయ విరహావస్థలో తన స్వామి పొందు కొఱకు సాధనాంతరాలను రోయు గోదాదేవికి, ద్వాపర యుగంలో శ్రీకృష్ణుని పొందడానికి గోపికలు నిష్ఠతో ఆచరించిన మార్గళి నోము పరమాచరణీయంగా కనబడింది.

అంతట గోదా ఆ మార్గళి నోము పట్టితానే గోపికయై మధుర భావభక్తి పారవశ్యంతో మార్గశిరమాసం ముప్పదిరోజులలో ఆ నోముకు సంబంధించిన పాటలను రోజు కొక్కొక్కటి చొప్పున ముప్పది పాటలను కమనీయ కవితా ఝురిగా, శృంగార రసధునిగా సంకల్పించి పాడింది. తమిళ భాషలో 'పావు' అంటే పాట. ఇది శ్రీ కరమైన పాట కాబట్టి 'తిరుప్పావు' అని దీనికి పేరు. ఈ తిరుప్పావు దివ్య ప్రబంధమై ద్రావిడ వేదమనబడే "దివ్య ప్రబంధాలలోని ముదలాయిరములలో జేరినది. ఈమె

తన అపారమైన భక్తి ప్రాబల్యం చేతను, అఖండమైన భగవదనుభవ సామర్థ్యం చేతనే ఈమె మహావైష్ణవ స్వాములైన పన్నిద్ద ఱాళ్వారులలో చేరినది. చెప్పనలవికాని సుకుమార కవితా శిల్పమూ, భావసౌ మనస్యమూకల ఈ తిరుప్పావు దివ్య ప్రబంధము భారతీయ సాహిత్యంలో ఒక ఉత్తమ గ్రంథం కావడానికి, ఈ కావ్యంలోని విశ్వశ్రేయస్సాధనా చింతనమూ, మధుర మంజుల భావపుష్టి మనోహరకవితాశిల్పమూ అకలంక భగవదభిరతి కారణాలుగా కన్పడుతున్నాయి.

గోదాదేవి లేక ఆండాళ్లు రచించిన ఈ తిరుప్పావు, ఆ కృష్ణుని వాల్లభ్యం కోరి గోపికలు చేసిన మార్గం నోముకు సంబంధించినది. మొట్టమొదట ఈ వ్రతమునకు ప్రథమాంగమైన స్నానము కొఱకై గోపికలు ఒక్కొక్కరిని మేల్కొలుపుకుంటూ, పిలుచుకొంటూ వెళ్లడంతో ఈ తిర్పావు ప్రబంధం ప్రారంభమౌతుంది.

ఇందు మొదటి "మార్గళిత్తిజ్జళ్ మదిని త్రైన్ద సన్నాళాల్" అనే పాశురంలో "తల్లి యశోదా దేవికి సింగపు గొదమవలెముద్దు మురిపెములు దీర్పు, వాడియైన యీటెను ధరించిన నందకుమారగోపుడు మన నోమునకు వలసిన సౌకర్యములను చేయును" అని చెప్పుటలోను, "యశోదై ఇళశ్శింగమైన నంద గోపకు మారుని దివ్య సౌందర్యమును గాన మొనర్చుటలోను ఈ వ్రతము ఔన్నత్యము, వ్రతముచేయ వారి అభీష్టము, అందలి వారి మధుర భక్తి రూపమైన పరమార్థము అన్నింటిని గోదాదేవి చాలా మనోహరముగా సుకుమారధ్వనితో ఉపలక్షింప చేసినది. తరువాత "ఓఙ్గియులగోళన్ద ఉత్తమన్ పేర్పాడి" అనే పాశురంలో వ్రతాంగమైన స్నానక్రియచే లోకమునకు కల్గు మేళ్లను ఆమె స్పష్టముగా అభివర్ణించినది.

పండివంగిన యెఱ్ఱవరి మళ్లలో పొర్లాడే చేపలు, కలువ కన్నెలో నిశ్చింతగా నిదురించే తుమ్మెదలు, గోపికలకుండలకు మిగులు క్షీరధారలను గురిసే ధేనువులూ స్నాన ప్రయోజనంగా సిద్ధించే శ్రేయః ప్రయోజనాలని పాశురంలో గోదాదేవి వర్ణించిన తీరు ఎంతలలితంగా ఉన్నదో అంత సంపుష్టమైన విశ్వ శ్రేయోభావనతో నిండి వున్నది. శ్రీమద్రామానుజ జయంతికి పరమ ప్రీతి కరమైన "ఉన్దుమణుగళిర్" అనే పద్దె న్మిదవపాశురంలో 'నప్పిన్నపిరాట్టి' (నీళాదేవి) మేల్కొలిపే, పాశురమూ నంద గోపకుమారుని శరీర సౌభాగ్య శ్రీని వర్ణించి తమ్ముదయతోచూడు మని ప్రార్థించు 23, 24 పాశురములు, ఏమీ తెలియని తమ్ము (గోపికలను) ఏలుకొమ్మని సర్వసమర్పణ భావంతో ప్రార్థించే "కణవైగళ్లుపిన్ శెన్దు" అనే 28వ పాశురము మృదులమైన శయ్యా పరిపాకంతో, ప్రసన్నమైన శైలితో, రుచిరమైన భావార్థంతో తమిళ మహాసారస్వత పరిష్కియాయోగ్యములై అఖిల భారత సారస్వత

మహనీయతను వేనోళ్ల చాటుతూ ఉన్నవి.

ఇందు గోపకిశోరగత భావన కలగోపికలు నందబాలుని కొఱకు వ్రతం చేయడం, దానికి యశోదాసింగమైన పురుషవరేణ్యుడు రక్షకుడైయుండి కావలసిన ఉపకరణ సౌకర్యాలనుకూర్చడం, వ్రతంలో గోపికలు సర్వసమర్పణ భావంతో ఆ లీలామానుష దివ్య సుందరుణ్ణి వేడుకోవడం అన్నీ భగవత్పరములే.

యజ్ఞము, యజ్ఞసాధనము, యజ్ఞాంగము, యజ్ఞపురుషుడూ, యజ్ఞదేయము, యజ్ఞ ప్రయోజనము, చివఱకు యజ్ఞకర్తా, యజ్ఞభోక్తా తానే అయి ఆ పరమ పురుషుడే ఆ గోపికా మహాయజ్ఞాన్ని నిర్వహిస్తూంటే లోకంలో శోభన సమృద్ధి వర్షించక ఇంకొక విధం ఎట్లాన గూడు తుంది?

గోదా మహాదేవి జన్మించి ఎన్నివందల సంవత్సరాలైనదో ఆ మహానుభావురాలి లలిత మధుర భక్త్యారాధనతో గూడిన విశ్వ కళ్యాణ సందేశం ఆమె పేరుకు తగ్గట్టు నిత్య సౌరభాలను విరజిమ్ముతూ భారతీయ సాహిత్యాన్నే శాశ్వతంగా సుమాళింపజేస్తూ ఉంది. ఇంత మహోన్నత సాహిత్య ప్రయోజనాన్ని లలిత చయనంగా, మధుర మార్గంలో శివేతరక్షతి ఫలోద్దేశంతో నిర్వహించిన గోదాదేవి నిజంగా మనకు ఆరాధ్యురాలు:

ప్రేమ పారవశ్యమ్మున స్వామి గొలిచి
భద్రచయనమౌ "తిర్పావు" పాడినట్టి
భక్తి తన్మయ, సుమధుర భావ లలిత
ధన్య గోదామహాదేవి ధరణి బ్రోచు॥

# రామాయణంలో తండ్రి ప్రేమ

ప్రేమ పరమ పవిత్రమైనది. ప్రేమచేతనే విశ్వమంతా నిత్యకళ్యాణ శోభామయమై విలసిల్లుతూ ఉన్నది. పరమపితయైన భగవానుని "ప్రియమిత్యుపాసీత". ప్రియునిగా భావించి అనగా ప్రేమ స్వరూపునిగా భావించి ఉపాసింతురుగాక అని శ్రుతి నినదించు చున్నది.,

ప్రేమ ఎప్పుడూ ఒండొరులను బంధించునది. కావుననే ప్రేమ వికాసము సంపూర్ణముగా విలసిల్లిన చోటులలో భేదభావము, భిన్నత్వము, వ్యతిరేకత, విరోధ భావము, వైముఖ్యము, అసహనము. మున్నగు జగదశాంతి లక్షణముల ప్రకోపమునకు అవకాశము వాటిల్లదు. ఈయర్థము సంపూర్ణముగా వివరింప జేయుటకే శ్రుతి పరమేశ్వరుని "ససేతుర్విదధేలోకానామసంభేదాయ" అని ఊది ఊది పల్కినది. అతడు పరమ కళ్యాణ ప్రేమ స్వరూపుడైన ఆ పరమాత్మ లోకముల అసంభేద స్థితి కొఱకు అనగా లోకములు పరస్పర ప్రేమాకృష్టములై శోభనస్థితిలో ప్రవృద్ధములగుట కొరకు సేతురూపియై యుండెను అని కీర్తించినది.

పవిత్ర భారతీయ సంస్కృతియందు ప్రేమకింత మహదర్థము కలదు. ప్రేమా కృష్టతయే సహజ ధర్మముగా గల సృష్టిలో, సృష్టికి సంపుష్టిని కూర్చు జగతీ వ్యాపారములో కణవిచ్ఛేదన మొనర్చు, లోహకారులు మొదలైన వృత్త్యా జీవనులను శాస్త్రకారులు వెలివైచిరట.

కర్మధర్మ పరాయణమైన భారతీయ సంస్కృతిలో మానవుడు చరితార్థత పొందుటకై పరమ కర్తవ్యముగా విధింపబడిన చతుర్విధ పురుషార్థసాధనలో తురీయమైన ముక్తావస్థ ఒకటే ఒకయెత్తు : మిగిలిన మొదటి ధర్మార్థకామములు మూడు ఒకయెత్తు.

జగన్నాటక నిర్వహణకు ముఖ్యసాధనము లైన ధర్మార్థకామములలో ప్రేమకు ఆలంబన మైన కామమే ప్రధానమైనది. కామము పవిత్రప్రేమగా పరిణమించినపుడే పరమేశ్వర సంకల్పమైన సృష్టి నిర్విక్రముగా సాగిపోగలదు.

సృష్టి నిర్వహణమున ఇంత ప్రధాన పాత్ర నిర్వహించిన ప్రేమ బహుముఖమైనది. పితృపుత్ర భావమునందు మొలకెత్తి సఖ్య: దాస్య, బంధుత్వాది భావములలో కొనలుసాగి పుష్పించి భగవానుని సృష్టి సామ్రాజ్యంలో దట్టంగా అల్లుకొని జగతికి పందిళ్లు గప్పిన ఈ ప్రేమ భార్యా భర్తృత్వంలో ఫలించి సంపూర్ణత్వాన్ని పొందుతుంది.

తండ్రి బిడ్డల మధ్యన ఉండే ప్రేమకు గల్గిన ఒరపిడియే భారతీయ సాహిత్యంలో రామాయణంగా సాక్షాత్కరించింది. దశరథ రామచంద్రుల పరస్పర ప్రేమ సౌందర్యమే రామాయణ మహాకావ్యమని ఇంకొక విధంగా వాకొన వచ్చును. రామాయణంలోని

తండ్రి ప్రేమ అనే ఈ ప్రసంగమకుటానికి విశాలార్థం ఇస్తే భారతీయుల ఆదర్శ ధార్మిక కావ్యమైన రామాయణంలో ఈ తండ్రి ప్రేమ సంఘటనావశంగా వివిధ రీతుల్లో ప్రదర్శింపబడినట్లు మనం తెలుసుకోగల్గుతాము.

దశరధుడు అడవికి వేటకు వెళ్లినపుడు శబ్దభేది అస్త్రంతో అంధదంపతుల కుమారుడైన శ్రావణకుని పొరపాటున నిహతుని చేసినపుడు ఆ శ్రావణకుడు తలిదండ్రులపట్ల ఆ ఆంధ దంపతుల కుమారుడైన శ్రావణకుని పట్ల కనబరచిన అకల్మష ప్రేమాను రాగములు రామాయణంలో తండ్రి ప్రేమకు మొదటి తార్కాణం.

తరువాత విభాండక ఋష్య శృంగుల నడుమగల అతిలోకమైన పితృప్రేమ రెండవ సంఘటన. ఇక జగదాదర్శమైన మహత్తరమైన బృహత్తర పితృప్రేమ ధశరధరామ చంద్రుల ప్రేమ.

ఈ సందర్భంగా వాకొనదగిన ఇంకొక సంఘటన రావణేశ్వరమేఘనాధులప్రేమ. ఏ తండ్రికైనను బిడ్డలయందలి ప్రేమ అకలుషవాత్సల్యాను రాగములతో కూడినదే. కాని పై నాలుగు సంఘటనల యందలి తండ్రి ప్రేమలలో కొన్ని భేదములను మనము చూడగలము.

అంధులగు తల్లిదండ్రులను కాశీయాత్రకు తీసికొని పోవుచు అయోధ్య సమీపా రణ్యములలో దశరథబాణ కర్మితుడై మృతి చెందిన తమయేకైక పుత్రుడైన శ్రావణ కుమారుని తలచుకొని దీన పరిదేవనముగా వావిడిచి ఏడ్చిన ఆ ఆంధ దంపతుల ప్రేమ చాలా దయనీయమైనది.

చూడండి పాపం! ఆ ప్రియపుత్రుని మృత కళేబరమును తడివి తడివి ఆ తండ్రి ఏవిధంగా అల్లాడి పోయాడో॥ నాభివాదయసేమాద్యనచమామభి భాషణే၊ కింను శేషేతు భూ మౌత్వం వత్సకింకుపితొహ్యాసి ॥ నత్వహంతే ప్రియః, పుత్ర మాతరం పశ్యధార్మిక၊ కింనునాలింగనేసుకుమార వచోవద၊..... కోమాంసంధ్యాముపాస్యై వస్నాత్వాహుత హుతాశనః ..... కందమూల ఫలం హృత్వా కోమాంప్రియమివాతిథిమ్၊ భోజయిష్యతి ....... ॥ నా తండ్రీ ఏమిరా నాతో మాట్లాడవేమి? ఎందుకురా నా చిట్టి తండ్రీ మాపై అలిగితివా? నీకు మేము ప్రియతములము కామా? పోనీ నీతల్లిని చూచైనా కొంచెం మాతో పలుకుబాబూ. ఇక మాచే సంధ్యోపాసన నెవరు చేయెంచెదరు? మాకు నీరాడించి అగ్నికార్యము చేయించు వారెవరు? కందమూలములను తెచ్చి అతిధికి వలెమమ్మాదరించి మాచేతినిపించువారెవరు? అని యీ విధంగా వాపోయాడు. ఆ అభాగ్యుడు అన్ని విధములా తమకు ఆధారమైన ఆ ఏకైక పుత్రుని మరణంతో వారి ప్రాణాలే తోడుకుని పోయాయి. వారి స్థితి తలచుకొంటే మనకు కూడా గుండె బ్రద్దలై పోతుంది.

ఇక ఋషిపుంగవుడైన విభాండకునకు తన కుమారుడైన ఋష్యశృంగుని పై గల ప్రేమ కేవలము అలౌకికము. తాపసులైన తమకు లోక స్పర్శ ప్రమాదకారియని యా ముని చంద్రుడు తనకుమారుని కేవలము లౌకికముగా పెంచినాడు. తుదకాతడు తనకు తెలియని పరిస్థితులలో కొనిపోబడి అంగరాజైన రోమపాదుని కుమార్తైను శాంతను పెండ్లి యాడగా ఆ పరిస్థితులకు ఆయన సర్దుకొని మిన్నకుండెను. ప్రజ్ఞా వంతుడైన ఆ మహర్షి ప్రదర్శించిన తండ్రి ప్రేమ కూడా ప్రజ్ఞామార్గంలోనే నడిచింది.

భారతీయ సంస్కృతిలో తల్లిదండ్రుల ముప్పు గడిపే తెప్ప పుత్రుడు। పున్నామ నరకాన్ని తప్పించి శాశ్వత పుణ్యాలోకావాసప్రాప్తి కల్గించేవాడు పుత్రుడే। అంతేకాదు "ఆత్మావైపుత్రనామాసి" అనేసూక్తి ప్రత్యక్షరసత్యంగా తండ్రి తన ప్రేమాంకురమైన తనను చూచుకొని సంతృప్తి పడతాడు!

తండ్రి ఆశలూ, ఆశయాలూ తీరేది సంతతి వలననే అవధులులేని తండ్రి ప్రేమలో పుత్రుని నుండి పరాజయాన్ని స్వీకరించడం కూడా తండ్రికి సంతోష కారణమే. కేవల సంతోష కారణమే కాదు! గర్వకారణం కూడా దాంపత్య ప్రేమలో స్వార్థమూ, స్వప్రయోజనమూ ఉంటే ఉండవచ్చు. కాని తండ్రిప్రేమ కేవలమూ అవ్యాజమైనది. తన సంతతి తనకు శత్రువులుగా ఉన్నా బిడ్డలపై తండ్రి ప్రదర్శించే ప్రేమకు మాత్రం ఏమీ అపాయం ఉండదు. తనకంటే ఎక్కువగా లోకంలో ఎవరిని ప్రేమించగలరు? అని ప్రశ్నిస్తే వచ్చే సమాధానం ఒక్కటే తండ్రి తన బిడ్డలను తన కంటే ఎక్కువగా ప్రేమిస్తాడు. అని అయితే బిడ్డలు తల్లిదండ్రులను ఆ విధంగా ప్రేమించకపోవచ్చు. బిడ్డలు తల్లిదండ్రుల విషయంలో అన్యధాగా ప్రవర్తించి నందుకు లోకంలో, కావ్యలోకంలో ఉదాహరణలు దొరకవచ్చు. కానీ తండ్రి తన ప్రేమను బిడ్డల విషయం అన్యధామార్గంలో ప్రసరింపజేశాడనడానికి ఎక్కడా మనకు ఆధారం లభించదు!

మన భారతీయ గృహస్థ జీవనానికి పరమాదర్శమైన రామాయణ మహాకావ్యంలో మాత్రం తండ్రీ కొడుకు లిద్దరూ "ప్రేమ ప్రేమకోసమే" అనే మహత్తర సందేశాన్ని చాటడంకోసమే అన్నట్లు సర్వత్యాగాలు చేసి విశాల వసుంధరా హృదయాకాశంలో ఆరని, పితృ ప్రేమే వెల్గించి ప్రాచీన భారతీయ పవిత్ర సంస్కృతికి తనివారని దివ్య హారతులను పట్టారు!

ఆ ఏకైక నిదర్శనమే దశరథ రామచంద్రుల పవిత్ర ప్రణయం!

తనకు పుత్ర సంతతి లేదని రాచకార్యాలపై పరమోదాసీనత వహించి, అత్యంత ప్రేమ పాత్రురాండ్రైన భార్యల పట్లకూడా విరక్తుడైన దశరథ మహారాజునకు అనేక జన్మ సంచిత పుణ్యఫలమట్లు నల్గురు కుమారులు దయించారు. ఇక అతని ఆనందానికి హద్దులుండవనే విషయంలో ఎవరికీ సందేహం ఉండదు కదా!

ఆ మహారాజు ఆ కన్నుల చందమామలను ఒక్కక్షణం కూడా విడిచి ఉండలేక పోయేవాడనే అంశాన్ని రామాయణ కావ్యం అనుపదంలోనూ స్పష్టం చేసింది.

దశరథునకు పుత్రులపై గల ప్రేమ ప్రగాఢత చాలా అతీయమైనది. లేక లేక కలిగినా ఆయనకు కల్గింది ఒకడుకాదు నల్గురు. నల్గురిలో ఒకరు లేక పోయినా ఇంకొకరిని చూచుకొని ఆయన కొంత ఊరట పడవచ్చు. కాని ఆ మహారాజు అన్ని విధాలా కల్గిన ఆ గృహస్థు తన మహాభాగ్యం కంటే మహాద్భాగ్యంగా నల్గురు కొడుకులనూ నాలుగు కండ్లుగా చూచుకొన్నాడు. అందులో సకల గుణాభిరాముడైన కళ్యాణ రాముని విషయంలో ఆయన ప్రేమ మరీ అతిమాత్రమైనది. విశ్వామిత్రయాగాది అనేక ఘట్టాలలో ఎటువంటి సంకోచవ్యాకోచాలూ లేకుండా ప్రదర్శించేఉన్నాడు.

ఇంక శ్రీరామచంద్రుని అరణ్యవాస సందర్భ సంఘటన దశరథుని తండ్రి ప్రేమకు గీటురాయి. మానవుని సకామప్రేమకు ఆలంబనమైనది. దాంపత్యప్రేమ అట్టి భార్యా ప్రేమను దశరధుడు తన ముద్దుల భార్యయైన కైకేయిలో కేంద్రీకృతం చేశాడు. అంత ప్రియతమురాలైన భార్య కంటే కూడా ఆయనకు పెద్దకుమారుడైన శ్రీరామ చంద్రుడే చాలా ఎక్కువ ఆ విషయాన్నే ఆయన అలిగి కోపగృహంచేరిన కైకేయిని బుజ్జగించే సందర్భంలో "అవలిప్తే, నజనాసిత్వత్తః ప్రియతమా మమ, మనుజోమనుజ వ్యాఘ్రాద్రామాదన్యోన విద్యతే తేనాజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా, శపేతే జీవనార్హేణ బ్రూహియన్మన సేవ్యసి॥ యన్ముహూర్తమ వశ్యంస్తునజీ వేయ హింధ్రు వమ్। తేనరామేణ కైకేయీ శపేతే వచన క్రియామ్।

ఓ మూర్ఖులారా, కైకేయీ నీకంటె ప్రియతములు నాకు లేరన్న సంగతీ నీవు తెలుసుకో లేకుండా ఉన్నావు. మనుజులలో శ్రేష్ఠుడై, ఒక్క క్షణం కూడా నేను విడచి ఉండలే నంతగా నాకు ప్రియతముడైన రామచంద్రుని మీద ఒట్టు పెట్టి చెప్తూ ఉన్నాను. నీ అభిమతం ఏమిటో చెప్పు తీరుస్తాను॥ అంటాడు. ఇది అక్షరాల నిజం. కాని ఒక విధంగా మాత్రమే ప్రియురాలైన కైక అభీష్టం తీర్చడానికి అంతకంటే ప్రియతముడైన కొడుకును శాశ్వతంగా వదులుకోవలసి వస్తుందని పాపం ఆ మహారాజు తెలుసుకోలేక పై విధంగా ఒట్టుపెట్టాడు! నిజంగా ఈ విషయంలో కైక కాదు మూర్ఖురాలు! దశరధుడే మూర్ఖుడు!

ఇప్పుడామె ఇంకా ఎన్నో సూర్యచంద్రాది సాక్ష్యాలను గట్టిగా బల్లగుద్ది జ్ఞాపకంచేసి "నవపంచవర్షములు చీరాడి నజటాధారియై రాముడు దండకారణ్యాన్ని ఆశ్రయించి ఉండాలి. భరతుడు అకంటకమైన యౌవరాజ్యాన్ని పొందాలి అనే తనమనోవాంఛి తాన్ని బయట పెట్టింది. ఆ వెంటనే దశరథుని దృష్టికి కైక ఆడపులి వలెనూ, తాను ఆ ఆడపులికి బలికాబోయేమృగం వలెనూ కనబడ్డారు. దశరధునికి బిడ్డడైన రామచంద్రునిపై కల అత్యంత ప్రగాఢ ప్రేమ ప్రభావమే ఇదంతా.

ఆడి తప్పుట యెరుగని దశరథ మహారాజు తన అన్నమాట నిలుపుకొనే నిమిత్తం కన్న కొడుకైన శ్రీరామచంద్రుని పరిత్యజించడానికి - అందులోనూ పద్నాలుగు సం॥లు

మాత్రమే పడినబాధను వాల్మీకి మహర్షి 80 సర్గల్లో వర్ణించాడు. కైకేయీ వచనం వినగానే ఆయభాగ్యుడు మూర్ఛితుడైనాడు. మూర్ఛ నుండి తేరుకోగానే కైకేయిని చక్షువులతో దహించి వేసేటట్లుచూచి ఓ రాక్షసీ, కులఘాతకీ అని మొదలు పెట్టి దులిపేశాడు. తరువాత "ఓ కైకేయీ నీకు అంజలించి నివేదించు కొంటాను నీపాదాలు పట్టుకొంటాను. నీవు ఈ వరం విడిచి ఇంకోటి కోరుకో అనే ఉన్మత్త స్థితికి వచ్చాడు. పాపం ఎంతదయనీయమైన పరిస్థితిలో పెట్టిందో ఆ అనుబంధం చూడండి శోకార్ణవానికి పారం చూడలేక సమభిప్లుతుడై, ఘూర్ణిస్తూ - అంటే రోజుతూ మాటికి మూర్ఛాభి గతుడైనాడట ఆయన. "మృతేమయి, గతేరామే వనం మనుజ పుంగవే, ఇష్టే, మమజనే శేషే కింపాపం ప్రతిపత్స్యసే" రాముడడవికి వెళ్లడమే సంభవిస్తే నా మరణం తథ్యం అది కూడా నీకిష్టమైనా ఆ సందర్భంలో నీకేమి మిగుల్తుంది? నీకు దీని వలన కలిగేది పాపమేకాదా। అది భరించడానికి కూడా నీవుసిద్ధపడ్డావా? హే పాపిన్ కైకేయీ ఎంత సాహసురాలవు। ఎంతదురాగతానికి తలపడ్డావు? అని ఫలవించి పలవించి ధూళిలో పొర్లాడాడట ఆ మహారాజు। తుదుకు రామపరిత్యాగం వలన ఆయనకు సంభవించింది కూడా రామ రామ అంటూ రామనామస్మరణతోడి మరణమే. అంత అనన్యమైన ప్రేమను ప్రదర్శించిన మహానుభావుడు దశరధుడు! ఇందులో వెదకి చూచినా ఇంకొక లాభాపేక్ష ఏమీకానరాదు! పరస్పరాశ్రయమైన ప్రేమ వివశతకూ, ప్రేమ భగ్న స్థితిలో విరహానికి జాతిమత వివక్షత లేదు కదా! త్రిలోకాలనూ జయించిన రావణ బ్రహ్మ తానుదుష్ట రాక్షసుడే కావచ్చును. తన కుమారుడు రాక్షసుడు కావచ్చును. గాదిలి సుతుడైన ఇంద్రజిత్తు యుద్ధభూమిలో ఒరిగినపుడు అంత మహాసత్త్వుడైన రావణుడు దుఃఖావేగంతో వివశుడైపోయి విలవిలా తన్నుకున్నాడు 'సతంప్రతిభయంశ్రుత్వావధం పుత్రస్య దారుణమ్! ఘోర మింద్రజిత స్సంఖ్యేకశ్మలం చావిశన్మహత్' ముద్దుల కొడుకు మరణవార్తయే త్రిలోకములలో భయమెఱుగని ఆ అసహాయ శూరునకు ప్రతి భయమైనది. త్రిలోక విజయియైన ఆ ఏకైక వీరునకు పుత్రమరణ వార్త చెవిని పడ్డంతోటే "ఆద్యలోకాస్త్రయః కృత్స్నాపృధివీచసకాననా, ఏకేనేంద్రజితాహీనా శూన్యేవ ప్రతిభాతిమే" త్రిలోకములూ ఈ పృధివీ ఇంద్రజిత్తులేని ఈ క్షణంలో నాకుశూన్యమై పోయినాయి" అని ఆ పరమ భోగిదిక్కులేని వానివలె విలపించాడు. పుత్రవ్యసన సంభూతమైన ఆ మహాశోకం అంతలో శత్రుప్రతీకారేచ్ఛా రూపమైన మహాకోపంగా పరిణమించి ఆ మహావీరుణ్ణే కప్పేసింది.

యుద్ధోన్మాదియైన రావణాసురుని అకల్మషమైన తండ్రి ప్రేమ ఈ విధమైన ప్రతీకారాన్ని కోరడంలో వింత ఏమీలేదు. అంత మాత్రాన అతని ప్రేమను మనం శంకించడానికి కారణమే లేదు.

ఈ విధంగా మన ప్రాచీన సంస్కృతికి ఆదర్శ దర్పణమైన రామాయణంలో చిత్ర విచిత్ర రీతులలో మహోత్కృష్టంగా తండ్రిప్రేమ ప్రదర్శితమై జగతికి ధార్మిక నిష్ఠా పరతంత్రమైన ఆదర్శాన్ని స్థాపించింది.

# ఉత్తర రామచరిత్ర యందలి సీతపాత్ర

మన భారతదేశంలో రామాయణ, భారత, భాగవత గాథలను, ఆ గాథలయొక్క మహనీయులైన నాయికా నాయకులను తెలియనివారంటూ ఉండరు. మన ప్రస్తుత కథానాయిక సీతా మహాదేవి రామాయణమునందలి నాయకుడగు శ్రీరామచంద్రుని పత్ని. అందు ప్రధాన నాయికా పాత్రకూడా ఆమెయే.

రామాయణ కథ అనేటప్పటికి మనదృష్టిని, మనతలంపులను, మన మనస్సులను ఆకట్టుకొని బరువుగా కనబడే ప్రధానపాత్ర ఏదంటే సీతపాత్ర ఒకటే. రామాయణంలో నుండి సీతపాత్రను తొలగిస్తే ఇక రామాయణ రచనా ప్రసక్తిలేదు. రామాయణ కథకు ఇతివృత్తమేలేదు. అంటే చిలుకబోయిన పంజరమన్నమాట. అందుకే వాల్మీకి కూడా సీతాయాశ్చరితం మహత్ అన్నాడేకాని ఆశ్వాసాన్తాల్లో రామ స్వచరితం అనలేదు.

ఐతే రామకథలో సీతపాత్ర యెంత ప్రధానమైనదో అంత దయనీయమైనది కూడా. రామచరిత్రం ఎన్నిమార్లు చదివినా సీతకష్టాలు చదువుతూంటే కంటనీరు పెట్టనివాళ్లు ఒక్కరూ ఉండరు.

ఇంతా ఎందుకు కలిగిందంటే ఆ సీత పాత్ర చిత్రణంలో బహిరంతరాలా, బాధా వ్యథితత్వమూ, సహన శీలమూ, సహజంగా కలహైందవనారిని మూసలో పోసి సేతా రూపంలో పైకి తీశాడా కవి యీ పాత్రను? అనిపిస్తుంది. హిందూ సమాజంలో స్త్రీకి ఉండవలసిన స్వభావలక్షణాలు, స్త్రీకి ఉన్న ప్రతిపత్తీ, విధేయాత్మా, పరవశంగమత్వమూ, పతిగత ప్రాణత్వము, స్వధర్మ నిరపేక్షాత్వము మొదలైన అన్ని లక్షణాలు అక్షరాలా ఆ పాత్రలో రూపొందింపజేసే ధన్యుడైనాడు కవి... అందుకే ఆ సీతా చరిత్ర పఠనంలో అంత సహజంగా ఆత్మీయంగా అనుభూతిని పొందగల్గడం సంభవిస్తూంది?

మున్ముందు సీతాపాత్రకు ఈ విధంగా స్థూలరేఖలు గీసుకొంటే ఉత్తర రామచరిత్రలో సీతాచిత్రణం మన భావనా పథంలో చాలా సులభంగా మూర్తిమంతం ఔతుంది. ఆ నాటకంలో మరొక విశేషమేమంటే కూర్పు ముప్విధంగా సమకూర్చబడింది. ఎక్కువ భాగం శ్రీరామ చంద్రుడు సీతనుద్దేశించి సీత పరోక్షంలో కనబరచిన భావముల సహాయముతో సీతకు గల ఉత్కృష్టస్థానాన్ని కనబరచడం మొదటి విధం. తరువాత అరుధతి, వాసంతి, గంగ, పృధివి, తమసమున్నగువారి మాటల ద్వారా సీత స్వభావాన్నిమన మనోఫల కాలపై చిందింపజేయడం రెండవవిధం. ఇక స్వతహాగా సీతపాత్రను ప్రవేశపెట్టి ఆ పాత్రచే పల్కించిన పలుకుల ద్వారా సీతాదేవి స్వభావశోభను ఆవిష్కరింపజేయడం మూడవ విధం. ఇందులో సీతపాత్రకు రంగ ప్రవేశమే తక్కువ అన్నంతవరకు విరహార్తుడైయున్న రాముని జూచి సానుక్రోశంగా పలికే పలుకులే కాని

వేరొండు కనబడవు. ఇక రంగస్థలి మీది యితర పరిస్థితులనే స్థూలరేఖలను బట్టి సీతా చిత్రణమునకు మనసు రంగులు పూయవలసిన పరిసరాలను కల్పిస్తాడు కవి.

ప్రథమాంకంలో చిత్రదర్శనం చేసి అలసి రాముని వక్షస్థలమున నిద్రించిన సీతను గూర్చి రాముడు పల్కిన మాటలు గమనించండి.......

ప్రమోవో విద్రావా . . .
ఇయంగేహేలక్ష్మీరియం . . .
మ్లానస్యజీవకుసుమస్య వికాసనాని . . .

ఈ శ్లోకార్థాలను బట్టి రామహృదయంలో సీతకు ఎట్టి అత్యున్నత స్థానం ఉన్నదో తెలుసుకోవడానికి ఇంతకంటే కొలబద్దలు మనకక్కఅలేదు. సృష్టిలో మరియే యితర వ్యక్తికాని శ్రీరామునివలె భార్య యందంతటి అత్యుచ్ఛయ ప్రేమావిష్ట డింకొకడు కాన్పింపడు. ఇట్లా రాముని హృదయం గతంగా ఆరబ్దమైన ఆ జీవేశుల ఈ పవిత్ర ప్రణయం శ్రీరామచంద్రుడు తన గూఢచారి వలన సీతయందలి జనాపవాదమును విని సీతను విడువక తప్పదని నిర్ణయించుకొన్నప్పుడు సీతయందు గనబరచిన భావవిశుద్ధతయందు పరాకాష్ఠ పొందినది.

సంప్రతివిపర్యస్తా జీవలోకః అక్ష్యావసితంచ జీవిత ప్రయోజనంరామస్య,
శాన్యమధునాజీర్ణారణ్యాం జగత్ అసాతస్సంపాతఃకాష్ఠప్రాయంశరీరం,
అశరణోహం కింకరోమి కాగతిః క్వగచ్ఛామి.

దుఃఖసంవేదనాయైవ రామేచైతన్య మా పాతమ్
మర్మోపఘాతిభిః ప్రాణైః వజ్రకీలాయితం స్థిరైః
- సీతాయాః పాదౌశిరసికృత్వా - దేవి అయం పశ్చిమస్తే
రామ శిరసిపాదపంకజస్పర్శః - ఇతిరోహితి -

ఈ వాక్యార్థములను గమనించినారా? ధర్మరక్షణార్థము, ప్రజారంజనార్థము సీతను కఠోరగర్భను క్రూరమృగసంచార భూయిష్ఠమైన అడవులలో జన్మాంతము ఒంటిగా శీల అనీ, పతిగత ప్రాణ అనీ, సర్వోన్నతురాలనీ శ్రీరాముడు పూర్తిగా ఎఱిగియే ఉన్నాడు. అందువలననే తన అకృత్యకరణంవలన జగతియే శూన్యమైనదని తలపోయడమే కాక ఆ సాధుశీల విడుచుటవలన తనకు గలుగబోయే పాపపరిహారార్థమో అన్నట్లు నిదురించుచున్న ఆమె అరుణారుణములైన చరణకమలాలకు శిరసా అంజలి బంధించుటయే కాక ఆడుదానివలె వావిడిచి విలపించినాడు.. అహో సీతా మహాసాధ్విజన్మము ధన్యమైనది కదా.... ఆమె ఇక బ్రదికినను బ్రతుకకున్నను ఆమెకీ సంపూజనము చాలదా? ఏయాడుది భర్త హృదయ పీఠమున ఇతి ప్రణయాతి భాజన మైన ఉత్కృష్ట పదము నధిష్ఠింపగల్గినది? పరోక్షమున పతిదేవుడు భార్యాపాదములకు

ప్రణయభావముతో, పూజ్యతతో ప్రణతుడు కాగల్గునంత ఆదర్శప్రవర్తనమును సాధించినది సీతామహాదేవి. ఇంతకంటే గొప్పగా సీతాస్వభావవర్ణనమునకు కవియింక ఎట్టి భావార్థములను సమ కూర్చగలడు?

కావుననే సీత దండకారణ్యమున రాముని జూచుట తటస్థించినపుడు వాసంతియను తన పూర్వ వనవాససఖియగు వనదేవత రాముని సమీపించి తనను రాముడు విడిచి పెట్టుటను ఆమెయెంత మాత్రము సహింపలేకపోయినది. రాముడు బాహ్యతృప్తికి ఆమెను విడిచిన వాడైనను మనస్సా ఆమెను విడువలేవి వాడగుటచేతను, తమ ఉభయుల అవినాభావ సంబంధము నెరిగినవాడగుటచేతను పదపదమునకు సీతనే స్మరించుచు మూర్ఛితుడగుట సంభవించినది. అట్లు శ్రీరాముడు మూర్ఛ పొందిన పుడల్లా తనకు రాముని మూలముగా అంత కష్టస్థితి గల్గినదని కూడ గమనింపక, తన దుర్భరస్థితిని, తన అనాధస్థితిని, తన అప్రకాశ వనవాసస్థితిని కూడ లక్షింపలేక పోయినది.

> మాం మందభాగినీ ముద్దిశ్య, ఏవం వత్సలస్య, ఏవం వాదినః
> ఆర్యపుత్రస్యాపరి కధం నిరపు క్రోశా భవిష్యామి? అహమేతస్య హృదయం,
> జానామి మామాస్యైషః
> "మాంమందభాగినీ ముద్దిశ్యసకలలోక మంగళాధారస్య తేజన్మలాభస్య వారంవారం
> సంశయిత, దారుణో దశాపరిణామః ఇతి హాతోస్మి..."

అనే వాక్యాల వలన సీత తనస్థితికి తాను జీవన్మృత స్థితి యందున్నదేయైనను, తన ఆ స్థితికి శ్రీ రామచంద్రుడే కారణభూతుడైనను, అతడు తనపై జాలి జూపవలసినది పోయి తానే ఆ స్థితికి జాలిపడుచు, నాథుడు మూర్ఛపడినపుడేల్ల తన స్థితి, తన జ్ఞానము, తన వశము తనకు తెలియకుండగనే కేవలము పతిప్రాణ సంరక్షణమునందె లీనురాలై పోయినది. అంతేకాక భర్త ప్రాణ సంరక్షణంలో తాను ప్రకాశస్థితికి వచ్చినచో రాముడేమనునో అనే అంశాన్ని కూడా మొదట్లో ఆమె లక్ష్యం చేయలేదు. యద్భవతి తద్భవతు అని సాహసముగ వెళ్లి వ్యయ కర్తవ్యముగ శ్రీరాముని తన స్పర్శచే మూర్ఛ ...ండి తేర్చినది. అతడు తేరుకొన్న పిమ్మట, పరిత్యక్తయైన తాను భర్తనుజ్ఞ లేకుండా ...కంత్రముగ ఎదుటబడిన అతడు కోపించునని తిరిగి భయపడినది. "భగవతి ...మసే అవసరావస్థావత్ మాంప్రేక్ష్య అభ్యననుజ్ఞాతేన, సన్నిధానేన అధికంతా వత్సో

తరవాత ఈ వాక్యాలచేత సీత పతిగత ప్రాణిగాను, స్వధర్మనిరపేక్షగాను మనకు కనబడ గలదు. తరువాత సీతను గూర్చిన వాసంతీ వాక్యములు, అరుంధతి వెలి బుచ్చిన

''శిశుత్వం స్త్రైణంవా భవతు ననువంద్యాసి జగతాం పూజాస్థానం గుణిఘనచలింగం సచవయః''

మున్నగు అధిభాషణములూ గంగాభగవతి, పృధ్వీమాత సీతవిషయమున పల్కిన పల్కులు సాధ్విచిత్రణమున పూర్తిగా కవికి ఉపబలకములైనవి కదా . . .

ఇది యిట్లుండగా సీతపాత్రను స్వస్థితిలో కడవరకు అమాయికగాను, విధేయాత్మగానే పాలించినాడు. సీత భూదేవితో అన్న ఈ క్రింది వాక్యాలను చూడండి...

నయతు మమాత్మనాంగెషు విలయమంబా .. నన్ను నీలోగలుపుకొమము తల్లీ నన్నీ యపవాదమునుండి రక్షింపుము. అంతేకాక కట్టకడపట భర్తను, తండ్రిని కలిసి కొన్నపుడు రఘురాముడు తన్ను తిరిగి పత్నిగా అంగీకరించినట్లు తెలిసికొన్నప్పుడు ప్రత్యుజ్ఞ పితాస్మి అని మాత్రమే ఎంతో హర్షముగను, ఆర్ద్రముగను. అమాయిక ముగను, పలికి బిగబట్టిన ఊపిరిని మెల్లగా విడచినది. ఇంత అతిమాత్రముగా ఉదాత్తురాలైనది కనుకనే గంగిగోవువంటి యామెను గూర్చి కవియే స్వయముగా పూనుకొని ఈ మాటలు యాధావాచాం తథాస్త్రీణాం సాధుత్వే దుర్జనో నః అని వాచ్యముగా సమర్పింపకుండా ఉండలేక పోయినాడు.

ఆమె మూలమున శక్తి స్వరూపణి అంశారూపమున మూర్తీభవించిన కష్ట సహిష్ణువుగా ప్రపంచమునకు ఆదర్శము దిద్దినది. పరస్పర అభిమాన, అనుమాన గవిష్ణువై ఒండొరుల నీడలు చూచిభయపడుచు, స్వార్ధముతో ఎదుటివారిని రక్తదాహముతో పీల్చిపిప్పిచేయు సాధరణ జనతా ప్రపంచము సముద్ధరింపబడవలెనన్న పవిత్రప్రేమార్ద్ర ప్రచారము నిదర్శనపూర్వకముగా జరుగవలెను. దానికి సర్వసమర్ధమైన శక్తియే పూను కొనవలెనుగాని యితరుల ద్వారా అది జరుగలేనిపని. కష్టసహిష్ణుత్వము చేతనే ఆ ప్రేమ సంచారము జరుగగలదు. కావుననే సాక్షాచ్ఛక్తి, భువనైక మాత, పూతచరితయగు సీతగా అవతరించిన తనజీవితమును పణముగా ఒడ్డి గ్రుడ్డిలోకమునకు దివ్యా దర్శమును దిద్దిచూపినది. ఆదియొక ఉద్దీప్తి. ఆ కాలమొక రసతరంగము. ఆచరిత మొక దివ్యద్దిప్రకాశము.

ఆ ప్రణయరసోల్బణము, ఆ నియమనిగ్రహము, ఆ పరస్పర విశ్వాసము, ఆ పవిత్ర రస సంపుటీకరణము ఆ ఆదిమ దంపతులకే చెల్లినది. ఏరీ మఱల ఈ పృధ్వీస్థలిపై రాముని వంటి రాజును సీతవంటి సాధ్వియును .... !!!

# మొల్ల రామాయణము నందలి నారీ చిత్రణము

తాత్త్విక చింతా పరమగుట చేతను, త్యాగ సుందరమగుట చేతను భారతీయ సాహిత్యము ప్రపంచ సాహిత్యమునకే తల మానికమైనది. అట్టి భారతీయ సాహిత్యమునకు మౌలిక గ్రంథమైన శ్రీ మద్రామయణము నందు ఈ త్యాగ సౌందర్యము పరమోదాత్తముడుగా వర్ణింపబడింది. కావుననే ఈ ఉత్తమ కావ్యము భారతీయ భాషలలోనికే కాదు, అఖిల ప్రపంచ భాషలలోనికిని ఈ గ్రంథమ నూదితమగుటకు కూడా ఈ మహాకావ్యము ఈ త్యాగ సౌందర్యమే కారణము!

మన ఆంధ్ర వాఙ్మయము నందుకూడా ఈ మహాకావ్యము ఎన్నో విధములగు అనువాదములను బొంది చిత్ర, విచిత్ర రీతుల వెలసియున్నది. అంతేకాదు, ఆంధ్రులకు శ్రీరామచంద్రుడిష్ట దైవమైనట్లు ఇతర దైవములిష్ట దైవములుకారు. సీతమ్మ అభిమానమైనట్లి తరనాయిక లభిమాన పాత్రములు కాదు.

ఆంధ్ర సారస్వతము నందలి వివిధములగు సంగ్రహ రామాయణములలో మొల్ల రామాయణము మిక్కిలి ప్రసిద్ధమైనది - కవయిత్రీమతల్లియైన మొల్ల ఆంధ్ర ప్రజానీయమునకుఆదర్శపూర్ణమైన శ్రీరామ గాథను సంగ్రహముగా తెలుపవలెనను ప్రధానాశయముతో ఈ కావ్యమును రచించినది. ఈ ఉద్దేశ్యము తోనే కాబోలు రామాయణము నందలి కొన్ని ఘట్టములను, కొన్ని పాత్రలను కూడా విడిచివేసినది. కొన్ని ఘట్టములను, కొన్ని పాత్రలను కథా ప్రధానముగ స్పృశించి విడిచినది.

అట్లు విడువబడిన ఘట్టములలో మంథరా ప్రబోధ ఘట్టమొకటి. మంధరా ప్రబోధ ఘట్టమునకు శ్రీమద్రామాయణ మహాకావ్యమున నెంతో ప్రాధాన్యమున్నది. శ్రీ మద్రామాయణమును"జానక్యాశ్చరితం మహత్త, నియు, 'పౌలస్యవధాతథా అనియు వాల్మీకి పేర్కొని యుండెను - లోక విద్రావణుడైన రావణుని హత మొనర్చుటయు, ఆలోక శ్రేయస్కర కావ్యమునకు సాధ్వి సీతమ్మ స్వార్థ త్యాగమొనర్చుటయునను నవియే రామాయణమున ప్రధానాశయములు. ఈ ప్రధానాశయ నిర్వహణమునకు మంధారా ప్రబోధము అతి ప్రధాన ఘట్టము అట్టి యెడ మంథరా పాత్రమునే విసర్జించుటలో మొల్ల మనస్సులో ఏదేని ఒక మహదాశయము దాగి యుండ వచ్చును.

దీనిచే శ్రీరామ వనవాసమును మంథరా ప్రేరణము లేక తానే స్వయంబుద్ధితో వరముగా గోరిన కైకేయి పాత్ర పైననే రావణ వధా కార్యనిర్వహణమునకు ప్రేరణము బరువుగా మోపబడినదనియే మన మూహింపవచ్చును. మొల్ల కావించిన పాత్ర చిత్రణముల తీరు తెన్నుల యందలి రహస్యమును కనుగొనజాలినచో ఇట్టి మహత్తర విషయము లెన్నేని బయట పడగలవు.

ఆమె కావించిన ఈ మార్పులకు, భారతీయ తాత్త్విక చింతన పట్ల ఆమెకు గల ప్రగాఢ విశ్వాసమును, భారతీయ నారీమణుల త్యాగమహిత జీవిత పద్ధతి యెడల ఆమెకు గల శ్రద్ధా గౌరవములును కారణములు. భారతీయ సాహిత్య మంతయు నిట్టి మహోద్భుత విషయములతో నిండి యుండుటయు. త్యాగైనైకే నామృత మశ్నుతే' ' అను సూక్తికి మూల పురుషులగు మహనీయుల చరితములనే కావ్య నాయకులుగా నాయకురాండ్రుగా నెన్నుకోబడుటయు జూడ మన కవులకు గూడనీయుదార చరిత్రలపై గల గౌరవాభిమానములే కారణములని, మన, మూహింపవచ్చును. ఇందులకై మన కవులకు మనము జోహారులర్పింపవలసి యున్నది.

భగవానుని సృష్టి సంకల్పోద్దేశమైన ధర్మార్థ కామమోక్ష రూపమగు చతుర్విధ పురుషార్థ సాధన ఏమాత్రము లోపము వాటిల్లకుండ మనుజ సంఘముచే నిర్వహింపబడుటయే సృష్టికి పుష్టిని, తుష్టిని గూర్చు ముఖ్యోద్దేశము! ఈ సాధనకు త్యాగమొక్కటియే మూల సాధనము. యుగయుగముల నుండియు, సర్వ జగములకు ధర్మ సందేశమొసంగ జాలిన మన భారతీయ సాహిత్యాత్మ సర్వతో భద్రముగ, సర్వతోముఖముగ ఈ ధార్మిక దృక్పథమును ముఖరిత మొనర్చుచు మానవాళిని జాగరత మొనర్ప బూనుట యందలి పరమార్థమును ఇదియే. కావున మనము ప్రామాణిక గ్రంథములైన శ్రీమద్రామాయణ, మహాభారతముల యందలి ప్రధాన పాత్రములన్నియు త్యాగ ప్రధానములై ప్రపంచ సాహిత్యమునకే వెలుగు గూర్చినవి.

ముఖ్యముగ శ్రీమద్రామాయణమునందలి పాత్రములకు, అందును స్త్రీ పాత్రములకొక విశిష్టతగలదు. భూమిపై ధర్మగ్లాని సంభవించిపుడంతయు తన్ను భూమిపై సృజియింప జేసుకొని ధర్మాభ్యుత్థాన మొనరింతునని అభయమొసంగిన భగవానుడు అధర్మాభ్యుదయమునకు మూలపురుషులైన సోమక హిరణ్యా కశలైనపాది రాక్షస ప్రభువులను గూల్చుటకై, అంతకు మున్నె ఆరుమార్లు ధరణిపై అవతరించి యున్న విషయము మనమెరింగినదే. రామావతారమునకు పూర్వము నందలి ఘట్టములలో పరమేశ్వరుడొంటరిగా మాత్రమే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామావతారములను దాల్చి, ఏడవ అవతారమున, జగన్మాతతో భువికవతరించుటలోనే ఈ అవతార విశిష్టత మనకు స్పష్టమగుచున్నది. అంతేకాక, సవతి తల్లులు, సవతి తమ్ములు, బంధు మిత్ర పరివార సంఘము కలిగి, వీర్య, శౌర్య, గర్వ ప్రతాపాటోపముల కాలవాలమైన రాజకుటుంబమున, జాగరూకతతో బాధ్యతలు తీర్చవలసిన జ్యేష్ఠ కుమారుడుగా, ధర్మగ్లానిని సమయించి, ధర్మాభ్యుత్థాన మొనరింప మహాపురుషుడుగా అవతరించవలసి వచ్చుటచే పరాశక్తి తోడ్పాటు కూడా అవతారమున ముఖ్యముగా కావలసి యుండుటయు మనకు తెల్లము కాగలదు.

తన సాత్త్విక పరాక్రమ తేజో బలవీర్య సంపత్తితో మాత్రమే దుర్గర్వాంధకార విక్రమాటోపాహంకార దీపితుడును, అధార్మిక ప్రభువును అయిన రావణాసురుని పొలయించు దీక్షతో అవతారమెత్తిన ఆ మహాపురుషునకు ఆదుష్ట శిక్షణ, శిష్టరక్షణ కార్య నిర్వహణకై తోడ్పడవలసి యున్న శ్రీ మద్రామాయణ స్త్రీ పాత్రలకు త్యాగ ప్రధానత హెచ్చుగానుండవలసిన అవసరమెంతేని కలదు.

రామాయణ మందలి రమణీమణుల చిత్రణకు ఈ భూమికను ఆధారముగ తీసుకొన వలసివచ్చుటచేతనే మొల్ల తన కావ్యమునందలి నారీ చిత్రణమునందు హెచ్చు శ్రద్ధ వహించినది. ముఖ్యముగ కైక పాత్రను గూర్చి ముచ్చటించునపుడు మొల్ల గైకొన్న ఈ మెలకువ మరింత కొట్ల వచ్చినట్లు కన్పట్టకమానదు. సవతికొడుకగు శ్రీ రామభద్రుని అభ్యున్నతి నోర్వ.జాలని ఈర్ష్యాళువుగా ఆ చంద్రతారార్కము లోకమువారిచే అపకీర్తింపబడినది. పాపము కేకయనందన. కాని నిజమున కామె అట్టి ఈర్ష్యాళువు కానేరదు. సవతి కుమారుడైనను శ్రీరాముని ఎంతో గారాబముగా పెంచి, లాలించినది కైకేయి! కాని శ్రీరామ చంద్రుని అవతార కార్య నిర్వహణమున కామెయే మూల స్తంభమగుటచే ఆమె తనను ఈర్ష్యాళువుగా లోకమువారి యెదుట చిత్రించుకొనుటకు వెనుదీయలేదు. రాఘవుడు పట్టాభిషిక్తుడై అయోధ్యయందే ఉండి పోవుచో లోక విద్రావణుడగు రావణ వధ జరిగియుండెడిదేకాదు. ఈ లోకకల్యాణ సంఘటనమునకై, కేకయాత్మజ, ప్రాణమున కంటె ప్రీతియైన కీర్తిని త్యాగము చేసి ప్రతిష్ఠా త్యాగ మొనర్చుటకు సహితము సంసిద్ధురాలైనది. రఘురాముని వనవాసమునకు మంథరా ప్రోత్సాహమే కారణమగుచో ఆ ఖ్యాతి యంతయు మంథరకే దక్కెడిది. మొల్ల మంథరా పాత్రను తొలగించి ఆ కీర్తి నంతను కైకకే చెంద జేసినది.

అసలు రామాయణమునందలి నారీ పాత్రలలో ప్రధానపాత్ర, భూజాతయగు సీత. తక్కిన కౌసల్య, శబరి, తార, మండోదరి, కైకసి, లంకిణి, సులోచన, త్రిజట మున్నగు పాత్రలకు కథా నిర్వహణమున గల అల్ప ప్రాధాన్యమును బట్టి మొల్ల ఆ పాత్రల యెడ అంతశ్రద్ధ తీసుకొనలేదు. శూర్పణఖ మాత్రము కథా నిర్వహణముపట్ల ప్రధాన పాత్రయే. మొల్ల కూడా ఈ ప్రాధాన్యమును గుర్తించి యే ఈ పాత్రను మలచుటలో మెలకువచూపినది. ముందు శూర్పణఖయందే తప్పుచూపి తర్వాత లక్ష్మణునిచే ముక్కు చెవులు గోయించినది ! ఆ రాక్షసి మనుజేంద్రసూనుల దండింప దలంచుట, నెరింగి భరతానుజుండు, దాని నాసికా కర్ణంబుల గోసివైచె" నట. పాత్ర చిత్రణము పట్ల మొల్ల చాలా బుద్ధి సూక్ష్మతచూపి, సూక్ష్మమగు ఒక్క వాక్యముతోనే ఎంతో చక్కగా ఆయా పాత్రల స్వభావమును వెలువరింప జేయగల్గిన చదురాలు. ఈ

చతురత సీతా మహాదేవి పాత్రోన్మీలనము పట్ల పరాకాష్ఠకెక్కినది.

త్యాగమునకు, కష్ట సహిష్ణుతకు, అభిమాన ప్రధానతకు, వీర్య పరాక్రమములకు, ముఖ్యముగాపాతివ్రత్యమునకు, బుద్ధి సూక్ష్మతకు ధర్మ రక్షణమునకై సర్వస్వ మర్పించి భర్తలకు సాయపడుటకు భారత నారీమణులు మిక్కిలి ప్రశస్తి కెక్కియుండిరి. ప్రపంచ వాఙ్మయముల నెన్నింటిని పరిశీలించినను, అద్భుతమైన ఈ సౌశీల్య సంపద భారత మణులయందే తప్ప మరి యింకెందును గాంచబోము. ఆ సీమంతినులలో సీతా సాధ్వి అగ్రగణ్య. తేజోవంతమైన, ఓజస్వంతమైన ఈ పాత్రకు రూపకల్పన చేయుటలో మొల్ల చూపిన జాగరూకత స్తవనీయము. ప్రప్రథమమునందే, మైధిలిని, పౌరుష ప్రధానగా మానధనురాలుగా, శౌర్యశీలగా, అతిశయమగు ఆత్మాభిమానము కల దానినిగా ప్రవేశ పెట్టుట యందే మొల్ల గొప్ప విజ్ఞతను, విన్నాణమును ప్రదర్శించినది.

"ఇనవంశోద్భవుడైన రాఘవుడు,
ధనువుదునిమి నంత ధరణీశ సూనులు
శిరములెల్ల వంచి సిగ్గుపడిరి
సీతమేను పెంచె'' నట గమనించితిరా, మొల్ల ప్రత్యేకత!

మరల ఎప్పుడును, ఎట్టి కష్టములయందను ఇట్లు పెంచిన మేనిని, మరల ఆసాధ్వి కుంచింపజేయలేదు, ఆత్మాభిమానమును వంచింప జేయలేదు. అంతనేర్పు చూపినది సీతా పాత్ర చిత్రణమున మొల్ల తల్లి!

అవును మరి! భారతీయ మహిళా ప్రపంచమున ధ్రువతారయై, పౌలస్త్యవధా ప్రధానమైన, జానకీదేవి, మహచ్చరితమును, రఘురాముని ఇల్లాలైన సీతా సచ్చరిత్రమునురామ రామపదపంకజయుగము నిచ్చలు భజించు నీ మొల్ల వేరొక విధముగా, న్యూనతా పాదకముగా నిర్వహించునా?

తరువాత మదన వ్యామోహితుడై, ఉచితానుచితము లెరుగకుండ, తనతో ఆలపించిన రావణునిదుష్ట భాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనక భూపాల నందనయిడిన ప్రతివచనంబుల సొబగు వాకొన నలవికానిది.

తన త్రైలోక్య విజయ వైభవ గర్వమును చాటుచు, దాశరథిని అల్పునిగా పేర్కొనుచు రావణు డాడిన మాటలకు వైదేహి ప్రథమమున తన పాతివ్రత్యవైభవాన్ని గూర్చి పేర్కొనుచు బదులిడినది.

పతి దైవముగా నెన్నడు, మతి దలచుచు
మండునట్టి మగువల కెందున్,
బ్రతినగల యిట్టినీతో బ్రతి వచనము
లాడు కంటె బాపము గలదే''

అని తన పాతివ్రత్యా బలమును, అతని నీచత్వమును ఉగ్గడించినది. తరువాత పరదారాపేక్షకులగు పురుషుల కాయువు నశించునని హితము బలికినది, "తనసాహసము తానే పొగడు కొనువాడు హీనసత్వుడని నిరూపించి నిష్ఠూరమాడినది. ఏమీ త్రిలోక విజయినని గర్వించునీవు రఘురాము తోడను పోరంగనోపక దొంగిలించి నన్ను తెచ్చి, ఇప్పుడు తులబువాతుచ్ఛపు పల్కులు పల్కెదవా ? అనిపిచ్ఛలించి, నిలువరించినది. ఇక కడసారిగ లక్ష్మణాగ్రజుని ఘనశక్తి, శౌర్యమహిమలనుగడించుచు,

"పాదరజమున కొక రాయిబడతిజేసె
రాజమాత్రుడే మేదినీరక్షకుండు,
రామ భూపాలకుండాదినారాయణుండు . . .
అట్టి మహానుభావుని దూషించు నీనాల్కకోయుటయేకాదు :

"అట్టి రామునకీయబ్ధి యనగనెంత
లంకయననెంత దనుజుల పొంకమెంత
నీవనగనెంత, నీలావుచేవయెంత
చెప్పనేటికి నీవె, చూచెదవు గాక . . .
వీరాలాపము లాడనేల . . . .

క్రూరాస్త్రంబులమస్తముల్ దునిమిభుక్తుల్ పెట్టు భూతాళికిన్ . . . . నేడెల్లి శాంతింపుమా.

అనియు, ఓరీతుఛ్ఛుడా పాశవికశక్తి యుక్తుడవైన నీ ప్రతాపములపుడే డీలుపడినవి. నీచావు ముందున్నది, చూచుకొమ్మనియుపల్కి రావణుని వాగాడంబరము నంతకును మాటకు మాటతూచి నట్లు బదులిడినది. లంక యందు హనుమ కానబడినపుడు సీతా సాధ్విపడిన వేదనను మొల్ల కడు సహజముగ మిక్కిలి కరుణా విలముగను చిత్రించినది.

"పతి బాసినప్పటి యాపదలకంటె వివిధ మాయలచేత వేగివేగి.
రాముదలచుకొంచు రాముని బేర్కొంచు
రామరామయనుచు. నిడుద పెన్నెటి వేణి
జడలుగా సవరించి . . . మహితలంకామహాద్వీప గహనసీమ దపము

సేయుచున్న సీతను మనకండ్లకు దర్శింపజేసిన మొల్ల ప్రావీణ్యమప్రతిమానమైనది - అంతేకాదు సీతచే రాముని కొరకై తపము చేయించినది. మాయా మృగ సందర్భమున లక్ష్మణుని పోనాడి నందున కామెను పశ్చాత్తప్తురాలను గావించినది ! గత కిల్బిషరాలైన సీతమ్మకు పతి దర్శనము, బంధ మోచనముగాకుండ నెట్లు

దప్పును, అట్టి ఒడుపులో సీతమ్మను తీర్చిదిద్దినది.

అంతయునైనది ఏ పతి సన్నిధానమునకై సీతమ్మ అన్ని పాట్లు బడియు, ప్రాణములను నిలువరించుకొన్నదో, ఆ పతియే రావణ వధానన్తరము తన్ను "కులసతిని జెరగొని పోయిన . . . . శాత్రవు . . . గెలిచితి, పగ జంపితి నెలతా నీ యిచ్చజనుము - నేనిన్నొల్లన్ అన్ని పోనాడినాడు. ఆ వేడి మాటలు కర్ణంబులకు వాడిగల్గినట్టి నారసములు సోకినట్లు కాగా తలకొట్టిన నాగ కాంతవోలె "నరవర! నాదుచిత్తము, మనంబును, నీవయెరుంగుదు. ఎరింగియుండియున్ బరుసములాడ నేమిటికి, నాయెడ బాపములేదు. కాదు సురలు నుతింప మేటి సాదజొచ్చెద, మెచ్చుడని ధీరముగా మేలు నెంచి, శిరము నెత్తినిలువరించి పలికినది రామో - విగ్రహవాన్ ధర్మః అనిపించుకొన్న రాముని ధర్మకవచము ఈ ఒక్క వాక్యముతో తునాతునకలైనది. తానెంతపతి శీలయయ్యును, ధర్మువుదప్పిన పతికి బానిస కాలేక పోయినది. ధర్మసంరక్షణ మనునది శీలసంపన్నురాండ్రును, సాధ్యులునైన నారీమణుల త్యాగముచేతనే సిద్ధించును కాని, మిముబోటి భీరువుల వలన కాదని, మోమోడక రామునిమోముపై గొట్టి మాట్లాడి, తన సౌశీల్యమునకు జయ పతాకమెత్తి, భారతీయసాహిత్యాంబరమున చెరగని కాంతి పుంజముల ధ్వజమెత్తినది. ఈ తన కావ్యరచనలో మేను పెంచిమనకు దర్శనమిచ్చిన సీతా సాధ్విని మేను వంచకుండునట్లు గానే చిత్రించి సూక్ష్మంలో మోక్షంగా ఉన్నంతలో సీతమ్మ శీలానికి విజయ కిరీటం పెట్టింది మొల్ల !

చాలు! మొల్ల ప్రచురించిన నారీ పాత్ర చిత్రణానికి ఈ శిల్పం జయగీతిక!

# సంస్కృత వాఙ్మయము - మహిళల కృషి

భాష జాతికి ప్రాణము. జాతికి గౌరవ కారణము. ప్రతిష్ఠాకరము కూడ. ఏ దేశీయులు తమ భాషను సర్వాంగీణమైన భక్త్యాదరాలతో అభిమానించి, సేవించి, పూజించి, కొలుచుకుంటారో ఆ దేశము, ఆ జాతి సర్వ సేవా భాగ్యాలను అనుభవిస్తూ ప్రప్రపంచంలో ఒక ఆదర్శజాతిగా, ఒక మహాదేశంగా పరిగణింపబడి కీర్తింపబడుతాయి.

ఇంకా వివరించి చెప్పాలంటే ఒక జాతి నాగరికత, సంప్రదాయాలు, సంస్కృతి, అభిరుచులు, ఆచారములు, మత విశ్వాసములు, కళాభిజ్ఞత మొదలైన ఉత్తమోత్తమ విషయాలనన్నింటిని వాఙ్మయరూపంతో భద్రంగా రికార్డు చేసి దేశ దేశాలలో, యుగయుగాలలో నిత్యనూతన చైతన్యంతో కీర్తింపజేయ గల్గేది భాష ఒక్కటే. అందువలననే భాష జాతికి సర్వస్వము అని చెప్పవచ్చును.

ఇక మన భారత దేశంలో హిందువులందరకు ఈ విధంగా ఆధారమైన ఏకైక భాష సంస్కృత భాష.

భాషా లక్షణ దృష్టితో పరిశీలిస్తే విశ్వ భాషలన్నింటి లోకి సర్వవిధ ఉచ్చారణ సౌకర్య సౌష్ఠవాలు, సర్వరస, భావ గుణ ప్రకటనా సమర్థత, మాధ్యుర గాంభీర్య సౌకుమార్య సర్వగుణ సంపూర్ణత కలిగిన ఏకైక భాష కూడ, సంస్కృతమే. అంతే కాకుండా ముఖ్యంగా చెప్పుకోదగిన విషయమింకొకటి ఏమంటే ఈ సువిశాల వసుంధరలో ఈశ్వర సంబంధమైన మత, చింత, విశ్వాస విషయాలలో, ఆధ్యాత్మికమైన భావ ప్రపత్తిని తన జాతికి ఒక విశిష్ట లక్షణంగా, తన దేశానికే ఒక ఉన్నత గౌరవ ప్రపత్తిని తన జాతికే ఒక విశిష్ట లక్షణంగా, తన దేశానికే ఒక ఉన్నత గౌరవ ప్రపత్తిగా తన ఉనికికే ఒక గర్వకారణంగా ప్రకటించ గల్గిన భాష కూడా సంస్కృతం ఒక్కటే. అంతేకాక ఆగమశాస్త్రము, శిల్ప, వాస్తు శాస్త్రములు, మంత్రశాస్త్రము, రాజనీతి, అర్థనీతి మొదలైన భారతీయ సంస్కృతి సంప్రదాయాలకు మూలకందములైన శాస్త్రములు అపార ఆర్షవాఙ్మయము, ఋషితుల్యులైన వ్యాస, కాళిదాసాదుల అమోఘ సారస్వత సందేశములను ఒకే ఒక ప్రపత్తితో గర్భీకరించుకొని ప్రపంచం యెదుట సాటిలేని నిండుతనంతో నిలువబడ గల్గిన భాష కూడా సంస్కృతమే.

కాబట్టే సంస్కృతం ఆనాటికీ ఈ నాటికీ ప్రపంచం మొత్తం మీద అఖండ గౌరవాన్నీ, అత్యధిక పూజనాన్నీ అందుకొంటూ భారతదేశానికి తరుగని, విరుగని కీర్తి ప్రతిష్ఠల నార్జించింది. ఇట్లా ఆధ్యాత్మికంగా, వైజ్ఞానికంగా, సాంస్కృతికముగా, చారిత్రకంగా, సాంఘికంగా, ఆర్థికంగా ఉన్నతోన్నతమైన, ఉత్తమోత్తమమై చరమ సీమల నధిగమించి,

తన జాతి నధిగమింప జేసినేల నాలుగు చెఱుగుల తన ఈ భారత జాతికి నివాళులిప్పించిన ఈ పవిత్రభాషను, ఈ ఉత్కృష్ట వాఙ్మయాన్ని రూపుమాపితేనే తప్ప తమ ఆంగ్లేయుల పరిపాలన ఇక్కడ సుస్థిరం కాదనే ఉద్దేశంతో డెడ్ లాంగ్వేజ్ - మృతభాష అనే ప్రచారం లేవదీసి, ఆంగ్లేయులు మనలను మన సౌభాగ్యానికి దూరం చేస్తే, అన్ని విధాలా అజ్ఞులమైన మనం ఆ ప్రచారానికి మోసపోయి మన ఉన్నతికి, మన శ్రేయస్సునకు కారణభూతమైన ఈ దివ్య నిక్షేపాన్ని తలదన్ని, కాలరాచి విసర్జించి అగౌరవపరిచాం, కాని మన ఈ గీర్వాణ వాఙ్మయం మహత్త్వాన్ని, అవసరాన్ని తెలిసి జర్మనీ, రష్యా మొదలైన ఇతర నాగరక దేశాలవారు మాత్రం చాల గౌరవిస్తూ ఉన్నారు.

పూర్వ భారత దేశంలో సంస్కృతం రాజభాషగా ఉండడం వలన భారతీయుల సర్వస్వమూ ఈ వాఙ్మయంలో నిక్షేపితమై ఉండడం చేత భరత ఖండంలోని తక్కిన అన్ని దేశీయ వాఙ్మయాలకూ సంస్కృతమే ఆదర్శప్రాయము, ఆధార కారణమూ కూడ అయింది. అందులోనూ మన ఆంధ్రవాఙ్మయానికిమతీ వెన్నెముక సంస్కృమే అని చెప్పాలి. అంతేకాదు. ఆంధ్రులలో ఒక విధమైన ప్రవేశ పాండిత్యాలు కలగాలంటే సంస్కృత వాఙ్మయ ప్రవేశం ఏలవలేశమైన లేకపోతే చాలా కష్టమే అని కూడా చెప్పవచ్చు. ఇక ఈ ఆర్యభాషా ప్రథమ వాఙ్మయమైన వైదిక సాహిత్యం దగ్గఱనుండీ కూడా మహిళల ప్రాభవ పాండితీ పరిచయం అతి సన్నిహితంగా కనబడ్తూనే ఉన్నది. అపాల, శశ్వతి, విశ్వవార మొదలైన సీమంతినులు అనేకమంది దేవ వాఙ్మయంలో కనబడ్తూ ఉన్నారు. గార్గి, మైత్రేయి సులభ మొదలైన వారు కొందరు బ్రహ్మవాదినులుగా కూడా ఉన్నట్లుగా చరిత్ర పేర్కొంటున్నది.

విశేషించి గార్గి బ్రహ్మవాదిని, బ్రహ్మచారిణి కూడా. ఆమె జనకు నాస్థానిగా ఉండి తన విశేష ప్రజ్ఞాప్రాభవాలతో అక్కడి మహా పండితులతో సమంగా ఆధ్యాత్మిక చర్చలు జరిపేదట. కనుకనే, వాక్శుద్ధి, వాదస్ఫూర్తి కలది అనే అర్థం వచ్చేటట్లు 'వాచక్నవి' అనే బిరుదు నిచ్చి ఆనాటి పండితలోకం ఆమెను సమ్మానించుకొన్నది.

యాజ్ఞ్యవల్క్యుని కులవధువు మైత్రేయి విజ్ఞాన శేముషీధురంధరురాలు. తన భర్త గృహస్థ ధర్మాన్ని విడిచి ఆత్మ చింతనకై అడవులకు వెళ్తూ, నేను అమృత పదవీ ప్రాప్తికై వెళ్తున్నాను. నీవు ఇక్కడనే ఉండి ఈ గృహకార్యకలాపాన్ని చక్కబెట్టుకోవలసింది, అని భార్యయైన మైత్రేయితో అంటే, "గృహస్థాశ్రమ నిర్వహణం వలన నేను అమృతత్వాన్ని సాధించలేక పోయినపుడు నాకు మాత్రం ఈ గృహస్థాశ్రమం ఎందుకు? అనే అర్థం వచ్చేటట్లు, 'యే నా హం సా మృ తా స్యాం కి ం యే న మ మ'

అని భర్తను ప్రశ్నించి తాను కూడా అమృత పదవి కొఱకై భర్త వెంట వెళ్లిపోయింది. సంస్కృత వాఙ్మయం భద్రంగా నిత్యనూతనంగా మన జాతికి అందజేసే సందేశాల్లో ఇది ఒకటి. ఈ విధంగా పరిశీలిస్తూ ఉంటే ఇంకా విచిత్రమైన విషయాలనేకం మనం తెలుసుకోగలం. కావ్య మీమాంస రచించిన రాజశేఖరుడు తన ఈ లాక్షణిక గ్రంథంలో ఉక్తివైచిత్ర్యము, విదగ్ధ భంగీ ఫణితి మొదలైన ఉత్కృష్టాంశాలలో తన అర్ధాంగి అవంతి సుందరి అభిప్రాయాలను తలస్పర్శిగా స్వీకరించి గౌరవించాడు. శంకరునితో వాదించిన శాస్త్రాన్ని ప్రదర్శించిన కామాంధకి మొదలైన తల్లుల ప్రతిభ అప్రతిమానమైనది. కావ్యకళలో కూడా ఆరితేఱి వినిర్మల గీర్వాణ వాఙ్మయాంబ రంలో ధ్రువతారలై వెలుగొందిన ఇందుబాల, వికటనీతంబ, లీలావతి, నాచి, శారద, త్రివేణి మొదలైన కవయిత్రుల వాఙ్మయ సేవ ఎన్నటికీ ప్రస్తూయ మానమే కదా.

వైజ్ఞానికముగా ఈ దేవ భాషా వాఙ్మయాన్ని సేవించి కీర్తి నార్జించిన వీరి నటుంచి సామాన్య కుటుంబాలలో నిత్య వ్యవహారాలలో కూడా మహిళలు సంస్కృతాన్నభ్యసించి, సంస్కృతానికెంత గౌరవం ఇచ్చేవారో ఈక్రింది సందర్భాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో పెండ్లి కెదిగిన కన్యకు ఆ తండ్రి విద్యావిహీనుడైన యువకుణ్ణి వరునిగా తీసుకొని వస్తే, సంస్కృత భాషా పండితురాలైన ఆ కన్య ఆ యువకుణ్ణి పరీక్షించి అతడు అజ్ఞాని అని తెలిసికొని తండ్రితో యుష్యష్ఠచ, చతుర్థాచ విహాస్యచ, విహాయచ ద్వితీయాస్యాత్ కథమహన్ ద్వితీయా న్యామహంకథన్. విహస్య, విహాయ, షష్ఠీ, చతుర్థి విభక్తులనీ, కథం, అహం అనేవి ద్వితీయా విభక్తీ అని అనుకునే ఈయనకు నేను ద్వితీయ భార్య నెట్లు కాగల్గుదును? అనగా, నాకీ సంబంధం ఈడైనది కాదని చెప్పివేసినదట. ఇది స్థాలీపులాకన్యాయంగా సంస్కృత వాఙ్మయంలో పూర్వ మహిళ లొనర్చిన కృషి. ఈ సూక్ష్మదృష్టితో మనకు తేలిందేమి టంటే గీర్వాణ భాష మహామహిమోన్నతమైనదని, భారతీయుల సర్వవిధి సంస్కారాలు, సకల సత్సంప్రదాయాలూ, సమస్త విజ్ఞాన విషయాలూ, సంస్కృతంలో నిక్షేపించబడి ఉన్నాయి అనే విషయాలు.

ఇవిచాలు, సంస్కృత భాష పట్ల జాతి అవశ్య కర్తవ్యాన్ని ఉద్బోధించడానికి ఇంక మిగిలింది. ఇప్పట్లో ఆభాషాభివృద్ధికై మనం చేయవల్సిన కృషి ఎట్లాంటిది అనేది? జాతిపరంగా ఒకేమాఱు ఒక బృహత్ప్రయత్నంతో విస్మృతమైన ఒక మహా సంస్కృతి స్రవంతిని పునరుద్ధరించడం తేలికగా అయ్యేపని కాదు.

కాని మెల్లమెల్లగా మన జాతికి మన సంస్కృతిని జ్ఞాపకం చెయ్యడం కోసం ప్రయత్నాలు చేసుకోవాలి. మన మహిళా సమాజాలలో గృహ సంబంధమైన సంస్కృత భాషా

పదాలతో పరిచయం కల్గించాలి. చిన్నచిన్న సంభాషణాత్మకమైన ప్రయోగ విన్యాసాలు సమకూర్పు జేయాలి. పత్రికలలో ముఖ్యంగా మహిళా పత్రికలలో ఇట్లాటి ప్రచార ప్రబోధాలు, సందేశాలు విరివిగా జరగాలి. ప్రభుత్వ పక్షంగా రేడియో సంస్థలో ఆకర్షణీయమైన పద్ధతుల్లో ప్రచారం జరగాలి. భండార్కర్, కాశీ కృష్ణాచార్యులు వంటి అనుభవజ్ఞుల సంస్కృత బోధన గ్రంథాలముఖంగా పాఠం జరగాలి. కొడెగ్రామరు, ఆప్టేస్ కాంపోజిషన్ గైడుల ననుసరించి వ్యాకరణ వివేచనం సూక్ష్మరూపంలో వారికి కల్గించాలి. ముఖ్యంగా సులభరూపంలో ధాతువివేకం కల్గించాలి. అప్పుడు జాతికి ఉజ్జ్వల భవిష్యత్తునకు ఆయువుపట్టులైన మహిళలలో సమ్యక్ప్రాచీన సంస్కృతి సాంప్రదాయిక ధార అఖండ స్రోతస్సుగా ప్రవహించి సుస్థిర శాంతి కాముకమైన ప్రజాసస్యాలనుత్పాదింప జేయగలవు. అప్పుడే మన రాజ్యం రామరాజ్యం కాగలదు. ఇదంతా మాతృస్వరూపిణియైన మహిళ చేతిలో పని.



1. **కన్యకా సుప్రభాతమ్ :-**

యా పార్వతీ కుసుమగుప్త తపః ప్రపన్నా
యాసా పవిత్ర లలితావత తార భూమౌ
తామ్, త్వామ్, శివస్యమ వృణోన్నవ బాల్య ముగ్ధామ్
శ్రీ కన్యకే పరశివే తవ సుప్రభాతమ్!

2. **కన్యకాస్తోత్రమ్**

మహిళా జన పావన ధర్మరతే
వర వర్ణిని, వాసవి, సౌమ్యమతే
హరసుందరి, భారతి, భవ్యరమే
విజయీభవ హే పెనుగొండ హితే

3. **దేవీస్తవ తారావళి**

యాచాంద్రీకృత సర్వలోక సుషమా స్థాణ్వర్థకాయానతిః
యా యోగీశ హృదున్ముఖీ హరిహృదబ్జాలంక్రియా శ్రీసతిః
యాసాహిత్య రసాకృతిః విధిముఖాసీనా శుచిర్వాక్సతిః
త్రైలోక్యా భరణా త్రిమూర్తి లలితా సాపాతు దుర్గాంబికా

# గోదాదేవి భక్తి సౌరభము

ఉల్లము పల్లవింప నయనోత్పలముల్‌రహి చెమ్మగిల్ల
త్యుల్ల సితమ్ములే సుమధురోక్తుల వెనుని బాడిప్రీడితా
పల్లవపాణి 'గోద' హరిభక్తి సువాసితమౌ పుష్పమాలగా
నల్ల సిలంగ జేసె రుచిరోన్నత సంస్కృతి సాహితీ స్థలిన్‌॥

శ్రీపతిమీది కూర్మిమెయి చేతము పొంగగగ ప్రేమ భక్తియు
ద్దీపన మొందగా కవిత దీరిచి ముప్పది పాశురంబులా
లాపన మీర భూనభములం దనుతాపము పాపమారగా
గోపికయౌచుపాడె మునుగోద జగమ్ములు పుల్కరింపగా॥

పుట్టూనే పరిమళించిన పవిత్ర పుష్పమాలిక; గోదాదేవి! ఈ పుష్పమాలిక నలుదెసగా వ్యాపింపజేసిన భక్తి గేయసౌరభం అనన్యం! తమిళ వాఙ్మయ ప్రాభవ సౌందర్య శోభకు ముప్పి గూర్చిన ఈ కావ్యమాలికల రమణీయ యశశ్చంద్రికలు విరజిమ్మిన కాంతిపుంజం శాశ్వతమై, భారతీయాధ్యాత్మిక శక్తికి స్థిరమైన పునాదుల నేర్పరచింది. శ్రీ మహావిష్ణువును గాన సంకీర్తనతో సంప్రీతుణ్ణి చేసి జగతికీ, జగతి యందలి మానవులకూ దివ్యత్వాన్ని, అమృతత్వాన్నీ లభింపజెయ్యాలనే పవిత్ర సంకల్పంతో భూదేవి మహాభక్తుడైన విష్ణుచిత్తునకు తులసీ వనభూమిలో బిడ్డగా దొరికింది.

"ఇతఃపురా పఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధుడూ, ఆ రామక్ష్మా ఖనన క్రియా ఖరఖనిత్ర గ్రాహితోద్యత్కిణస్తమాస్నిగ్ధ కరుడూ అయి. దేవ "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా వహనమో" మాత్రమే తెలిసిన అమాయిక సాత్త్విక భక్త శిఖామణి; విష్ణు చిత్తుడు! ఆ పరమభాగవతోత్తముడు తనకు తులసీవనంలో లభించిన ఆ చిన్నారి చిట్టిపాపను, అపూర్వ సౌందర్య రాశిని, సౌభాగ్యశ్రీలు కురిపించే ఆ ముద్దు బిడ్డను ఆండాల్ దేవిని ఇంటికి తీసికొనిపోగా ఆ దంపతులు పేదకు దొరకిన పెన్నిధి అని ముద్దుగా పేరు పెట్టి గారాబంగా ఆ అందాల బరిణెను పెంచుకొన్నారు.

మహాభక్తుడైన విష్ణుచిత్తుడు నిస్సంతు తాను తన చేతులతో నీరుపోసి, పాదు త్రవ్వి స్వయంగా పెంచిన తన ఇంటి పెరటితోటలోని సుందర తులసీ పుష్పాలతో మాలలు కట్టి తన స్వస్థానమైన శ్రీ విల్లిపుత్తూరులోని వట పత్రశాయి స్వామికి మాలా కైంకర్యం చేయడం తప్ప వేరేపని లేని లతాకిక తపస్వి!

తం(డ్రి కట్టిన పూల దండలను గోదాదేవి (కోదై అనియేకాక గోదా అని కూడా ఆమెకు నామాంతరం కలదు) తం(డికి తెలియకుండా నిత్యమూ ఒకమారు తన సిగలో సింగారించుకొని, తోటలోని నూతిలో తన చెలువము చూచుకొని మరల పూజా పాత్రలో ఏమీ ఎరగనట్లు పెట్టేసేది. ఏ మాత్రం ఈ విషయం తెలియని విష్ణుచిత్తుడు పాపం ఆదండలనే తీసికొని వెళ్ళి స్వామికి అలంకార నివేదన చేసేవాడు.

ఒకనాడు కుమార్తె స్వామి మాలలను అలంకరించుకొని ఉండగా విష్ణుచిత్తుడు చూడడమూ, అది భగవదపచారంగా భావించి, తన బిడ్డను మందలించి ఆనాడు స్వామికి మాలలను నివేదించక పోవడమూ జరిగింది. కాని ఆ రాత్రి స్వామి విష్ణుచిత్తుని కలలో కన్పడి ఆ బాలికలనుభవించి విడిచి (ఆముక్తమాల్యద) మాల్యమే తనకు అత్యంత ప్రీతికరమనీ, ఆ బాలిక తలలో ముడువని పూలను తాను ఒల్లననీ చెప్పి వేశాడు.

ఇట్లా పుట్టుకతోనే భక్తి సౌరభాలు వెదజల్లుతూ పరిమళించిన గోదాదేవి, చిన్ననాటి నుండీ రంగేశునే నిజేశునిగా భావించి ఆ మధుర భావభక్తి పారవశ్యంతోనే శుక్లపక్ష చంద్రికవలె దినదినాభివృద్ధిని పొందుతూ ఎలజవ్వని అయింది. జవ్వని అయిన గోదాదేవికి వయస్సుతో బాటు శ్రీరంగభర్తపై వలపుకూడా అతిశయిం జొచ్చినది. నాడు నాటికే లగ్గలమయ్యే ఆ(పేమ తాపాన్ని భరింపలేక గోదాదేవి విర విరలాడిపోయినది. ఆమె ఆ విరహతాపంలోని సౌకుమార్యాన్ని రసరాట్టైన శ్రీ కృష్ణదేవరాయ ప్రభువు చాలా రుచిరంగా వర్ణించి యున్నాడు.

> శ్రీపతి మీది గేతములఁ బ్రేమఁ విపంచిక నంట బాణినఁ
> తాపము సోకిమెట్ల మయి నంబు గరంగిన డించి పాడు - నా
> లాపిని దాల్చి, పెన్జెమటలన్మఱి తం(త్రులు జజ్జ్వగాగలా
> లాపిని దానపాడును. గళంబును గద్గదమైన మ్రాన్పడున్॥

ఆట, ఆసుకుమారి విరహతాపం ఇంత అతిశయమైనది అట్లాంటి అంత అతిశయ విరహావస్థలో తన స్వామి పొందుకొఱకు సాధనాంతరాలను రోయుగోదాదేవికి, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుని పొందడానికి గోపికలు నిష్ఠతో ఆచరించిన మార్గళినోము పరమాచరణీయంగా కనబడింది.

అంతట గోదా ఆమార్గళినోము పట్టితానే గోపికయై మధురభావభక్తి పారవశ్యంతో మార్గశిర మాసం ముప్పది రోజులలో ఆనోముకు సంబంధించిన పాటలను కమనీయకవితాఝురిగా, శృంగార రసధునిగా సంకల్పించి పాడింది. తమిళభాషలో 'పావు' అంటే పాట. ఇది శ్రీ కరమైన పాట కాబట్టి 'తిరుప్పావు' అని దీనికి పేరు.

ఈ తిరుప్పావు దివ్య ప్రబంధమై ద్రావిడ వేదమనబడే దివ్యప్రబంధాలలోని ముదలాయిరములలో జేరినది. ఈమె తన అపారమైన భక్తిప్రాబల్యం చేతను, అఖండమైన భగవదను భవసామర్థ్యం చేతనే ఈమెమహావైష్ణవస్వాములైన పన్నిద్దఱాళ్వారులలో చేరినది.

చెప్పవలసికాని సుకుమార కవితా శిల్పమూ, భావసౌమనస్యమూకల ఈతిరుప్పావు దివ్య ప్రబంధము భారతీయ సాహిత్యంలో ఒక ఉత్తమ గ్రంథం కావడానికి; ఈ కావ్యంలోని విశ్వశ్రేయస్సాధనాచింతనమూ, మధురమంజుల భావపుష్టీ మనోహర కవితా శిల్పమూ అకతింక భగవదభిరల కారణాలుగా కన్పడుతున్నాయి. గోదాదేవి లేక ఆండాళ్లు రచించిన ఈ తిరుప్పావు, ఆ కృష్ణుని వాల్లభ్యం కోరి గోపికలు చేసిన మార్గళినోముకు సంబంధించినది,. మెట్టమొదట ఈ వ్రతమునకు ప్రధమాంగమైన స్నానము కొరకై గోపికలు ఒక్కొక్కరిని మేల్కొలుపుకుంటూ, పిలుచుకుంటూ వెళ్లడంతో ఈ తిర్పావు ప్రబంధం ప్రారంభమౌ తుంది.

ఇందు మొదటిదైన "మార్గళిత్తిబల్ మదినిత్తైన్ద నన్నాళాల్" లినే పాశురంలో తల్లి యశోదా దేవికి సింగపు గోదమవలెముద్దుమారిపెములు దీర్చు. వాడియైన యీటెను ధరించినందుకు మారగోపుడు మన నోమునకు వలసిన సౌకర్యములను చేయును." అని చెప్పుటలోను, యశోదైఇళశ్శింగమైన" నందగోప కుమారుని దివ్య సౌందర్యమును గానమొనర్చుటలోను ఈ వ్రతము ఔన్నత్యము, వ్రతము చేయువారి అభీష్టము, అందలి వారి మధురభక్తి రూపమైన పరమార్థము, అన్నింటిని గోదాదేవి చాలా మనోహరముగా సుకుమార ధ్వనితో ఉపలక్షింప జేసినది. తరువాత "ఓఙ్గయుల గళన్ద ఉత్తమన్ పేర్పాడి" అనే పాశురంలో వ్రతాంగమైన స్నానక్రియచే లోకమునకు కల్గుమేళ్లను ఆమె స్పష్టముగా అభివర్ణించినది. పండివంగిన యెట్టు వరిమళ్లలో పొర్లాడే చేపలు, కలువ కన్నెలో నిశ్చింతగా నిదురించే తుమ్మెదలు, గోపికల కుండలకు మిగులు క్షీరధారలను గురిసే ధేనువులూ స్నాన ప్రయోజనంగా సిద్ధించే శ్రేయల్గ ప్రయోజనాలని ఈ పాశురంలో గోదాదేవి వర్ణించిన తీరు ఎంత లలితంగా ఉన్నదో అంత సంపుష్టమైన విశ్వశ్రేయో భావనతో నిండిఉన్నది.

శ్రీమద్రామాను జయతికి పరమ ప్రతీకరమైన "ఉన్దుమతుదగళిన్" అనే పద్దెన్మిదవ పాశురంలో నప్పిన్నైపిరాట్టి (నీళాదేవి)ని మేల్కొలిపే పాశురమూ, నందగోపకుమారుని శరీర సౌభాగ్యశ్రీని వర్ణించి తమ్ముదయతో చూడుకుని ప్రార్థించు 23, 24 పాశురములు, ఏమీ తెలియని తమ్ము (గోపికలను) ఏలుకొమ్మని సర్వసమర్పణ భావంతో ప్రార్థించే కరవైగళ్లుపిన్ శెన్దు" అనే 28వ పాశురమూ మృదులమైన శయ్యా పరిపాకంతో, ప్రసన్నమైన శైలితో, రుచిరమైన భావార్థంతో తమిళ మహాసారస్వత

పరిశ్రిక్ష్యాయాయోగ్యములై లిఖిల భారత సారస్వత మహనీయ తను వేనోళ్ల చాటుతూ ఉన్నవి.

ఇందు గోపకిశోర గత భావనకల గోపికలు నందబాలుని కొరకు వ్రతం చేయడం, దానికి యశోదాసింగమైన పురుషవరేణ్యుడు రక్షకుడై యుండె కావలసిన కుపకరణ, సౌకర్యాలను కూర్చడం, వ్రతంలో గోపికలు సర్వసమర్పణ భావంతో ఆ లీలా మానుష దివ్య సుందరుణ్ణి వేడుకోవడం అన్నీ భగవత్పరములే.

యజ్ఞము, యజ్ఞసాధనము, యజ్ఞాంగమూ, యజ్ఞ పురుషుడూ, యజ్ఞధ్యేయము, యజ్ఞ ప్రయోజనము, చివఱకు యజ్ఞకర్తా, యజ్ఞభోక్తా తానేఅయి అపరమపురుషుడే ఆ గోపికా మహాయజ్ఞాన్ని నిర్వహిస్తూంటే లోకంలో శోభన సమృద్ధి వర్ణించక ఇంకొక విధిం ఎట్లాఒన గూడుతుంది?

గోదామహాదేవి జన్మించి ఎన్నివందల సంవత్సరాలైనదో ఆ మహానుభావురాలి లలిత మధుర భక్త్యా రాధనతో గూడిన విశ్వకళ్యాణ సందేశం ఆమె పేరుకు తగ్గట్లు నిత్య సౌరభాలను విరజిమ్ముతూ భారతీయ సాహిత్యాన్నే శాశ్వతంగా సుమాళింప జేస్తూ ఉంది. ఇంత మహోన్నత సాహిత్య ప్రయోజనాన్ని లలితచయనంగా, మధుర మార్గంలో శివేతరక్షతి ఫలోద్దేశంతో నిర్వహించి గోదాదేవి నిజంగా మనకు ఆరాధ్యురాలు!

ప్రేమ పారవశ్యమ్మునస్వామి గొలిచి
భద్రచయనమౌ "తిర్పావు" పాడినట్టి
భక్తితన్మయ, సుమధుర భావలలిత
ధన్య, గోదామహిదేవి ధరణి బ్రోచు॥



## ఒక్కచిన్నదివ్వె

ఓహో మహాత్మా, ఒ మహితాత్మా
నీమోసిన పదము జాడ సకల తీర్థమనుగమించె
నీయెత్తిన కరము నీడ శాంతిదేవి విశ్రమించె
నీ పల్కిన పల్కుచాయ శ్రుతి శిరములు ప్రతిరవించె
నీ పిల్చిన పిలువునంది భువనపాళి తలలు వంచె
ఓహోమహాత్మా, ఓహోమహితాత్మ!

# కాంతి శిఖరాలు

నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండి వెల్గెద మోయీ!
కడలి లోతులు తఱచి
కడల యెల్లలు చఱచి
నిండారి భావత
రంగాలు శబలింప
సంభ్రమించెద మోయీ
విభ్రమించెద మోయీ
విధివిరామము లేక ఈశా॥ నీలోని॥
చూపు చూపులు లేక
పలుకు పలుకులు లేక
నిశ్చలమౌ, నీరవమౌ
నిబిడ హృత్సీమలతో
నిలిచి పోదమటోయీ
విలుచు కొందమటోయీ
విపుల జగతీ సారము నీశా॥ నీలోనీ॥
అంతయును ఏకమై
అన్నియును ఒకటియై
అంతరంగము నిండ
అంతర్ముఖులమై
అనంత పదసీమ
ఆనంద ధామాలు
అల్లుకొందమటోయీ ఈశా॥ నీలోనూ॥

